# కామ్రేడ్ కాళిదాసు




## అభినందన సంచిక




సంగీత సాహిత్య నృత్య నాటక సంస్థ

**కామ్రేడ్ కాళిదాసు**
అభినందన సంచిక

సంపాదకుడు
**మోదుగుల రవికృష్ణ**
MTS ఉపాధ్యాయుడు, లేమల్లెపాడు.
94403 20580

ప్రచురణ
**సంస్కృతి,** గుంటూరు.

ప్రథమ ప్రచురణ
22.12.2024

పబ్లికేషన్ నెం. 18

ముఖచిత్ర రచన
**పెమ్మరాజు రవికిషోర్**
80080 08790

ప్రతులు: 1000

వెల: అమూల్యం

లేఅవుట్
**లక్ష్మీ ప్రసన్న గ్రాఫిక్స్**
98660 16690

ప్రతులకు
**సంస్కృతి,** గుంటూరు.
98489 68889

ముద్రణ
**అఖిల్ ప్రింట్‌ప్యాక్,** విజయవాడ.
94933 88987



**సత్యాజు బాలచందర్**
వ్యవస్థాపకుడు, 'సంస్కృతి', గుంటూరు.
(సంగీత సాహిత్య నృత్య నాటక సంస్థ)
చరవాణి నెం. 98489 68889

# కామ్రేడ్ కాళిదాసు

**కా**ళిదాసుగారికి వారి తల్లిదండ్రులు ఏమి ఆలోచించి నామకరణం చేసారో తెలీదు కానీ, తాను కూర్చున్న కొమ్మను తానే నరుక్కుంటున్న ఆనాటి కాళిదాసు లాంటివారు 1972లో ఈ కాళిదాసు.

అమ్మవారిచేత నాలుకపై బీజాక్షరాలు లిఖించబడి మహాకవి కాళిదాసు అయినాడు ఆనాటి కాళిదాసు. పోపూరి రామారావుగారి, పుతుంబాక వెంకటపతిగారి సాహచర్యంతో 1992 నాటికి ఈ కాళిదాసు 'కామ్రేడ్ కాళిదాసు'గా రూపాంతరం చెందాడు.

ఎన్ని సమస్యలెదురైనా ఎన్ని కష్టాలొచ్చినా నమ్మిన సిద్ధాంతం కొరకు నిలబడడం చాలా కష్టం. అలా నిలబడాలంటే చెక్కుచెదరని నిబద్ధత కావాలి. ఆ నిబద్ధత పరిపూర్ణంగా వున్న వ్యక్తి కాళిదాసు.

కాళిదాసు గురించి మాట్లాడాలంటే వారి భార్య విజయలక్ష్మి గురించి ముందుగా చెప్పుకోవాలి. కాళిదాసు యింత నిబద్ధతతో వున్నాడంటే అది ఆయన భార్య విజయలక్ష్మి సంపూర్ణ సహకారమే కారణం.

నాకు తెలిసి డబ్బు సంపాదించడం కష్టం కాదు. కొన్ని వదిలేస్తే.

కానీ మనుషులను సంపాదించుకోవడం చాలా కష్టం. అది సాధించాడు కాళిదాసు. వసుధైవ కుటుంబం అనే భావన పెంపొందించుకున్నాడు కాబట్టే కాళిదాసు గురించి ఈ పుస్తకం.

కాళిదాసుగారి గురించి మీ అనుభవాలను, జ్ఞాపకాలను, అభిప్రాయాలను తెలుపమని కోరగానే, వ్రాసి పంపిన ఆయా వ్యాస రచయితలందరికీ ధన్యవాదాలు.

డి.టి.పి. చేసిన ఆర్. పరమేశ్వరరావుగారికి, ఓర్పుగా బుక్ డిజైన్ చేసిన పల్లె వెంకటేశ్వర్లుగారికి ధన్యవాదాలు.

ఈ అభినందన సంచికతో కలిపి 'సంస్కృతి' సంస్థ తరపున ఇప్పటికి 18 గ్రంథాలు వెలువడినాయి. సంస్కృతి గ్రంథమాలికలోని 10 గ్రంథాలకు 'సాహిత్య విద్యార్థి' మోదుగుల రవికృష్ణ సంపాదకునిగా వ్యవహరించడమేకాక ముద్రణ బాధ్యతను కూడా నిర్వర్తించారు. మిగిలిన గ్రంథాలూ వారి తీర్పుతోనే వెలువడ్డాయి. మోదుగుల రవికృష్ణగారి (MTS ఉపాధ్యాయుడు, లేమల్లెపాడు) తోడ్పాటుకు కృతజ్ఞతలు.

'కామ్రేడ్ కాళిదాసు' గ్రంథ ప్రచురణకు హార్దికంగా, ఆర్థికంగా తోడ్పడిన నిక్కమైన నాటకాభిమాని డాక్టర్ ముత్తవరపు సురేష్‌బాబుగారికి హృదయపూర్వక ధన్యవాదాలు.





**నూతలపాటి కాళిదాసు**

యడ్లపాడు

9490099991

# నా మాట

**బా**లచందర్‌గారు నన్ను గురించి ఎందుకు పుస్తకం తీసుకురావాలనుకున్నారో తెలియదు. ఈ పుస్తకం చదివినవారికి ఏమైనా ఉపయోగపడుతుందో లేదో తెలియదు. నాకు బాలచందర్‌గారు సోదరసమానుడు. నా చిన్నతనంలోనే యడ్లపాడు గ్రామంలో నేను ఎలా ఉండేవాడినో బాలచందర్‌గారికి బాగా తెలుసు. నేను గుంటూరు వచ్చిన తర్వాత నన్ను గురించి, నేను చేస్తున్న కార్యక్రమాల గురించి బాగా గమనించేవాడు. నా మంచిచెడుల గురించి తెలుసుకునేవాడు. నేను చేస్తున్న కార్యక్రమాలకు సహకారం అందించేవాడు. 'సంస్కృతి, గుంటూరు' తరఫున ఆయన నిర్వహిస్తున్న కార్యక్రమాలలో అన్నింటిలో నేను పాల్గొనే అవకాశమిచ్చేవారు. ఆయన గురించి ఒక్కమాటలో చెప్పాలంటే, ఎవరైనా సహాయం కావాలనేవారు ఎవరు సహాయం చేస్తారా అని దేవులాడుకుంటారు. జన్యూన్‌గా సహాయం పొందటానికి అర్హులెవరు అని బాలచందర్‌గారు దేవులాడుతూ ఉంటారు. అటువంటి బాలచందర్‌గారు నాకు మిత్రుడవ్వటం నాకు చాలా గర్వకారణం. ఇలాంటి గొప్పమిత్రుడి గురించి వ్రాయవలసింది చాలా ఉన్నప్పటికీ నా శక్తి చాలటంలేదు.

కామ్రేడ్ పుతుంబాక వెంకటపతిగారి ప్రేరణ, సైద్ధాంతిక రాజకీయశిక్షణ, ప్రజాసంబంధాలు, పోరాటాలలో నేర్చిన మెళకువలే నేను జిల్లాసెంటర్‌కి రావటానికి ప్రధాన కారణం. కామ్రేడ్ సింహాద్రి శివారెడ్డి – కార్యకర్తలను మచ్చిక

చేసుకోవటం, పదిమందినీ కలుపుకుపోవటం ఆయన ప్రత్యేకత. కామ్రేడ్ పోపూరి రామారావు – మాటమీద నిలబడటం, నిజాయితీ, ధైర్యం, తెగువ, నైతిక ప్రమాణాలు పాటించడం వారి దగ్గర గమనించాను. తెలంగాణా సాయుధ రైతాంగపోరాట సారథి, మార్క్సిస్టు లెనినిస్టు విప్లవోద్యమ నిర్మాణదక్షుడు, త్యాగమూర్తి కామ్రేడ్ పుచ్చలపల్లి సుందరయ్య. సునిశిత మార్క్సిస్టు లెనినిస్టు మేధావి, సిద్ధాంతకర్త, 1964 ప్రోగ్రాం రూపకర్త కామ్రేడ్ మాకినేని బసవపున్నయ్య, ఉమ్మడి రాష్ట్ర పార్టీకి తండ్రి వంటివారు. మితవాద అతివాదాలతో చీలికలు పీలికలై చిన్నాభిన్నమై, శక్తిహీనమైన పార్టీ ఉద్యమానికి తిరిగి జవసత్వాలను సంతరింపజేసే కష్టసాధ్యమైన పనిలో బండెడు కృషిచేసిన కామ్రేడ్ మోటూరు హనుమంతరావు. పార్టీ ప్రజాసంఘాల నిర్మాణం, రాజకీయ పరిణామాలను నిశితంగా పరిశీలించగల మేధావి. ఏరకం సమస్యనైనా స్కాన్ చేసి పార్టీని కాపాడుకునే పనిలో ఉండే కామ్రేడ్ లావు బాలగంగాధరరావు – చిన్నాపెద్దా లేకుండా కార్యకర్తలతో కలివిడిగా ఉంటూ 'ఏరా బాబూ బాగున్నావా' అంటూ ఆప్యాయంగా పలకరిస్తూ ప్రజల సమస్యలను గుర్తించి ఆందోళనా పోరాట రూపాలను నిర్ణయించి ప్రజల సమస్యల పరిష్కారానికి నిరంతరం తపించే కామ్రేడ్ కొరటాల సత్యన్నారాయణ ప్రజల ప్రధానశత్రువుకి వ్యతిరేకంగా మనం ఆందోళన చేస్తూ, ఎన్ని భిన్నాభిప్రాయాలున్నా కలవటానికి అవకాశం ఉన్నవారందరినీ కలుపుకొని ప్రజల సమస్యల పరిష్కారానికి పూనుకోవాలి. ఇలా చేయాలంటే నిర్దిష్ట పరిస్థితులను నిర్దిష్టంగా అధ్యయనం చేయాలని చెప్పే అఖిల భారత సి.పి.ఐ.(యం) కార్యదర్శి కామ్రేడ్ సీతారాం ఏచూరిగార్ల రాజకీయ శిక్షణ వల్లనే నేను కొద్దిపాటి జ్ఞానాన్ని పొందగలిగాను.

ఉదారస్వభావం గల దయార్ద్రహృదయుడు డాక్టర్ కాసరనేని సదాశివరావు, డాక్టర్ జయప్రదాంబ దంపతులద్వారా ప్రజలకు వైద్య అవసరాలు ఎలా తీర్చాలో కొద్దిగా నేర్చుకున్నాను. స్వతహాగా కళాకారులు, సింపుల్‌గా ఉంటారు, వైద్యమూ అంతే ఉంటుంది. రోగనిర్ణయం, తగిన చికిత్స, తక్కువ ఖర్చుతో వైద్యం చేయటమే కాకుండా ఉద్యమానికి అండగా ఉండే కామ్రేడ్స్ కళాధర్, భువనేశ్వరిగార్ల ఆసుపత్రి నాకు స్వంత ఇల్లుగా ఉండేది. డాక్టర్ గడ్డిపాటి బాబూరావు, డాక్టర్ కొండబోలు

బసవపున్నయ్య, డాక్టర్ వై. లక్ష్మణస్వామి, డాక్టర్ అలపర్తి లక్ష్మయ్య, గుంటూరు ప్రభుత్వ ఆసుపత్రి డాక్టర్లు చాలామంది నాకు బాగా తోడ్పడ్డారు. వారందరికి కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

గుంటూరు నగరంలో శ్రీ వెంకటేశ్వర విజ్ఞానమందిరం కార్యదర్శి శ్రీ రామచంద్రరాజుగారికి, మేనేజర్ గాంధీగారికి, స్టాఫ్‌కి ధన్యవాదాలు తెలుపుచున్నాను. శ్రీ వెంకటేశ్వర బాలకుటీర్ వ్యవస్థాపకురాలు డాక్టర్ యన్. మంగాదేవిగారు, మరుద్వతిగారు, ఆర్కిటెక్చర్ శ్రీ కె.ఎస్. కుమార్‌గారకి కృతజ్ఞతలు.

ప్రజానాట్యమండలి ఉమ్మడి రాష్ట్రసెంటర్‌లో కళారూపాలు సృష్టించి ప్రజానాట్యమండలిని ఉన్నతస్థాయిలో నిలిపి, నేను ప్రజానాట్యమండలిలో కీలకమైన వ్యక్తిగా తయారు కావటానికి కృషి చేసిన టీముకు కృతజ్ఞతాభివందనాలు తెలియజేస్తున్నాను.

నేను సంవత్సరం పిల్లవాడిగా ఉండగానే మా నాన్న చనిపోయినా ఎన్నో కష్టాల నెదుర్కొని నన్ను పెంచి పెద్దచేసిన కష్టజీవి మా అమ్మ నూతలపాటి వెంకాయమ్మ. నా యడల అత్యంత ప్రేమాభిమానాలు చూపించటమేకాకుండా నన్ను చాలా గౌరవంగా ఆదరించిన నా అత్తమామలు కొల్లూరి వెంకాయమ్మ, సత్యన్నారాయణ; నా బావమరిది కుటుంబం సాంబశివరావు, గోపి, దొప్పలపూడి వెంకట్రావు, కల్పన, కిరణ్, కృష్ణవేణి, నా మేనమామ తుళ్ళూరి సంగయ్య, నన్ను దగ్గరకు తీసి అరక చేతికిచ్చిన పోపూరి వెంకట్రావు (చంద్రయ్యగారు), మా ఇరువైపుల కుటుంబాల తరపున మా ఆడపిల్లలకు, మా బావగార్లకు, మేనకోడళ్లకు, మేనల్లుళ్లకు, తమ్ముళ్లకు, మరదళ్లకు, బంధువులందరికీ కృతజ్ఞతలు.

మాకు సొంతబిడ్డలు లేకపోయినా చదువుకుంటూ మా దగ్గరకు వచ్చి మమ్మల్ని తల్లిదండ్రులుగా చూసుకునే డాక్టర్ శివబాబు, డాక్టర్ విజయలక్ష్మి, మేమూ మీ పిల్లలమే అని చెప్తూ మేము ఆరోగ్యంగా జీవించాలని కోరుకుంటున్న డాక్టర్ అనూరాధ, డాక్టర్ మురళి, డాక్టర్ శ్రీనివాస్, డాక్టర్ రత్నకుమారి, డాక్టర్ ధనలక్ష్మి, డాక్టర్ చక్రవర్తి, డాక్టర్ అరుణ, డాక్టర్ సునీత, డాక్టర్ ఎ.ఎస్.పి.,

డాక్టర్ పోట్ల శివయ్య, దొప్పలపూడి విజయ, కోమలి తదితర పిల్లలందరికీ మా ఆశీస్సులు తెలియజేస్తున్నాను.

ఉమ్మడి గుంటూరు జిల్లావ్యాప్తంగా నాతోపాటు పనిచేసిన, చేస్తున్న ఉద్యమ సహచరులు, కళారంగ మిత్రులందరికీ పేరు పేరునా ప్రత్యేక ధన్యవాదాలు తెలుపుతున్నాను.

నేను ఈ స్థాయికి రావటానికి సంపూర్ణంగా సహకరించి నన్ను భరించిన నా సహచరి విజయలక్ష్మికి కృతజ్ఞతలతో ఆమె కృషిని తగ్గించలేను. ఇప్పటివరకు నన్ను భరించిన మిత్రులకు, ఇప్పటికీ భరిస్తున్న నా మిత్రులందరికీ హృదయపూర్వక కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

ఈ అభినందన సంచిక తీసుకురావాలని ఆలోచించి, పూర్తి బాధ్యత నెత్తినవేసుకున్న నా మంచిమిత్రుడు ఎస్. బాలచందర్‌గారికి మరొకసారి వినమ్రతతో కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను. ఈ సంచికను సంకనలం చేసిన మిత్రులు శ్రీ మోదుగుల రవికృష్ణగారికి ధన్యవాదాలు. కొంతవరకు డిటిపి చేసిన బి. ముత్యాలరావుకు అభినందనలు.

ఈ పుస్తకానికి ముందుమాట వ్రాసిన సి.పి.ఐ.(యం) రాష్ట్రకార్యదర్శి, కామ్రేడ్ వి. శ్రీనివాసరావుగారికి, నన్ను గురించి వ్యాసాలు వ్రాసిన మిత్రులందరికీ హృదయపూర్వక అభినందనలు తెలుపుచున్నాను.



నిరాడంబరంగా వైవాహిక వజ్రోత్సవం జరుపుకుంటున్న కాళిదాసు, విజయలక్ష్మి.

# విషయసూచిక



గుఱ్ఱం జాషువా కవితా పురస్కారాన్ని సుద్దాల అశోక్‌తేజ గారికి యిస్తున్న
సందర్భంలో సి.పి.ఐ.(ఎమ్) పొలిట్ బ్యూరో సభ్యులు కామ్రేడ్ బి.వి. రాఘవులు,
ఎమ్మెల్సీ శ్రీ కె.ఎస్. లక్ష్మణరావు, ప్రొఫెసర్ విజయశ్రీ,
గుంటూరు జిల్లా రచయితల సంఘం అధ్యక్షులు శ్రీ సోమేపల్లి వెంకటసుబ్బయ్య,
శ్రీ వై. రాధాకృష్ణ, పురస్కార పత్రాన్ని చదువుతున్న కాళిదాసు.



పోపూరి రామారావు విజ్ఞాన కేంద్రంలో కామ్రేడ్ పుచ్చలపల్లి సుందరయ్య
నాటకోత్సవాల జ్ఞాపికను 'సంస్కృతి' బాలచందర్‌గారికి అందిస్తున్న
గ్రామమునసబు శ్రీ ముత్తవరపు రామమూర్తి మరియు నాటకోత్సవ బృందం




**వి. శ్రీనివాసరావు**
కార్యదర్శి,
సిపిఐ(యం)
ఏపి కమిటి.

# మానవతావాది కాళిదాసు

**ఉ**మ్మడి గుంటూరు జిల్లా సాంస్కృతిక ఉద్యమంతోనూ, ప్రజా ఉద్యమాలతో పెనవేసుకుపోయిన జీవితం కామ్రేడ్ నూతలపాటి కాళిదాసుది. గుంటూరు కార్యాలయంలో కాళిదాసు తన సతీమణితో కలిసి నివసిస్తూ అందరికీ తలలో నాలుకగా ఉండేవారు. విద్యాభ్యాసం తక్కువగా ఉన్నప్పటికీ స్వయంకృషితో ఒక కమ్యూనిస్టు నాయకుడిగా ఎదిగారు. ప్రజలకు సేవ, కళారాధన తప్ప మరో ధ్యాస ఉండదు. నేను 1992-93 ప్రాంతం నుండి దాదాపు 12 సంవత్సరాలు రాష్ట్ర ప్రజానాట్యమండలికి ప్రత్యక్షంగా సహాయపడ్డాను. ఆ కాలంలో ప్రజానాట్య మండలి అనేక వర్క్‌షాపులు, క్యాంపెయిన్‌లు నిర్వహించింది. ఎన్నికలు, ప్రజా ఉద్యమాలకు ప్రత్యక్షంగా తోడ్పడింది. నేను కళాకారుడిని కాదు. అయినా రాష్ట్ర నాయకత్వం గౌరవించి నేను ఇచ్చే సూచనలు, సలహాలు పాటిస్తుండేది. ఈ క్రమంలోనే కాళిదాసుతో పరిచయం ఏర్పడింది. రాష్ట్ర నాయకత్వంలో ఒకడుగా చాలా చురుగ్గా ఉండేవాడు. చర్చలలో తన అనుభవాలతో అనేక కష్టమైన, క్లిష్టమైన సందర్భాల్లో కూడా చురుగ్గా పాల్గొని సహాయపడేవాడు. అభిప్రాయాలు చెప్పటంలో ఎక్కడా మొహమాటపడేవాడుకాదు. తప్పుడు భావాలు, పొరపాటు పద్ధతులపై పోరాడాడు. రాష్ట్రప్రజానాట్యమండలి అభివృద్ధిలో ముఖ్యపాత్ర పోషించాడు. చేసిన అన్ని నిర్ణయాలను చిత్తశుద్ధితో బలంగా అమలు జరిపేందుకు పట్టుదలతో కృషి చేశాడు. గుంటూరుజిల్లాలో ప్రజానాట్యమండలిద్వారా అనేకమంది కొత్తకార్యకర్తలు ప్రజాఉద్యమాల్లోకి వచ్చారు. చిన్నతనంనుండే వారిలోని కళాతృష్ణను గుర్తించి

ప్రోత్సహించడంలో కాళిదాసు దిట్ట. సాంస్కృతిక కార్యక్రమాలను ప్రణాళికబద్ధంగా నిర్వహించడంలో కాళిదాసుకి ప్రత్యేకనైపుణ్యం ఉంది.

నిర్ణయాల అమలులో చిత్తశుద్ధిని, పట్టుదలను ప్రదర్శించడాన్నిబట్టే వారి నాయకత్వబలం ఆధారపడి ఉంటుంది. ఈ విషయంలో కాళిదాసుని మనం అభినందించాలి. తన ఇష్టాయిష్టాలనుబట్టి కాకుండా ఉమ్మడి నిర్ణయాలనుబట్టి క్రమశిక్షణ కలిగిన కళాసైనికుడిగా అమలు జరిపేందుకు ప్రయత్నించేవాడు. యడ్లపాడులో ప్రతి సంవత్సరం క్రమం తప్పకుండా జరిగే సుందరయ్య నాటకోత్సవాలలో తన మిత్రులతో కలిసి తనదైన శైలిలో పనిచేశాడు. కామ్రేడ్ పోపూరి రామారావు విజ్ఞానకేంద్రం నిర్మాణం, నిర్వహణలో ముఖ్యపాత్ర కాళిదాసుది. అనేకమంది ప్రజాతంత్రవాదులతో నిరంతరం సంబంధాల్లో ఉంటూ ప్రజాఉద్యమాలకు, ప్రజానాట్యమండలికి వారి సహాయాన్ని పొందుతుండేవాడు. ఈ సంబంధాలను ఏనాడు స్వార్థానికి ఉపయోగించుకున్నట్లు దాఖలాలు లేవు. వివిధరంగాలలో ఉన్న ప్రముఖులతో కాళిదాసుకి మంచిసంబంధాలు ఉండేవి. గుంటూరు ప్రభుత్వ ఆసుపత్రి డాక్టర్లతో నిరంతర సంబంధాలు ఉన్నాయి. ఆ సంబంధాలు అన్నిటిని పేదవాళ్లకు త్వరగా వైద్యసహాయం అందించేందుకు ఉపయోగిస్తుండేవాడు. పార్టీలోగాని, ప్రజాసంఘాలలోగాని వాళ్ల కుటుంబ సభ్యులకు ఎవరికైనా ఆరోగ్యం బాగా లేకుంటే కాళిదాసు వారికి రాత్రింబవళ్లు దగ్గర ఉండి సహాయం చేసేవారు. గుంటూరు గవర్నమెంట్ ఆసుపత్రిలో ఎవరైనా చేరాలనుకుంటే వారు కాళిదాసు సహాయం తీసుకునేవారు. వారి సతీమణి కూడా అంతే. వారిరువురిని ఆఫీసులో అందరూ నవ్వుతూ పార్వతీపరమేశ్వరులని అంటుంటారు. ఇద్దరూ మానవత్వంతో ఉంటారు. వారికి పిల్లలు లేకున్నా కార్యకర్తలనే తమ పిల్లలుగా భావించి వారికి తోడునీడగా ఉంటారు. కాళిదాసు అభినందన సంచిక తీసుకువస్తున్న ఈ సందర్భంగా ఆయన జీవిత అనుభవం నుండి నేర్చుకోవాల్సిన ఈ కొద్ది విషయాలను నాకు పరిచయం ఉన్నంత మేరకు పాఠకుల ముందు ఉంచుతున్నాను. మిగతా జీవితకాలంలో కూడా కమ్యూనిస్టు ఉద్యమం, ప్రజానాట్యమండలి నేర్పిన పాఠాలను గుర్తుంచుకొని ఆదర్శకార్యకర్తగా వారి జీవితం కొనసాగుతుందని ఆశిస్తున్నాను.



**కె. యస్. లక్ష్మణరావు**
శాసనమండలి సభ్యులు
8309965083

# నిబద్ధతగల కళాసేనాని కాళిదాసు

**నూ**తలపాటి కాళిదాసుతో నాలుగు దశాబ్దాల పరిచయం. నిబద్ధతగల కళాసేనాని అతడు. వామపక్ష ఉద్యమాలకు కేంద్రంగా ఉన్న యద్దపాడు ప్రాంతంలో అనేక ఉద్యమాలలో భాగస్వామి అయ్యాడు. ముఖ్యంగా రైతాంగం కోసం జరిగిన పోరాటాలలో ప్రత్యక్షపాత్ర నిర్వహించాడు. మార్క్సిజం అనే సిద్ధాంతంద్వారా ఈ భూగోళంలో అసమానతలు లేని సమాజాలను నిర్మించవచ్చని నమ్మాడు. మార్క్సిజం - లెనినిజం సిద్ధాంతాలను ఆచరణలోకి తేవడానికి కమ్యూనిస్టు ఉద్యమాలలో భాగస్వామిగా మారాడు. ఈ మార్పుకోసం ఈనాటికీ నిరంతరం తపన చెందుతున్నాడు.

"కళ కళకోసం కాదు...ప్రజల కోసం" అని నమ్మి ప్రజానాట్యమండలిలో ప్రముఖపాత్ర వహించాడు. గుంటూరు ఉమ్మడిజిల్లాలో ప్రజానాట్యమండలి కార్యక్రమాలు రూపొందించడంలో, అమలు చేయడంలో ముఖ్యపాత్ర పోషించాడు. గుర్రం జాషువా విజ్ఞానకేంద్రంని ఏర్పాటు చేయడంలో, కార్యక్రమాల నిర్వహణలో చురుకైనపాత్ర పోషించారు.

కాళిదాసుతో జనవిజ్ఞానవేదిక కార్యక్రమాల నిర్వహణ సమయంలో నాకు ప్రత్యక్ష అనుభవాలు ఉన్నాయి. జనవిజ్ఞానవేదిక, భారత జ్ఞానవిజ్ఞానసమితి ద్వారా సైన్స్ కళాయాత్ర, అక్షరకళాయాత్ర మొదలగువాటిని నిర్వహించడంలో కీలకపాత్ర

నిర్వహించారు. యడ్లపాడులో వీటికి సంబంధించిన శిక్షణాశిబిరాలు నిర్వహించి నప్పుడు మొత్తం బాధ్యత కాళిదాసు స్వీకరించేవారు. ఈ సందర్భంలో ఒక సంఘటన జ్ఞాపకం వస్తున్నది. కళాయాత్ర నిర్వహించే సందర్భంలో మైక్ అవసరమై అద్దెకు తీసుకునేకంటే స్వంతంగా సంస్థకు కొనివేయటం అవసరమని భావించాము. మైక్‌సెట్ కొనటానికి అవసరమైన పదివేలు కాళిదాసు ఎక్కడనుండో అప్పు తెచ్చారు. ఈ అప్పు పెరిగి, దానిని తీర్చటానికి తనకున్న ఒక ఎకరం పొలం అమ్మారని తెలిసి చాలా బాధపడ్డాను. ఆయన నిబద్ధతకు ఇది ఒక చిన్న ఉదాహరణ మాత్రమే.

కాళిదాసుతో కలిసి ప్రజానాట్యమండలి, జనవిజ్ఞానవేదిక, యువజన సంఘం, విద్యార్థి సంఘం (ఎస్.ఎఫ్.ఐ) మొదలైన సంస్థలు నిర్వహించిన అనేక కార్యక్రమాలలో పాల్గొన్నాను. అనేక సంవత్సరాలపాటు ఆయన గుంటూరు బ్రాడీపేటలోగల సి.పి.యం. జిల్లాకార్యాలయంలో ఉంటూ ఎంతో నిబద్ధతతో, క్రమశిక్షణతో పని చేశారు.

అనేక కార్యక్రమాలలో కాళిదాసు సహకారం మరువలేనిది. గత మూడేళ్ళుగా నిర్వహిస్తున్న గుంటూరుజిల్లా బాలోత్సవాలకు షుమారు ఆరు వేల మందికిపైగా విద్యార్థులు ప్రతి సంవత్సరం హాజరవుతున్నారు. వాటి నిర్వహణలో కాళిదాసు ఎంతో సహకారం అందించారు.

అనేక సంస్థలకు, సంఘాలకు సహకారం అందించినప్పటికీ కాళిదాసుకు ఇష్టమైనది కళారంగమే. కళాకారులతో, సాహితీవేత్తలతో, రచయితలతో ఆయన సజీవమైన సంబంధాలు కలిగి ఉన్నారు. నిబద్ధతగల కళాసేనాని కాళిదాసు సేవలు సమాజానికి, ప్రజలకు నిరంతరం అందించాలని కోరుకుంటూ ఆయనకు శుభాకాంక్షలు.





**కె. దేవేంద్ర**
నాటక, గీతరచయిత,
ఖమ్మం.
9490098304

# సాంస్కృతిక కృషీవలుడు కాళిదాసు

**అ**మ్మా, నాన్నలు కాళిదాసు అని పేరు పెట్టినపుడు అస్సలు ఊహించి ఉండరు. పెరిగి పెద్దయ్యాక అతడు సాంస్కృతికరంగంలో నిలబడతాడని, ప్రజానాట్యమండలిని నిలబెడతాడని. కాళిదాసు నాటకం అభిజ్ఞానశాకుంతలం వస్తురీత్యా, శిల్పరీత్యా భారతదేశ సాహిత్యచరిత్రలో ఒక తలమానికంగా చిరస్థాయిని పొందింది. ఈ కాళిదాసు నాటకరచయిత కాదు కానీ, నాటకం ఇతని చేతిలో అద్భుతాలు ఒలికించేసింది గుంటూరుసీమలో. దశాబ్దాల తరబడి విసుగూ, విరామం లేకుండా నాటకరంగంతోపాటు అనేక కళారీతుల్లో కళారూపాలు తీర్చిదిద్దుతూ వందలాది కళాకారులను తీర్చిదిద్దిన నిత్యనూతన కృషీవలుడు నూతలపాటి కాళిదాసు.

పుట్టింది చిలకలూరిపేట దగ్గర యడ్లపాడు గ్రామం. తండ్రి వెంకటేశ్వర్లు, తల్లి వెంకాయమ్మ. తండ్రి చిన్నతనంలోనే చనిపోయాడు. తల్లి పసిపిల్లాడిని ఆలంబన చేసుకొని రానూ, పోనూ 20 కి.మీ.ల నడకతో చిలకలూరిపేటలో పొగాకు గ్రేడింగ్ తదితర యితర పనులు చేస్తూ జీవనం సాగిస్తూ వుండేది. అలాంటి కుటుంబ నేపథ్యంలో జరుగుబాటు వున్న యితర కుటుంబాల్లో పిల్లల మాదిరి చదువూ సంధ్యలు కాళిదాసు విషయంలో అసలు సాధ్యం కాలేదు. అయినా, తోటి సావాసగాళ్ళ దగ్గర విరిగిన పలకచెక్కతో వీథిబడిలో చండశాసనుడు భాస్కరరావు మాస్టారు దగ్గరకు వెళితే అసలు కాళిదాసు వంక ఆ మాస్టారు

చూడనైనా చూడలేదు. ఆ మాస్టారి అమ్మగారు ఈగమ్మగారు కాళిదాసు ఉత్సాహం చూసి తన దగ్గరకు రానిచ్చింది. తోటి పిల్లల ప్రయత్నాలు చూసి వాళ్ళకన్నా మిన్నగా అక్షరాలు, తొలిపలుకులు రాసి ఆమెకు చూపిస్తే ఆమె ముచ్చటపడి కొడుకుకు చెప్పి నాలుగు అక్షరం ముక్కలు వచ్చే విధంగా చేసింది. అయిదో తరగతి పరీక్ష రాసి స్థానిక లూథరన్ స్కూల్‌లో ఆరవ తరగతిలో ఉత్తమశ్రేణిలో తాను మాత్రమే అడ్మిషన్ సాధించిన ఆనందం కొద్ది రోజులు కూడా మిగలలేదు. రెండు నెలలు గడిచాక స్కూలు ఫీజు 5 రూ.లు కట్టలేక బడినుంచి పేరు తొలగించబడిన పేదరికం. కనీస ఫీజుకు కూడా నోచుకోని స్థితికి తట్టుకోలేక ఇంటి నుండి పారిపోయి ఫిరంగిపురం పక్క సిరంగిపాలెంలో ఓ రైతు దగ్గర పాలేరుగా కుదురుకోవటం, కాళిదాసు మామయ్యగారు వెతికి వెతికి చివరికి 10 రోజుల తర్వాత దొరకబుచ్చుకొని తిరిగి యడ్లపాడు తీసుకురావటం, ఆ తర్వాత బడిమాట, చదువుమాట వదిలిపెట్టి వ్యవసాయ పనుల్లో ప్రవేశించటం, అరక దున్నటంలో నైపుణ్యంతోపాటు, వ్యవసాయ మెళకువలన్నీ నేర్చుకోవడం. సంక్రాంతిపాడులో వున్న మేనమామ తుళ్ళూరు సంగయ్య ఇంట రెండు సంవత్సరాలకు పైగా పనిచేయటం జరిగింది. స్థానిక ఇతర కుటుంబపెద్దలు వ్యవసాయంలో కాకుండా పొరుగూరులో పనిచేయడం, దగ్గర బంధువులకు రుచించని నేపథ్యంలో తల్లి వెంకాయమ్మ కొడుకును మళ్ళీ యడ్లపాడు పిలిపించుకుంది.

ఇక ఊరి నేపథ్యం పరిశీలిస్తే, తెలంగాణ రైతాంగ పోరాటాల కాలం నుండి యడ్లపాడు ఆ పోరాట సానుభూతి గ్రామంగా, దళాలకు, కమ్యూనిస్టులకు బాసటగా నిలబడుతున్న చరిత్ర ఉంది. ఊరి ప్రెసిడెంట్, మున్సుబ్ తదితర పెద్దలు తమ పలుకుబడితో ఊరిమీద పెద్ద నిర్బంధం లేకుండా చూసేవారు. కానీ కాంగ్రెస్‌వారి ద్రోహబుద్ధి ఊరిమీద అనేక పోలీసుదాడులకు, నిర్బంధానికి దారితీసే పరిస్థితి ఉంది. దగ్గరలో తుమ్మలపాలెంలోనూ, పాలపర్రు గ్రామంలో జరిగిన మారణకాండకు బలి అయిన అమరవీరుల సమాధులవద్ద వారి స్మారకంగా పెద్దసభలు జరుగుతుండేవి. ఆ సందర్భంలో కమ్యూనిస్టు నాయకుల ఉపన్యాసాలు, అక్కడ జరిగే కళారూపాలు కాళిదాసుకు మొట్టమొదట సాంస్కృతికపరంగా

పరిచయం చేశాయి. చిన్న వయస్సులోనే అంటే 16-17 ఏండ్ల ప్రాయంలో దగ్గర బంధువుల అమ్మాయి జయమ్మతో పెళ్ళి జరిగిపోయింది. వ్యవసాయ పనులు, ఇల్లూ తప్ప వేరే వ్యాపకాలు లేకుండా సాగుతున్న కాలంలో కమ్యూనిస్టుల నాయకత్వంలో జరిగే పోరాటాలు, ఉద్యమాలు ఆసక్తిగా గమనిస్తూ వుండే కాళిదాసుకు విజయవాడలో ఎ.కె.గోపాలన్‌గారు హాజరవుతున్న పెద్దబహిరంగ సభకు ఒక నూతన దృష్టికోణంలో గ్రామంలో యువకులు పక్కదారిపట్టి వ్యసనాలకు తిరుగుబోతుగా వుండే తోటిస్నేహితులను కలుపుకొని పంజా అనే నాటిక ప్రదర్శనతో రంగప్రవేశం చేయటం ఒక మూలమలుపు. నూతనదృష్టి అని ఎందుకన్నామంటే కుర్రాళ్ళతో సావాసం చేయాలంటే ముందు వాళ్ళ దారిలోకే వెళ్ళాలి అనే ఆలోచన ఎన్నో గొప్పవిజయాలను సాధించటానికి కాళిదాసుకు దోహదపడింది. యువజన సంఘాల్లో చురుగ్గా పాల్గొనటం ఒక కీలక అంశంగా గుర్తు పెట్టుకోవాలి. ఉమ్మడి నర్సరావుపేట, చిలకలూరిపేట డివిజన్ సిపిఎం పార్టీనిర్మాణంలో స్థానిక ఏరియా కమిటీ బాధ్యుడిగా వున్న పోపూరి రామారావుగారు రచించిన "ఇదే నా దేశం" అనే నాటకం యువజన సంఘాల ఆవశ్యకత, గ్రామాభివృద్ధిలో యువకుల పాత్ర ఇతివృత్తంగా ఒక రకంగా రాజకీయ నేపథ్యంలో సాగింది. అందులో ఒక పాత్రధారిగా కాళిదాసు పాల్గొనటం, కాళిదాసులో గొప్పమార్పుకు కారణమైంది. జాతరలు, ఎడ్లపందాలు, ఆ సందర్భాలు యువకుల పేకాట, యితర వ్యసనాలు సర్వసాధారణంగా వుండే ఆ రోజుల్లో వాటికి వ్యతిరేకంగా దేశభక్తి, యువజన సంఘాల నిర్మాణాత్మక కృషిని ఆ నాటకంలో యితివృత్తంగా రామారావుగారు మలిచారు. ఊరిలో నాటకాల ప్రదర్శనల పేరుతో యువకుల సమీకరణలో కాళిదాసు వేషధారిస్థాయి నుండి నిర్వాహకుడిస్థాయికి ఎదిగాడు.

విజయవాడలో ఎ.కె.గోపాలన్‌గారి బహిరంగసభకు జనసమీకరణకై సాగిన సైకిల్ ప్రచారయాత్రలో తిరగటంలో మరింత కమ్యూనిస్టు రాజకీయాలవైపు ఆకర్షితుడయ్యాడు కాళిదాసు. ఎమర్జెన్సీ అనంతరం వచ్చిన రాజకీయాల మార్పుతో పాటు ప్రజాఉద్యమాలు కూడా పెల్లుబుకుతున్న సమయంలో 1977 ఉప్పెన తర్వాత ఆ పెనుతుఫాను తాకిడికి బాగా నష్టపోయిన యడ్లపాడు గ్రామ రైతాంగానికి

మద్దతుగా ప్రభుత్వాన్ని నిగ్గదీస్తూ జరిగిన జాతీయ రహదారి దిగ్బంధనం గంటల తరబడి సాగింది. వాహనాల బంద్ ఉద్రిక్త పరిస్థితికి దారితీసింది. చివరకు కలెక్టర్ స్వయంగా వచ్చి చర్చలు జరిపి పరిష్కారమార్గం చెప్పేదాకా, ఆ రాస్తారోకో కొనసాగింది. దానిలో పాల్గొన్న కాళిదాసు అంతకు ముందు యువజన సంఘ కార్యకర్తగా, నాయకుడిగా, కళాకారుడిగా వున్న అనుభవానికి ఈ రాస్తారోకోతోడై ఉద్యమకార్యకర్తగా కూడా రూపాంతరం చెందాడు. స్థానిక సిపిఎం పార్టీ నాయకత్వం దృష్టిలో చురుకైనవాడిగా గుర్తింపు పొందాక వాళ్ళు కాళిదాసును రాజకీయంగా తర్ఫీదు చేయటంలో చొరవను పెంచారు. కాళిదాసు ఆ రకంగా సిపిఎం పార్టీ సిద్ధాంతాలూ, రాజకీయాలూ వంటబట్టాయి. ఈ సందర్భంలో పార్టీ జిల్లానాయకత్వం, ముఖ్యంగా జిల్లాకార్యదర్శి కామ్రేడ్ పుతుంబాక వెంకటపతిగారి దృష్టిలో కాళిదాసు పడ్డాడు. వారిద్దరి మధ్య సంబంధ బాంధవ్యాలు చాలా వేగంగా పెరిగాయి. సాధారణంగా వెంకటపతిగారికి కార్యకర్తలను గుర్తించటంలో, తర్ఫీదు యివ్వటంలో వున్న నైపుణ్యం కాళిదాసు విషయంలో మరింతగా రుజువైంది.

77 తుఫాను తర్వాత గ్రామాభివృద్ధి కార్యక్రమంలో, యువజన సంఘ నిర్మాణంలో కళారంగం, క్రీడల అభివృద్ధిలో కాళిదాసు భాగస్వామ్యం గణనీయంగా పెరగటంలో కాళిదాసులో నాయకత్వ లక్షణాలు అభివృద్ధి చెందాయి. స్థానికంగా పోపూరి రామారావుగారి, జిల్లా కేంద్రంలో వెంకటపతిగారి పర్యవేక్షణలో సుశిక్షితుడైన కార్యకర్తగా కాళిదాసు పరిణామం చెందాడు. 1980 వచ్చేసరికి రాష్ట్ర రాజకీయాలు చాలా బాగా వేడెక్కాయి. కాంగ్రెస్ ప్రభుత్వ ప్రజావ్యతిరేక చర్యలు ప్రజల్లో తీవ్ర విమర్శకు దారితీసాయి. రాజకీయ పునరేకీకరణ దిశగా పరిణామాలు జరుగుతూ పతాకస్థాయికి చేరాయి. అప్పుడే అఖిలపక్ష ఉద్యమంలో ప్రతిపక్షపార్టీలు ఐక్య కార్యాచరణకు పూనుకున్నాయి. పార్టీ రాష్ట్రకార్యదర్శిగా కామ్రేడ్ పుచ్చలపల్లి సుందరయ్య నాయకత్వంలో రాష్ట్ర పార్టీయావత్తూ అఖిలపక్ష ఉద్యమంలో చురుకైనపాత్ర పోషించింది. ఆ ఉద్యమం కోసం నెలల తరబడి ప్రచారం, చాప్టర్ వారీగా పోరాట పిలుపులలో రాష్ట్రం మొత్తం రాష్ట్ర ప్రభుత్వాన్ని

నిలదీసే స్థాయికి ఆ పోరాటం చేరింది. ప్రభుత్వం పెంచిన ఆర్టీసి బస్‌ఛార్జీల పెంపుకు నిరసనగా అఖిలపక్షం యిచ్చిన బస్సు బంద్ పిలుపు నిర్వహణలో యడ్లపాడు గ్రామాన్ని ఆనుకునివున్న జాతీయరహదారిపై కాళిదాసు ముందు పీఠిన నిలబడ్డాడు. బస్సుల విధ్వంసానికి పూనుకోకుండా శాంతియుతంగా కేవలం టైర్లలో గాలి మాత్రమే తీస్తూ బస్సులు నిలిపే సందర్భంలో పోలీసు లాఠీఛార్జి చాలా పెద్దఎత్తున పాశవికంగా జరిగింది. గాలిలో కాల్పులు కూడా జరిగాయి. పోరాటంలో వెన్నుచూపని ధైర్యశాలి కాళిదాసు ఆ లాఠీఛార్జీలో తీవ్రంగా గాయపడ్డాడు. ఎత్తి కుదేసి వెల్లకిలా పడేసి నడుం మీద కూడా బూటు కాళ్ళతో, లాఠీలతో కొట్టడంతో నిర్భయంగా అక్కడే వున్నాడు తప్ప, పోరాటంలో వెనుకంజ వేయలేదు. ఈ లాఠీఛార్జీ కాళిదాసు కుటుంబంపైన తీవ్రమైన ప్రభావం చూపింది. పుట్టింటి నుంచి అత్తింటి వరకూ కాళిదాసుమీదే ఆధారపడ్డ కుటుంబాలు భయంతో వణికిపోయాయి. వారికెంత ధైర్యం చెప్పి వచ్చినా స్థిమితపడని పరిస్థితి. అలాంటి సందర్భంలో కూడా అటు కుటుంబాలు, ఇటు తానూ ధైర్యం కోల్పోకుండా నిలబడ్డాడు. వారిని నిలబెట్టాడు కాళిదాసు. దీనిని కూడా ప్రజాపోరాటాల్లో నిర్భీతిగా నిలబడటంలో పరీక్షగానే భావించాడు. మొదటిసారి లాఠీఛార్జీ, నాయకుల అరెస్టుల తర్వాత పోలీసులు తిరిగి వచ్చినపుడు కూడా దెబ్బలు తిన్న కాళిదాసు అక్కడే బంద్‌ను నిర్వహిస్తున్న తరుణంలో విచక్షణ కోల్పోయిన ఇన్‌స్పెక్టర్ తుపాకీతో గాలిలోకి కాల్పులు జరిపేసరికి అది ఎక్కడ ప్రజల మీద కాల్పులకు దారితీస్తుందో అని పోలీస్ సిఐ మీద తిరగబడ్డాడు కాళిదాసు. తుపాకీ నేలమీద పడగానే ప్రజలు పోలీసులపై తిరగబడ్డారు. పోలీసులను, వాళ్ళ ఆయుధాలను ఒక బస్సులో వేసి తరిమేశారు ప్రజలు. దానితో తీవ్ర ఉద్రిక్తత. ఊరిమీద పోలీసులదాడి, ఆస్తుల ధ్వంసం దాకా సాగింది. 50 మంది అమాయక ప్రజల్ని అరెస్టుచేసి, నెల్లూరుజైలుకు తరలించారు. ఆ తర్వాత జరిగిన అరెస్టులూ, జైలుజీవితంలో కూడా చిట్టచివరకు విడుదలైన వ్యక్తి కాళిదాసు. ఈ ఘటనలు కాళిదాసు తెగింపుకూ, ధైర్యానికి ప్రతీకగా నిలబెట్టాయి. నెలల తరబడి అజ్ఞాతవాసం, పోలీసులవేట కొనసాగినా నిబ్బరం కోల్పోని నిజమైన పార్టీకార్యకర్తగా కాళిదాసు నిలబడ్డాడు.

నిరంతరం గ్రామంలో యువజన సంఘ కార్యకలాపాలు, నాటిక ప్రదర్శనలు కాళిదాసు నిత్యకృత్యాలుగా మారిపోయాయి. కుటుంబ ఆర్థిక అవసరాల నిమిత్తం అమ్మమ్మగారి ఊరిలో పొలం కౌలుకు తీసుకొని వ్యవసాయం చేయాల్సిన అవసరం ఏర్పడింది. అలా ఒక సంవత్సరం గ్రామం విడిచి వున్నా, మళ్ళీ 1983 నాటికి స్వగ్రామం యడ్లపాడుకు చేరుకున్నాడు. 1983లో యడ్లపాడు గ్రామంలో కామ్రేడ్ పుచ్చలపల్లి సుందరయ్యగారి నేతృత్వంలో 10 రోజుల కోస్తాజిల్లాల రాజకీయ పాఠశాల జరిగింది. దాని నిర్వహణలో ఒక కార్యకర్తగా కాళిదాసు పాల్గొనటం, ఆ క్లాసులు పరిశీలించటం, వారి చర్చలను గమనించటం, వారి భోజన వసతి సదుపాయాలు చేయడం ఒకరకంగా కాళిదాసు రాజకీయ అధ్యయనానికి, పుస్తక పఠనానికి పురికొల్పాయి.

ఇక్కడే మరో విషయం ప్రస్తావించాలి. కళారంగంలో, యువజనరంగంలో చురుగ్గా వుంటున్న కాళిదాసుకు గొప్ప అవకాశం వచ్చింది. 1978వ సంవత్సరం నవంబర్‌లో విజయవాడలో ఆంధ్ర ప్రజానాట్యమండలి రాష్ట్రస్థాయి శిక్షణా తరగతులు జరిగాయి. డాక్టర్ విఠల్, ధైర్యానందంగార్లు ఆనాటి ఆంధ్ర ప్రజానాట్యమండలికి రాష్ట్ర అధ్యక్ష, కార్యదర్శులు. ఆ శిక్షణాశిబిరంలో కామ్రేడ్ సుందరయ్య, కామ్రేడ్ బసవపున్నయ్య, కామ్రేడ్ జక్కా వెంకయ్య, కామ్రేడ్ మోటూరు హన్మంతరావు, కామ్రేడ్ విఠల్‌లాంటి ఉద్దండులు కళారంగం రాజకీయాలపై పాఠ్యాంశాలు బోధించారు. ఆ పాఠశాలలో గుంటూరు జిల్లా ముఖ్య నాయకత్వం నుంచి కాళిదాసు పాల్గొనటం కాళిదాసు జీవితంలో ఒక ముఖ్యమైన ఘట్టం. ఆ సందర్భంలో అక్కడ నాయకుల నిరాడంబరత, క్రమశిక్షణ, కార్యకర్తల యెడల ఆపేక్ష, అప్యాయతలు, వివిధ రకాల అలవాట్లతో వున్న కార్యకర్తలు వదిలివేసిన చెత్తాచెదారాన్ని ఉదయమ్‌గారిలాంటి భారీమనిషి ఎత్తి పారేయటంలాంటి దృశ్యాలు కాళిదాసును ఎంతగానో ప్రభావితం చేశాయి. ఆ పాఠశాలలో పాల్గొన్న కాళిదాసుకు తన జీవితలక్ష్యాలు, పార్టీకార్యకర్తగా తన పనిలో మెరుగుదలకు తీసుకోవాల్సిన జాగ్రత్తలు అన్నీ అవగతమయ్యాయి. అంత వరకూ వున్న ఏ కొద్దిపాటి తటపటాయింపులు, మినహాయింపులు పటాపంచలు చేసిన క్లాసులుగా ఆంధ్ర ప్రజానాట్యమండలి శిక్షణాతరగతులుగా కాళిదాసు జీవితంలో మిగిలిపోయాయి.

యడ్లపాడు గ్రామ కళారంగంలో కాళిదాసు పని పోపూరి రామారావు గారి ద్వారా, కళారంగం తన ప్రధాన వ్యాపకంగా కొనసాగించటలో దోహదపడ్డ అంశాలు జిల్లా పార్టీ దృష్టికి చేరుతూ వుండేవి. స్థానికంగా కళాప్రదర్శనల సంస్కృతి యడ్లపాడుతోపాటు, చుట్టుప్రక్కల లింగారావుపాలెం, నాదెండ్ల, ఉన్నవ గ్రామాలలో కూడా కొనసాగాయి. వీటితోపాటు చిలకలూరిపేట సుదీర్ఘకాలంగా పెద్ద సాంస్కృతిక కేంద్రంగా కొనసాగుతూ పరిషత్తులు, ప్రదర్శనలతో నిరంతరం సందడిగా ఉండేది. వీటి ప్రభావం కాళిదాసు మీద ఎక్కువగా ఉంది. గ్రామంలో ప్రదర్శనల నేపథ్యంలో తయారైన 'గప్‌చుప్' నాటిక బాగా ప్రజాదరణ పొందింది.

ఎమర్జెన్సీ తర్వాత విజయవాడ నగరం మాంటిస్సోరి కళాశాలలో జరిగిన ఆంధ్ర ప్రజానాట్యమండలి ప్రతిష్ఠాత్మక ప్రదర్శనలు ఒక రకంగా ప్రజానాట్యమండలి పునరుద్ధరణగా చెప్పుకోవాలి. దానికి యుటిఎఫ్ మహాసభలు వేదికగా ఉన్నాయి. ఇదే సందర్భంలో చిలకలూరిపేట సెంటర్‌గా కళాప్రదర్శనల్లో కందిమళ్ళ నారాయణమూర్తిగారి ఆధ్వర్యాన రాష్ట్రంలోనే మొదటిసారి నాటక ప్రదర్శనలను పారితోషికంతో నిర్వహించటం, ఔత్సాహిక నాటకబృందాలకు ప్రోత్సాహాన్నీ, ఉత్సాహాన్నీ యిచ్చింది. ఇదికూడా కాళిదాసుమీద గ్రామంలో నాటకదళాన్ని నైపుణ్యంగా, రసవంతంగా తీర్చిదిద్దటానికి స్ఫూర్తిగా నిలిచింది. అందుకు దర్శకులు జరుగుల రామారావుగారి సహకారం, కృషి పరిషత్ స్థాయికి యడ్లపాడును తీసుకు వెళ్ళింది. విశాఖపట్నంలో ప్రజానాట్యమండలి మొదటి మహాసభ జరిగింది. ఆ మహాసభకు గుంటూరు జిల్లా ప్రతినిధులలో నూతలపాటి కాళిదాసు, ముత్తవరపు రామారావు హాజరు కావటం, ఆ మహాసభల ప్రదర్శనలు, ఉపన్యాసాలు, ఇతర కళారూపాలు రాష్ట్రవ్యాప్త ఆంధ్ర ప్రజానాట్యమండలి ప్రధాన నాయకత్వంతో పరిచయాలు కాళిదాసును ఎంతో ప్రభావితం చేశాయి. అక్కడ అరుణ్‌జీ ఆధ్వర్యాన ప్రదర్శించిన "ఊరేగింపు" వీథినాటిక, దాని టెక్నిక్, దానికి లభించిన విశేష ప్రజాదరణ కాళిదాసు ఆలోచనాసరళి మీద ఎంతో పనిచేసింది. లింగారావు పాలెంలో కందా నాగేశ్వరరావు, అక్కడి పిల్లలతో తయారుచేసిన "అద్దం" వీథి నాటిక ప్రదర్శన కాళిదాసు మనసును ఇక తిప్పనియ్యలేదు. అధిక శ్రమ, ప్రయాస, వేదిక, లైటింగ్, మేకప్, సుదీర్ఘ రిహార్సల్స్‌యొక్క ఒత్తిడితో వున్న స్టేజీనాటికల

స్థానంలో వీధినాటిక ఎంతో సౌకర్యంగా, ఖర్చు తక్కువ, ఎక్కువ ఆకర్షణ, ప్రజాదరణ పొందటం చూసి ఎంతగానో ఉత్తేజపడ్డాడు కాళిదాసు. కళాకారులకు సౌకర్యంగా, ప్రజాసమస్యలపై ప్రజల్ని చైతన్యం చేయడానికి ఉన్నంతలో ఆ బాధ్యతలు ఎంతో సమర్థవంతంగా నిర్వహించి గుంటూరుజిల్లాలోనే కళాబృంద నాయకుడిగా మన్ననలు పొందాడు కాళిదాసు. అటు రంగస్థలం, ఇటు వీధినాటిక రెండు కళ్ళుగా చేసుకున్నాడు కాళిదాసు.

అక్కడ నుంచి అతని దృష్టి కోణంలో చాలా మార్పు వచ్చింది. ఒకవైపు నటుడు, ఒకవైపు ఆర్గనైజర్, మరోవైపు పార్టీకార్యకర్త, మరోవైపు చుట్టుపక్కల దళాల నిర్మాణానికి సహకారం యివ్వటం యిలా బహుముఖాలుగా తన కళాప్రస్థానం విస్తరించుకుంటూపోయాడు కాళిదాసు. ఆ తర్వాత జరిగిన నెల్లూరు 1984 ప్రజానాట్యమండలి మహాసభ తర్వాత గుంటూరు జిల్లా ఆంధ్ర ప్రజానాట్యమండలి కన్వీనర్‌గా రాష్ట్రకమిటీకి ఆహ్వానితుడిగా ఉద్యమ బాధ్యతలు స్వీకరించాడు. ఆ తర్వాత ఖమ్మంలో 1988 ఏప్రియల్‌లో జరిగిన రాష్ట్ర మహాసభలో పూర్తిస్థాయి రాష్ట్ర కమిటీసభ్యుడిగా బాధ్యతలు తీసుకున్నాడు. ఇలా రాష్ట్రబాధ్యతలు అన్నీ కన్వీనర్‌గానే నిర్వహించాడు తప్ప అప్పటికి గుంటూరుజిల్లా ప్రజానాట్య మండలి నిర్మాణం సంపూర్ణంగా జరగలేదు. ప్రజానాట్యమండలికి జిల్లా కేంద్రం లేదు. ఈ నడిమి కాలమంతా జిల్లా కేంద్ర నిర్మాణం కొరకు బాధ్యులపై నిరంతరంగా ఒత్తిడి చేస్తూనే ప్రజానాట్యమండలి విస్తరణ కోసం కృషి చేశాడు. ఈ కృషిలో భాగంగానే జిల్లావ్యాపితంగా కోలాటదళాలు, డప్పుదళాలు, నాటికదళాలు విస్తృతంగా ఏర్పడ్డాయి. ఈ పనిలో కాళిదాసుతోపాటు యడ్లపాడు పద్మారావు, కొమ్మూరి హన్మంతరావు, నాదెండ్ల మాణిక్యమ్మ, అమరమ్మ, పాలపర్రు చెక్కభజన గురువు సుబ్బారావు, కోలాట దళాల నిర్మాణానికి జాన్, దుగ్గిరాల తుమ్మపూడి ప్రసాద్, రాజు, నటరాజు, రేపల్లెప్రాంతం నిమ్మగడ్డ రామకృష్ణ, పెద్దకాకాని ప్రాంతం శ్యాంప్రసాద్, నర్సారావుపేట మెట్టు కోటిరెడ్డి, జి. చిన్నపరెడ్డి, మంగళగిరి నుంచి ఆర్.వి.రాఘవయ్య, సత్తెనపల్లి కె.వెంకటేశ్వర్లు, అల్లాభక్షు తదితరులు భాగస్వామ్యం వహించారు. విశేషమేమిటంటే వీరిని తమ సహచరులుగా చేసుకోవటానికి ముందు గుర్తించటం, వారికి శిక్షణ ఇవ్వటం,

పనిలో భాగస్వామ్యం వహించే విధంగా చైతన్యపర్చటం, వారిని నాయకత్వం స్థాయికి అభివృద్ధి చేయటం ఇవన్నీ కాళిదాసు నిర్మాణదక్షతకు తార్కాణాలు. పైన తెలియచేసినవారంతా సుదీర్ఘకాలం ప్రజానాట్యమండలి అభివృద్ధికి తోడ్పడే విధంగా పనిచేశారు. వారితోనూ, వారి కుటుంబాలతోనూ నిరంతర సంబంధాలు కాళిదాసు మానవ సంబంధాల ప్రత్యేకతను తెలియచేస్తాయి. ఆ కుటుంబా లన్నింటితో విడదీయరాని బంధం ఏర్పడింది. దీనిని మనం కాళిదాసు ప్రత్యేకతగా గుర్తుపెట్టుకోవాలి. ఏ కార్యకర్తను కూడా నిర్లక్ష్యం చేయకుండా వారి అభివృద్ధికి నిరంతరం బాధ్యతగా అంటిపెట్టుకొని పనిలో వారి ఉత్సాహం తగ్గకుండా చూడటంలో విశేష ప్రతిభాశాలి కాళిదాసు.

దేశవ్యాప్తంగా శాస్త్రీయ ఆలోచనలను పెంపొందించే లక్ష్యంగా దేశంలో మూడు ప్రాంతాలలో ప్రారంభమైన శాస్త్రకళాయాత్రలలో ఒకటి కేరళనుండి ప్రారంభమైంది. ఆ యాత్ర గుంటూరు ప్రదర్శనలు విజయవంతం కావటంలో కాళిదాసుది మరచిపోలేని పాత్ర. ఈ కళాయాత్ర ఉమ్మడి ఆంధ్రరాష్ట్రమంతా అత్యంత విజయవంతంగా కొనసాగింది. ఆ ఇచ్చిన స్ఫూర్తితోనే రాష్ట్రంలో జన విజ్ఞానవేదిక ఏర్పడింది. శాస్త్రీయదృక్పథం ప్రచారంలో జనవిజ్ఞానవేదిక బాలోత్సవాలు, పిల్లల్లో ప్రయోగశీలత పెంపొందించే వర్క్‌షాపులు పెద్దఎత్తున జరిగాయి. కేంద్రప్రభుత్వం నూతన ఆర్థిక విధానాలలో భాగంగా అక్షరాస్యతా ఆవశ్యకతపై విశేషంగా కృషిచేయాలని 500 జిల్లాల్లో సంపూర్ణ అక్షరాసత్య సాధించాలని నిర్ణయం తీసుకొంది. దేశవ్యాప్తంగా భారత జ్ఞాన విజ్ఞానసమితి ఏర్పడింది. దానికి పెద్దలు బి.పి.ఆర్.విఠల్, ఐఎఎస్‌గారు, సిసిఎంబి నుంచి డైరెక్టర్లు, యితర ప్రముఖ ప్రొఫెసర్లు, మేధావులతో ఏర్పడిన కమిటీగా బిజివిఎస్ పని మొదలైంది. దాని ఆధ్వర్యంలో రచయితల వర్క్‌షాపు హైద్రాబాద్, ప్రొడక్షన్ వర్క్‌షాప్ ప్రముఖ నాటక దర్శకులు పి.జె.రామనాథంగారు క్యాంప్ డైరెక్టర్‌గా ధవళేశ్వరంలో 15 రోజులు జరిగింది. ఆ కళారూపాల ప్రదర్శనలకు అక్షరాస్యతా ఉద్యమ వాతావరణం తేవటానికి ప్రతి జిల్లాలో 45 రోజుల బస్సు యాత్రలు జరిగాయి. గుంటూరు జిల్లా కళాయాత్రకు కాళిదాసు కన్వీనర్‌గా విశేషంగా కృషి చేశాడు. రచయితల వర్క్‌షాపు, రాజమండ్రి ప్రొడక్షన్ వర్క్‌షాపుల్లో రచనల

తయారీ, వాటిని కళారూపాలుగా మార్చే చర్చలలో తన అనుభవాన్ని యితర టీం సభ్యులతో పంచుకున్నాడు. గుంటూరు జిల్లా నుండి ప్రముఖ దర్శకులు జరుగుల రామారావు, ప్రముఖ గాయని మండవ మాణిక్యమ్మ, శ్యాంప్రసాద్‌లతో పాటు, తాను కూడా శిక్షణ పొందటం, యాత్ర పొడుగూతా కన్వీనర్ బాధ్యతతో పాటు, కాళిదాసు సహనటుడుగా కొనసాగాడు. 15 రోజుల డైరెక్షన్ శిక్షణ, జిల్లా కేంద్రం 13 రోజుల శిక్షణ, ప్రదర్శనా కాలం 45 రోజులు ఇవన్నీ అంకెల్లో ఎలా వున్నా ఇన్ని రోజులు టీంను ఐక్యంగా ఉంచటం, క్రమశిక్షణగా ఉంచటం, ప్రదర్శనా ప్రాంతాల్లో నిర్వహణలో వచ్చే రోజువారీ సమస్యలు చాకచక్యంగా పరిష్కరించుకోవటం, అధికార, అనధికార ప్రముఖులతో సమన్వయం చేసుకోవటం అంత తేలికైన విషయం కాదు. కత్తిమీద సాములాంటిది. ఆ బాధ్యతను ఎంతో సమర్థవంతంగా నిర్వహించి జిల్లాలో విజయవంతమైన కళాబృంద నాయకునిగా మన్ననలు పొందాడు కాళిదాసు. ఈ విజయం వెనుక అప్పటికే తాను చేస్తున్న 10, 15 సం.ల కృషి ఎంతో సహాయపడింది. ఈ దళంలోని యితర సభ్యులు తర్వాత కాలంలో దళనాయకులుగా, ఫుల్‌టైం అక్షరాస్యతా కార్యకర్తలుగా ఆన్‌డ్యూటీ గానూ, అది లేకుండా కూడా 5 సం.ల పాటు సాక్షరతా ఉద్యమంతో మమేకమై పనిచేశారంటే ఆ అంకితభావం వెనుక మోటివేషన్ బాధ్యత కాళిదాసు తీసుకోవటం వల్లే సాధ్యమైంది.

కాళిదాసు ఒక పని మొదలెడితే ఆ పనితోనే ముగించడు. దానిని ఉద్యమానికి అనుసంధానం చేస్తాడు. ఇప్పటికే జిల్లావ్యాపితంగా ఒక రెండు నెలలపాటు సైన్స్, హేతువాద భావాల ప్రచారం కళారూపాలుగా చేశాడు. వాటితో జిల్లావ్యాపితంగా వచ్చిన పరిచయాలు, సంబంధాలు, వ్యక్తులుగా, సంస్థలుగా సహకరించినవారిని ప్రజానాట్యమండలిలోకి ఇమడ్చటానికి పూనుకున్నాడు. జిల్లాలో ఎన్ని రకాల కళాబృందాలు వున్నాయో అని సర్వే చేసి ప్రజానాట్యమండలి నిర్మాణానికి పట్టుపట్టాడు. అప్పటికి ప్రజానాట్యమండలి ఉద్యమానికి జిల్లావ్యాపిత స్వభావం లేదు. కమిటీలు లేవు. కన్వీనింగ్ కమిటీగానే కొనసాగుతుంది.

మరో విషయం ప్రస్తావించాలి. ఈ సైన్స్ కళాయాత్ర సాగుతున్న కాలంలోనే దేశవ్యాపితంగా అయోధ్య, బాబ్రీమసీదు పేరిట బిజెపి చేస్తున్న రథయాత్ర, దానితో

రెచ్చిపోయిన మతోన్మాదులు మసీదు కూల్చివేత, మతకల్లోలాలతో దేశం అట్టుడికిపోతోంది. హైద్రాబాద్ అక్షర కళాప్రారంభజాతా ముగింపు ఉత్సవాల సొక్కు ఇంకా ప్రజానాట్యమండలి నాయకులకు, కళాకారులకు తీరనేలేదు. రాష్ట్ర బృందం మొత్తాన్ని కాళిదాసు గుంటూరుజిల్లా ఉండవల్లికి తరలించాడు. దేశ సమైక్యత, లౌకికవాద పరిరక్షణ, మతసామరస్య ఎజెండాగా ఒక ప్రొడక్షన్ వర్క్‌షాపు మొదలెట్టించాడు. అలా వర్క్‌షాపులో తయారైనదే "మన చరిత్ర" వీథినాటిక. మతసామరస్య గీతాలసృష్టి. అవి రాష్ట్రవ్యాపితంగా సంచలనం సృష్టించాయి. అవి ఇప్పటికీ 30 ఏళ్ళకుపైగా కాలం గడిచినా, అవి వన్నెతరగని కళారూపాలుగా వున్నాయి. ఈ వర్క్‌షాపులో కొందరిని తప్పకుండా తలచుకోవాలి. పాటల రచన వర్క్‌షాపు దేవేంద్ర, బాణీలుకట్టిన కీర్తిశేషులు వేపా నర్సింహారావు, మనచరిత్ర బృందం దేవి, శాంతారావు, రఘు తదితరులు రచనల్లో పాల్గొంటే, నాటకరంగం గర్వించే దర్శకులు పి.జె.రామనాథం అద్భుతంగా వీథినాటికగా మనచరిత్రను మలిచారు. ఇది రాష్ట్రవ్యాపితంగా కళాకారులకూ, గాయకులకూ ఎన్నో విలువైన అనుభవాలను ఇచ్చిన ఉండవల్లి వర్క్‌షాపు. ఎవరైనా వాళ్ళకంటికి కనిపించిన దానిని వ్యాఖ్యానించగలరు. కానీ దాని వెనుక ఎంత కృషి ఉన్నదో, ఎంత నిబద్ధత, పట్టుదల వున్నదో గుర్తించలేరు ఎవరైనా చెబితే తప్ప. అందుకు కాళిదాసుయొక్క సమయానుకూల అవసరాలను గుర్తించటంలో నైపుణ్యం, దాన్ని కార్యరూపంలోకి తేవటంలో తాను నిద్రపోడు, ఎవరినీ నిద్రపోనివ్వడు. ఈ నాటిక తిలకించిన నాటకరంగ ఉద్దండ పండితులు కీ.శే.మొదలి నాగభూషణశర్మ, గుంటూరు, కృష్ణాజిల్లాల నాటకరంగ ప్రముఖులు అద్భుతంగా మనచరిత్ర వీథినాటికను కొనియాడారు. 40 ని.లలో చరిత్ర, వర్తమానాలను గొప్పగా అనుసంధానించారని ప్రజానాట్యమండలిని ప్రశంసించారు. దీని తర్వాతే మన ప్రజానాట్యమండలి కళారూపాలకు ఒక బ్రాండ్ ఇమేజ్ వచ్చింది.

ఆ మధ్యకాలంలో వచ్చిన ఎన్నికల సందర్భంలో కర్నూలు పేపర్‌మిల్లు కార్మికవాడల్లో ప్రజానాట్యమండలి కురుక్షేత్రం, ఆటబొమ్మల వీథినాటికల ప్రొడక్షన్ వర్క్‌షాపును పెద్దఎత్తున నడిపింది. రాష్ట్రంలో తొలిసారిగా పై రెండు నాటకాలను చిలకలూరిపేట కేంద్రంగా కురుక్షేత్రాన్ని ప్రముఖ నాటకదర్శకులు అన్నవరపు

శివరామిరెడ్డిగారితో, ఆటబొమ్మల నాటికను ప్రముఖ నాటకరంగ దర్శకులు పి.జె.రామనాథంగారితో వర్క్‌షాపు రూపొందించి ప్రదర్శనలకు సిద్ధంచేయటంలో కాళిదాసు కృషి చెప్పుకోదగ్గది. ఏదైనా కాళిదాసు మనసులోపడితే అది కార్యరూపం దాల్చేదాకా వదిలిపెట్టడు. అలాంటిదే అఖిలభారత రైతుమహాసభలు ఖమ్మంలో జరుగుతున్న నేపథ్యంలో దాని కోసం దేవేంద్ర ప్రత్యేకంగా రాసిన "రైతు" వీథి నాటికను మహాసభల ప్రచారంకోసం ఆలిండియా జాతాకు జతచేసి 50 ప్రదర్శనలకు పైగా గుంటూరు జిల్లాలో ప్రదర్శింపచేశాడు కాళిదాసు. ఇలా చేసింది కాళిదాసు బృందం మాత్రమే.

జనవిజ్ఞానవేదిక ఒక ఆరోగ్యకళాయాత్ర నిర్వహించాలని భావించింది. అది గుంటూరుజిల్లాలో ఎలా జరపాలి అన్న చర్చ వచ్చినపుడు కాళిదాసు యడ్లపాడులో ఓ మధ్యతరగతిరైతుగా వ్యవసాయం చేసుకుంటున్నాడు. తీవ్రమైన వ్యవసాయ పనుల ఒత్తిడిలో కాళిదాసుకూడా ఆయనతో ఈ పనికి ఒప్పించారు పెద్దలు. ప్రొడక్షన్ వర్క్‌షాపు లక్ష్మి సినిమా థియేటర్‌లో 14 రోజులు నడిపాడు. ఆ తర్వాత నెలరోజులు కళాయాత్ర. ఇదేదో ఒకరోజు చుట్టాలొచ్చినపుడు భోజనం పెట్టడంలా కాదు. కళాకారులను జమచేయాలి, భోజన వసతులు చూడాలి. ఇదంతా ఒక్కచేతిమీద నడిపాడు కాళిదాసు. ప్రదర్శన ఏర్పాట్లు, వేదికలు, టూర్ డిజైన్ల లాంటి కీలకమైన పనులు ప్రస్తుతపు ఎం.ఎల్.సి. కె.ఎస్.లక్ష్మణ్‌రావుగారు చూశారు. ఇక ప్రదర్శన జాతాస్థాయికి వచ్చింది. రోజువారీ 4, 5 ప్రదర్శనలివ్వాలి. మైక్ అద్దెలు పెట్టాలంటే చాలా ఎక్కువ మొత్తం ఖర్చు. కాళిదాసు వ్యక్తిగత బాధ్యతతో వడ్డీకి అప్పు తెచ్చి మైకు సెట్ సమకూర్చాడు. నిర్వాహకులకు ఆ అప్పు తీర్చడంలో, ఆర్థిక వనరులు పోగుచేయడంలో ఎందుకనో ఆలస్యం అవుతోంది. వడ్డీ పెరిగి పోతోంది. కళాయాత్రకైతే మైక్‌సెట్ అమరింది. కాళిదాసు మాత్రం ఆ మైక్‌సెట్ అప్పుకింద ఒక ఎకరం పొలం అమ్మి రిజిస్ట్రేషన్ చేయాల్సి వచ్చింది. ఇది కాళిదాసు అంటే. పని పూర్తిచేయటంలో తన, పర చూడకుండా ముందు పీకల్లోతు దిగబడటం, బయటపడటం కోసం ఏదైనా అమ్మటానికి సిద్దంకావటం అంటే మామూలు విషయం కాదు. కళాయాత్ర అద్భుతంగా విజయవంతమైంది. ఆ సందర్భంలో కోటా వెంకటేశ్వరరెడ్డి, నటరాజు, ప్రసాద్‌లు

కాళిదాసు బృందానికి సమకూరారు. ఆ తర్వాత కాలంలో వాళ్ళ ముగ్గురు ఎన్నో గురుతర బాధ్యతలు నిర్వహించారు.

90వ దశకంలో రెండు మహా ఉద్యమాలు వచ్చాయి.

అవి 1. అక్షరాస్యతా ఉద్యమం: అది ఇచ్చిన చైతన్యంతో ప్రశ్నించే ధైర్యంతో, వయోజన పాఠశాలల్లో కొత్తగా చదువు నేర్చుకొన్న మహిళాశక్తి సారా వ్యతిరేక ఉద్యమంగా రూపాంతరం చెందింది. అది నెల్లూరు దూబగుంటలో రాజుకొని, రాష్ట్రమంతా అంటుకుంది. కాళిదాసు సమకాలీన ఏ సమస్యనూ వదిలిపెట్టే రకం కాదు. అప్పుడప్పుడే మొదలవుతున్న సారా వ్యతిరేక ఉద్యమాన్ని, దాని శక్తిని ముందుగానే గుర్తించాడు. చిలకలూరిపేటలో లెక్చరర్‌గా పనిచేస్తున్న కందిమళ్ళ సాంబశివరావుగారు నాటకరచయితగా అప్పటికే మంచిపేరుతో వున్నారు. వారిని పట్టుకొని "ఆఖరి ఆట (సారా సంహారం)" నాటిక రాయించటం, దాన్ని యడ్లపాడులో జరుగుల రామారావు దర్శకత్వంలో రిహార్సల్ చేసి ప్రదర్శించటం, కాలక్రమంలో దాన్ని అభివృద్ధి చేసుకుంటూ భువనగిరి ప్రజానాట్యమండలి వీథి నాటకోత్సవాలలో ప్రదర్శించి ముందుకుపోయారు. దూబగుంట నిప్పు బాగా రగులుతోంది. ఆ వేగానికి తగిన నాటిక కోసం శాంతారావు దర్శకత్వంలో నాగార్జున యూనివర్శిటీ విద్యార్థులను సమీకరించి వాళ్ళతోనే 'సారా సర్కార్' నాటిక రాయించి సత్తెనపల్లి రెంటపాళ్ళలో ప్రదర్శింపచేశాడు కాళిదాసు. పై నాటిక రాష్ట్రవ్యాపితంగా వందల ప్రదర్శనలు పొందింది. ప్రజల్ని చైతన్యం చేయటంలో ప్రముఖపాత్ర పోషించింది.

రెండవది: 1991 నూతన ఆర్థికవిధానాల ప్రారంభకాలం. అటు మేధావివర్గం, పత్రికా రంగం, అభివృద్ధి చెందుతున్న పారిశ్రామిక అధిపతులు, ప్రపంచవ్యాపితంగా పెట్టుబడుల ఎగుమతుల కోసం అంతర్జాతీయ సామ్రాజ్యవాదం ఉవ్విళ్ళూరుతున్న సమయంలో ప్రధాని పి.వి.నర్సింహారావు కేరికేచర్‌తో మన్మోహన్‌సింగ్ ఆర్థికమంత్రిగా దేశరాజకీయాలు వేడెక్కుతున్న సందర్భమది. అప్పుడు ప్రజానాట్యమండలి చాలా ముందుచూపుతో నూతన ఆర్థిక విధానాల పర్యవసానాలను ప్రజలకు వివరించే కర్తవ్యాన్ని చేపట్టింది. కృష్ణా జిల్లా తేలప్రోలు

గ్రామంలో ఓ ప్రొడక్షన్ వర్క్‌షాపును నిర్వహించింది. అందులో దేవేంద్ర రాసిన "గొర్రెలు తిరగబడతాయి" వీథినాటిక పి.జె. రామనాథంగారి దర్శకత్వంలో శాంతారావు నిర్వహణలో రూపొందింది. దానిని గుంటూరు జిల్లాలో నాదెండ్ల గ్రామంలో,యడ్లపాడు, లింగారావుపాలెం, ఉన్నవ గ్రామాలనుండి కళాకారులను సమీకరించి వర్క్‌షాపులో గొర్రెలు తిరగబడతాయి నాటిక తయారు చేయించాడు కాళిదాసు. 50 ప్రదర్శనలకు పైగా గుంటూరు జిల్లావ్యాపితంగా ప్రదర్శనలు పొందింది. 'గొర్రెలు తిరగబడతాయి' నాటిక రాష్ట్రవ్యాపితంగా ఒకేరోజు వందల ప్రదర్శనలు పొందిన నాటికగా రికార్డు సృష్టించింది.

ఈ పరంపరలో ప్రైవేటీకరణ విశ్వరూపాన్ని బట్టబయలుచేసే మరో వీథినాటిక "అప్పా, అమ్మకమా". దీనిని ప్రజానాట్యమండలి గుడివాడలో ప్రొడక్షన్ క్యాంప్ పెట్టి రూపొందించింది. దానిని దేవేంద్ర, దండు నాగేశ్వరరావు, దశరథలు రచించగా, శాంతారావు దర్శకత్వం వహించాడు. ఈ నాటిక చాలా సంచలనం కలిగించింది. ఈ శిబిరం సదర్భంగానే ప్రముఖరచయిత, కవి కీ.శే.నాగభైరవ కోటేశ్వరరావుతో నూతన ఆర్థిక విధానాలపై రెండు పాటలు రాయించి తెచ్చాడు కాళిదాసు. ఏ పనికి ఎవరిని కలుపుకుపోవాలి. ఎవరెవరిని భాగస్వామ్యం చేయాలి అనే విషయంలో కాళిదాసు ఒక ప్రత్యేకమైనబాణి కలిగి ఉండేవాడు. ఏదో ఆషామాషీగా పని దొర్లించడం కాళిదాసు నైజం కాదు. కాళిదాసు రాయించి తెచ్చిన 2 పాటలు బ్రహ్మాండమైన హిట్‌సాంగ్స్‌గా విజయవంతమయ్యాయి. ఈ అప్పా, అమ్మకమా నాటిక ఆవశ్యకతను బాగా గుర్తించినవాడు కాళిదాసు. ఆ నాటికలో ముఖ్యమైన వేషం కూడా వేశాడు. దానిని రికార్డుస్థాయిలో 11 దళాలతో తయారుచేసి గుంటూరు జిల్లావ్యాపితంగా ప్రదర్శనలు చేశాడు. ఒక వీథినాటిక కోసం ఆ రోజుల్లో 10 నుంచి 12 మంది కళాకారులు అవసరపడేవారు. అలాంటిది 11 దళాలు అంటే కుడి ఎడంగా 120 మంది కావాలి. వాళ్ళని గుర్తించటం, సమీకరించటం, శిక్షణలకు తరలించటంలో వున్న కష్టనష్టాలు తెలిసిన వ్యక్తిగా కాళిదాసు తానే స్వయంగా పూనుకొని ఒకదానివెంట ఒకటి నేర్పుకుంటూ నటరాజు సహకారంతో జిల్లాలో ఒక పెద్ద సాంస్కృతిక ప్రభంజనం సృష్టించాడు కాళిదాసు. ఈ దెబ్బతో ప్రజానాట్యమండలి ముందున్న నల్గొండ, ఖమ్మంజిల్లాల

సరసన గుంటూరుజిల్లా నిలబడింది. ఆ జిల్లాలకు ప్రజానాట్యమండలిలో ఘనమైన చరిత్రలు వుండి జిల్లాకమిటీలు కూడా వున్నాయి. గుంటూరు ఇంకా జిల్లా కమిటిస్థాయికి చేరుకోనిదశలో అతనే ఒక సైన్యంలా సుడిగాలి చుట్టబెట్టినట్లు దళాల నిర్మాణం కోసం అందులో అందుబాటులో వున్న కార్యకర్తలను వెంటబెట్టుకొని ఇంతటి బృహత్తర లక్ష్యాన్ని ఛేదించాడు కాళిదాసు.

ఇక నూతన ఆర్థికవిధానాల విధ్వంస ఫలితాల సమగ్రరూపంగా, అంతర్జాతీయ సామ్రాజ్యవాద ఫైనాన్స్ క్యాపిటల్ దాడి, మూడో ప్రపంచదేశాలపై ఎలా ఉండబోతోంది అని హెచ్చరించే గొప్ప కళాత్మకప్రయోగం "చీమ కుట్టింది" వీధినాటిక. ఈ నాటిక ప్రొడక్షన్ కృష్ణాజిల్లా కొండపల్లి గ్రామంలో జరిగింది. నాటిక ఇతివృత్తం "అనగా అనగా ఒక రాజు, ఆ రాజుకు ఏడుగురు కొడుకులు" అన్న కథలో ప్రారంభమై, నాటిక చివరిలో "నా బంగారుపుట్టలో వేలుపెడితే కుట్టనా" అన్న వాక్యంతో ముగుస్తుంది. ఆ బంగారుపుట్ట మన భారతదేశం. దానిని ఏ రూపేణా అయినా ఆక్రమించ చూస్తే ఈ దేశం తిరగబడుతుంది అనే సందేశంతో ముగుస్తుంది. వస్తువురీత్యా, రూపంరీత్యా కూడా "చీమ కుట్టింది" నాటిక థియేటర్ పరిభాషలో అద్భుతమైన క్లాసిక్. అలాగే దాని ప్రదర్శన, అది చర్చించే లోతైన అంశాలు, ఆ నాటిక సంవిధానం, అప్పటి వీధినాటికల ప్రమాణాలకన్నా చాలా పైమెట్టున ఉంటుంది. ఒక రకంగా అది ఒక మేధోపర చర్చాంశంగా సాగుతుంది. అలాంటి నాటికను కూడా కాళిదాసు పల్లెప్రాంత ప్రజల్లోకి తీసుకెళ్ళే ప్రయత్నం మానలేదు. సత్తెనపల్లి డివిజన్ నార్నెపాడు గ్రామాన్ని కేంద్రంగా చేసుకొని దారీ డొంకా సరిగాలేని బాటలవెంట పగలంతా చేలో పని, సాయంకాలం 17 కి.మీ.లు సైకిల్ తొక్కుకుంటూ వెళ్ళి 14 రోజులు కష్టపడి నాటిక తయారుచేసి ప్రదర్శన ఇప్పించటం కళారంగంపై ఆయనకున్న నిబద్ధతకు నిలువెత్తు తార్కాణం. రానూ, పోనూ 34 కి.మీ.ల సైకిల్ ప్రయాణం తల్చుకుంటే కాళిదాసులో ఎంతటి పనిరాక్షసుడు వున్నాడో తెలియచేస్తుంది. ఈ బృహత్ ప్రయత్నానికి బెల్లంకొండ కోటేశ్వరరావు మాస్టారు ఎంతగానో సహకరించారు. గొర్రెలు తిరగబడతాయి, అప్పొ అమ్మకమా, చీమ కుట్టింది ఈ మూడు నాటికలు నూతన ఆర్థికవిధానాలపై కళాత్మక తిరుగుబాటుకు నిలువెత్తు సంతకాలుగా

చరిత్రలో మిగిలిపోయాయి. ఈ మూడు నాటికల మీద నాటకరంగ పరిశోధనలు జరగవల్సిన ఎన్నో అంశాలున్నాయి. చీమ కుట్టింది నాటికను తర్వాత దేశవ్యాపితంగా వచ్చిన శాసనోల్లంఘన ఉద్యమాన్ని అనుసంధానిస్తూ వినుకొండలో శిక్షణాశిబిరం పెట్టి 8 దళాలకు శిక్షణ ఇచ్చాడు కాళిదాసు. ఆ కళాబృందాలు పోలీసుల లాఠీఛార్జీలకు గురి అయ్యాయి. ఫణిదం కళాకారుడు ఆ సందర్భంగా తీవ్రంగా గాయపడ్డాడు కూడా. ప్రజల ఏ ఉద్యమానికైనా కాళిదాసు తన బృందంతో ఎంతటి నిర్బంధాన్నైనా తట్టుకొనే విధంగా సిద్ధం చేసేవాడు.

గుంటూరుజిల్లా సాంస్కృతికరంగంలో ఘనమైన చరిత్ర కలిగిన ప్రాంతం. ఇప్పటికికూడా నాటకరంగ వికాసంలో, పెద్ద సంఖ్యలో కళాపరిషత్తుల నిర్వహణలో ప్రతి సంవత్సరం ఈ ప్రాంతమంతా కోలాహలంగా ఉంటుంది. ఔత్సాహిక నాటక బృందాలు నాటకాలు తయారుచేసుకొని ప్రతిష్ఠాత్మకంగా పోటీపడతాయి. ఆంధ్ర ప్రజానాట్యమండలి చరిత్రగా కూడా గుంటూరు, తెనాలి ప్రాంతాలు ఎంతో గత వైభవం కలిగివున్నాయి. ప్రజానాట్యమండలి నిషేధం, నాటి ప్రముఖులంతా మద్రాసు సినీరంగానికి తరలిపోవటంతో రాష్ట్రవ్యాప్తంగా రెండు దశాబ్దాలు ప్రజానాట్యమండలి నిద్రణావస్థలోకి వెళ్ళిన తర్వాత ఎమర్జెన్సీ కాలంలో మళ్ళీ పునరావిర్భావం జరిగిన మాంటిస్సోరి కళాశాలలో సదస్సు, విశాఖ తొలి మహాసభ జరిగిన తర్వాత కూడా గుంటూరుజిల్లాలో ప్రజానాట్యమండలి నిర్మాణపరంగా ఇంకా మొదలు కాలేదు. రాష్ట్రవ్యాపితంగా ఆంధ్ర ప్రజానాట్యమండలి జిల్లాకమిటీలు, మహాసభలు, రాష్ట్రకమిటీలు ఏర్పడుతున్నా గుంటూరు మాత్రం రమారమి 20 సం.లు ఏవో కొన్ని దళాల కార్యకలాపాలు, జిల్లాస్థాయిలో కన్వీనింగ్ కమిటీల పేరున కొనసాగింది. చాలా కాలం కామ్రేడ్ పోపూరి రామారావు, కామ్రేడ్ సురేంద్ర కన్వీనర్లుగా కొనసాగారు. దాదాపు 10 సం.లు తన సొంతపని తాను చూసుకుంటూ కాళిదాసు కన్వీనర్‌గా పైన నేను ప్రస్తావించిన ప్రయత్నాలూ, ప్రయోగాలూ కాళిదాసు నిర్వహించాడు. రాష్ట్రకేంద్రంనుంచి గుంటూరులో ప్రజానాట్యమండలి నిర్మాణం కోసం ఒత్తిడి పెరిగింది. స్థానిక అవసరాలు, చారిత్రక పరిస్థితులు కూడా గుంటూరుజిల్లా మహాసభ జరపాల్సిన స్థితి కల్పించాయి. ఇక కాళిదాసు పార్ట్‌టైం కార్యకర్తగా కొనసాగటం సాధ్యం కాదు. పూర్తికాలం కార్యకర్తగా

గుంటూరు జిల్లా కేంద్రానికి తరలి రావల్సిన అవసరం ఏర్పడింది. వ్యక్తిగత కుటుంబ జీవితంలో కూడా ఒక్కగానొక్క కూతురు ఎడబాటు, ఉద్యమంలో తనకు వెన్నుదన్నుగా నిలిచిన కామ్రేడ్ పుతుంబాక వెంకటపతి హఠాన్మరణంలాంటి సమస్యలు కాళిదాసు కర్తవ్యదీక్షను ప్రభావితం చేయలేకపోయాయిగానీ వ్యవసాయంలాంటి కారణాలతో యడ్లపాడును వదలలేని స్థితి కొనసాగింది.

ఈ క్రమంలో 1994 జనవరి 24 నుంచి 29 వరకు ఆంధ్ర ప్రజానాట్యమండలి తొలి మహాసభలను చిలకలూరిపేటలో కాళిదాసు నిర్వహించాడు. అది ఏదో తూతూ మంత్రంగా జరిగిన మహాసభ కాదు. ఇప్పటికి కూడా దాని నిర్వహణ, దాని విజయవంతం చేసిన విధానం, దానికి వేసిన ప్రణాళిక, కలుపుకు వచ్చిన ప్రముఖులను సమన్వయం చేసుకోవటం ఎన్నో గొప్ప అనుభవాలను మనకిచ్చింది. ఏ మాత్రం ప్రజానాట్యమండలి వాసనలేని చిలకలూరిపేటలో 6 రోజులపాటు మహాసభలు కాళిదాసు నిర్వహించాడు. చుట్టుప్రక్కల గ్రామాలను కదిలించాడు. కామ్రేడ్ జాన్ సహాయంతో వందలమందిని కోలాటబృందాలుగా తీర్చిదిద్దాడు. పాటలూ, పల్లెసుద్దులూ, యితర నాటక ప్రదర్శనలు తర్ఫీదుల కోసం ఈ 6 రోజులు మహాసభలను వినియోగించుకున్నతీరు ఒక చరిత్ర. గణేశుని రత్తయ్య, మానుకొండ ఉపేంద్ర, ఇతర పట్టణ ప్రముఖులను ఆహ్వానసంఘంగా ఏర్పాటు చేయడం దగ్గరనుండి నిధుల సమీకరణ, మహాసభల నిర్వహణ ఇప్పటికీ కథలుకథలుగా అక్కడ చెప్పుకుంటారు. 800 మంది కళాకారులతో బ్రహ్మాండమైన మేళతాళాలు, కోలాట విన్యాసాలు, విచిత్రవేషాలు చిలకలూరిపేటను ఆశ్చర్యపర్చాయి. 3 వేలమందితో గొప్పబహిరంగ సభ జరిగింది. ప్రముఖ సినీరచయితలు పరుచూరి బ్రదర్స్, జననాట్యమండలి ఢిల్లీ నేత సోనియాగుప్త, రాష్ట్రకార్యదర్శి శాంతారావు, స్థానికపెద్దలు ఉద్వేగపూరిత ఉపన్యాసాలతో అద్భుతంగా జరిగింది. ఎక్కడైనా మహాసభ అలంకరణ ఎంతో శ్రమతో కూడుకొని ఉంటుంది. చుట్టుప్రక్కల గ్రామాల ప్రజల్ని వాటిలో భాగస్వామ్యం చేయటం కోసం ముందుగానే ప్రయత్నం చేయటంవల్ల తోరణాలు ముందుగానే సిద్ధం చేయడంవల్ల ఒక్క రాత్రిలోనే పట్టణం మొత్తం వంద మంది కార్యకర్తలు 30 నిచ్చెనలు, ఎన్నో వాహనాలతో మెటీరియల్ రవాణాతో రాత్రికి

రాత్రి వీధులన్నీ అద్భుతంగా ప్రజానాట్యమండలి తోరణాలు, జెండాలతో ముస్తాబయ్యాయి. ఒక్కరాత్రిలో ఇంత అలంకరణ జరగటం చిలకలూరిపేట మొత్తాన్ని ఆశ్చర్యంలో ముంచింది. కాళిదాసు ముందస్తు ప్రణాళిక, ప్రజలను భాగస్వామ్యం చేసిన పద్ధతి ఇంతటి అద్భుతాన్ని చేసి చూపించాయి. దాదాపు 1200 సభ్యత్వాన్ని ఈ పనులు నిర్వహించుకుంటూ పూర్తిచేశాడు. మహాసభ నిర్వహించగలమా అన్న ప్రశ్నతో మొదలైన మహాయజ్ఞం 2 నెలల కఠోరశ్రమతో ఒక చరిత్రగా గుంటూరుజిల్లా మహాసభ ముగిసింది. కాళిదాసు గొప్ప విజనరీ. ముందుగానే గమనాన్ని, గమ్యాన్ని గుర్తించగల నేర్పరి. ప్రణాళికాబద్ధ కృషికి సహచరులను సమీకరించుకోవటంలోనూ, పనిలో భాగస్వామ్యం చేయటంలోనూ ఎక్కడా తాత్సరం చేయకుండా, విజయవంతంగా ఎంతటి భారాన్నైనా భరించగలడు, సహించగలడు. ఈ విజయం ఇచ్చిన ప్రేరణతో అన్ని డివిజన్ల మహాసభలు పూర్తిచేశాడు. కొలకొల్లు వెంకటేశ్వర్లు అధ్యక్షులుగా మన నూతలపాటి కాళిదాసు కార్యదర్శిగా నూతన కమిటీ ఏర్పడింది.

1995 రాష్ట్ర ఎన్నికల సందర్భంలో వామపక్షాలు తెలుగుదేశంతో కలిసి పోటీచేశాయి. సత్తెనపల్లి, మంగళగిరి అసెంబ్లీ స్థానాల్లో ప్రచారం కోసం యితర రాష్ట్ర అవసరాల కోసం సత్తెనపల్లిలో వర్క్‌షాపు నిర్వహించాడు కాళిదాసు. అక్కడే ఎన్నికల పాటలు "పాముల పుట్ట" వీధినాటిక రూపొందాయి. ప్రచారంలో బాగా ఉపయోగపడ్డాయి. రాష్ట్రవ్యాప్తంగా సిపిఎం అభ్యర్థులు విజయం సాధించారు.

దేశవ్యాప్తంగా ఒక ప్రత్యేక ఎజెండాగా సాక్షరతామిషన్ ముందుకు వచ్చింది. 500 జిల్లాలలో అక్షరాస్యత సాధించే లక్ష్యం భారతజ్ఞానవిజ్ఞానసమితి సహకారంగా పెద్ద ఎత్తున ఎవేర్‌నెస్ ప్రోగ్రాం వచ్చింది. మనం రాష్ట్రవ్యాప్తంగా నిర్వహించిన జిల్లాలవారీ అక్షరకళాయాత్రలు, భారతజ్ఞానవిజ్ఞానసమితి ఆధ్వర్యంలోనే జరిగాయి. అందులో ఆంధ్ర ప్రజానాట్యమండలి, జనవిజ్ఞానవేదిక, ఐక్య ఉపాధ్యయ సంఘం యు.టి.ఎఫ్. ఈ 3 సంఘాలు కీలకభూమిక పోషించాయి. దానికి మనం చేసిన రాష్ట్రస్థాయి రచయితల వర్క్‌షాపు అద్భుతమైన పాటలు, కళారూపాలు, పల్లెసుద్దులు యిలా అనేకరీతుల సాంస్కృతిక రూపాలు ప్రజానాట్యమండలి ఆధ్వర్యాన రూపొందాయి. వాటిని అక్షరకళాయాత్రలో కళారూపాలుగా విశేషంగా ప్రజా

ప్రాచుర్యాన్ని పొందాయి. ఆ అనుభవం ఇప్పుడు వచ్చిన అక్షరకళాయాత్రలకు మార్గదర్శిగా ఉపయోగపడ్డాయి. వీటికి అనుబంధంగా ఆయా జిల్లాల ప్రత్యేక అవసరాలకు తగిన స్థానిక అంశాలు జతచేస్తూ జిల్లాలవారీగా రచయితల వర్క్‌షాపులలో కూడా మనమే చొరవగా పనిచేశాం. మంచిపాటలు, కళారూపాలు రూపొందించాం. సాక్షరతామిషన్ మొదటి ప్రయత్నంగా ప్రకాశంజిల్లా ప్రకటించబడింది. మన కాళిదాసు అందులో అది కొనసాగినంతకాలం ఆ జిల్లా వాళ్ళతో కలిసి పనిచేసి అనుభవం సమకూర్చుకున్నాడు. గుంటూరుజిల్లా ఆంధ్ర ప్రజానాట్యమండలి మహాసభ పూర్తిచేసుకొని, జిల్లావ్యాపిత సంబంధాలు విస్తరించుకుంటూ చాలా ముందుచూపుతో రానున్న సాక్షరతామిషన్‌లో గుంటూరు జిల్లా భాగస్వామ్యం కోసం మానవవనరుల సమీకరణకు తన జిల్లాకమిటీని సిద్ధం చేసుకున్నాడు. పనిలో దిగబడి లిస్టులు, వివిధ నైపుణ్యాలు కలిగిన కళాకారులను గుర్తించటం మొదలుపెట్టాడు. ప్రకాశంజిల్లా తర్వాత గుంటూరుజిల్లా ఎంపికైంది. అనేక కారణాలరీత్యా అంతగా ముందు కలిసి పనిచేసినవారు విడివిడిగా సాక్షరతా మిషన్‌లో పనికి పోటీపడే స్థితి వచ్చింది.

ఈ నేపథ్యంలో తెనాలిలో జరిగిన దర్శకుల శిక్షణా శిబిరానికి 47 మంది యితర మిత్రులు 14 మందిని సమీకరించి పంపారు. మన క్రమశిక్షణ మనం ముందుగా రూపొందించుకున్న ప్రణాళిక, కళారూపాల తయారీవల్ల కాళిదాసు, అతని బృందం చేసిన చొరవ, నైపుణ్యాలవల్ల ఆ దర్శకుల వర్క్‌షాపులో కాళిదాసు పైచేయి సాధించటం జరిగింది. కలెక్టర్ దగ్గర నుంచి డిడిల వరకు మన కృషి విశేషంగా ఆకర్షించింది. అసలు అంకం ఇప్పుడే మొదలైంది. గుంటూరు మొత్తం 57 మండలాలు. ప్రతి మండలానికి 12 నుంచి 14 మంది కళాకారులను ఎంపిక చేసుకోవాలి. వారితో శిక్షణకు సిద్ధం చేసుకోవటంలో కాళిదాసు యితరులకన్నా చాలా ముందున్నాడు. గుంటూరు బి.ఇడి. కాలేజీలో జరిగిన జిల్లా దళాలశిక్షణ సందర్భంలో 41 దళాలుగా 544 మంది కళాకారులను సమీకరించుకోవటానికి ఎంతటి హోంవర్క్ అవసరమౌతుంది. అంతమందిని ఈ పనిలో భాగస్వాములను చేయవల్సిన పరిస్థితి. ఇది ఒక పెద్ద ఛాలెంజ్‌గా కాళిదాసు కృషి చేసి కళాకారులను సమీకరించాడు.

ప్రతిరోజూ ఏదో ఒక సమస్య. భోజనం, వసతుల కోసం పోరాటం, శిక్షణ జమిలిగా సాగినస్థితి. అధికార యంత్రాంగంయొక్క మొక్కుబడి, సాచివేత నిర్ణయాలలో ఆలస్యం, దళాలలో వచ్చే అనైక్యతా సమస్యలు యిలా అనుక్షణం ఒక పద్మవ్యూహం సిద్ధంగా ఉండేది. అధికారులతో ఘర్షణ, అదే సందర్భంలో వాళ్ళతో ఐక్యత. కలెక్టర్‌గారి నుండి డిడి ఆఫీసు అటెండర్‌దాకా కో–ఆర్డినేషన్ చేసుకోవల్సిన అనివార్యత ఎంతో ఒత్తిడికి గురిచేస్తుందో అర్థం చేసుకోవచ్చు. వీటన్నిటిని చాకచక్యంగా పరిష్కరించుకొంటూ శిక్షణ పూర్తి చేయటం, నిజాయితీ కలిగిన అధికార యంత్రాంగంయొక్క మన్ననలను పొందటం, వారి ద్వారా సహకారాన్ని మరింతగా కళాకారుల వర్క్‌షాపుకు మలచటంలో కాళిదాసు కృతకృత్యుడయ్యాడు. ఇందుకు ఆంధ్ర ప్రజానాట్యమండలి రాష్ట్ర కేంద్రం పూర్తి తోడ్పాటు అందించింది. విడివిడి ఘటనలు ప్రస్తావిస్తే ఓ పెద్ద పుస్తకం అవుతాయి. ప్రతి జిల్లాలో ఇదే పరిస్థితి ఉంది ఆ కాలంలో. అప్పుడు అర్ధరాత్రి సమయం. గుంటూరు వర్క్‌షాపులో యితర మిత్రుల శిబిరంలో ఓ కుర్రాడు గుండెపోటుతో హఠాత్తుగా చనిపోయాడు. కబురు కాళిదాసు దగ్గరకు వచ్చి చేరింది. ఆ శిబిర బాధ్యులు సరిగా స్పందించలేదు. కాళిదాసు వెంటనే వెళ్ళి గుండెపోటుకు గురైన కుర్రాడిని హాస్పిటల్‌కు తరలించాడు. వైద్యం కోసం ఎంతో కష్టపడ్డాడు. వైద్యం జరుగుతున్న సమయంలోనే అతను చనిపోయాడు. ఒక్కసారి ఊహించుకుంటే అక్కడ స్థితి ఎలా ఉంటుందో మన ఊహకు అందదు. అయినా నిబ్బరంగా ఆ శవాన్ని వారి గ్రామానికి, యింటికి చేర్చటం, ఆ కుటుంబాన్ని సముదాయించటం, దహనసంస్కారాలు, యితర క్రతువులు అన్నీ పూర్తి అయ్యేదాకా ఆ పనులు చూడటం, అదే సందర్భంలో శిక్షణలోనే సంతాపసభ నిర్వహించటం, శిక్షణ కుంటుపడకుండా ముందుగా నిర్ణయించుకున్న టైం షెడ్యూల్ ప్రకారం పనులు పూర్తిచేయటం, ఇలాంటి విపత్కర సందర్భాలలో కూడా కాళిదాసు నిబ్బరాన్ని కోల్పోలేదు. ఆ చనిపోయిన కుర్రవాడు అంతక్రితం ఏ మాత్రం కాళిదాసుకు పరిచయం లేనివాడు. ఆ ఊరు తెలియదు, ఆ తల్లిదండ్రులూ తెలియదు. అయినా కాళిదాసు నిర్వహించిన పై బాధ్యతలవల్ల ఆ కుటుంబం, ఆ ఊరు కాళిదాసును బయటివాడిగా కాకుండా తమ కుటుంబసభ్యుడిగా చూసుకునేటట్లు ప్రవర్తించటం

ఒక్క కాళిదాసుకే సాధ్యమౌతుందేమో! శిక్షణ ఒక్కక్షణంకూడా కుంటుపడనివ్వలేదు. శిక్షణ పూర్తిచేసిన తర్వాత దళాలను జిల్లావ్యాపితంగా తరలించి ప్రతిరోజూ పర్యవేక్షిస్తూ రోజువారీ సమస్యలు పరిష్కరించుకుంటూ కళాయాత్రలు ముగించాడు.

అక్షరకళాయాత్రలు ముగిసినాకూడా తర్వాత ఆ కళాకారులతో సంబంధ బాంధవ్యాలు వదులుకోలేదు. యాత్ర ముగిసిన వెంటనే ఆ వందలమంది కళాకారులను మళ్ళీ జమచేసి 3 రోజులపాటు కళారంగం, యితర సామాజిక రంగాలపై అధ్యయన తరగతులు నిర్వహించి వారి చైతన్యస్థాయిని పెంచటం కాళిదాసు సాధించిన గొప్ప విజయం. ఆ తర్వాత వరుసగా 2 సం.లపాటు గుంటూరులో జరిగే కోటప్పకొండ, గోవాడ, అమరావతి తిరునాళ్ళలో సంప్రదాయంగా వస్తున్న చౌకబారు ప్రదర్శనలకు బదులు ప్రజలకు చదువు, ఆరోగ్యం, మూఢవిశ్వాసాలకు వ్యతిరేక అంశాల ఆధారంగా కళారూపాలు ప్రదర్శింపచేశాడు కాళిదాసు. అంటే కళాకారుల పని కళాప్రదర్శనలతోనే ముగించకుండా అనంతరం కూడా సామాజిక సేవలో ఉండాలంటే వాళ్ళతో ఎంతో సుహృద్భావ పరిస్థితి కొనసాగితే కానీ సాధ్యం కాదు. ఇక్కడ కళాకారులు, అటు అధికార యంత్రాంగాన్ని కూడా ఏక కాలంలో సమన్వయం చేసుకోవాలి. ఇవన్నీ నాయకత్వ నైపుణ్యానికి కొండగుర్తులు. తిరునాళ్ళలో ప్రదర్శనలు 10 గం.లకుపైగా జరిగాయి. వచ్చిన అధికారులు, చూసిన ప్రేక్షక సముదాయం, రికార్డింగ్ డ్యాన్సులకు వేగంగా ఆకర్షింపబడే ప్రజల్ని ఇన్ని గంటలపాటు మన కళారూపాల దగ్గర నిలబెట్టటం అసలు మనం ఏ మాత్రం ఊహించేది కాదు. ఏదో మీ ఒత్తిడితో అంగీకరించాం కానీ వేలాదిమంది ప్రజల్ని ఇంతగా మీ కళారూపాలు ప్రభావితం చేయటం మీ నిబద్ధతకు, ప్రజల యెడల మీ నమ్మకానికి నిదర్శనమని యావన్మంది ఎంతో గొప్పగా కాళిదాసును, వారి బృందాలను ప్రశంసించారు. పత్రికలు కూడా ఈ విషయాన్ని అత్యంత ప్రముఖంగా ప్రచురించాయి.

1996 పార్లమెంట్ ఎన్నికలకోసం దాచేపల్లిలో జరిగిన వర్క్‌షాపులో తోడు దొంగలు నాటిక రాష్ట్ర కేంద్రం రూపొందించింది. ఆ నాటికను 9 దళాలకు నేర్పించి జిల్లావ్యాపిత ప్రచారంలో పాల్గొనేలా చేశాడు కాళిదాసు. ఆ తర్వాత

హైద్రాబాద్ సిపిఎం ఆలిండియా మహాసభ సందర్భంగా “కథ మారింది” నాటికను 10 బృందాలకు శిక్షణ యిచ్చి ప్రదర్శనలు యిప్పించాడు.

1996 డిసెంబర్ 27, 28, 29 తేదీలలో నర్సరావుపేట మహాసభ చాలా ప్రత్యేకత కలిగి ఉంది. చిలకలూరిపేట మహాసభకన్నా శ్రమతో కూడినది కావటమే కాదు, ఈ మహాసభ ప్రజాస్వభావం కలిగి ఉంది. మనకు పెద్ద ఉద్యమంలేదు. అయినా 25 మంది కార్యకర్తలను పాలపాడు గ్రామంనుండి సమీకరించి 35 రోజులపాటు నర్సరావుపేట ఊరిలో ప్రతి ఇంటికి కరపత్రం ఇచ్చుకుంటూ వారి వద్దనుంచి బియ్యం, నిధి వసూళ్ళ కార్యక్రమాన్ని ఎంతో గొప్పగా నిర్వహించాడు కాళిదాసు. 30 క్వింటాళ్ళ బియ్యం, 30 వేలకు పైగా డబ్బులు ఆ పాలపాడు దళం పోగు చేసింది. అలంకరణలో కూడా పాత సైకిల్ టైర్లతో వినూత్నపద్ధతుల్లో పని జరిగింది. సోనియాగుప్తాగారు, అక్షరాస్యతలో D.D.గా పనిచేసిన తాతా మురళీశంకర్‌గారు, తెలంగాణ రైతాంగ సాయుధపోరాట యోధురాలు మల్లు స్వరాజ్యంగారు ప్రజానాట్యమండలి ఉద్యమం ఎదిగి వచ్చిన క్రమాన్ని కొనియాడారు. కాళిదాసు నిర్వహణా నైపుణ్యానికి ఈ మహాసభ ఓ నిదర్శనం.

గుంటూరు జిల్లా మొట్ట మొదటి వీథి నాటకోత్సవాలు ఎస్.హెచ్.ఓ.టి. (షాట్) నిర్వహించారు. 7 నాటికలు ఆడారు. స్టేజిమీద “ఫలం” నాటిక ప్రదర్శన జరిగింది. గుంటూరు మెడికల్ కాలేజి మహిళా డాక్టర్స్ ప్రత్యేకించి “ప్రశ్నించండి” వీథినాటిక ప్రదర్శనపై బాగా చర్చ జరిగింది. ప్రతిరోజూ 3 వేలమందికిపైగా ప్రజలు ఈ వీథినాటికోత్సవాల్లో పాల్గొన్నారు. ప్రజానాట్యమండలి రోడ్డు మీద ప్రదర్శనలకు సైతం డాక్టర్లను కూడా సిద్ధం చేయటం చిన్నవిషయం కాదు. ఆ మహిళా డాక్టర్లందరూ కాళిదాసు ఇంటిని పుట్టిల్లుగా భావించేవారు. అందువల్ల అది సాధ్యమైంది.

1997 విజయవాడ ప్రజానాట్యమండలి 5వ రాష్ట్రమహాసభలు పెద్ద ఎత్తున జరిగాయి. రాష్ట్రవ్యాప్తంగా బహుళ ప్రజాదరణ పొందిన దేవేంద్ర “రైతు” వీథినాటిక ఫణిదం కళాకారులు ప్రదర్శించారు. గుంటూరుజిల్లాలో కాళిదాసు ప్రత్యేకకృషి

వల్ల ఈ రైతునాటిక 100 ప్రదర్శనలు పూర్తిచేసుకొని ఊరూరునా రైతాంగం యొక్క విశేష ఆదరణ పొందింది. ఈ వీధి నాటికోత్సవంలో కూడా గుంటూరు లేడీ డాక్టర్ల బృందం ప్రశ్నించండి నాటిక ఉండవల్లి బృందంతో "మేరా భారత్ మహాన్" 3 నాటికలు ప్రదర్శించారు. 50 మంది మంగళగిరి కళాకారులు విచిత్ర వేషాలతో పాల్గొన్నారు. విజయవాడ 8వ వీధినాటకోత్సవాలు గుంటూరుజిల్లా ఉద్యమాభివృద్ధి, ముఖ్యంగా మంగళగిరి ప్రాంతానికి విస్తరణకు కాళిదాసు బాగా ఉపయోగించుకున్నాడు. మంగళగిరి ప్రాంతం నుంచి 200 మంది కళాకారులు పాల్గొన్నారు. ఈ విజయవాడ ప్రజానాట్యమండలి మహాసభలోనే కాళిదాసు ప్రజానాట్యమండలి కార్యదర్శివర్గంలోకి ప్రమోషన్ పొందాడు.

రాష్ట్రవ్యాప్తంగా ఆ రోజుల్లో వ్యవసాయ కార్మికులు పెంపుదల, వారి ఆత్మగౌరవ పరిరక్షణ లక్ష్యంగా పెద్ద ఉద్యమం సాగింది. దానిలో గుంటూరు జిల్లాను చాలా చురుకైనపాత్ర పోషించేలా కాళిదాసు సిద్ధం చేశాడు. దేవేంద్ర కూలి బతుకులు వీధినాటికను నాగార్జునసాగర్ ఆయకట్టు, సత్తెనపల్లి, నర్సరావుపేట ప్రాంతం, ఇటు రేపల్లె, తెనాలి, మంగళగిరి డెల్టాప్రాంతాల్లో 5 దళాలతో నాటిక, యితర వ్యవసాయ కార్మికపాత్రలతో కాళిదాసు విస్తారంగా ప్రదర్శింపచేశాడు. అక్షరాస్యతా ఉద్యమ కళాకారులను ఇందులో భాగస్వామ్యం చేయించటం కాళిదాసు స్టైల్ ప్రత్యేకత. 2 చోట్ల శిక్షణాశిబిరాలు లింగారావుపాలెం, దుగ్గిరాలలో జరిగాయి.

రేపల్లె డివిజన్ తిప్పలకట్ట గ్రామంలో 150 మందితో మెగా కోలాట శిక్షణా శిబిరాలు, మరొకటి సత్తెనపల్లి ఫణిదం గ్రామంలో, మరొకటి డప్పుల శిక్షణా శిబిరం 17 రోజులపాటు నిర్వహించాడు. ఈ శిబిరాల నుండి 4గురు కోలాట గురువులు వచ్చేలాగా నడిపాడు. ఇతర జిల్లాల విన్యాసాలస్థాయికి గుంటూరుజిల్లాను తీసుకెళ్ళే లక్ష్యాన్ని కాళిదాసు సాధించాడు. వ్యవసాయ కార్మికుల వాడల్లో ప్రజానాట్యమండలికి చాలా కొత్త సంబంధాలు సంపాదించాడు.

1999 సంవత్సరంలో ఏప్రిల్ 12, 13, 14 తేదీలలో ఆంధ్ర ప్రజానాట్యమండలి 10వ వీధి నాటకోత్సవాలు బ్రహ్మాండంగా జరిగాయి. నూతన

ఒరవడికి దారిచూపాయి. 37 మంది యువతీ, యువకులు 50 రోజులు గుంటూరు అంతా ప్రదర్శనలు యిచ్చుకుంటూ ఇంటింటికి తిరిగి నిధుల సమీకరణకు పూనుకున్నారు. 50 క్వింటాళ్ళ బియ్యం, 50 వేలు పోగుచేశాడు. రాష్ట్రవ్యాపితంగా వచ్చిన 15 వీథినాటిక దళాలు నగరంలో 70 ప్రదర్శనలు ఎండ, వడగాలి సైతం లెక్క చేయకుండా ప్రదర్శించారు. ఈ సందర్భంగా ప్రజానాట్యమండలి స్వయంపోషకం అయింది.

పట్టణ ప్రముఖులు, నాటకరంగ ప్రముఖులు ఆసాంతం ఈ ఉత్సవాలను అంటిపెట్టుకొని ఉన్నారు. నాటకరంగంపై గొప్ప సెమినార్ నడిచింది. సెంట్రల్ యూనివర్శిటీ థియేటర్ ఆర్ట్స్ ప్రొఫెసర్ భాస్కర్ శివాల్కర్ హైద్రాబాద్ నాటకరంగ ప్రొఫెసర్ పి.ఎస్.ఎన్.మూర్తి, ప్రముఖ నాటక దర్శకులు టి.జె.రామనాథం, నాయుడు గోపి, ప్రముఖ సినీనటులు జయప్రకాష్‌రెడ్డి, సినీరచయిత, నిర్మాత మల్లెమాల, హైద్రాబాద్ నుంచి సోనియాగుప్తాలాంటి నిష్ణాతులైనవారు బహిరంగ సభను, సెమినార్లను విజయవంతం చేశారు. 18 నాటికలతో అంతవరకు ఎన్నడూ జరగనిరీతిలో వీథినాటకోత్సవం విజయవంతం అయింది. ఒక సావనీర్‌ను కూడా ప్రచురించారు. పట్టణం మొత్తం షాట్ జరిగినన్నాళ్లూ చాలా కోలాహలంగా ఉంచారు. పోస్టర్లు, బ్యానర్లు, కరపత్రాలు, తక్కువ ఖర్చుతో బుట్టలు, చాటలు, కొబ్బరిమట్టలు, తాటిఆకులు, పాతటైర్లను సైతం అలంకరణలో నైపుణ్యంగా వినియోగించారు. ఒక రకంగా ఈ 10వ వీథినాటకోత్సవాలు గుంటూరుజిల్లా ప్రజానాట్యమండలి చరిత్రలో మూలమలుపు.

ఇంకో ప్రత్యేకత ఏంటంటే ప్రజానాట్యమండలి కేంద్రనాయకత్వం మొత్తం కేవలం 2 గం.ల వ్యవధిలోనే నాటి కేంద్రప్రభుత్వ భవితవ్యం మీద "ఇంకొన్ని నిమిషాలు" అన్న వీథినాటికను అప్పటికప్పుడు తయారుచేసి ప్రదర్శించింది. ఆ నాటికలో చెప్పినట్టే తెల్లవారేసరికి కేంద్రరాజకీయాలు మారిపోయాయి. కేంద్ర ప్రభుత్వం గద్దె దిగిపోయింది. ఇది కూడా ప్రజానాట్యమండలి ముందుచూపుకు, వర్తమాన రాజకీయ అంశాలపై కూడా తనదైనశైలిలో వ్యాఖ్యానించేస్థాయికి పరిణతి సాధించింది అని అందరూ ముక్తకంఠంతో ప్రదర్శించారు. ఈ మొత్తం కృషికి వ్యూహకర్త, కార్యనిర్వహకుడు, సమన్వయంలో దిట్టగా కాళిదాసు మరోసారి

నిరూపించుకున్నాడు. ప్రజానాట్యమండలి కీర్తిప్రతిష్ఠలు పెంచడంతోపాటు, నిర్మాణపరంగా శక్తిసామర్థ్యాలను నిరూపించుకున్న వీధినాటకోత్సవాలు ఇవి.

రాష్ట్ర రాజకీయాలలో చంద్రబాబు దూకుడు బాగా పెరిగింది. ప్రపంచ బ్యాంకు షరతులకు లోబడి ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌ను దేశంలోనే మొదటి ప్రయోగశాలగా మార్చే ప్రయత్నంలో చాలా బిజీగా ఉన్నాడు. ఏ ఇజాలూ అక్కర్లేదు. టూరిజం చాలన్నాడు. విద్యుత్ సంస్కరణల పేరుతో ఛార్జీలు పెంచటం, సబ్సిడీలు అన్నిటా కోతపెట్టటం, విద్యుత్ సంస్థను ముక్కలుచేయటం, రెగ్యులేటరీ అథారిటీని ఏర్పాటు చేయటం, ఎప్పుడుపడితే అప్పుడు కరెంటురేట్లు మార్చేపద్ధతి తేవటానికి పూనుకున్నాడు. రాష్ట్రమంతా పెద్దఎత్తున తిరగబడింది. ధర్నాలు, రాస్తారోకోలు, బంద్‌లతో ఊగిపోయింది. అందులో ఆంధ్రప్రజానాట్యమండలి చాలా చురుకైన పాత్ర పోషించి "కరెంటు వాతలు" వీధినాటిక, యితర పాటలు అనేక స్కిట్స్‌లు పెద్దసంఖ్యలో తయారుచేసి పోరాడుతూ ప్రజాశ్రేణులతో మమేకం అయింది. నిర్బంధాలు, లాఠీఛార్జీలు, పోలీసు కేసులుసైతం పెద్దసంఖ్యలో కళాకారులు భరించారు. రాష్ట్ర కేంద్రంనుంచి స్థానిక దళనాయకత్వం దాకా ఈ తిరుగుబాటు ఉద్యమంలో భాగస్వామ్యం అయ్యారు. బషీర్‌బాగ్‌లో వేలాదిమంది నిరసనకారులపై పోలీసు దమనకాండ కాల్పులదాకా వెళ్ళటం, అందులో ముగ్గురు కార్యకర్తలు అసువులుబాయటం, వందలమంది గాయపడటం ఒక గొప్పప్రజా పోరాటచరిత్ర. ఆ సందర్భాల్లో కాళిదాసు హైద్రాబాద్ లాఠీఛార్జీలో బాగా గాయపడ్డాడు. స్థానిక పోరాటాల్లో పదుల సంఖ్యలో కేసులకు లోనయ్యాడు. అయినా చైతన్యవంతంగా గుంటూరులో కరెంటువాతలు నాటిక, బల్బ్ ఆరిపోయింది వీధి నాటిక ప్రత్యేకించి తయారు చేయించాడు. కళాకారులను వందలసంఖ్యలో సమీకరించి, పోరాటంలో ముందు పీఠిన నిలబెట్టాడు. ప్రజాభిప్రాయసేకరణలో కళాకారులు కార్యకర్తలుగా పెద్దసంఖ్యలో పాల్గొనేలా చేశాడు. గుంటూరులోకూడా కళాకారుల అరెస్టు, కేసులతోపాటు అనేక రకాలుగా ప్రభుత్వం అవస్థలు పెట్టింది. కళాకారుల నైతికస్థైర్యం పడిపోకుండా పోరాటపటిమ పెరిగే పద్ధతుల్లో ప్రదర్శనలతో పాటు, రాజకీయంగా వాళ్ళను తీర్చిదిద్దటంలో కాళిదాసు విశేషంగా కృషిచేశాడు. ఈ

ఉద్యమం కళాకారులకు సామాజిక బాధ్యత నేర్పే కార్యశాలగా వినియోగించు కున్నవాడు కాళిదాసు.

2000 సం॥లో నెల్లూరులో ఆంధ్రప్రజానాట్యమండలి తనపేరును ప్రజానాట్యమండలిగా మార్చుకుంది. ఆంధ్ర, తెలంగాణ అన్న వివక్షత పేరులో కనపడనీయకూడదు అన్న లక్ష్యంగా ఉమ్మడితనానికి, ప్రజల సాంస్కృతికోద్యమ నాయకురాలిగా పరిణామంచెందింది. అందులో ఎంతో ఉత్సాహంతో 3 వీధి నాటికలు సిద్ధం చేసుకొని వచ్చిన కాళిదాసు హఠాత్తుగా అస్వస్థుడయ్యాడు. మేమంతా ఎంతో ఆందోళనకు గురయ్యాము. స్థానిక రామచంద్రారెడ్డి ప్రజా వైద్యశాల సకాలంలో చేసిన అత్యవసర వైద్యసేవలద్వారా తాను కోలుకున్నా షాట్, మహాసభలలో పాల్గొనలేకపోయాడు. తమ నాయకుడు తీవ్ర అస్వస్థతలో వున్నా, గుంటూరుజిల్లా కళాకారులు చాలా నిబ్బరంగా తమ కర్తవ్యాన్ని నెరవేర్చారు. అది కాళిదాసు వారికిచ్చిన శిక్షణ.

కాళిదాసులో అంతవరకూ మనకు పరిచయంలేని మరో అంశాన్ని ప్రస్తావించాలి. కాళిదాసు గొప్ప ఆర్గనైజర్. అది ఆల్రెడీ రుజువైన అంశమే. అక్కడితో ఆగకుండా మంచి ఉద్యమానుభవాలు వివరిస్తూ ప్రజానాట్యమండలి నిర్మాణక్లాసును బోధించగలిగిన ఉపాధ్యాయుడిగా కూడా పరిణతిచెందాడు. రేపల్లెలో కళాకారులకు ఒక రాజకీయ పాఠశాల జరిగింది. దానిని చాలా బాగా నిర్వహించాడు. తర్వాత అనంతపురంలో మరోక్లాసు జరిగింది. మా అందరి బలవంతంగా తానేమాత్రం సిద్ధంగా లేకపోయినా, రాష్ట్ర కేంద్రం ఉద్యమ నిర్మాణాల పాఠానికి కాళిదాసును ఎంపికచేసి బలవంతంగా పంపించింది. ఆ బాధ్యతను చాలా బాగా అనుభవాలు, గుణపాఠాలు సహితంగా ఆ పాఠశాలలో నిర్మాణ పాఠం బోధించాడు. తర్వాత గుంటూరుజిల్లా పాలపాడు గ్రామంలో రాష్ట్రవ్యాప్తంగా 380 మంది ప్రజానాట్యమండలి నాయకత్వానికి 4 రోజులపాటు స్థానిక పార్టీ కార్యకర్తల సహకారంతో రాజకీయ పాఠశాల జరిగింది. అందులో కూడా కాళిదాసు ప్రజానాట్యమండలి నిర్మాణ పాఠాన్ని బోధించాడు. ప్రజానాట్యమండలి రాష్ట్ర

నాయకత్వం వచ్చిన విద్యార్థుల మన్ననలు పొందిన ఉద్యమ ఉపాధ్యాయుడిగా కాళిదాసు నిరూపించుకున్నాడు. కేవలం 5వ తరగతి చదివిన కాళిదాసు నిత్య అధ్యయనశీలి. ఎకౌంట్స్ చూడటంలో నిష్ణాతుడు. లెక్కలు ఆడిటింగ్ చేయటంలో దిట్ట. ఇతర ప్రజాసంఘాల లెక్కలు చూసే బాధ్యత కూడా నిర్వహించాడు. స్వయం సాధనతో అంచలంచెలుగా తనను తాను చెక్కుకున్న కృషీవలుడు కాళిదాసు.

పొట్టి శ్రీరాములు ఆత్మబలిదానం ద్వారా ఏర్పడిన ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఆవిర్భావం తర్వాత 50 సం.లు పూర్తి అయిన సందర్భంగా రాష్ట్రవ్యాపితంగా పెద్ద ఎత్తున ఉత్సవాలు జరిగాయి. వాటిని రకరకాల అస్తిత్వపోరాటాలకు అనుసంధానిస్తూ అవాకులు, చెవాకులు పేలుతూ ఉద్రిక్తతలు రాజేసే ఒకవైపు, పాలకవర్గ భజనబృందాలు ఒకవైపు దీనిని ఉపయోగించుకునే ప్రయత్నాలు మొదలయ్యాయి. ప్రజానాట్యమండలి పై రెండు పెడధోరణులకు లోనుకాకుండా తెలుగుభాషా సాంస్కృతిక కళాయాత్ర పేరిట రాష్ట్రవ్యాపితంగా తెలుగువెలుగు పేరిట ఓ కళాయాత్ర ప్రణాళిక సిద్ధం చేసింది. హైద్రాబాద్‌లో రాష్ట్రస్థాయి రచయితల వర్క్‌షాపు నిర్వహించింది. ప్రధానమైన కాన్సెప్ట్, ప్రయోక్త, వచనభాగం వరకూ దేవి రాసింది. దానితో పాటలు, జానపదబాణీలన్నీ యితర కవులు, గాయకులు భర్తీ చేస్తూ వేల సంవత్సరాల భాషాసాంస్కృతిక, ఆర్థిక, రాజకీయ అంశాలను సాధికారికంగా ప్రస్తావిస్తూ తెలుగువెలుగు కళారూపం తయారైంది. ఆ కళారూపం దాదాపు ఒక గంట. దానితోపాటు, యితర పాటలు, కళారూపాలు ఒక గంట కలిపి 2 గంటల ప్రోగ్రాం తయారైంది. దాదాపు 30 మంది కళాకారులతో ఆ జాతా అద్భుత విజయం సాధించింది. మధ్యతరగతి మేధావివర్గం దానికి జేజేలు పలికారు. ఆ తెలుగువెలుగు కళాయాత్ర గుంటూరుజిల్లాలో సంచలన కళారూపంగా ప్రశంసలు పొందింది. కాళిదాసు చాకచక్యంగా దానికి ఆర్థికవనరుల సమీకరణ, ఉద్యమనిర్మాణానికి వీలుగా ప్రజానాట్యమండలి విస్తరణకు వినియోగించటంలో చాలా ప్రతిభ చూపాడు. వివిధ సభల సందర్భంగా కూడా దానిని ఒక బహుళ ప్రయోజన కళారూపంగా మలచి ప్రశంసలు పొందాడు కాళిదాసు. ఆ కళాయాత్రలో లబ్ధప్రతిష్ఠులైన రాష్ట్ర కళాకారులబృందం సమిష్టి మేధోశ్రమగా తెలుగువెలుగు చరిత్రలో మిగిలిపోయింది.

వ్యవసాయకూలీ జీవితాలపై కూలిబతుకులు నాటిక రూపొందించిన తర్వాత వాటి ప్రదర్శనల సందర్భంగా జిల్లావ్యాపితంగా తిరుగుతున్న నేపథ్యంలో గ్రామీణ ప్రాంతాలలో కౌలురైతుల జీవితాలను చాలా సన్నిహితంగా కాళిదాసు స్టడీ చేశాడు. ఏమైనా ఈ సమస్య రాను రాను పెరిగేదే తప్ప, తరిగేదికాదు. దీనికి ఒక శాస్త్రీయ పరిష్కారం చెప్పాలనే లక్ష్యంతో రాష్ట్ర కేంద్రంనుండి శాంతారాంను, ఒంగోలు నుంచి నాటకరచయిత దశరథను నర్సరావుపేట డివిజన్ పాలపాడు గ్రామానికి రప్పించి వ్యవసాయ కూలీలను సమీకరించి వారితో కౌలు రైతులసమస్యపై "బ్రతుకుదారి" అన్న కౌలురైతుల వీధినాటిక తయారు చేయించాడు కాళిదాసు. అదే బృందంతో డప్పు నృత్యాన్ని దానిలో విన్యాసాలు కూడా ఆ కళాకారులకే నేర్పించాడు. ఈ కళారూపాలతో పాలపాడు దళం దాదాపు 50 ప్రదర్శనలు వివిధ గ్రామాల్లో ప్రదర్శించింది. విశేష ఆదరణ పొందింది. తిరిగి అదే బృందంతో దేవేంద్ర రైతు వీధినాటికను తయారుచేయించి నర్సరావుపేట డివిజన్ ప్రజాతంత్ర ఉద్యమానికి నిధుల సమీకరణకు 20 రోజులుపాటు ఉదయం తమ కూలి పని చేసుకుంటూ, రాత్రులు ప్రదర్శనలు యిచ్చుకుంటూ కొనసాగారు. అదే బతుకుదారి నాటిక మచిలీపట్నం షాట్‌లో గుంటూరు ప్రాతినిధ్యం క్రింద ప్రదర్శన పొందింది. పగలు తమ పని తాము చేసుకుంటూ ఎంతో శ్రమకోర్చి నాటకప్రదర్శనల కోసం జమకూరి ప్రదర్శనలు యివ్వటం అంటే ఎంత శ్రమతో కూడుకున్నపనో, దాన్ని అవలీలగా చేయించగలిగాడు వారితో కాళిదాసు.

గుంటూరుజిల్లా సమగ్రాభివృద్ధి ధ్యేయంగా మన దగ్గర ఓ పెద్దపాదయాత్ర డిజైన్ చేయబడింది. అప్పటివరకూ గుంటూరుజిల్లా ప్రజానాట్యమండలి కార్యదర్శిగా పనిచేసిన కాళిదాసు అధ్యక్షస్థానానికి రమణ, కార్యదర్శిగా బాధ్యతలు తీసుకున్న ప్రారంభకాలం. లింగారావుపాలెం వర్క్‌షాపునాటికి పాటలు రూపొందించటం, దానికి స్థానికకవులను పాటలరచయితలుగా మలిచేక్రమంలో దేవేంద్ర సహకారంతో ఒక వర్క్‌షాపు నడిచింది. చాలా మంచిపాటలు వచ్చాయి. ఇక్కడ కాళిదాసు పాదయాత్ర రూట్ ఇన్‌ఛార్జ్‌గా మారి దాని విజయంలో అధికభాగం అయ్యాడు.

ఎంతో ఘనమైన కమ్యూనిస్టు ఉద్యమచరిత్ర గుంటూరుజిల్లాది. కామ్రేడ్ ఎల్.బి.జి., కామ్రేడ్ మోటూరు, బసవపున్నయ్య, కొరటాల, పుతుంబాక, శివారెడ్డి తదితర పెద్దనాయకులను అందించిన పోరుగడ్డ గుంటూరు. చరిత్రఘనమే అయినా, గుంటూరుకేంద్రంగా జిల్లాకార్యాలయం లేకపోవటం పెద్దకొరతగా ఉంది. చాలీచాలని ఆఫీసు. ఏమాత్రం ఉద్యమ అవసరాలను తీర్చే పరిస్థితిలేదు. ఆ నేపథ్యంలో పమిడిముక్కల లక్ష్మణ్‌రావు స్మారక జిల్లా పార్టీ కార్యాలయం రెండు దశలలో నిర్మాణం జరిగింది. దాని నిర్మాణ, నిర్వహణ బాధ్యతలు కాళిదాసు నిర్వహించడంతోపాటు, వాటికి నిధుల సమీకరణలో కూడా భాగస్వామ్యం వహించాడు. విజయవంతంగా లిఫ్ట్‌తోసహా, సమగ్ర అవసరాలు తీర్చగలిగిన జిల్లా కేంద్రకార్యాలయాన్ని తాను దగ్గరుండి మరీ తన పర్యవేక్షణలో పూర్తిచేశాడు. ఈ సందర్భాల్లో రోజువారీ సమస్యలు, నిధులలేమి వున్నా, సమయానికి కావల్సిన నిర్మాణ పనులు పూర్తిచేయించడంలోనూ, స్థానికంగా దశాబ్దాల గుంటూరు పార్టీ ద్వారా తనకేర్పడిన పరిచయాలను వినియోగించుకుంటూ ప్రకటించిన సమయానికి భవననిర్మాణం పూర్తిచేసి ఈ బాధ్యతల్లో ఏ చిన్న విమర్శ ఆరోపణ లేకుండా ఉండగలగటం కాళిదాసు నిబద్ధత, నిజాయితీల ప్రత్యేకత. దాని డిజైనర్ కె.ఎస్.కుమార్, మేస్త్రి వెంకట్రావు, పార్టీ బాధ్యులు శివారెడ్డిగార్ల ప్రత్యేక పర్యవేక్షణలో విశేషంగా కష్టపడ్డాడు కాళిదాసు. ఇది కాళిదాసుయొక్క మరో పార్శ్వం. అలాగే యడ్లపాడు పోపూరి రామారావు విజ్ఞానకేంద్రం నిర్మాణ బాధ్యతలకు పెద్ద ఎత్తున సహకరించి నిధులు సమీకరించినవాడు కాళిదాసు.

2010వ సంవత్సరం జనవరి 10, 11, 12, 13 తేదీలలో గుంటూరులో అఖిల భారతరైతు మహాసభ (ఎ.ఐ.కె.ఎస్.) జాతీయ మహాసభలు జరిగాయి. ఒక రకంగా రాష్ట్రం మొత్తం దీనిని ప్రతిష్టాత్మకంగా భావించింది. మహాసభల నిర్వహణతోపాటు, దాని ప్రచారంకూడా పెద్దసవాలుగా ముందు కొచ్చింది. బయట ప్రాంతాలవారిని పోగుచేశారు. స్థానికంగా ఎస్.ఎఫ్.ఐ. కార్యకర్తలు, రోజువారీ పత్రికా సమావేశాలు, నాయకులు, వాలంటీర్లు యిలా అనేకశ్రేణులు రోజువారీ ప్రచారంలో నెలరోజులకుపైగా పాల్గొన్నారు. వారికి భోజనం, వసతి చూసే బాధ్యత కూడా కాళిదాసుపైనే పడింది. వసతికి ఎలాగోలాగా పార్టీ

జిల్లాకార్యాలయాన్ని సరిపెట్టినా, భోజన ఏర్పాట్లు చాలా కష్టమైంది. మొదట్లో ఒకటి రెండ్రోజులు స్థానిక మెస్‌లు, స్పాన్సరర్స్ మీద ఆధారపడ్డారు. అవి కార్యకర్తలకు సరిపడక అనారోగ్య లక్షణాలు బయటపడ్డాయి. కార్యకర్తలు పెద్దసంఖ్యలో ఇళ్ళకు తిరిగి వెళ్ళిపోవటానికి సిద్ధపడ్డ పరిస్థితుల్లో తన ఇంటినే ఒక మెస్‌గా, తనభార్య జయమ్మగారు, తన అన్నయ్య పోపూరు సుబ్బారావు (పద్దయ్య) అన్ని రోజులూ సహకారంతో ఇంట్లోనే వంటచేయించి పెట్టినవాడు కాళిదాసు. తనతోపాటు, తన ఇంటిని, భార్యను, బంధువులను కూడా కర్తవ్యంలో భాగస్వాములను చేయటం, ఒక్కరు కూడా ఇబ్బంది పడకుండా ప్రతిరోజూ వందమందికి టిఫిన్, భోజనాలు ఏర్పాటు చేయడంలో ఎంత కష్టం, ఓపిక దాగి వున్నాయో కదా! దానికితోడు ఆ మహాసభల సందర్భంలో ప్రజానాట్యమండలి వీథినాటకోత్సవాలు రాష్ట్రవ్యాప్తంగా వచ్చిన దళాలు ప్రదర్శనలకు ఎరీనా, బహిరంగసభ, అతిథుల ఏర్పాట్లు యిలా ఎన్ని పనులున్నా అలుపులేకుండా నిర్వర్తించాడు. ఆశ్చర్యకరమైన విషయం ఏమిటంటే ఆలిండియా మహాసభల ఆహ్వాన సంఘానికి ట్రెజరర్‌గా కూడా కాళిదాసే బాధ్యతలు చూశాడు. దాదాపు 80 లక్షల ఖర్చు. దాని జమా, ఖర్చులు, రిసీట్స్, ఓచర్లు, డేబుక్, ఆవర్జాలు అన్ని పనులు జాగరూకతతో పూర్తిచేసి మహాసభ పూర్తైన రెండోరోజుకు ఒక్కపైసా తేడాలేకుండా లెక్కలు అప్పగించిన ఉత్తమ ఎకౌంటెంట్ కాళిదాసు.

రాష్ట్రవ్యాప్తంగా నివాసస్థలాల పోరాటం పెద్దఎత్తున జరిగిన సందర్భంగా గుంటూరునగరం పెద్దఎత్తున పాల్గొంది. పార్టీ దానికి నాయకత్వం వహిస్తే, దానికి ముందు పీఠిన నిలబడిన ఇద్దరు, ముగ్గురులో కాళిదాసు ప్రముఖులు. మూడు వేల మందితో జరిగిన పెద్దపోరాటమది. దాడులకు లోనయ్యాడు. నాలుగుసార్లు గాయపడ్డాడు. చాలాసార్లు బహిరంగంగా ఘర్షణలలో ముందుండి పోరాడాడు కాళిదాసు. మూడు ప్రాంతాల్లో పోరాటం జరిగింది. కేసులు, అరెస్టులు, జైళ్ళూ ఇలా ఎంతటి నిర్బంధమైనా భరించినవారిలో కాళిదాసు ఒకడు. ఇది ఏదో యవ్వన కాలంలో ఉడుకునెత్తురు ఉప్పొంగేకాలం కాదు. దాదాపు 60 ఏండ్లు వస్తున్న మనిషిలో ఇంతటి తెగింపు, ఘర్షణలకు భయపడని ధీరత్వం కాళిదాసు సొత్తు. ఇలాంటి ప్రజా ఉద్యమాలతోపాటు, ప్రజానాట్యమండలి

నూతనతరం నాయకత్వాన్ని వృద్ధిలోకి తెస్తూ రైతు సంఘంనిర్మాణంలో కూడా 2 దఫాలు జిల్లా సహాయ కార్యదర్శిగా 6 సం.లకుపైగా రైతు సంఘం బాధ్యతలు నిర్వహించాడు. జిల్లా రైతాంగసమస్యల కోసం కృషి చేశాడు. ఇదంతా జిల్లా పార్టీకార్యాలయం రోజువారీ నిర్వహణ చూస్తూ చేశాడు. విశ్రాంతి అన్న పదం కాళిదాసు జీవితంలో ఏమాత్రం చోటుదొరకని పదం అంటే అతిశయోక్తి కాదు. ఒక వ్యక్తి ఇన్ని బహుముఖ రంగాలలో ఇంత సమర్థవంతంగా పనిచేయటం చాలా అరుదైన విషయం.

సాంస్కృతిక ఉత్సవాలు, జనజాగరణ ఉత్సవాలు, బాలోత్సవాలు ఇలా ఏ పేరున నడిచినా, డిసెంబర్ చివరి వారంలో క్రిస్మస్ మొదలుకొని, 31 వరకూ ప్రతి సంవత్సరం ప్రజానాట్యమండలి పెద్దఎత్తున ఎన్నో కార్యక్రమాలను నిర్వహించేది. వీటిని డిజైన్ చేయటం, నిర్వహణలో ముందుండటం, ఊళ్ళకు ఊళ్ళను దీనికి సిద్ధం చేయటంలో ఎంతో ఆదర్శవంతమైన కృషి కాళిదాసుది.

పుల్లరి పోరాటయోధుడు హనుమంతు (వీరగంధం నాటకం) తయారైన విధానాన్ని కొంత మనం మాట్లాడుకోవాలి. పల్నాటిసీమలో సహజంగా ఫాక్షన్ ఉద్రేకాలు, ఘర్షణలు ఎక్కువగా ఉంటాయి. వాటిలో పాల్గొనే యువతను లక్ష్యంగా చేసుకొని పల్నాటి పుల్లరియోధుడు కన్నెగంటి హనుమంతు జీవితాన్ని, సాహసాన్ని, త్యాగాన్ని స్మరిస్తూ ప్రజానాట్యమండలి రాష్ట్రనాయకురాలు దేవి స్వయంగా రాసి, దర్శకత్వం వహించిన కన్నెగంటి హనుమంతు నాటకం గుంటూరుప్రాంతంలో చాలా చర్చకు దారితీసింది. 46 మంది కళాకారులు కావాలి దానికి. కళాకారుల, వనరుల సమీకరణ, రిహార్సల్స్, ప్రదర్శన వరకు ప్రతిరోజూ ఒక సమస్యగా వుండే సందర్భంలో కాళిదాసు నిర్వహణా సామర్థ్యాలు సామాన్యమైనవికావు. ప్రదర్శనలు ఎక్కువ సంఖ్యలో వేయకపోయినా, వేసిన ప్రతిచోటా ప్రజలు నీరాజనాన్ని పట్టారు. శివరాత్రికి కోటప్పకొండ తిరునాళ్ళలో కూడా వేశారు. ఈ ప్రయత్నంలో కాళిదాసుకు తోడుగా మెట్టు కోటిరెడ్డి కూడా చాలా కష్టపడ్డాడు. స్టేజిమీద ఈ సందర్భంగా చేసిన అనేక ప్రయోగాలు బాగా అలరించాయి.

కాళిదాసు పనిని పరిశీలిస్తే అన్నీ ఒక క్రమంలో గుర్తు చేసుకోవడం కుదరదు. అందుకే చాలా విషయాలు కొంచెం ముందూ, వెనుకలుగా వస్తూ వుంటాయి. పాఠకులు క్షమించాలి. పార్టీ ఆఫీసు నిర్మాణంలో కాళిదాసు పాత్ర ప్రస్తావన ఇంతకు ముందు చేశాను. నిర్మాణంతోనే అతని పాత్ర ముగియలేదు. ఆ తర్వాత ఆఫీసు కార్యదర్శి బాధ్యతలు, ఆఫీసు నిర్వహణా బాధ్యతలు కూడా తానే మోశాడు. ఈ పని చేస్తూనే కళారంగంలో కృషిసల్పటం మామూలు విషయం కాదు. అతని రోజువారీ టైం చూసుకుంటూ ఏ కొద్ది సమయమో విశ్రాంతి తప్ప నిరంతరం ఏదో ఒక నిర్మాణమో, పర్యవేక్షణో, కళారంగ విస్తరణో, క్లాసులో, శిక్షణలో ఇలా అనేక బహుముఖ కార్యక్రమాల్లో ఎప్పుడూ బిజీయే. సుదీర్ఘకాలంలో జరిగిన కృషితోపాటు, ప్రజానాట్యమండలి నిర్మాణ బాధ్యతలు వారసులకు అప్పగించటం ఒక అనివార్య పరిణామం. మరి దానిద్వారా కుదురుగా వుండే లక్షణం లేదుగా. తర్వాత జాషువా విజ్ఞానకేంద్రం నిర్మాణం, నిర్వహణ దాని బాధ్యతను అనేక మందిపెద్దల సహకారంతో చేపట్టాడు. ట్రస్ట్ ఏర్పడింది. నిధుల సమీకరణ జరిగింది. ఆ సమయంలో కూడా కాళిదాసు చాలా బిజీగా కొనసాగాడు. 11.50 లక్షల నిధుల సేకరణ కాళిదాసు పట్టుదలకు, సంకల్పానికి నిదర్శనం. ఆ ట్రస్ట్ కార్యదర్శిగా ఇప్పటికీ కాళిదాసు కొనసాగుతున్నాడు.

ఈ మధ్యలో ఒక విషయం మర్చిపోయాను. అఖిలాంధ్ర కళాకారుల సాంస్కృతిక సంక్షేమ కేంద్రం పని ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో ఒక విశిష్టమైన కృషిగా చెప్పుకోవాలి. ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక ఉద్యమంలో ఒక మేలిమలుపు అఖిలాంధ్ర కళాకారుల సాంస్కృతిక సంక్షేమ కేంద్రం ఏర్పాటు ఒక ప్రత్యేక దశగా పేర్కొనాలి. దీనికి ప్రేరణ మహనీయుడు సుందరయ్యగారు. మనం ఏవో కొన్ని కళారూపాలు, పాటలు, ప్రదర్శనలకు ప్రజానాట్యమండలి కృషిని పరిమితం చేయటం కాదు. తెలుగురాష్ట్రంలో సమస్త సాంస్కృతికోద్యమానికి నాయకత్వస్థాయికి అభివృద్ధి చెందాలి. దాని చరిత్ర, వర్తమానం, అందులో వున్న అన్ని కళారంగాలను, బృందాలను, కళారూపాలను తమ, పరభేదం లేకుండా సమస్త కళాకారులను సమీకరించాలి. వాళ్ళ హక్కులు, మెరుగైన సౌకర్యాలు,

మెరుగైన జీవనభృతి లక్ష్యంగా ఉద్యమించటానికి విశాల ఐక్యవేదిక కావాలి. అఖిలాంధ్ర కళాకారుల సాంస్కృతిక సంక్షేమకేంద్రం పై కర్తవ్యంలో భాగంగా ఒక ఉద్యమస్థాయి నిర్మాణంగా జరిగింది. తొలిమహాసభ తెనాలిలో పెద్దఎత్తున జరిగింది. ఆ కార్యక్రమ రూపశిల్పంలో తెనాలి మహాసభల విజయవంతంలో ఆనాటి ఓ పెద్దపోలీసు అధికారి చంద్రశేఖర్ ఆజాద్ పేరిట కాళిదాసు ఆప్తమిత్రుడు బొప్పన విజయకుమార్ గారు ఎంతో సహాయసహకారాలు అందించాడు. కాళిదాసు నిర్వహించాడు. దాని ప్రారంభం చాలా ఘనంగా సాగింది. రాష్ట్రవ్యాపితం అయింది. హైద్రాబాద్‌స్థాయిలో ప్రభుత్వం దగ్గర కూడా చాలా పలుకుబడి సంపాదించింది. వివిధ నగరాలలో మహాసభలు జరుపుకొని వెళుతూ ప్రదర్శనలతో ఉద్రూత లూగించింది.

దురదృష్టవశాత్తూ కాలక్రమంలో ఆ సంఘంలో కొన్ని అన్యవర్గ ధోరణులు ప్రవేశించాయి. ప్రారంభంలోనే దాని అంతిమలక్ష్యం నెరవేరలేదు. ఏమైనా కాళిదాసు శ్రమకు ఈ సందర్భాన్ని తప్పక పేర్కొనితీరాలి. అది సాధించిన గొప్పవిజయంగా చెప్పుకోవల్సి వస్తే చెల్లాచెదురుగా వ్యక్తులు, కొన్ని బృందాలు, కొన్ని సంఘాలుగా వున్న కళారంగాన్ని అది ఏకం చేసింది. కొన్ని సంవత్సరాలు చాలా ప్రభావశీలిగా పనిచేసింది. ఆనాటి తెలుగునాట కళారంగం ప్రముఖులు మేటి నటులంతా ఈ కేంద్రంలో ఐకమత్యంగా కలిసి పోరాడి కొన్ని డిమాండ్లు సాధించిపెట్టారు. సమస్యలు ప్రభుత్వంతో గుర్తింపచేశారు. 5 సం.లు కొనసాగింది. మిర్యాలగూడెం బాలకోటయ్యగారులాంటి వారి సహకారం, నర్సరావుపేట భాషాగారు, శివరామిరెడ్డిగారు, కోటిశివగారు, నాయుడు గోపిగారు, శాస్త్రిగార్ల తోడ్పాటుతో గుంటూరు కేంద్రంగా మరో సాంస్కృతిక సంక్షేమసంఘాన్ని ఏర్పాటుచేసిన ఘనుడు పట్టువదలని విక్రమార్కుడు కాళిదాసు. కళాకారుల అభివృద్ధికి ఎంతగానో తోడ్పాటు అందించాడు.

సాధారణ చిన్న వ్యవసాయ కుటుంబంలో పుట్టి పసితనంలో తండ్రిని కోల్పోయి, తల్లి వ్యవసాయకూలీగా, దొర పొగాకు కల్లాలు గ్రేడింగ్ పనుల్లో పనిచేసుకుంటూ కుటుంబాన్ని సాగుతూ ఎన్ని కష్టనష్టాలకు ఎర అయిందో ఆ

మహాతల్లి. ఒకవైపు చదువుకోవాలనే తపన, మరోవైపు పనిచేస్తేనే తప్ప ఇల్లు గడవని స్థితి. వీటిమధ్య అటు వ్యవసాయపనుల్లో నైపుణ్యాన్ని సాధిస్తూ, ఉన్నంతలో పంతులయ్యగారి తల్లి అభిమానం, మాస్టారు ప్రాపకం సాధించి పలకచెక్క ఆధారంగా ప్రాథమికవిద్య ప్రారంభించి హైస్కూల్‌లో కొద్దిపాటి ఫీజుకట్టలేని స్థితిలో గత్యంతరం లేక చదువుకు, బడికీ దూరమైనవాడు కాళిదాసు. కసికొద్దీ మేనమామ గ్రామంవెళ్ళి వాళ్ళ వ్యవసాయంలో కూరుకుపోయి పనిచేస్తూ తన యవ్వనకాలంలో అడుగుపెట్టిన కాళిదాసు కాలక్రమంలో తానే ఒక వ్యవస్థగా రూపాంతరం చెందటం వెనుక వున్న డైనమిక్స్ ఏమిటి? అన్నదే కాళిదాసునుంచి మనం పొందవల్సిన ప్రేరణ. ఇప్పటివరకూ కొంచెం ముందూ వెనకలైనా ఆయన జీవితంలో కొన్ని దశలను, కొన్ని ఘటనలను, కొన్ని ఉద్యమాలను, కొంత సాంస్కృతికోద్యమ నిర్మాణాన్ని ఒకవైపుగా, మరోవైపు భారత కమ్యూనిస్టుపార్టీ (మార్క్సిస్ట్) కార్యకర్తగా గుంటూరుజిల్లా కేంద్ర పూర్తికాలం కార్యకర్తగా, జిల్లా కమిటిసభ్యుడిగా, రైతు సంఘ ఉద్యమ నిర్మాణంలోనూ, దానికి నాయకత్వంలోనూ, పార్టీ జిల్లా కార్యాలయ నిర్మాణంలోనూ ముఖ్యంగా పార్టీ మరియు ప్రజాసంఘాల ఆడిట్ చేయగలిగిన ఆడిటర్‌గానూ ఒక మనిషి ఎన్నో...ఎన్నెన్నో రూపాలుగా ఎదిగాడు, ఒదిగాడు, ఘర్షణపడ్డాడు. విమర్శలూ, ప్రశంసలకు కుంగిపోవటం, పొంగిపోవటం లేకుండా స్థితప్రజ్ఞుడిగా, మేరునగధీరుడిగా కాళిదాసు నిలబడ్డాడు. కుటుంబంలో ఎన్నో విషాదాలు వచ్చి మీదపడ్డా, ఈ రోజు పదులసంఖ్యలో ఎందరికో కాళిదాసు దంపతులు సొంత తల్లిదండ్రులకు మించి అమ్మానాన్నలుగా వున్నారు అంటే, అది కాళిదాసు నిరాడంబరత, మనుషుల్ని ప్రేమించటం, వారి కష్టసుఖాల్లో భాగమవ్వటం, వారి మానసిక అవసరాలన్నిటా ఒక పరిశీలకుడిగా, ఒక పర్యవేక్షకుడిగా, ఒక మార్గదర్శిగా, మమతానురాగాల కూడలి క్షేత్రంగా తీర్చి దిద్దినవాడు కాళిదాసు. ఈ వాక్యం కొంచెం పెద్దదైనా మధ్యలో కామాలు, ఫుల్‌స్టాప్‌లు కావాలనే నేను పెట్టలేదు. నా ఫ్లోను అలాగే కొనసాగించాను.

తన పిల్లలకోసం ఎంతకైనా తెగించే కోడిపెట్టలా ఎందర్నో తన పొత్తిళ్ళలో కాపాడారు ఆ దంపతులు. కులాంతర, మతాంతర వివాహాలను చేసి ఎందరికో దగ్గరుండి జంటల్ని కలిపాడు. పెళ్ళిళ్ళు చేశాడు. పెద్దపెద్ద చదువులు చదువుకున్న

వారిని సైతం వీథుల్లో ప్రదర్శనలు ఇచ్చే విధంగా మలిచాడు. వారి మనుసులు గెలిచాడు.

ఈ వ్యాసం ముగింపులో వ్యాసకర్తగా నా పరిశీలనలను కొన్ని ప్రస్తావించి తీరాలి. ఎందుకంటే కాళిదాసుతో నాకు 35 సం.ల పైబడి అనుబంధం ఉంది. సుదీర్ఘకాలం ఒక నాయకత్వ బృందంగా కొనసాగాము. ఎన్నో వ్యక్తిగతమైన జ్ఞాపకాలు, అనుభవాలు, అనుభూతులు, బంధాలు, అనుబంధాలు ఇలా పెనవేసుకున్న జీవనక్రమం మా ఇద్దరిది. వ్యక్తిగతంగా నేను పొందిన స్ఫూర్తి కూడా కాళిదాసు నుంచి ఎక్కువే.

ఒక వ్యక్తిగా ఒక వ్యవస్థగా రూపాంతరం చెందటం వెనుక ఎన్నో విజయాలతోపాటు, అంతకుమించి అపజయాలు కూడా ఉండి తీరుతాయి. ఆ అపజయాలమెట్ల మీదనుండే విజయదరహాసం చేసుకుంటూ ఎంతో ఎత్తుకు ఎదిగాడు కాళిదాసు. ఏంటి కాళిదాసు వ్యక్తిత్వం? రూపం గాంభీర్యం. మాట కరువు. విమర్శ ఘాటుగా ఉంటుంది. మనసు వెన్న అని తెలియాలంటే కాళిదాసుతో ప్రయాణం చేస్తేనే అది అనుభవంలోకి వస్తుంది. అనవసర పొగడ్తల జోలికి పోడు. అవసరమైన విమర్శకు వెనుకాడడు. పాలూ, నీళ్ళూ దేనిలెక్క దానిలాగే చూస్తాడు. మొండిగా కనిపిస్తాడు. ఉద్యమ ఐక్యత, అభివృద్ధికోసం పట్టువిడుపులలో ఉంటాడు. చిన్నపిల్లాడు చెప్పినా ఓపికగా వింటాడు. దానినుంచి తనను తాను సవరించుకుంటాడు. ఆత్మవిమర్శకు జంకడు. ఎదిరించటంలో ఎదుటివారిస్థాయిని ఏమాత్రం పరిగణనలోకి తీసుకోడు. పెద్దపెద్ద నాయకులు సైతం "ఎందుకింత కొరకరాని కొయ్యలాగా ఉంటావు?" అని అన్నప్పుడు "నాకు పార్టీ పని తప్ప ఏ స్వప్రయోజనం లేదు. అందుకే నాకు లౌక్యం తక్కువ. నిర్ణయాలలో అవకాశవాదం జొరబడితే దాని మూల్యం వ్యక్తులకే కాకుండా, ఉద్యమం తీసుకోవల్సి వస్తుంది. అందుకే నా అనుభవపాఠాలను మాత్రమే నా ప్రతిపాదనలుగా పెడతాను. నచ్చనివారితో ఘర్షణపడటమంటే భవిష్యత్ నష్టాలను నివారించటానికే అన్న స్పృహలో ఎప్పుడూ ఉంటాను" అని ఖరాకండిగా చెప్పగలిగినవాడు కాళిదాసు. కాళిదాసుకు మనం ఒకమాట ఇస్తే మనకు ఇంక ఏ అవకాశం ఇవ్వడు. వెంటపడటంలో నక్షత్రకుడు కూడా కాళిదాసు ముందు

దిగదుడుపే. అదే సందర్భంలో ఆ పని అవసరాన్ని, దానితో మనకున్న అనివార్యతను గుర్తింపచేస్తూ ఫలితాలు రాబడతాడు. పోసుకోలు కబుర్లు చెప్పేవాళ్ళు ఎంతోకాలం కొనసాగలేరు. ఎందుకంటే కాళిదాసు అంటే "మ్యాన్ ఆఫ్ యాక్షన్" ఏ కౌశల్యాలైనా, నైపుణ్యాలైనా పనిలోనే తేల్చుతాడు. అంచనా కడతాడు. ఎవ్వరు ఎక్కడ అర్థాంతరంగా పనిచేస్తూ కాడి పడేసినా, దానిని భుజాన వేసుకోవటంలోనూ, ఉన్నత ప్రమాణాలతో పూర్తి చేయటంలోనూ ఎందరికో ఆదర్శంగా ఉంటాడు కాబట్టి పనిలో ఎవ్వరూ కాళిదాసుతో పోటీపడలేరు, పడనీయడుకూడా.

ఇంత గొప్పగా ప్రస్తావించినప్పటికీ, కాళిదాసు జీవితంలో ఏ పొరపాట్లు, తప్పులూ చేయలేదని కాదు. కాళిదాసు గొప్పతనం ఇక్కడే ఉంది. సమీక్షా సందర్భాలలో ఎక్కడా తా పట్టిన కుందేలుకు మూడేకాళ్ళు అనే రకంకాదు కాళిదాసు. మరొకరికి విమర్శించే అవకాశం ఇవ్వకుండానే తన పొరపాట్లు, తప్పులు చర్చకు పెడతాడు. సమీక్షించుకుంటాడు. మరింత పట్టుదలగా పనిలో దిగబడతాడు. నేను కూడా చాలా సందర్భాలలో కాళిదాసుతో తీవ్రవైరుధ్యాలలోకి వెళ్ళినవాడినే. అదే సందర్భంలో అతని నిజాయితీ, సంకల్పదీక్ష, నిర్మాణదక్షత, నిరాడంబరత, కార్యకర్తలను గుర్తించటం, పట్టుకోవటం, శిక్షణ ఇవ్వటం, కళాకారులుగా, నాయకులుగా తీర్చిదిద్దటం ఇలా బహుముఖాలుగా వున్న కాళిదాసు వ్యక్తిత్వాన్ని ఎప్పుడూ నేను గౌరవించి తీరతాను. గౌరవించాలి కూడా. అది కాళిదాసు ప్రత్యేకత. ఏ ఘర్షణా వ్యక్తిగతస్థాయికి చేరనీయడు. ఉమ్మడి ప్రయోజనంకోసం కట్టుబడి ఉండటంలో శషభిషలకు లోనుకాడు. ఏ సామర్థ్యాన్నీ చిన్నబుచ్చడు. అధికారాన్ని, ఆధిపత్యాన్ని ప్రదర్శించడు. ఈ లక్షణాలు వున్నవారితో వచ్చే సమానస్థాయి వ్యక్తిత్వాలమధ్య భిన్నాభిప్రాయాలు ఉంటాయే తప్ప, అవి ఘర్షణలు, రాగద్వేషాలుగా రూపాంతరం చెందవు. ఇది కాళిదాసు యెడల నా వ్యక్తిగత అంచనా. ఎంత ఒత్తిడిలోనూ నిబ్బరం కోల్పోకుండా ప్రతికూల పరిస్థితులను కూడా అనుకూలంగా మలచుకోవటంలో కాళిదాసు దిట్ట.

ఇక వ్యక్తిగత సంబంధాల కొనసాగింపులో కాళిదాసుది ఒక ప్రత్యేకపద్ధతి. మనుషులను పనిముట్లుగానూ, పరికరాలుగానో, మూసలుగానో కాళిదాసు పరిగణించడు. తెలుసుకోవాలనుకునే మనుషుల కళ్ళల్లో నిజాయితీని పసిగడతాడు.

వాళ్ళతో జతకడతాడు. ఒకసారి జతపడ్డ మనిషి మొత్తం బలాలను, బలహీనతలను మొత్తం ఓన్ చేసుకుంటాడు. ఇకవాళ్ళకు, వాళ్ళను గురించి ఆలోచించుకునే అవకాశం ఇవ్వనంతగా వాళ్ళ జీవితాల్లో తాను భాగమైపోతాడు. వాళ్ళు జీవితంలో ఎప్పుడూ కాళిదాసు ముందు ముసుగులతో మనలేరు. అంతగా ఓపెన్‌గా ఉండే స్వేచ్ఛ ఇస్తాడు. వారి రోజువారీ ప్రవర్తనలో వస్తున్న తేడాలను ఎప్పటికప్పుడు వాళ్ళ దృష్టికితెస్తాడు. దాని సాదకబాధకాలు వారు గుర్తించేటట్లు చేయడంలో ముందుంటాడు. అప్పటికప్పుడు కాళిదాసు యెడల వాళ్ళు అసంతృప్తి తెచ్చుకున్నా దాన్ని వాళ్ళు ఎంతోకాలం నిలుపుకోలేరు. కొద్ది సమయంలోనే రియలైజ్ అయి తీరుతారు. ఇది కాళిదాసు కౌన్సిలింగ్ పద్ధతి. ఇదంతా తాను ఎక్కడో ఎవరి దగ్గరో శిక్షణ తీసుకున్నది కాదు, జీవితంలో తాను చేసే పోరాటం, పరిస్థితులు సహకరించకపోయినా, నమ్మకం సడలని పట్టుదల, మొండితనం, ఫలితాలు రాబట్టే ఎత్తుగడలూ, వ్యూహాలు ఇవన్నీ తన జీవనపోరాటం నుండే సంపాదించుకున్నాడు. అందుకే అంత ఆత్మవిశ్వాసంగా ఉంటాడు. ఆత్మాభిమానాన్ని ఏ పరిస్థితుల్లోనూ ఫణంగా పెట్టడు, ఏ ప్రలోభాలకూ లోనుకాడు. అందుకనే కాళిదాసుతో ఒకసారి ఎవరికైనా ముడిపడిందంటే అది కాలపరీక్షకు నిలిచి తీరుతుంది. గెలిచి తీరుతుంది. కాళిదాసు గురించి ఇంత చెప్పుకుని ఒకరి గురించి నేను ప్రస్తావించకపోతే ఈ వ్యాసం సంతృప్తిగా ఉండదు. అది తన జీవనసహచరి జయమ్మగారు. ఆ మహాతల్లి కాళిదాసుకు కేవలం భార్య మాత్రమే కాదు, గొప్ప మార్గదర్శి కూడా. కాళిదాసును ఎల్లప్పుడూ నిటారుగా ఉంచటంలోనూ, ఓటమి పాలుకాకుండా చూడటంలోనూ తనదైన ప్రత్యేక మమతానురాగాలను అతనికి అందించటంతోపాటు, తన విజయాలు, అపజయాలు, కష్టాలు, నష్టాలు అన్నిటా ఏ ప్రత్యేకమైన ఉద్వేగాలకు, ఉద్రేకాలకు లోనుకాకుండా కాళిదాసు అనే ఒక మొండిఘటాన్ని నిరంతరం ప్రేమించే ఒక ప్రేమమూర్తి జయమ్మ. ఆవిడను కూడా మనం ఎల్లప్పుడూ గుర్తు పెట్టుకొని తీరాలి.

కాళిదాసు వెనక్కి తిరిగిచూసుకుంటే ఏ సందర్భంలోనూ పశ్చాత్తాపపడే సందర్భం అతనికి ఉండదు. ఏ ప్రాయశ్చిత్తం చేసుకోవల్సిన ఆగత్యం అతనికి ఏర్పడదు. కాళిదాసు మూర్తీభవించిన కార్యదీక్షాపరుడు. కారణజన్ముడు.



**కె. శాంతారావు**
ఆంధ్రప్రజానాట్యమండలి
పూర్వ రాష్ట్రకార్యదర్శి,
రంగస్థల కార్యకర్త,
హైదరాబాదు.
9959745723

# ఉద్యమ విలువల 'కాళి'దాసు

**క**ళలు, రాజకీయాలు, జీవనతత్వం, వేర్వేరుకాదని, అన్నీ సమాంతరంగా సమన్వయంతో ప్రజలకోసం ముందుకు సాగాల్సిందేనని కోరుకుని, ఆ మార్గంలో త్రికరణశుద్ధిగా పనిచేసే అరుదైన విశిష్టవ్యక్తుల్లో నూతలపాటి కాళిదాసు ఒకరు. అందుకే డెబ్బై వసంతాలకు చేరువ అవుతున్నా, ఆ నిక్కచ్చితనానికి వన్నెతగ్గని రీతిలో పదహారణాల కమ్యూనిస్టు కార్యకర్తగా నేటికీ చలామణి అవుతున్నాడు.

చెప్పిందే చేయాలి. చేసేదే చెప్పాలి. ద్వైదీభావం ఉండకూడదు. విలువలు పలకడానికే కాదు, పాటించడానికి అని చెప్తూ...ఆ క్రమంలో రాజీపడక ఎంతటి వారినైనా ఎదిరించగల ధీశాలి కాళిదాసు అని పరిచయం అయిన ప్రతి ఒక్కరికీ తెలిసిందే.

ప్రజలకోసం జీవితాన్ని అంకితం చేయాలనే దృఢసంకల్పంతో యడ్లపాడు నుండి గుంటూరు వచ్చిన సాధారణరైతు, ఔత్సాహిక కళాకారుడు కాళిదాసు. పెద్దగా చదువుకోకపోయినా, 'మార్క్సిజం – లెనినిజం' సైద్ధాంతిక పునాదులకు ఆకర్షితుడయ్యాడు. మార్క్సిస్టుపార్టీ అగ్రనేతలు పుచ్చలపల్లి సుందరయ్య, మోటూరు హనుమంతరావు, లావు బాలగంగాధరరావు, కొరటాల సత్యనారాయణ, పుతుంబాక వెంకటపతి, సింహాద్రి శివారెడ్డి వారి జీవితాలను, కార్యదక్షతను దగ్గరగా చూడగలిగాడు. ఆ మార్గంలో నిత్యం స్ఫూర్తి పొందుతూ పైవారితో,

ప్రక్కవారితో, క్రిందివారితో ఆ విధంగా కలిసిమెలిసి పనిచేయగలిగాడు. ఆటుపోట్లను, ఇక్కట్లను ఎదుర్కొన్నాడు. తన బాధ్యతలు నిర్వర్తించేందుకు ఒక్కోసారి పంటిబిగువున నిలబడ్డాడు. అవసరమైనప్పుడు కలబడ్డాడు. పలు విజయాలు సాధించాడు. అయితే ఆ విజయాలు ఆ వ్యక్తికి సంబంధించినవి కావు. ఉద్యమాలకు సంబంధించినవి. బయటకు అంతగా స్పష్టంగా కనిపించవు, ఉద్యమకోణం ఉన్నవారికి తప్ప.

ప్రతికార్యకర్త స్థూలమైన సైద్ధాంతిక స్పష్టతతో విశాలమైన ప్రజా బాహుళ్యం లోకి ప్రవహిస్తూ పనిచేయాలన్న సుందరయ్యగారి మాటలను సదా మదిలో నిలుపుకుని ఆచరణలో పెడుతూ ఉంటాడు. ఆ వర్గచైతన్యంతోనే అందరికీ అందుబాటులో ఉంటూ మానవసంబంధాలను పెనవేస్తుంటాడు.

రైతు, కార్మిక, యువజన, ఉపాధ్యాయ, ఉద్యోగ, విద్యార్థి, మహిళ, కళా, సైన్స్‌రంగాలు ఒకటేమిటి అన్నింటిలో తల్లో నాలికలా మెలగడం కాళిదాసు సొత్తు అనడం అతిశయోక్తి కాదేమో!

1980లో నేను ప్రజానాట్యమండలిలోకి రాక మునుపునుండే కాళిదాసు ప్రజానాట్యమండలిలో పనిచేస్తున్నాడు. 1976లో ఆంధ్ర ప్రజానాట్యమండలి పునర్నిర్మాణ కార్యక్రమాల్లో భాగస్వామ్యం అయ్యాడు. నాటి రాష్ట్ర అధ్యక్ష కార్యదర్శులు డా॥ ఎ.పి.విఠల్, ధైర్యానందంగార్లకు చేదోడు వాదోడుగా ఉన్నాడు. యడ్లపాడులో ప్రజారంగస్థల కార్యక్రమాలకు పట్టుకొమ్మగా నిలిచాడు.

మేటిదర్శకుడు జరుగులతో కలసి గప్‌చిప్, హలికులూ సేమమా, సారాసంహారం (ఆఖరి ఆట), బుద్ధుడు పుట్టిన భూమిలో మొ॥నాటికల ప్రదర్శనలకు సారత్యం వహించాడు.

1987 భారత జనవిజ్ఞానయాత్ర, 1989 సఫ్దర్ హష్మీ మరణం, 1990 అక్షర కళాయాత్రల సందర్భంగా, ఆంధ్రప్రజానాట్యమండలి కార్యక్రమాల్లో అద్భుతమైన గుణాత్మక మార్పులు వచ్చాయి. వీథినాటిక ప్రక్రియే ఓ ఉద్యమంగా మారింది. ఎప్పటికప్పుడు ప్రజాసమస్యలపై సొంతంగా పాటలు, వీథినాటికలు,

ఇతర కళారూపాలు రాసుకోవడం, ప్రదర్శించడం, అందుకోసం నిరంతరం సమష్టిగా వర్క్‌షాప్‌లు, శిక్షణా కార్యక్రమాలు నిర్వహించుకోవడం ఓ వరవడిగా మారింది. స్వశక్తిగా నిలబడింది...ఎదిగింది ఆంధ్రప్రజానాట్యమండలి.

రాష్ట్రంలో జరుగుతున్న ఈ మార్పుల్లో కాళిదాసు మమేకంకావడంతో పాటు, తను స్వంతంగా గుంటూరుజిల్లాలో అంతే ఉద్వేగభరితంగా కార్యక్రమాల నిర్వహణకు తపనపడుతూ నడుం కట్టేవాడు.

ఆ కళారూపాలకు జనంనుండి వచ్చే స్పందన, ఆదరణ, ప్రజాబలంతో కాళిదాసు కృషి, ఉత్సాహం ద్విగుణీకృతం అయ్యేది.

ఇక్కడ ఓ మాట చెప్పుకోవాలి. ప్రజాకళాకారునిగా జీవితం కడవరకు కొనసాగాలంటే అటు రాజకీయాలను – ఇటు కళలను నిరంతరం శ్రద్ధగా అధ్యయనం చేయాల్సిందేనని సఫ్దర్ హష్మీ వక్కాణించాడు. ఆ జోడు గుర్రాలస్వారీని చాకచక్యంగా కొనసాగించాల్సిందేనని, లేకుంటే ఓ సాధారణ రాజకీయవాదిగానో, కళాకారునిగానో మిగిలిపోతావని హష్మీ తెలిపాడు.

ఈ మాటలను స్వాభావికంగా జీర్ణించుకున్న కాళిదాసు, కళాకారులకు వర్గరాజకీయాలపై అవగాహన కల్పించేందుకు ప్రత్యేకకృషి సల్పేవాడు. రేపల్లె లోను, పాలపర్రులోను ఆ విధంగా కళాకారులకు ప్రత్యేకంగా రాష్ట్రస్థాయి రాజకీయ పాఠశాలలను ఏర్పాటు చేశాడు.

రాష్ట్రస్థాయి వర్క్‌షాపుల్లో, జిల్లాస్థాయి శిక్షణాశిబిరాల్లో, మహాసభల్లో కూడా రాత్రి సమయాల్లో నిష్ణాతులను రప్పించి క్లాసులు చెప్పించేవాడు. పగలు శిక్షణ, రాత్రి అవగాహనలతో కళాకారుల్లో రెట్టించిన ఉత్సాహం తొణికసలాడేది. దిశానిర్దేశం కన్పించేది. అనంతరం ఇదే మార్గాన్ని తమ తమ ప్రాంతాల్లో కళాకారులు అనుసరించేవారు.

అనేక అక్షర, సైన్స్ కళాయాత్రల శిక్షణాశిబిరాలతోపాటు ఉండవల్లిలో జరిగిన మతసామరస్యంపై వర్క్‌షాప్, రెంటపాళ్ళ, ఫణిదం, తిప్పలకట్ట తదితర గ్రామాల్లో జరిగిన డప్పులు, కోలాటం, పాటలు, పల్లెసుద్దులు, జానపదకళల

శిక్షణాశిబిరాల్లో వందలాదిమంది కళాకారులు పాల్గొని ఈ విధంగా తర్ఫీదు పొందారు. ఎక్కడెక్కడినుంచో కళాకారిణులు కూడా వచ్చి ఈ శిబిరాల్లో స్వచ్ఛందంగా రోజులు తరబడి పాల్గొనడం విశేషం.

1994లో ప్రజానాట్యమండలి ప్రథమజిల్లామహాసభలు కాళిదాసు నేతృత్వంలో చిలకలూరిపేటలో జరిగాయి. పరుచూరి సోదరులు హాజరయ్యారు.

అదే సందర్భంలో కాళిదాసు సలహామేరకు కే.శే. అల్లాబక్ష్ సారథ్యంలో దేవేంద్ర రచన "రైతు" వీథినాటికను సత్తెనపల్లిదళం నేర్చుకుని, ఐచ్ఛికంగా గుంటూరునుండి హైదరాబాద్ వరకు వెళ్తూ శతాధిక మార్గ ప్రదర్శనలు ఇచ్చారు. రాష్ట్ర వీథినాటికోద్యమంలోనే ఇదో మైలురాయి.

అలాగే షాట్–99 (సఫ్దర్ హష్మీ ఓపెన్ థియేటర్–99) గుంటూరులో జరిగిన రాష్ట్రస్థాయి వీథి నాటకోత్సవాలకు సూత్రధారై కాళిదాసు అటు కళాకారుల్లోను, ఇటు ప్రజానీకంలోనూ ఎనలేని ఉత్తేజం కలిగించాడు. కే.శే. మల్లెమాల, జయప్రకాష్‌రెడ్డి, ఐ.ఎ.ఎస్. అధికారి ఎన్. ముక్తేశ్వరరావు, డా॥ సోనియాగుప్తా, డి.ఎస్.ఎన్.మూర్తి, భాస్కర్ శివాల్కర్‌వంటి ప్రముఖులు పాల్గొన్నారు. షాట్ చివర్లో నాటి దేశ రాజకీయ అనిశ్చిత పరిస్థితులకు అద్దంపట్టే తాజా లఘు వీథినాటిక 'ఇంకెన్ని నిముషాలు...?' ప్రదర్శించిన కొన్ని గంటలకే నాటి కేంద్రప్రభుత్వం పడిపోవడం గమనార్హం.

కాగా, వీథినాటిక ప్రక్రియ రాష్ట్రంలో వేళ్ళూనుకుంటున్న దశలో ఓ చర్చ జరిగేది. వీథినాటికను నేలబారుచేసి నినాదాలగోలకు, అభినయాలకు తేడా లేకుండా చేసారనేది ఒక వాదన అయితే, ఏ నాటికకయినా ప్రజాకదలికే అంతిమ లక్ష్యం గనుక, నాటకంయొక్క అత్యున్నత రూపమే వీథినాటిక ప్రక్రియ అని వాదించినవారూ ఉన్నారు.

కానీ వీథినాటిక ఎక్కడికక్కడ ఎండల్లో వీథుల్లో సైతం చమట్లుకక్కేలా ప్రదర్శించే సామర్థ్యంతోపాటు ముఖ్యంగా వీథినాటకం పోరాటాయుధం గనుక, అవసరమైతే శత్రువుల దాడులు, ప్రతిబంధకాలను ఎదుర్కొనే ధైర్యం, తెగింపు అవసరం అని హష్మీ రుజువు చేసిన విషయం జగద్విదితం కదా.

ఆ నేపథ్యంలో ఎ.ఆర్.కృష్ణ వంటి నాటక దిగ్గజం సైతం వీధినాటిక ప్రక్రియను సమర్థించారు. కీ.శే.రామనాథం "హల్లాబోల్", "గోగ్రహణం" నాటికలను అటు వీథుల్లోనూ, ఇటు వేదికలపైనా రసరమ్యంగా ప్రదర్శించిన విషయం తెలిసిందే. అంతేకాదు శివరామరెడ్డి వంటి గొప్ప దర్శకులు సైతం వయోభారం లెక్కచేయక కురుక్షేత్రం వీధినాటికలో నేలపై పొర్లుతూ ప్రదర్శించడం మరువలేం. కాళిదాసు నేతృత్వంలో జరిగిన తొలి జిల్లా వీధినాటిక వర్క్‌షాప్‌లో (చిలకలూరిపేట-89) ఈ ఘటన జరిగింది.

మరో సమస్య కాళిదాసుతో సహ మాలాంటి వారు ఎదుర్కొన్నది- పరిషత్‌లు లేకపోతే సాంఘిక నాటకరంగానికి దిక్కేలేదన్నది ఒకవాదన అయితే, పరిషత్ వల్లనే నాటకరంగం వికసించాల్సినంతగా వికసించక, రాగద్వేషాలతో బహుమతులు లక్ష్యంగా కుచించుకు పోతున్నదనేది మరో వాదన.

ఈ వాదన ప్రకారం నాటకం కోసం నాటకం అన్నట్టుగా ఆగిపోతుంది. ప్రజా సమస్యలను, ప్రజా ఉద్యమాలను పట్టించుకోవాల్సినంతగా పట్టించు కోదు. లోపభూయిష్టమైన రాజ్యం పాత్రను ఒక్కోసారి ఉపేక్షించడమే కాకుండా నిరాకరించడమూ జరుగుతుంది. అప్పుడు ప్రజాస్వామ్యానికి, ప్రశ్నకు, సత్యనిష్టకు, సద్భావ ప్రకటనకు నాటకం వేదిక కాకుండా పోతుందనేది అభిప్రాయం.

అందుకే 'సారా సంహారం' నాటిక ప్రజల సంస్కారానికి పీటవేస్తే 'సారా సర్కార్' నాటిక రాజ్యం పాత్రను ఎండగడుతుంది. ఈ రెండు నాటికల రూపకల్పనలో కాళిదాసుది కీలక పాత్ర. సారా సంహారం రచయిత డా॥ కందిమళ్ళ సాంబశివరావు కాగా సారా సర్కార్ రచనలో పెద్ది రామారావు, లాయర్ శ్రీనివాస్ వంటివారు (రెంటపాళ్ళ శిబిరం) పాల్గొన్నారు.

అలాగే పల్నాటి వీరుడు కన్నెగంటి హన్మంతు చారిత్రక ఉద్యమ నాటకం 'వీరగంధం' రూపకల్పన గావించేందుకు దేవిని, నన్ను తీసుకెళ్ళి వారాలతరబడి పాలపాడులో మకాం వేయించాడు. స్థానికంగా కోటిరెడ్డిగారి సహకారంతో ఈ పని చేశాడు.

గుంటూరులో జరిగిన తానా సభల్లో మా తెలుగుతల్లికి మల్లెపూదండ (రచన కూర్పు–దేవి) కళారూపాన్ని ముప్పైమందితో ప్రదర్శింపచేయడంలో ముఖ్య భూమిక పోషించాడు.

ప్రజాకళారంగాన్ని గుంటూరుజిల్లాలో ఓ ఉద్యమంగా నిలపాలనే లక్ష్యంతో తొలుత అంజిరెడ్డిని, తర్వాత రమణను కేంద్రానికి తీసుకువచ్చి సొంతంగా బాధ్యత వహించాడు.

ఇలా కాళిదాసు కళారంగంలో, రాజకీయరంగంలో ఉద్యమ విలువలు పాదుకొల్పేందుకు ఇప్పటికీ ప్రయత్నిస్తాడు. తన దగ్గరివాళ్ళల్లో సైతం అక్రమాలు చొరబడుతున్నప్పుడు మధనపడతాడు. ఒక్కోసారి ఆవేశంతో భంగపడినా, ఆ తర్వాత గరళకంఠునిలా మింగి, ఎవ్వరికి ఇవ్వాల్సిన స్థానం వారికి ఇస్తాడు.

మహాకవి గురజాడ అన్నట్టు 'ప్రేమనిచ్చిన ప్రేమవచ్చును' అన్నట్టు వయస్సు, విద్యార్హతలు, అంతస్తులు, కుల, మతభేదాలతో సంబంధంలేకుండా స్నేహపూర్వక సంబంధాలు కొనసాగిస్తుంటాడు. కాళిదాసుయొక్క ఈ ప్రగతిశీల ప్రజా సాంస్కృతికోద్యమ గమనంలో సగభాగం జీవనసహచరి అయిన జయమ్మకు నూటికి నూరుపాళ్ళు దక్కుతుంది.



చిలకలూరిపేటలో ప్రజానాట్యమండలి గుంటూరు జిల్లా మొదటి మహాసభ 1994 జనవరి 24–29 వరకు జరిగినప్పుడు కళాకారులకు డప్పు నేర్పిన నరసయ్య, పల్లెసుద్దులు నేర్పిన వెంకన్న, పాటలు నేర్పిన, జగన్, సురేష్, 'రైతు' నాటిక నేర్పిన రాష్ట్రకార్యదర్శి కె. శాంతారావులతో ప్రజానాట్యమండలి జిల్లా కార్యదర్శి కాళిదాసు.



**పి.ఏ. దేవి**
ప్రజానాట్యమండలి పూర్వ రాష్ట్రకార్యదర్శి,
రచయిత్రి, దర్శకురాలు.
9848622829

# వారే లంగర్

**వ్య**క్తుల గురించి రాయడం చాల కష్టమయిన పని. పొగడ తల్చుకుంటే అది తేలిక. తెగడదల్చుకున్నా తేలికే...కాని ఒకవ్యక్తి నిర్మితి పుట్టుకనుండి ఇంకా చెప్పాలంటే పుట్టుక ముందు నుండి ఆ కుటుంబ పరిస్థితి, కుటుంబంలోని వ్యక్తుల ప్రవర్తన, అతని చుట్టూ ఉండే సమాజం దాని కట్టుబాట్లు, ఆచారవ్యవహారాలు, విస్తృతస్థాయిలో ఆయా గ్రామసమాజంపై క్రియాశీల రాజకీయాల ప్రభావం, దాని ఆర్థికపునాది వగైరా లక్ష విభిన్నాంశాల సమాహారంచేత ప్రభావితమవుతుంది. వ్యక్తి తన సామాజిక అస్తిత్వంనుండి విశాలప్రయోజనకరమైన జన చైతన్యశీలత వైపుకి సాగించే ప్రయాణం చాలా ఆసక్తికరమైంది. ఒకవ్యక్తి తన ఆస్తిత్వం తన కుటుంబ ప్రయోజనాల కొనసాగింపుగా సామాజికతవైపు పయనించడం ఆ పరిమితుల్లో అభ్యుదయగామిగా వుండటం సాధారణంగా జరిగే వ్యవహారం.

కాని ఒక వ్యక్తి తనకంటే కుటుంబంకంటే సమాజం, ఉద్యమం ముఖ్యం అనుకోవడం చాల తక్కువసార్లు జరుగుతుంది. అటువంటి వ్యక్తుల గురించి మాట్లాడాలంటే చలనశీలత దాని తాలూకు ఆటుపోట్లు వాటికి వీరు ప్రతిస్పందించిన తీరు వంటి అనేకనేక అల్లికల గురించి కూడా విశ్లేషించాలి.

కాళిదాసు నడుస్తున్న నిబద్ధత. కాళిదాసు నిజాయితీపరుడు. కాళిదాసు గొడవకి జంకనివాడు. కాళిదాసు నోరున్నవాడు. ఇట్లా ఒక ఇంప్రెషన్ ఎక్కువగా వుండొచ్చు. కాని ఇవి మాత్రమే అతను కాదు. నిర్మొహమాటంగా మాట్లాడే వ్యక్తిగా కాళిదాసుకు తెల్సు, మనకి అతిదగ్గరయినవాళ్ళ గురించి రాయటం

ఎంత కష్టమో... ఉద్యమంలో సహచరులుగానేగాక వ్యక్తులుగా పరస్పరం గౌరవం, ఆప్యాయత అనుబంధం కలిగివున్నవాళ్ళం కాబట్టి మరీకష్టం...ఏమి రాసి...ఏమి రాయక అతనిపై ఒక సరిగాని చిత్రాన్ని ఇస్తానో అని, తూకం సరిగా పడదోనని అనుమానం.

ఉద్యమాలపై అంచనా, ఉద్యమ ఆందోళనల్లో ఆయా వ్యక్తులపాత్రపై విశ్లేషణ నిష్కర్షగా ఉండాలి. కాని వ్యక్తుల గురించి మొత్తం మీద అంచనా మాత్రం మానవత్వం - భావోద్వేగాల నేపథ్యం కూడా కలుపుకునే జరగాలి.

కాళిదాసు సి.పి.యం.లో సభ్యుడు. ప్రారంభంనుండి నాటకాలపట్ల ఆసక్తి గలవాడు. కాని నటించడంకంటే వేయించడంపట్ల ఎక్కువ ఆసక్తి కలిగినవాడు. ఈ లక్షణంవల్లనే వ్యక్తిగతమైన గుర్తింపు కోరుకునే కళాకారుడిగా కాకుండా ప్రజానాట్యమండలి బరువు మోసే స్తంభంగా...ఆర్గనైజర్‌గా ఎదిగాడు. వ్యక్తిగా కళాకారుడు స్వార్థపరుడు. తను తన సృజన, తనదయినముద్ర ప్రపంచంపై వేయాలని అలా గుర్తింపు పొందాలని కోరుకుంటాడు. ఉద్యమంలో ఉండే ప్రజాకళాకారులు కూడా దీనికి ఏమీ మినహాయింపుకాదు. వారు సామాజిక ప్రయోజనం కోసం అంకితం అయి పనిచేసినా వారి స్వంత ముద్ర...గుర్తింపు వారి ఆహోరాత్రాల కృషిలో భాగంగా వుంటాయి. కాసుకోసం, కీర్తికోసం సౌఖ్యంగా బ్రతికే కళాకారుల సృజన సాంకేతికంగా అలరించినా కళాప్రయోజనం రీత్యా అధమస్థాయికి చెందినదిగా వుంటుంది. ప్రజాకళాకారుడు ఉద్యమంలో ఎంత మమేకం అయినా అతని గుర్తింపు అతని విశిష్ట సృజనలోనే వుంటుంది. ఈ విశిష్ట సృజనను ప్రజలకోసం పదును పెట్టినందుకు ప్రజ వారికి నీరాజనాలు అర్పిస్తుంది.

కాని ప్రజాకళారంగపు ఆర్గనైజర్ మొదట చేసే పని కళాకారుడిగా వేదికలపై ప్రకాశవంతంగా మెరవాలనే కోరికనుండి నెమ్మదిగా...తెర వెనక్కి తనను తాను తగ్గించుకోవడం. ప్రదర్శించాలనీ, గుర్తింపు పొందాలనీ, తన సృజన లోకం మెప్పు పొందాలనీ కళాకారులందరికీ వుండే ఒక సాధారణమైన బలమైనకాంక్షను వదలుకోవడం ఒక తపస్సు లాంటిది. ఒక్కటొక్కటిగా గుర్తింపులను వలిచేసుకోవడం అన్నమాట. తన్ను తాను వెనక్కిపెట్టుకొని ఉద్యమం కోసం

మిగిలిన వారందర్నీ కళాకారులుగా నిలబడేలా ప్రదర్శింప చేయటం...వారిని అభినందించడం...వారు బాధపడితే ఓదార్చడం. తమ స్థాయికంటే ఎక్కువ ప్రశంస కోరుకుంటూ మిగిలిన వారిపట్ల ఈర్ష్యకలిగిన సందర్భాల్లో ఆయా కళాకారుల్ని కాస్త నొక్కడమూ, కాస్త ఎత్తడమూ వంటి నైపుణ్యాలు అలవర్చుకోవడం... ఒకటిగాదు, ఆర్గనైజర్ అనే అసిధారావ్రతాన్ని సునాయాసంగా సాధన చేసినవాడు కాళిదాసు. నాయకులని తానంగీకరించిన వారికి విశ్వాసపాత్ర సహచరుడు, ఆంతరంగికుడు. తనంతట తానుగా అనుసరించేవారిని తయారించుకున్న నాయకుడు. తాను నిలబెట్టిన వాళ్ళు తనకు ద్రోహంచేసినా పోనీలే అనుకుని ఫిర్యాదు కూడా చేయనివాడు. కాని వాళ్ళు ఉద్యమానికి హానిచేస్తే నిర్దాక్షిణ్యంగా కత్తిరించగలిగినవాడు. ఇదంతా ఉద్యమపు విషయం. ఇట్లా చాలా రాసుకుంటూపోతే అతనిపట్ల నా సబ్జెక్టివిటీ బయటపడుతుంది.

కాళిదాసు నారికేళపాకం. టెంక చాల గట్టిది. లోపల రుచి చాల గొప్పది. ఉద్యమ సహచరుల్ని వారి పనుల గురించి తిడుతూనే వారి బాగోగులు చూడగలడు. పరిశీలన చాలా పరిమితుల్లో వున్నవాళ్ళు మినహాయించి అతని కటువైన పదాలకి వ్యక్తులుగా గాయపడేవారు ఉండకూడదు గాని ఉద్యమాలని కెరీర్‌గానూ, యాంత్రికంగానూ, స్వంత జాగీరుగాను భావిస్తూ ముఖస్తుతికి ప్రసన్నులయ్యే నాయకులు, కార్యకర్తలు కాళిదాసు కటుత్వం వెనుకగల హితాన్ని, మెత్తని అతని మనసుని గమనించలేరు. కాళిదాసు చాలావాటి గురించి మాట్లాడాల్సిన అవసరం లేదు, కాని మాట్లాడతాడు. ఇది నీకు సంబంధించింది కాదు గదా గమ్మునుండొచ్చుగా అంటే చిర్రెత్తిపోతాడు. ఎందుకంటే విభాగాలు వేరయినా ఉద్యమం ఒక్కటే. ఈ సార్వజనీనతలేనివాడు కమ్యూనిస్ట్‌గాదు. అపకారం ఏదయినా హాని ఎక్కడ జరిగినా మాట్లాడటం ప్రతి మనిషీ చేయాలనే ఒక ప్రాథమిక అవగాహన అంతర్లీనంగా ప్రవహించినవాళ్ళేకదా ఉద్యమ కార్యకర్తలవుతారు. మనకెందుకులే అనుకునేవారి ముక్కలు వారి గాదెల్లోనే ఉండిపోతాయి. ఆ పరిధి దాటాక ప్రతిదీ మనదే అవుతుంది. “నాది”నుండి “మనది”కి చేరాక మాట్లాడటం అవసరం.

లౌక్యం తెలిసినవాళ్ళు నేర్పుగా ఒప్పించగలరు. వారి నైపుణ్యం అది. కాని తాను నాటినపంట కోసేస్తేగాని కొత్తపంట వేయలేం అని తెల్సిన రైతు

కాళిదాసు. ఒప్పు అయింది ఒప్పుకోవడానికి ఉద్యమంలో "తేనె"పూతలెందుకు అని నమ్మినవాడు. తన తప్పుని అన్ని సందర్భాల్లో ఒప్పుకుంటాడా అంటే అది కష్టం.

ఎందుకంటే ఆ అభిప్రాయం ఏర్పరచుకుని ఆ పనిచేయడానికి చాల శ్రమపడి అర్థం చేసుకుని ఉపక్రమిస్తాడు గాబట్టి తగ్గడం కష్టం. అయితే తప్పులు అందరూ చేస్తారని ఉదారంగా అంగీకరిస్తాడు.

ఉద్యమంలో ఉండేవారికి, బయటవారికీ అవగాహనలో ఉండే పరిమితులు, ఆచరణలో ఉండే మినహాయింపులు తెల్సు కాబట్టి బయటవారిపట్ల చాల ఉదారంగా ఉండగలడు. వారు అన్యాయంగా ప్రవర్తిస్తే మాత్రం కాదు. ఉద్యమంలో ఎన్ని సంబంధాలున్నాయో బయట అంతగానూ సంబంధాలున్నాయి. ఎవరినయినా ఆదుకుంటారు వాళ్ళు. వాళ్ళు...అంటే కాళిదాసు, జయమ్మ. కాళిదాసుకి ఇవన్నీ నేర్పించి నిలబెట్టింది ఆమే. కాళిదాసులో ఉండే మొత్తం మంచికి పూర్తి బాధ్యత ఆమెదే. అతనిలో చెడు వుంటే దానికి మాత్రం అతనిదే పూర్తి బాధ్యత. కాళిదాసు కంటే పరిశీలన, ఓర్పు నేర్పు కూడా ఆమెకే ఎక్కువ. నన్నడిగితే ఉద్యమం పట్ల నిబద్ధత, నిర్వాహకుడు అవ్వడం వల్ల కాళిదాసు గురించి రాయటం గాని, నిజానికి వ్యక్తిగా అతన్ని గురించి రాయాలంటే జయమ్మ గురించే రాయాలి. అస్సలు ఇతన్ని నేను భరిస్తున్నాను అనుకోకుండా పూర్తి ప్రేమతో అతనితో నడిచిన మనిషి... మామూలు విషయం కాదు. అతను డామినెంట్ పర్సన్. చలాయించగలడు...కాని చలాయించనీయకుండా నిలవరించగలిగిందామె. ఆమెపట్ల నాకు చాల ఆరాధన. "వీళ్ళతో ఎట్లరా బాబూ" అనుకునే వ్యక్తులతో అలవోకగా నిభాయించుకుని రావడం మామూలు విషయం కాదు.

భావోద్వేగాలు బహిరంగంగా ప్రకటించాలంటే నాకు తగని యిబ్బంది. రాయను అన్నా...రాయాల్సిందే అన్నాడు. కొట్లాటలు, అరుపులు, గొడవలు, బెదిరింపులు మా రోజువారీ కమ్యూనికేషన్‌లో భాగం. కాని అతని కోరిక న్యాయమైంది. రాయలేననే నా యిబ్బంది కూడా. ఇది ఒక ప్రారంభ పరిచయం... వాళ్ళు నాకు ఆత్మీయులు...ఏ ఒక్కరూ ఎవ్వరి గురించి అనుకున్నదంతా రాయాల్సిందంతా రాయలేరు...వాళ్ళు నాకొక భావోద్వేగాల లంగరు మరి!



**డా॥ కె.శివబాబు,**

**డా॥ ఎ.విజయలక్ష్మి**

ప్రగతి నర్సింగ్ హోమ్,

జహీరాబాద్

సంగారెడ్డి జిల్లా, తెలంగాణ.

9246277022

# మాకు మరో అమ్మానాన్న కాళిదాసుజయమ్మ దంపతులు

**కా**ళిదాసుగారు అనగానే ఉడుంపట్టు పట్టినట్టు మా వెంటబడే కళాకారుడే గుర్తుకొస్తాడు. మాటమీద నిలబడే వ్యక్తిగా, పట్టిన పట్టు విడవకుండా, తీసుకున్న బాధ్యత పూర్తయ్యేదాకా ఆహర్నిశలూ కృషిచేసే వ్యక్తిగా, ప్రజానాట్యమండలి కళాకారునిగా, నాయకునిగా, అందరికీ ఆప్యాయతను పంచే వ్యక్తిగా కాళిదాసుగారి గురించి క్లుప్తంగా చెప్పవచ్చు. ఉద్యమరీత్యా పరిచయం ప్రారంభమైనప్పటికీ భావోద్వేగాల సారూప్యతకూడా జోడవడంతో మా మధ్య అనుబంధం బలపడి నేటిదాకా కొనసాగుతున్నది. మా ఇద్దరికీ (నేను డా.శివబాబు మరియు నా భార్య డా.విజయలక్ష్మి) వాళ్లిద్దరితో (కాళిదాసు, విజయలక్ష్మి ఆంటీ) ఉన్న అనుబంధం ప్రత్యేకమైనది. మా ఇద్దరినీ వాళ్లిద్దరూ వాళ్ల స్వంతబిడ్డలుగానే తలచడమూ మేము కూడా అలాగే మెలగడం జరిగింది.

1990లో సాక్షరతా ఉద్యమజాతా జరిగినప్పుడు గుంటూరు నగరంలో కళాజాత వెంట నేను కూడా తిరిగాను. నాడు అక్షరాస్యతా ఉద్యమంకోసం ప్రజానాట్యమండలి రూపొందించిన పాటలు ఇప్పటికీ నా మనసులో సజీవంగా ఉన్నాయి. “రారా నా సామిరంగ మామా నువు రారా–చదువుకుందాం బడికి పోదాము రారా”, “చదవాలిరా ఎన్ని ఆటంకాలొచ్చినా–చదువులేకపోతే మన భవిత పెద్దసున్న”...ఇలాంటి పాటలు ఎన్నెన్నో. మెడికల్ కాలేజి విద్యార్థులంటే

బాగా చురుకుగా ఉంటారన్న ఉద్దేశంతో కాళిదాసుగారు మా మీద ప్రత్యేక శ్రద్ధపెట్టి కళారంగానికి ఉపయోగించుకోవాలని ప్రయత్నించేవారు.

బాబ్రీ మసీదు వివాదం నేపథ్యంలో అద్వానీ రథయాత్ర సందర్భంగా మతోన్మాదాన్ని వ్యతిరేకిస్తూ మతసామరస్యాన్ని ప్రచారం చేసే ప్రచారగీతాలు మాకు నేర్పించడానికి వర్క్‌షాప్ ఏర్పాటు చేశారు. ఈ వర్క్‌షాపులో మాకు నాదెండ్లనుండి వచ్చిన మాణిక్యమ్మ, అమరమ్మగార్లు మతసామరస్యం పైన పాటలు నేర్పించారు. "అందమైన నందనంలో మిడతలదండు వచ్చింది – భారతావని నందనము, మతోన్మాదమే మిడతలదండు", "మతం పేరిట మారణహోమం నివారించగ రారండి", "హిందు, ముస్లిం, క్రైస్తవుడు – ఎవరైతేనేం మానవుడే"వంటి పాటలు ఈ వర్కుషాపులోనే నేర్చుకున్నాం. ఈ పాటలు ఇప్పటికీ పాడగల్గినంత గాఢంగా మా మనసుల్లో నిల్చిపోవడానికి కాళిదాసుగారి కృషి ఫలితమే అని చెప్పగలం.

పాటలతో సరిపెట్టుకోకుండా మాకు వీథినాటికలు నేర్పించి ఆడించారు. మతసామరస్యం పైన "కబడ్డీ", విద్యార్థుల సమస్యలపైన "హల్లో స్టూడెంట్", కులవివక్షపైన "ఏ కులం నీది"వంటి వీథినాటికలు మేము గుంటూరు నగరంలోనేకాక జిల్లాలోనూ, షాట్ (Safdar Hashmi Open Theatre)లోనూ ఆడాము. అన్నిట్లోనూ కొంత ప్రత్యేకంగా చెప్పుకోదగ్గది మెడికల్ కాలేజి విద్యార్థినులతో ఆడించిన "ప్రశ్నించండి" అనే వీథినాటిక. ఆడపిల్ల పుట్టినక్షణంనుండీ ఎదుర్కొనే లింగవివక్ష గురించి ఈ నాటిక రూపొందించారు. ప్రస్తుతం వివిధ ప్రాంతాల్లో స్థిరపడ్డ వైద్యులు డా. విజయలక్ష్మి, డా. ధనలక్ష్మి, డా. రత్నకుమారి, డా. అనూరాధ, డా. సవిత మొదలగువారితో నాడు "ప్రశ్నించండి" వీథినాటిక నర్సరావుపేట, గుంటూరు, విజయవాడలలో జరిగిన షాట్ ఉత్సవాల్లోనేగాక పలు ఇతర సందర్భాలలో కూడా ప్రదర్శించడం జరిగింది. మెడికల్ కాలేజి విద్యార్థినులతో ఈ నాటిక ప్రదర్శింపజేయడంలో కాళిదాసుగారి పాత్ర ప్రధానమైనది. 2001 సం.లో నెల్లూరులో జరిగిన ప్రజానాట్యమండలి రాష్ట్ర మహాసభలలో కాళిదాసుగారు అస్వస్థతకు గురై చికిత్స చేసుకున్న అనంతరం విశ్రాంతి తీసుకోమని వైద్యులు

చెప్పారు. ఆ సమయంలోనే గుంటూరునగరంలో గాంధిపార్కులో 'వెల్ బేబి షో' కార్యక్రమం ఐద్వా తలపెట్టింది. ఆ కార్యక్రమం జయప్రదం కోసం పాతగుంటూరు, గుజ్జనగుళ్ల ప్రాంతాలు తిరగాల్సివచ్చింది. విశ్రాంతి తీసుకోమని వైద్యులు చెప్పిన సమయంలో కూడా తన ఆరోగ్యాన్ని లెక్కజేయకుండా కాళిదాసుగారు పూనుకుని ఆయనతో పాటు నేను (డా. విజయలక్ష్మి) ఆ ప్రాంతాలన్నీ మోపెడ్‌పైన తిరగడం, ఆ కార్యక్రమం జయప్రదంగా ముగియడం నాకు ఇప్పటికీ జ్ఞాపకమే.

గుంటూరుజిల్లానేగాక, ప్రక్కజిల్లా కార్యకర్తలకు కూడా ఏదైనా ఆరోగ్య సమస్యలు ఎదురైతే గుంటూరు ప్రభుత్వాసుపత్రి లేదా ఇతర ఆసుపత్రులలో చికిత్స కోసం మొదట గుర్తుకొచ్చేది కాళిదాసుగారే. అవసరమైనప్పుడు వేళాపాళాలేకుండా ఆసుపత్రులు తిరిగి వైద్యం విషయంలో కార్యకర్తలకు తోడ్పడటం ఆయనకు ఇష్టమైన పనుల్లో ఒక్కటి. ఏలూరుపట్టణ ప్రజాతంత్ర ఉద్యమ నాయకులు సోమయ్యగారు కత్తిపోట్లతో తీవ్రగాయాలకు గురైనప్పుడు గుంటూరు ప్రభుత్వాసుపత్రికి తీసుకువస్తున్నారంటే నేను (డా.విజయలక్ష్మి), కాళిదాసుగారు అర్ధరాత్రి 2 గం.ల దాకా ఆసుపత్రిలో ఎదురుచూసి సత్వరమే వైద్యచికిత్స జరిగేలా చేసిన సందర్భం నాకు ఇప్పటికీ గుర్తుంది. గుంటూరు నగరంలో సుందరయ్యనగర్ ప్రాంతంలో ఆంజనేయులు అనే కార్యకర్తపై దాడి జరిగి తలకు తీవ్రగాయాలైనప్పుడు, ఆపరేషన్ కోసం మత్తు ఇచ్చే డాక్టర్లు హైరిస్కు కేసుగా వెనుకాడుతుంటే, నాటి ప్రభుత్వాసుపత్రి సూపరింటెండెంట్ డాక్టర్ రాజునాయుడుగారితో కాళిదాసుగారు మాట్లాడి ఆపరేషన్ థియేటర్లోకి పోయి రిస్కు జరిగితే నాదే బాధ్యత అని హామీ ఇవ్వడం, తర్వాత సుమారు ఆరు గంటలపాటు పదకొండుమంది వైద్యుల టీమ్ ఆపరేషన్ విజయవంతంగా నిర్వహించడం జరిగింది. కోలుకున్న ఆంజనేయులు నేడు ఎం.వి.యస్. స్కూల్‌లో ఉద్యోగం నిర్వహిస్తున్నాడు.

కాళిదాసుగారికి అనేకమంది వైద్యులతో వ్యక్తిగతంగా మంచి అనుబంధం వుండటం ఒక ప్రత్యేకతగా చెప్పుకోవచ్చు. నాటి డా. కాసరనేని సదాశివరావుగారు, డా. కొండబోలు బసవపున్నయ్యగారు, డా. చిగురుపాటి నాగేశ్వరరావుగారు, తర్వాత తరంలో డా. కళాధర్‌గారు, డా. గడ్డిపాటి బాబూరావుగారు, ఇంకా

అనేకమంది ప్రభుత్వ, ప్రైవేటు వైద్యులు, తర్వాతకాలంలో మెడికల్ కాలేజి విద్యార్థి ఉద్యమంలో పరిచయమైన మాదాకా ఈ అనుబంధం కొనసాగింది, కొనసాగుతోంది.

నేను (డా.శివబాబు), మరికొందరం యస్.యఫ్.ఐ. సహచరులం సమకాలీన ప్రజాసమస్యలపైన పోస్టర్లు రాసి నగరంలో ముఖ్యప్రాంతాల్లో అంటిచేవాళ్లం. ఆ పోస్టర్లు గోడలపైన అంటించడానికి ప్రతిసారీ కాళిదాసుగారి ఇంటికి వెళ్లి ఆంటీతో మైదా ఉడకపెట్టించుకుని తీసుకుపోవడం ఇప్పటికీ గుర్తున్న విషయం. ఉద్యమంలో పరిచయమైన కాళిదాసుగారు, విజయలక్ష్మి ఆంటి కాలక్రమంలో మాకు వ్యక్తిగతంగా సన్నిహితులయ్యారు. మేము, మా విద్యార్థి ఉద్యమసహచరులకు లెక్కనేనన్నిసార్లు తిండి, పడక కాళిదాసుగారి ఇంట్లోనే. ఇంటికి ఎంతమంది వచ్చినా ఆంటీ సంతోషంగా వంటచేసి పెట్టేవారు. తమ ఇంటికి ఉద్యమంలో పనిచేసే కార్యకర్తలు, నాయకులు వచ్చినప్పుడు ఎంతో సంతోషంగా ఆదరించి ఆతిథ్యమిచ్చే విశాల మనస్తత్వం ఆంటీకి కూడా ఉండటం కాళిదాసుగారికి ఒక వరమని చెప్పచ్చు. మా వివాహం అత్యంత సరళంగా, వంద రూపాయల ఖర్చుతో నాటి సి.పి.ఎం. సీనియర్ నాయకులు కొరటాల సత్యనారాయణగారి సమక్షంలో కాళిదాసుగారి ఇంటిలోనే జరగడం మా జీవితంలో మేము మరువలేని మధురానుభూతి. ఉద్యమంలో మొదలైన ఆ అనుబంధం కాళిదాసుగారు–ఆంటీలతో నేటికీ కొనసాగడం మాకు అత్యంత సంతోషాన్నిచ్చే విషయం. జహీరాబాద్‌లో మేము 15 సం.లకు పైగా ప్రతిఏటా నిర్వహిస్తున్న పిల్లల వేసవిశిబిరాల నిర్వహణలో కాళిదాసుగారు – ఆంటీ దంపతుల పాత్ర అమూల్యం. వందమందికిపైగా పిల్లలకు వంటచేయడం ఆంటీ ఆధ్వర్యంలోని టీమ్ చేస్తుంటే, శిబిరందగ్గర కార్యక్రమాల సమన్వయం, నాటికలు నేర్పడంవంటి బాధ్యత కాళిదాసుగారు నిర్వహించేవారు. ఉద్యమనేపథ్యంలో పరిచయమైనప్పటికీ మాకు మరో తల్లిదండ్రులుగా మారి, మా వ్యక్తిగతజీవితంలో కూడా అనుబంధాన్నీ, అండదండల్నీ అందిస్తున్న కాళిదాసు – విజయలక్ష్మి ఆంటీ దంపతుల్ని మాకు వెలకట్టలేని వరంగా భావిస్తాము. ఆప్యాయత, నిబద్ధత, విలువలతో కూడిన కాళిదాసు దంపతులు పదికాలాలపాటు పదిలంగా జీవించాలనీ, సమసమాజాన్ని కాంక్షించే ఉద్యమకారులకు స్ఫూర్తినివ్వాలనీ మా ఆకాంక్ష.



**తెలకపల్లి రవి**
ప్రజాశక్తి దినపత్రిక పూర్వ సంపాదకులు,
రాజకీయ విశ్లేషకులు,
హైదరాబాదు.

# నీ జీవితం మాకు వెలుగుబాట

పల్లవి : నీ జీవితం మాకు వెలుగుబాట
నీ సేవలు మరువబోము మా పుతుంబాక
అందుకో మా అందరి విప్లవ జోహారులు
విడవములే ఏనాటికి ఆశయాల దారులు

అ.ప : ఓ పుతుంబాక....మా పుతుంబాక
అరుణారుణ పతాక....అరుణారుణ పతాక

చరణం 1 : ఉద్యమాల అభివృద్ధికి నిరంతరం అంకితం
త్యాగధనుల ఒరవడిలో సాగెను నీ జీవితం
విశ్రాంతి కోరని ఓ నిత్య కార్యకర్తవై
విశ్రమించినావు కడకు కర్తవ్య దీక్షతో ॥నీ జీవితం॥

చరణం 2 : ప్రజల కొరకు క్షణం క్షణం తపించావు ప్రతిచోట
ప్రజలను కదిలించినావు ఉద్యమాల బాట
రైతుకూలి సోదరులకు తలలోని నాలుకగా
ప్రజల మనిషిగా నిలిచిన ధన్యజీవి నీవయ్యా ॥నీ జీవితం॥

చరణం 3 : సమర సీమలోనైన శాసనసభలోనైన
సవ్యసాచిగా గెలిచిన సమరుడవు నీవు
తీరదులే కామ్రేడా నీవు లేని లోటు
నీ మార్గం మాదంటు శ్రమలోకం చాటు ॥ఓ పుతుంబాక॥

చరణం 4 : సుందరయ్య బాటలోన ఎర్రజెండ నీడలోన
కడదాకా సాగెనులే పుతుంబాక నీ పయనం
హఠాత్తుగ నీ మరణం నమ్మలేకపోతున్నాం
చేపడుతాం దీక్షతోటి ఆశయాల పతాక ॥ఓ పుతుంబాక॥

(ఈ పాట కాళిదాసుగారు తెలకపల్లి రవిగారితో రాయించుకున్న పాట. కాళిదాసుగారికి ఇష్టమైన పాట)






కొండవీటి వేంకటకవి 102వ జయంతిసభలో మాట్లాడుతున్న కాళిదాసు. వేదిక మీద ఎం.ఎల్.సి. శ్రీ కె.ఎ.ఎస్.లక్ష్మణరావు, మంత్రివర్యులు శ్రీ మండలి బుద్ధప్రసాద్, ప్రముఖ హేతువాద రచయిత శ్రీ కత్తి పద్మారావు, ప్రముఖ విమర్శకులు, డా. రాచపాళెం చంద్రశేఖర్‌రెడ్డి, ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం పూర్వ రిజిస్ట్రార్ శ్రీ రావెల సాంబశివరావు.



**ఎ. కళ్యాణి**
అడ్వకేట్,
గుంటూరు.
సెల్: 7901076940

# కాళిదాసు అంకుల్ కుటుంబంతో నాకున్న అనుబంధం

**మా**ది చందోలు గ్రామం. నా భర్తపేరు మీర్జా అహ్మద్‌బాషా. నాకు ఇద్దరు పిల్లలు. వారి పేర్లు మీర్జా లెని మరియు మీర్జా ఫెరాన. మేము భార్యాభర్తలిద్దరము తేనె వ్యాపారం చేసుకుంటూ సిపిఎం పార్టీలో పని చేసేవాళ్లం. నా భర్త బాషా సిపియం పొన్నూరు డివిజన్ కన్వీనర్‌గా ఉండేవారు. నేను, నా భర్త బాషా గుంటూరు సిపిఎం పార్టీ మీటింగులకు వచ్చినప్పుడు కాళిదాసుగారిని అక్కడ చూస్తుండేదానిని. కాళిదాసు అంకుల్ ప్రజానాట్యమండలి జిల్లా కార్యదర్శిగా పనిచేస్తారని, పాటలు, నాటికలు వేయిస్తారని, వాటికి జిల్లావ్యాప్తంగా శిక్షణలు ఇప్పిస్తారని చాలాసార్లు పార్టీ మీటింగులలో వినేదానిని. నా భర్తకి, కాళిదాసు అంకుల్‌కి మంచి స్నేహం ఉండేది.

ఒకసారి కామ్రేడ్ డి. రమాదేవి రేపల్లెలో ఎన్నికలలో పోటీ చేసినప్పుడు నేను, నా భర్త ఆమె తరపున ప్రచారానికి రేపల్లె ఏరియాకి ప్రతిరోజు వెళ్లేవాళ్ళం. అక్కడ రమాదేవిగారి ఇంట్లో విజయలక్ష్మి ఆంటీని చూశాను. ఆంటీ ఇంటికి వచ్చినవారందరికీ భోజనాలు, టిఫిన్లు సమకూర్చేవారు. వంటగదిని ఆవిడ అధీనంలో ఉంచుకుని చాలా పద్ధతిగా వచ్చిన వారందరినీ పలకరిస్తూ ఆప్యాయంగా చాలా సమర్థవంతంగా నిర్వహించడం చూసి నేను చాలా ఇంప్రెస్

అయ్యాను. నన్ను ఒక టీంతో, నా భర్తని వేరే టీంతో జతచేసి ఏరియాలకు ప్రచారానికి పంపించగా కాళిదాసు అంకుల్, రమాదేవిగారు చెప్పినట్లు చేసేవాళ్ళం.

ఆ తరువాత కామ్రేడ్ డి. రమాదేవి నాగార్జునసాగర్ నుంచి పాదయాత్ర మొదలుపెట్టినప్పుడు నేను, నా భర్త నాగార్జునసాగర్ వెళ్లాము. అక్కడ రూట్‌మ్యాప్ నిర్వహించడంలో, భోజనాలు ఏర్పాట్లు చేయటంలో కాళిదాసు అంకుల్ పాత్రను చూశాను. కాళిదాసు అంకుల్ తీసుకున్న కార్యక్రమాన్ని, వారికి ఇచ్చిన పనిని ఎంతో నిబద్ధతతో, ప్రతిదీ చాలాజాగ్రత్తతో చేయడం చూశాను. రెండుసార్లు గుంటూరులో ప్రజానాట్యమండలి ఆధ్వర్యంలో చిల్డ్రన్స్ థియేటర్ పేరుతో జరిగిన శిక్షణాశిబిరానికి పిల్లలు లెనీనా, ఫెరనాలని తీసుకుని వెళ్ళాము. ఆ తరువాత మా పిల్లలు కూడా వారి కుటుంబంతో కలిసిపోయారు.

2011 సంవత్సరంలో నా భర్త చెడువ్యసనాలకు బానిసై, రెండో పెళ్లి కోసం నాతో గొడవ పడి నన్ను నా పుట్టింటికి పంపించేసినాడు. నా పేరున ఉన్న ఆస్తిని అతని పేరుతో మార్పిస్తే కాపురానికి రానిస్తానని మా వాళ్ళని అడగగా, మా నాన్నవాళ్ళందరూ రాసిచ్చేయమంటే పత్రాలు కూడా చూడకుండా సంతకం పెట్టాను. తరువాత నా భర్త విడాకులు కావాలని కోర్టులో కేసు వేసినాడు. అప్పుడు నేను కాపురం కావాలని మా అమ్మానాన్నలతో గుంటూరుకి వచ్చి ఇల్లు తీసుకుని, గుంటూరులో ఉంటూ కోర్టు కేసులు చూసుకుంటూ ఐదేళ్ళ 'లా' కోర్సుకి జెసి కాలేజీలో చేరాను. నేను, విజయలక్ష్మి ఆంటీ బ్రాడీపేట శాఖలో సభ్యులుగా ఉండేవాళ్ళం. బ్రాడీపేట శాఖలో కార్యక్రమాలు చాలా బాగా చేసేవాళ్లం. మా శాఖలో కార్యక్రమాలు బాగా జరిగే విధంగా ఆంటీ తోడుంటే, వెనక అంకుల్ డైరెక్షన్ ఉండేది.

కోర్టులో నా భర్త, నా పిల్లలు ఇద్దరు నాకు వ్యతిరేకంగా అబద్ధపు సాక్ష్యాలు చెప్తుంటే నేను అంకుల్, ఆంటీల దగ్గర చాలా బాధపడేదాన్ని. అప్పుడు అంకుల్, ఆంటీ నా దగ్గర కూర్చుని 'నిన్ను ఎవరేమన్నా పట్టించుకోవద్దు, ముందు నీ కాళ్ళ పైన నువ్వు నిలబడాలి, నువ్వు బాగా చదువుకుని లాయర్‌వి కావాలి. అలాగే నువ్వు ఎల్.ఎల్.ఎమ్. కూడా చేయాలి. ఈ ఇబ్బందిని నీవు నీ కాళ్ళపైన

నిలబడటానికి ఉపయోగించు. ఇలా చేస్తే నీ చదువు నీ కేసులకి కూడా ఉపయోగపడుతుం'దని చెప్పి నన్ను ప్రోత్సహించడమే కాకుండా అన్ని రకాలుగా ఆ కుటుంబం నుంచి నాకు ప్రేమాభిమానాలు అందించారు.

అంకుల్, ఆంటీ నన్ను వారి అమ్మాయిగానే అందరికీ పరిచయం చేసేవారు. మా నాన్నగారింట్లో కులమతాలు, అలాగే మూఢాచారాలు ఇటువంటివి ఉండేవి కాదు. అలాగే అంకుల్ ఇంట్లో కూడా అవి లేవు. మా నాన్నగారు కూడా నాటికలు, పాటలు అంటూ సాంస్కృతిక కార్యక్రమాలలో ఎక్కువగా తిరిగేవారు. అందువలన అంకుల్‌వాళ్ళింట్లో నాకు మా నాన్నగారింట్లో ఉన్నట్లే ఉండేది. మా ఆలోచనా విధానాలు ఒకేలా ఉండేవి. నేను అంకుల్ కుటుంబంతో బాగా కలిసిపోయాను అనేదానికన్నా నన్ను అంకుల్‌వాళ్ళ కుటుంబంతో బాగా కలుపుకున్నారు అని అనడం అతిశయోక్తి కాదు. ఎందుకంటే ముందునుంచి అంకుల్‌కి, ఆంటీకి ఆడపిల్లలు అంటే ప్రత్యేకమైన అభిమానం. నేను చాలా బాధలో ఉండేదానిని. అయినా కేసులు చూసుకుంటూ, చదువుకుంటూ, పార్టీపని చేసేదానిని. నేను చేసే ప్రతిపనిలోనూ నాకు అంకుల్, ఆంటీ సహాయం ఉండేది. నా పుట్టింటివారు నాకు ఎంత సహాయం అందించారో అంతే సహాయం అంకుల్, ఆంటీ కూడా అందించారు. నా దృష్టిలో అంకుల్, ఆంటీ వేరు కాదు. వారిద్దరూ ఒకటే. ఒకే రకం ఆలోచనలు, ఒకే రకం భావాలు, ఒకే రకం ఇష్టాలు. అసలు వారిద్దరిని చూస్తుంటే అలా ఎలా ఉండగలరా అని ఆశ్చర్యం వేస్తుంది. నిజంగా ఒకరి కోసం ఒకరు అని అనిపిస్తుంది. మంచి ఆదర్శమైన జంట వారిద్దరు.

అంకుల్ వాళ్ళ తరపు ఏ ఫంక్షన్ వచ్చినా, ఏ కార్యక్రమం వచ్చినా నన్ను కూడా వారితోపాటు తీసుకెళ్లేవారు. అలా నేను వారి ఇంట్లో సభ్యురాలినయ్యాను. ఒక కార్యక్రమం తీసుకుంటే ఎంత నిబద్ధతతో, క్రమశిక్షణతో, పద్ధతిగా పూర్తి చేస్తారో అంతే పద్ధతిగా ఒక వ్యక్తికి ఏమి కావాలో పర్సనల్‌గా తెలుసుకుని వారికి అది అందించటానికి అంకుల్, ఆంటీ చాలా ఎక్కువగా కృషి చేస్తారు. అది ఆరోగ్యసమస్య అయినా, పెళ్లి అయినా, ఎలాంటి సమస్య అయినా సొంత మనిషిలాగా తెలుసుకుని నెరవేరుస్తారు. నేను బ్రాడీపేట పార్టీశాఖలో పనిచేస్తూ

పార్టీలో నిలదొక్కుకున్నానంటే ఆంటీ, అంకుల్ సహాయం ఎంతో ఉంది. నా లాయర్ చదువు పూర్తి అయ్యాక ఏఐబిఇ పరీక్షకి విశాఖపట్నంకి ఆంటీ నాకు తోడు వచ్చి, నాచేత పరీక్ష రాయించి గుంటూరు తీసుకువచ్చారు. పరీక్ష పాస్ అయినాక లా ప్రాక్టీస్ చేస్తున్నాను. ఎల్.ఎల్.ఎం.(P.G.) కూడా పూర్తి చేశాను. నా కేసులు గెలిచాను. నా భర్త వేసిన రెండు కేసులలో అతనే ఓడిపోయాడు. నేను సివిల్ కేసులన్నీ గెలిచాను. పార్టీపని చేయడం నేర్చుకున్నాను. బ్రాడీపేట శాఖ కార్యదర్శిగా పనిచేస్తున్నాను. మహిళా సంఘం (ఐద్వా) టౌన్ సెక్రటరీగా పనిచేస్తున్నాను.

ఇంతలా అంకుల్ వాళ్ళనుండి ఉపయోగం పొందిన నేను అంకుల్ గుంటూరు వదిలి యడ్లపాడు వెళ్ళిపోతున్నామంటే బోరున ఏడ్చాను. చాలా బాధ వేసింది. వెళ్ళవద్దు అన్నాను. అప్పుడే వెళ్లట్లేదులే అని ఓదార్చారు. యడ్లపాడు వెళ్లడం వాయిదా పడిందిలే అని తర్వాత చెప్పారు. హమ్మయ్యా అని ఊపిరి తీసుకున్నాను. తర్వాత రెండేళ్లు నన్ను నెమ్మదిగా వాళ్ళు యడ్లపాడు వెళ్లడానికి నేను బాధపడకుండా నన్ను ప్రిపేర్ చేసినారు. అంకుల్ యడ్లపాడు వెళుతుంటే వారితోపాటు నేను వెళ్లి ఒక రోజు ఉండి వచ్చాను. ఇక చూడాలనిపించినప్పుడల్లా యడ్లపాడు వెళ్లి చూసి వస్తున్నాను.

కాళిదాసు అంకుల్ గుంటూరులో ఉన్నప్పటి నుంచి నన్ను వెంకటేశ్వర విజ్ఞాన మందిరంలో ప్రతి సంవత్సరం జరిగే నాటికపోటీలకి, యడ్లపాడులో జరిగే సుందరయ్య నాటకోత్సవాలకి, అలాగే చాలాచోట్ల జరిగే సాంస్కృతిక కార్యక్రమాలకి అంకుల్‌తోపాటు ముఖ్యమైన ప్రత్యేక కార్యక్రమాలు అన్నింటికీ నన్ను తీసుకెళ్లేవారు. అవి చాలా విజ్ఞానదాయకంగా ఉండేవి. చాలా ఆలోచింప చేసేవిగా ఉండేది. కళారూపాలన్నింటినీ నేను చాలా బాగా ఆనందంగా ఆస్వాదించే దానిని అని చెప్పటానికి నేను చాలా సంతోషపడుతున్నాను. అంకుల్ యడ్లపాడు వచ్చిన తర్వాత సుందరయ్య నాటకోత్సవాలకి 10 మంది ప్రేక్షక న్యాయనిర్ణేతలను ఉంచి, అందులో నాకు ఒక ప్రేక్షకన్యాయనిర్ణేతగా అవకాశం కల్పించడం చాలా ఆనందాన్ని కలిగించింది. అంకుల్‌వాళ్లు యడ్లపాడు వెళ్లినా నాకు దూరంగా



యడ్లపాడులోని పోపూరి రామారావు విజ్ఞానకేంద్రంలో కాళిదాసుగారితో మా కుటుంబం

లేరు, వాళ్లు నా గురించి ఆలోచిస్తున్నారు అని అనిపించింది. అంకుల్ జీవితవిశేషాలతో వారి చిరకాల మిత్రుడు సంస్కృతి వ్యవస్థాపకులు, S. బాలచందర్‌గారు, పుస్తకం వేస్తున్నారని తెలియగానే చాలా సంతోషంగా ఫీల్ అయ్యాను. వారి పుస్తకంలో నాకు ఒక పేజీ వ్రాయడానికి అవకాశం వచ్చినందుకు అది నా అదృష్టంగా భావిస్తున్నాను.

విప్లవాభినందనలు మరియు కృతజ్ఞతలు.





**అవనిగడ్డ వీరవర్మ**
పోస్టల్ యూనియన్ నాయకులు,
గుంటూరు.
సెల్: 9441010322

# మానవత్వం మూర్తీభవించిన దంపతులు

**నూ**తలపాటి కాళిదాసు, విజయలక్ష్మిగారు ఆదర్శదంపతులు అనేకంటే మానవత్వం మూర్తీభవించిన దంపతులు అనడం సమంజసంగా ఉంటుందని నా భావన. వారికి కడుపున పుట్టిన పిల్లలు నేడు లేకపోవచ్చు...వారిని తల్లిదండ్రులుగా భావించి జీవిస్తున్నవారు అనేకులు. వారిలో డాక్టర్లు, ఇంజనీర్లు, కళాకారులు ఒకరనేమిటి? ఎంతోమందిని చేరదీసి విద్యావంతులను గావించారు. ఇది వారికి ఎలా సాధ్యమైందని ఆలోచిస్తే వారు సిపిఎంలో చురుకైన కార్యకర్తలుగా ఉండటమే దానికి కారణమని నేను అనుకుంటాను. సమాజాన్ని కుటుంబంగా భావించే గొప్ప లక్షణం కమ్యూనిస్టులకు కాక మరి ఎవరికి ఉంటుంది. అందులో భాగమే కాళిదాసు, విజయలక్ష్మి దంపతులు.

దుగ్గిరాలలో నేను పార్టీ కార్యకర్తగా పనిచేసే కాలం నుంచి నాకు నూతలపాటి కాళిదాసుగారు పరిచయం. "చీమ కుట్టింది" అనే నాటికకు ఆయన పర్యవేక్షకుడు. నేను 'సూత్రధారుడు' అనే పాత్రధారిని. ఆ నాటిక ఎంతగానో నాడు విజయవంతమైంది. నాకు పేరు తెచ్చి పెట్టింది. నాటి పరిచయం మొదలు నేటి వరకు కాళిదాసుగారి కుటుంబంతో నాకు అనుబంధం ఉంది. నా కుమార్తె కుటుంబంలో ఏర్పడిన ఒడిదుడుకులు సవరించు కోవడానికి ఆయన, వారి శ్రీమతి ఎంతగానో తోడ్పడ్డారు.

సిపిఎం పార్టీ జిల్లాకార్యాలయ బాధ్యునిగా, ప్రజానాట్యమండలి నాయకుడిగా కాళిదాసుగారు అందరికీ పరిచయం. కార్యాలయాన్ని ఎంతో బాధ్యతతో నిర్వహణ చేసేవారు. ప్రజానాట్యమండలిలో ఆయన కృషి మరువలేనిది. ఇప్పటికీ యద్లపాడులో ప్రతి ఏడాది ప్రత్యేకంగా జరిపే 'సుందరయ్య నాటక కళా ఉత్సవాలు"లో ఆయనది కూడా కీలకమైన పాత్ర. యద్లపాడులో నిర్మించిన విజ్ఞానకేంద్ర నిర్మాణంలో కామ్రేడ్ కాళిదాసు కృషి ప్రశంసించదగ్గది. విజ్ఞానకేంద్రం నిర్మాణంలో మమ్ములను కూడా భాగస్వామ్యం చేసినందుకు కాళిదాసుగారికి కృతజ్ఞతలు.

కాళిదాసుగారి కుటుంబంనీడన అనేకమంది పార్టీ కార్యకర్తలు, సమాజంలో ఉన్నతస్థానాల్లో ఉన్నవారు తయారయ్యారు. ఇది వారి కుటుంబానికి గర్వకారణం. నూతలపాటి కాళిదాసు, వారి శ్రీమతి విజయలక్ష్మి అభినందనీయులు. వారి శేషజీవితం సామాజిక ఉద్యమాలతో పెనవేసుకొని కొనసాగాలని భావిస్తూ...వారికి మరొకసారి అభినందనలు తెలియజేస్తున్నాను.





పాటల క్యాసెట్‌ను ఆవిష్కరిస్తున్న పెనుగొండ లక్ష్మీనారాయణ, బి. వేదయ్య, ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం వైస్‌ఛాన్సలర్ డా. కె. రాజారామ్మోహనరావు, కామ్రేడ్ డి. రమాదేవితో కాళిదాసు.



**ఏ.వి. శివయ్య**

విశ్రాంత బిఎస్ఎన్ఎల్ జెటిఓ

చిలకలూరిపేట

9493775555

## పీడితప్రజల ఆత్మబంధువు...కార్మికోద్యమ ధ్రువతార...

# నూతలపాటి కాళిదాసు

ప్రగతిశీలకాముకుడు, అభ్యుదయపథగామి, కర్తవ్యదీక్షాపరాయణుడు, వామపక్ష ఉద్యమనాయకుడు నూతలపాటి కాళిదాసుగారికి ఆత్మీయానురాగాలతో సమర్పించు అక్షర అభినందన చందనాలు.

యడ్లపాడు గ్రామంలో అతి సామాన్య రైతుకుటుంబంలో జన్మించి, పసితనంలోనే తండ్రి వెంకటేశ్వర్లు అమరుడైనా, సర్వం తానై పెంచి పోషించిన కష్టజీవి ఆదర్శ మాతృమూర్తి వెంకాయమ్మ సంరక్షణలో జీవనప్రస్థానంలో ఎదురైన ఆటుపోట్లను అధిగమించి ప్రాథమిక విద్యతోనే చదువుకు అంతరాయం కలిగినా, మొక్కవోని దీక్షతో వామపక్ష ఉద్యమస్ఫూర్తితో అందరిలో ఒక్కడుగా...అందరితో ఒక్కడుగా అంచెలంచెలుగా ఎదిగిన నిత్య నూతన కృషీవలుడు శ్రీ నూతలపాటి.

యడ్లపాడు ప్రాంత కమ్యూనిస్ట్ ఉద్యమనాయకులు పోపూరి రామారావు తదితర పెద్దల ప్రోత్సాహంతో యువజన సంఘ కార్యకలాపాల్లో చురుకైనపాత్ర పోషించడం, సిపిఎం జిల్లా కమిటిసభ్యులుగా, గుంటూరునగర సెక్రెటేరియట్ సభ్యులుగా, జిల్లా ఆఫీస్ కార్యదర్శిగా వామపక్ష ఉద్యమ బలోపేతానికి నిబద్ధతతో మీరందించిన సేవలు మీ వ్యక్తిత్వ ప్రతిభకు నిలువెత్తు నిదర్శనం.

చిన్నతనం నుండే సినిమాలు, సాంఘిక, పౌరాణికనాటకాలు తిలకించడం ద్వారా కళారంగంపై మక్కువతో బుర్రకథ పితామహుడు నాజర్‌గారి బుర్రకథ,

పౌరాణిక రంగస్థలదిగ్గజం ఏవి సుబ్బారావుగారి నాటకాభినయ ప్రభావం, చిలకలూరిపేట ప్రాంత కళాసంస్థలు, మురికిపూడి పరిషత్ కమలనాభుడు, చిలకలూరిపేట కళాసదస్సు కందిమళ్ళ నారాయణమూర్తిగారి ప్రభావం, సీనియర్ రంగస్థల సినీకళాకారులు దర్శకులు జరుగుల రామారావు, ప్రముఖ దర్శకులు అన్నపురెడ్డి శివరామిరెడ్డి, టి.జె.రామనాథం, దేవేందర్, శాంతారావుగార్ల ప్రేరణలతో ప్రయోగాత్మక వీధినాటికలు, రైతు, ఆటబొమ్మలు, కురుక్షేత్రం, హాలికులు సేమమా యిత్యాది ప్రభోదాత్మక నాటికలలో నటునిగా, ఆర్గనైజర్‌గా మీ ప్రజా కళాజీవితానికి మెరుగులు దిద్దుకున్న కృషి అమోఘం...అనన్య సామాన్యం.

ఆదర్శ కమ్యూనిస్ట్ నాయకుడు పుతుంబాక వెంకటపతిగారి ప్రోత్సహంతో ప్రజానాట్యమండలి జిల్లా కన్వీనర్‌గా,కార్యదర్శిగా, అధ్యక్షులుగా, రాష్ట్ర సహాయ కార్యదర్శిగా, ఉపాధ్యక్షునిగా, కళారంగ ఆత్మబంధువుగా, సాంస్కృతిక సింధువుగా, ప్రజాకళాకారునిగా కళారూపాలను సంధించిన సవ్యసాచి మీరు.

మీ నిరంతర సమాజ సేవాజీవితానికి మీ అర్ధాంగి శ్రీమతి జయమ్మ (విజయలక్ష్మి) సహకార ప్రోత్సాహాలు వెలకట్టలేని మధురస్మృతులు. మీ అనోన్య దాంపత్యఫలాలు ఇరువురు కుమార్తెల అకాలమరణం మీకు తీరనివ్యధని మిగిల్చినా చలించక మనోనిబ్బరంతో ధైర్యంగా ముందడుగు వేసిన ఆదర్శ దంపతులు మీరు.

గమ్య...గమనం...లక్ష్య...లక్షణమే మీ ఆలోచనం. మీ నాయకత్వ పటిమ ఘనం. మీ చైతన్యప్రస్థానం సంస్తవం. మీ సేవాపరాయణం సంస్తుతిపాత్రం. కార్మికవర్గ శ్రేయోదాయకమే మీ ఆశయం. సమస్యల పరిష్కారమే మీ దీక్షాదక్షణం. లక్ష్యసాధన మీకు కరతలామలకం.మీ స్థితప్రజ్ఞత, ధీరగంభీరత మీకు వెలకట్టలేని మణిమాణిక్యాలు. మిత్రధర్మానికి మీరే నిర్వచనం...నిదర్శనం.

మా అందరి ఆత్మీయానురాగాలు చూరగొన్న ఆదర్శ కమ్యూనిస్ట్‌గా... సమాజసేవలో పునీతులౌతున్న కామ్రేడ్ నూతలపాటి కాళిదాసు మహోదయా!

అందుకోండి మా అరుణారుణ వందనాలు.



**భీమిరెడ్డి కోటేశ్వరి**
సిపియం కమిటి సభ్యులు,
గుంటూరు జిల్లా
సెల్: 8885350724

# సహృదయం కలిగిన ఆదర్శదంపతులు

**నా**కు 1994 నుండి కామ్రేడ్ కాళిదాసు, జయమ్మగార్లతో పరిచయం ఉంది. వారు పార్టీ కార్యకర్తలను చాలా అభిమానంగా చూసేవారు. వారి ఇంటికి మేము ఎప్పుడైనా స్వతంత్రంగా వెళ్ళేవాళ్ళం. మేమే కాదు ఎవరైనా ఎప్పుడైనా వాళ్ళింటికి వెళ్ళే స్వతంత్రం ఉండేది. వచ్చినవారికి ప్రేమగా తమ ఆతిథ్యాన్ని ఆ దంపతులు అందించేవారు.

కాళిదాసుగారిని జయమ్మగారిని వేరువేరుగా చూడలేము. ఆయన చేసే ప్రతి పనికి ఆమె సంపూర్ణసహకారం అందించారు. నాన్నగారిని (సింహాద్రి శివారెడ్డిగారు) వారిరువురూ చాలా బాధ్యతగా వారింట్లో పెట్టుకొని తండ్రిలా చూసుకున్నారు. అదేవిధంగా జయమ్మగారిని మా కుటుంబంలో కూడా ఒక సోదరిగానే భావించేవాళ్ళం.

జయమ్మ నా ఆరోగ్యానికి ఏది అవసరమో వాటిని సమయానికి వండిపెడుతూ నా పెద్దకూతురిలాగా నాకు అన్ని సేవలూ చేస్తుందని నాన్న అందరికీ చెప్పేవారు. నాన్న ఎప్పుడైనా అనారోగ్యానికి గురైతే కాళిదాసుగారు వెంటనే హాస్పటల్‌కు తీసుకువెళ్ళేవారు. శివారెడ్డిగారి దగ్గరకు పనిమీద వచ్చే కార్యకర్తలను, కుటుంబసభ్యులను ఎంతో అభిమానంగా వారిద్దరూ చూసేవారు. పోరాటం చేసేవారికి కుటుంబసహకారం ఎంత అవసరమో జయమ్మగారిని చూస్తే తెలుస్తుందని నాన్న అనేవారు.

పెద్దవాళ్ళను గౌరవించడంలోనూ, వారి బాగోగులను చూసుకోవటంలోనూ పెద్దమనస్సు కలిగిన జయమ్మగారు "బాబాయి" అన్న పిలుపులో ఆప్యాయత, గౌరవం కలగలిసిన బంధం వారిద్దరిది. ఎలాంటి బాధ్యతనైనా తనదైన శైలిలో నిర్వహించడంలోనూ, ఎటువంటి లోటుపాట్లు లేకుండా చూడటంలోనూ ప్రత్యేకత ఉంది.

మహిళలు సహజంగానే విభిన్నపాత్రలు పోషించాల్సి వస్తుంది. అన్ని పాత్రలలోనూ అమ్మ మనస్సు మాత్రమే కలిగి ఉన్నారు. స్వార్థంలేని ప్రేమ, కల్లాకపటంలేని స్వచ్ఛత కలిగిన ఉన్నతమయిన వ్యక్తి ఆమె. ఎందరికో స్ఫూర్తినిచ్చే అరుదైన 'అమ్మ' మన జయమ్మగారు. ఆమె ఎవరికైనా అవసరమైనప్పుడు, అనారోగ్యాలకు గురైనప్పుడు వారివద్దకు వెళ్ళి పది రోజులు ఉండి సహాయం చేసేవారు. సాధారణ మధ్యతరగతి కుటుంబమైనా పొదుపుగా కుటుంబాన్ని నడిపేవారు.

కాళిదాసుగారికి ఇచ్చే పూర్తికాలం కార్యకర్తల అలవెన్స్‌తో కుటుంబాన్ని ఎలా నడపాలో ఆమె నుండి నేర్చుకోవచ్చు. ఇంట్లో వాడే ప్రతిపైసాకు ఆమె ఒక పుస్తకం పెట్టి అందులో ప్రతిరోజు ఖర్చులు వ్రాసేవారు. గుంటూరులో వారు ఉండే బ్రాడీపేటనుండి మార్కెట్‌వరకు నడుచుకుంటూ వెళ్ళి కూరగాయలు తీసుకొని మళ్ళీ నడుచుకుంటూ వచ్చేవారు. ఉన్నవాటితోనే ఆమె చాలా రుచిగా వంటలు చేసి పెట్టేవారు. నాన్నగారు ఆయనకు ఏమి కావాలో అడిగితే ఆమె వాటినే వండి పెట్టేవారు. వారి ఇంట్లో నాన్న ఉన్నన్ని సంవత్సరాలలో ఆయనకు ఒక్కడినే వదిలి ఆమె ఏ ఊరూ వెళ్ళేవారు కాదు. ఆయన గుంటూరులో లేనప్పుడు మాత్రమే ఆమె తన సొంత బంధువుల ఇళ్ళకైనా వెళ్ళేవారు.

కుటుంబ బాధ్యతలే కాకుండా ఆమె గుంటూరులో పార్టీ పనిని, మహిళా సంఘం పనిని అంతే బాధ్యతగా చేసేవారు. పార్టీ ఇచ్చే అన్ని పిలుపులలో చురుగ్గా పాల్గొనేవారు.

గుంటూరునుండి నాన్న చివరిలో కాజ ఇంటికి వచ్చారు. అప్పుడు కూడా ఆయన అనారోగ్యానికి గురైతే కాళిదాసుగారికి ముందు తెలియపరిచేవాళ్ళం.

హాస్పటల్‌కు వెళ్ళటానికి నాన్న అంతగా ఇష్టపడకపోతే కాళిదాసుగారు వచ్చి నచ్చచెప్పేవారు. ఆయనే దగ్గర ఉండి డాక్టర్‌ను కూడా ఇంటికి తీసుకువచ్చి వైద్యం అందేటట్లు చూశారు. శివారెడ్డిగారు ఎక్కడ ఉన్నా ఆయన బాధ్యత కాళిదాసుగారు తీసుకున్నారు.

కాళిదాసుగారు పార్టీపట్ల ఎంతో నిబద్ధతతో ఉన్నారు. ఆయన తీవ్ర అనారోగ్యానికి గురైనప్పటికీ పార్టీ పనిని చేయటం మానుకోలేదు. ఆయన ఏదైనా బాధ్యత తీసుకుంటే అది అయిపోయేవరకు నిద్రపోయేవారు కాదు. ఆర్థిక విషయాల నిర్వహణలో చాలా క్రమశిక్షణగా ఉండేవారు. ఎదుటివారు కూడా అదేవిధంగా చేయాలనుకునేవారు. ఇప్పటివరకు ఆయనకు పార్టీ ఏ రంగం బాధ్యత ఇస్తే ఆ పనిని బాధ్యతగా చేస్తూ వచ్చారు. అనారోగ్యాన్ని లెక్కచేయకుండా వారిద్దరూ పార్టీపట్ల అచంచలమైన విశ్వాసంతో పని చేస్తూనే ఉన్నారు.





గుంటూరు జిల్లా ఉద్యమ నిర్మాతలు కామ్రేడ్ సింహాద్రి శివారెడ్డి, కామ్రేడ్ భీమిరెడ్డి సాంబిరెడ్డితో కాళిదాసు.



**బొల్లు శంకరరావు**
రైతుసంఘం డివిజన్ మాజీ కార్యదర్శి,
చిలకలూరిపేట
సెల్: 9491336411

# కపటం తెలియని కాళిదాసు

**తే**దీ 1978 సంవత్సరంలో గుర్తు లేదుగానీ, లింగారావుపాలెం గ్రామంలో ఎమర్జెన్సీ తరువాత సిపిఐ(యం) పునర్ నిర్మాణంలో భాగంగా ప్రాథమికస్థాయిలో రాజకీయ అధ్యయన తరగతులు జరిగాయి. ఈ కార్యక్రమంలో లింగారావుపాలెం, యడ్లపాడు, చిలకలూరిపేటప్రాంత నూతనకార్యకర్తలు పాల్గొన్నారు. ఆ పాఠశాలలో కామ్రేడ్ కొరటాల పాఠ్యాంశాలు బోధించారు. కామ్రేడ్ పోపూరి రామారావు ప్రిన్సిపాల్‌గా, కామ్రేడ్ పుతుంబాక వెంకటపతి పర్యవేక్షణలో పాఠశాల జరిగింది.

నేనూ, మరో ఐదుగురు కార్యకర్తలం చిలకలూరిపేట ప్రాంతంనుండి ఈ పాఠశాలలో విద్యార్థులుగా పాల్గొన్నాము. వెంకటపతిగారు చిలకలూరిపేట నుండి వచ్చినవారిని నిలబడమన్నారు. నేను కూడా వారితోపాటు నిలబడ్డాను. 'మిగతావాళ్ళేరి, ఎందుకు ఆలస్యం అయిం'దని అడిగారు. నేను మిగతావాళ్ళను పోగుచేయటం కోసం ఆలస్యం అయిం'దని చెప్పాను. 'వారిని పోగుచేయటం కోసం పొలిగట్టిబెట్టి ఊడుస్తున్నారా' అని అన్నారు. మేము ఆలస్యం చేయటం గురించి, అందరి హాజరు గురించి చెప్తూ, మేము ఆలస్యంగా వచ్చిన టైమ్‌తో సహా కామ్రేడ్ నూతలపాటి కాళిదాసు, వెంకటపతిగారికి రిపోర్టు ఇచ్చారు. అప్పట్లోనే చొరవతో పైనాయకత్వంతో మాట్లాడుతూ బాధ్యతగా అక్కడ పార్టీ కార్యకర్తలకు వసతులు సైతం చిన్నచిన్న లోపాలు జరగనివ్వకుండా జాగ్రత్తలు

తీసుకోవటంవల్ల పొరపాట్లు జరగనిచ్చేవారుకాదు. అప్పటినుండి నేను కాళిదాసుగారిని గమనించటం మొదలుపెట్టాను.

చిన్నపిల్లవానిగా కపటంలేని మనస్తత్వం ఆయనది. తరువాత చిలకలూరిపేట డివిజన్‌లో భారత ప్రజాతంత్ర యువజన సంఘం (డివైఎఫ్ఐ) ఏర్పడటం, మొదటగా కామ్రేడ్ పోపూరి సుబ్బారావు కార్యదర్శిగా, డి. కోటేశ్వరరావు (గొట్టిపాడు) అధ్యక్షులుగా డివిజన్ కమిటి ఏర్పడింది. తరువాత నూతలపాటి కాళిదాసు అధ్యక్షులుగా, నేను కార్యదర్శిగా డివిజన్ కమిటి ఎన్నికైంది. సమావేశాలలో చొరవగా కార్యక్రమాలు అమలు జరిగేటట్లుగా అందరూ సమష్టిగా నిర్ణయాలు తీసుకునేటట్లుగా ప్రయత్నం చేసేవారు కాళిదాసుగారు.

సంక్రాంతి ఆటలపోటీలు అవకాశం ఉన్న అన్ని గ్రామాల్లో జరపాలని కమిటీ నిర్ణయించింది. మా గ్రామం బొప్పూడిలో మాకు సాధ్యం కాదని, ఎలా జరపాలో మాకు తెలియదని నేను అన్నాను. వెంటనే కాళిదాసుగారు నేను వస్తానని చెప్పి, తన వ్యవసాయ పనులు మానుకొని రెండురోజులు మా గ్రామంలో దగ్గరుండి వివిధ రకాల ఆటలపోటీలు పెట్టి సుమారు 80 మంది క్రీడాకారులు పాల్గొనేటట్లు చూసి నాయకత్వం వహించి మైక్ ఎనౌన్సర్‌గా, రిఫరీగా ఆయనే వ్యవహరించి జయప్రదంగా నిర్వహించారు. ఆటల్లో అందరినీ ఉత్సాహపరుస్తూ కార్యక్రమాలను బాగా నడిపారు.

అందరితో స్నేహం కలిపి, వారి కుటుంబాలతో సాన్నిహిత్యంగా మెలిగి కుటుంబ సభ్యుడిగా మెలగటం ఆయనలోని ప్రత్యేక సుగుణం. యడ్లపాడులో జరిగే ప్రజాసంఘాల కార్యక్రమాలలో చొరవగా ముందు పీఠిన వుండేవారు. పార్టీ కుటుంబాల మహిళలతోపాటు వంటలలో పాల్గొనటం, మీటింగ్స్ సందర్భంగా ఏర్పాటు చేయటంలో చొరవ చూపేవారు. ఆయన భార్యకూడ కార్యక్రమాలలో భాగం పంచుకోవటంలో ఆయన కృషి ఉంది. వచ్చిన కార్యకర్తల లోపాలు ఎత్తిచూపటం, దబాయించటం చేసేవారు. తరువాత వారితో సాన్నిహిత్యం నెరిపి వారిలో ఒకరిగా కలిసిపోయేవారు. మేమిద్దరము నిర్మాణ విషయాలు చర్చించు కునేటప్పుడు తీవ్రంగా మాట్లాడేవారు. నేను గట్టిగా వాదించేవాడిని. తరువాత

కలిసిపోయేవారు. తరువాత గుంటూరు జిల్లా సెంటర్ కార్యకర్తగా వెళ్లారు. ఆయన గురించి కొన్ని విషయాలు తరువాత తెలిశాయి. ఆయనకు ఇద్దరు ఆడపిల్లలు చిన్నవయస్సులోనే చనిపోవటం జరిగిందని, ఆ బాధలు తట్టుకొని కాళిదాసుగారు, జయమ్మగారు నిత్యం పార్టీ క్షేమమే తమ క్షేమమని తలుస్తూ పని చేస్తూ పార్టీ కార్యక్రమాలలో ఇమిడిపోవటం నాకు ఆశ్చర్యంగా ఉండేది. అపూర్వమైన త్యాగంగా నాకనిపించింది. విరామం అనేది లేకుండా నిత్యం అన్ని కార్యక్రమాలలో పాల్గొనటం నాకు ఆదర్శంగా ఉండేది. నేను జిల్లా ప్రజాసంఘాల సమావేశాలకు తరచూ గుంటూరు వెళ్ళేవాడిని. ఆయనతో పరిచయం ఉన్న పార్టీ కుటుంబాలకు, ఇతర కుటుంబాల సమస్యలు విని సహాయం చేయటం నేను వినటమే కాకుండా కళ్ళారా చూసేవాడిని. ఇవన్నీ నాకు ఆశ్చర్యం కలిగించేవి. అంతగా అందరితో కలిసిపోవటం ప్రత్యక్షంగా చూశాను.

నాతో తొందరపడి మాట్లాడటం, ఆయన పసిపిల్లవాని మనస్తత్వం చూసి నాకు చిరుకోపంగా ఉండేది. కానీ అది పట్టించుకునేవాడు కాదు. నాతో గుంటూరు పార్టీ ఆఫీసు డైనింగ్‌హాలు నిర్మాణం చేయాలని, దానికి ఎంత ఖర్చవుతుందో వివరంగా చర్చించి, ఆర్థికంగా ప్రధానమైన భాగం నేను సహాయపడే విధంగా నన్ను ఒప్పించి, దాని నిర్మాణానికి ప్రోత్సహించి నేను వెనక్కి తగ్గకుండా ఉత్సాహపరచటంలో కాళిదాసుగారు కీలకమైనపాత్ర పోషించాడు. కాకుమాను నాగేశ్వరరావు కూడా ఇందుకు తోడ్పడ్డాడు. ఆ హాల్లోనే చిన్నరూమ్‌లో ఆయన నివాసం ఉండేవారు. ఆ గదిలో చక్కగా పుస్తకాలు, వస్తువులు సర్దటం చూడముచ్చటగా ఉండేది. వచ్చినవారికి భోజన, ఫలహారాలు ఏర్పాటు చేయటంలో ఆయన, ఆయనభార్య జయమ్మగారు చొరవతో ముందుండేవారు. మా రెండో అమ్మాయి వివాహం విషయంలో కొన్ని సంబంధాలు చూసి సహాయపడ్డారు. నా విషయంలోనే కాకుండా, పార్టీ సహచరులకు, ఇతర పరిచయస్తులకు సహాయం చేసే మనస్తత్వం, త్యాగపటిమ నాకు ఆదర్శం అనిపించేది. ఆయన భార్యకు కూడా రాజకీయ చైతన్యం కలిగించి పార్టీ కార్యక్రమాలలో పాల్గొనేటట్లు చేయటం, అన్ని కార్యక్రమాలకు ముందు నిలబడటం నాకు ఆశ్చర్యం కలిగించేది.

సారా వ్యతిరేక ఉద్యమంలో కందిమళ్ళ సాంబశివరావుతో నాటిక వ్రాయించారు. ఆయన రచయిత కాకపోయినా రచనల సందర్భంగా కొంత పాత్ర వహించేవారు. ఆ “సారా సంహారం” వీథినాటికలో నటుడుగా ఉన్నారు. ఆ నాటికను చిలకలూరిపేట పట్టణంలో పలు ప్రాంతాలలో పార్టీ తరపున ప్రదర్శించారు. పార్టీ తరపున నేను ఉపన్యాసకుడిగా పాల్గొని అన్ని చోట్ల నేను మాట్లాడాను. కాళిదాసు అనునిత్యం సహచరులద్వారా పార్టీ పైనాయకత్వంద్వారా అన్ని విషయాలు నేర్చుకొని సామాన్యుడైనా, కొంతమేరకు విజ్ఞానవంతుడైనాడు. చిలకలూరిపేట ప్రజాతంత్ర యువజన సంఘం ఆధ్వర్యంలో చిలకలూరిపేట, నాదెండ్ల, యడ్లపాడు, ప్రత్తిపాడు, పెదనందిపాడు మీదుగా చిలకలూరిపేట వరకు జరిగిన సైకిల్‌యాత్రలో కాళిదాసుగారు పాల్గొన్నారు.

తక్కువ చదువు కలిగి కూడా పార్టీ ఇచ్చిన బాధ్యతలు నెరవేర్చటం, అత్యంత త్యాగజీవితం, ఆదర్శకమ్యూనిస్టుగా నూతలపాటి కాళిదాసుగారు నాకు అనిపిస్తారు.



ప్రపంచ కార్మిక దినోత్సవం
మేడే సందర్భంగా
సి.పి.ఐ. (ఎమ్) జెండా
ఎగురవేస్తున్న కాళిదాసు



**పి.వి. రమణ**
ప్రజా గాయకుడు
7396493100

# మా కాళిదాసు ప్రజాకళల ఊసు

**ఒ**క్కడివై అనేకుడవై – ఆవేశానివై ఆశయానివై
ఉద్యమమే బాటగా – విప్లవమే శ్వాసగా
అన్ని నీవైనవాడివి – మా కాళిదాసువి ప్రజాకళల ఊసువి
నా జీవితగమనంలో – ఎన్నో జీవితాల చలనంలో
వెన్నంటి నడిపించిన అద్భుతానివి
మా కాళిదాసువి ప్రజాకళల ఊసువి

యడ్లపాడులో పుట్టి – ఎర్రజెండానుబట్టి
ఎవరికి తలవంచని పోరాటమై – ఎన్ని పనులు సంక్షోభాలు వచ్చినా
ఎన్నో వేదనలు చుట్టుముట్టినా – అవాంతరాలు అడ్డమొచ్చినా
నువ్వెళ్లే దారి ముళ్ళదారి అని తెలిసినా – వెనక్కి తగ్గక వెన్నుచూపక
పార్టీకి అంకితమైనవాడివి – అలజడే ఆయుధమైనవాడివి
మా కాళిదాసువి ప్రజాకళల ఊసువి

ప్రజాకళలే పరమావధిగా – పోరాటాల రంగస్థలి ప్రజానాట్యమండలిగా
ఈ తెలుగునేల నలుచెరగులా – వీధినాటిక దళాల నిర్మాణకర్తగా
కవులను కళాకారులను – గాయకులను నాయకులను

మట్టిలోన దాగున్న – మణిమాణిక్యాలను గుర్తించినవాడివి
వెలుగులోకి తెచ్చినవాడివి – సాంస్కృతిక సారథివి
మా కాళిదాసువి ప్రజాకళల ఊసువి

నీ ఇల్లే వైద్యవిద్యార్థుల నిలయం – నీ ఇల్లే నాయకులకు ఆశ్రయం
నీ ఇల్లే కళాకారుల నిలయం – నీ యిల్లాలే అందరికీ అన్నపూర్ణ
కుటుంబబంధంకన్నా కామ్రేడ్స్‌బంధం మిన్నని
ఆత్మీయంగా ఆదరించినవాడివి – అభిమానం చూపినవాడివి
మా కాళిదాసువి ప్రజాకళాల ఊసువి

చదువే మనిషికి జీవమని – చదువే మనిషికి జ్ఞానమని
గుంటూరుజిల్లా అంతట – కళాదళాలను నిర్మించి
రాత్రిపూట బడుల్లో – వయోజనులను చదివించి
నవోదయపు ఆకాంక్షలు రగిలించినవాడివి
సాక్షరతా ఉద్యమసారథి వైనోడివి – చదువులమ్మ తల్లి ఒడికి చేర్చినోడివి
మా కాళిదాసువి ప్రజాకళల ఊసువి

అతివల జీవితాలు అల్లాడిన వేళ–తరతరాలుగా దారుణాలు ఒడిగడుతున్న పీడ
వైద్యకళాశాల విద్యార్థినులతో – భారతమ్మ ఎక్కడని ప్రశ్నించండిలాంటి
వీధినాటిక నేర్పిన మహిళాపక్షపాతివి – సమతాగుణనిధివి
మా కాళిదాసువి ప్రజాకళల ఊసువి

పొలాలనన్నీ హలాల దున్ని – ఇలాతలంలో హేమం పిండే
రైతన్నల రణం కేకవై – కార్పొరేట్ కబంధహస్తాల్లో
పాలకుల నిరంతరదోపిడీలో – నలిగిపోతున్న కరిగిపోతున్న
రైతన్నల తిరుగుబాటువై – హాలికులు సేమమా అంటూ
చైతన్యపు అస్త్రాలు విరజిమ్మినవాడివి
మా కాళిదాసువి ప్రజాకళల ఊసువి

వెనక తరములవారి వీరచరితల – సిరుల పండించినవాడివి
కన్నెగంటి హనుమంతు – వీరగాథలను వీరగంధంలా చూపించినవాడివి
నిలువెత్తు నాటకమైనోడివి – పలనాటినేల పౌరుషానికి ప్రతీకవి
మా కాళిదాసువి ప్రజాకళల ఊసువి

ఏ వేదికైనా – ఏ పోరాటమైనా
ఏ మహాసభ అయినా – ఏ యాత్రలైన
ఏ ప్రచారమైనా – ఏ కట్టడమైనా
ఏ నిధి వసూళ్ళయినా – అన్నింటా ముందు నిలిచినోడివి
మా కాళిదాసువి ప్రజాకళల ఊసువి

నీ కడుపున పుట్టినోళ్ళు – ఇద్దరు కనుమూసినా
ఉన్న కాస్త వ్యవసాయం – కర్పూరంలా కరిగినా
బతికావు నిప్పులా – ఏ తప్పు నిన్ను తాకలా
నిలిచావు ఎర్రజెండాలా గెలిచావు మా గుండెలా
మా కాళిదాసువి ప్రజాకళల ఊసువి

బాధ్యతలన్నీ అయిపోయాక – వయసుమళ్ళిన తర్వాత
ఉద్యమక్షేత్రంనుంచి – ఉన్న ఊరికి పయనమై
సుందరయ్య పరిషత్‌ని సొసైటీలని – వైద్యశిబిరాలని
పిఆర్ విజ్ఞానకేంద్రమని – మలిదశ పోరాటానికి కంకణబద్ధుడివైన
మా కాళిదాసువి ప్రజాకళల ఊసువి

ఏ మాటలు వెనకాల – ఏ వర్గప్రయోజనం
ఉందో చదివినోడివి – నీ వెనకాలే గోతులు తీసేవాళ్ళ
మర్మం తెలియనోడివి – పాపం పనిపిచ్చోడివి
ఏ పదవులూ కోరని – ఏ పదవీ నీ దరిచేరని ఆరాధ్యుడివి
మా కాళిదాసువి ప్రజాకళల ఊసువి

ఎక్కడో నెల్లూరు దరిదాపుల్లో
కూనిరాగం తీసే నను గుర్తించి – అవనికి రాగం అందించి
ఆంధ్రుల గుండెల్లో గుర్తింపు తెచ్చుకునే అవకాశం కల్పించి
అచంచల విశ్వాసంతో నన్ను నేను బతికేంత దారులువేసిన తండ్రివి
మా కాళిదాసువి ప్రజాకళల ఊసువి

నిను గానం చేస్తున్నా – నిను ధ్యానం చేస్తున్నా
అమ్మలా నను సాకిన విజయమ్మకు ప్రణామం చేస్తున్నా
నిను కన్న మా నాన్నమ్మ కష్టజీవి వెంకాయమ్మకు
కన్నీటి నివాళి అర్పిస్తున్నా...






ప్రజానాట్యమండలి కళాకారిణి ఏసమ్మ, జిల్లా కార్యదర్శి పి.వి. రమణ, కాళిదాసు, ఆర్.వి. రాఘవయ్య, రాష్ట్ర అధ్యక్షులు ఎం. జగ్గరాజు.



**బొప్పన విజయ్‌కుమార్**

రిటైర్డ్ డి.ఎస్.పి.,

మంగళగిరి.

సెల్: 9494775537

# కాళిదాసు కళాకారుడే కాక, మంచి ఆర్గనైజర్ కూడా...

**మా**చర్లలో తమ్ముడు కాళిదాసు పరిచయం తరువాత నాటికపై నా అభిప్రాయాన్ని మార్చుకున్నాను. ఏదైనా ఒక నాటిక ప్రదర్శించబడి ప్రేక్షకులు దానివైపు ఆకర్షితులైతే అందులో గట్టి సబ్జెక్టు అయినా ఉండాలి, లేక నటీనటుల నటనాకౌశలల్యం అయినా ఉండాలి. ఏదో ఒక ప్రత్యేకత ఉండాలి. ఒక నాటికను ప్రదర్శించాలి అని అంటే ఒక సర్కస్‌ను ప్రదర్శించినట్లే.

ఆ రోజు మాచర్లలో నాటిక ప్రదర్శన ప్రారంభమైంది. దురదృష్టంకొద్ది వర్షం వచ్చింది. ఒకవైపు కట్టినతాళ్ళు నేల నాని మేకులు పెకలించుకుని రావటంతో టెంటు కూలిపోయే పరిస్థితి ఏర్పడింది. ఇప్పటి వరకు కళాకారుడుగా ఉన్న తమ్ముడు కాళిదాసు కార్మికుడి రూపంలోకి వచ్చాడు. టెంట్ కూలిపోకుండా బలాన్ని వాడవలసి వచ్చింది. ఎవరైనా వాడతారు. దానిలో సంశయమేమీ లేదు. కానీ అవసరంకొద్ది అందరం అసలుసిసలైన శ్రామికుల పాత్ర పోషించాము. తమ్ముడు కాళిదాసు ఒక సహజమైన శ్రామికుడు. శ్రామికుడూ కళాకారుడు కలిస్తే ఎలా ఉంటుందో తమ్ముడు కాళిదాసుని ఆ రూపంలో చూశాను. ఆనాటినుండి మా పరిచయం క్రమేణా పెరుగుతూ వచ్చింది. దాని తరువాత నా వృత్తిలో భాగంగా చిలకలూరిపేటలో బస్సుదహనం కేసులో యడ్లపాడు పరిసర

ప్రాంతాలలో నేరస్తుల కొరకు తీవ్రంగా గాలింపులు జరపాల్సి వచ్చినప్పుడు తమ్ముడు కాళిదాసులో ఒక సామాజికసేవకుడ్ని చూశాను.

వృత్తిరీత్యాపోలీసు ఆఫీసర్‌ని. చాలామంది నాతో పరిచయంగా ఉంటారు. ఏదైనా అవసరం వచ్చినప్పుడు సహాయం కొరకు కలుస్తుంటారు. కానీ తమ్ముడు ఏనాడూ తన పరిచయాన్ని దుర్వినియోగం చేసుకోలేదు. కందిమళ్ళ సాంబశివరావు, ముత్తవరపు పద్మారావు, ఐ. రాజ్‌కుమార్, ఈనాడు ప్రసాద్ వీళ్ళందరూ తరచూ మాయింట్లో సమావేశం అయ్యేవారు. ఒకరి అభిప్రాయాలు ఒకరు పంచుకుంటూ పరిషత్ నాటకాలు ఎక్కడవుంటే అక్కడకు వెళ్ళేవాళ్ళం. ఆ కలయిక ఒక సుదీర్ఘమైన ఆత్మీయసంబంధం ఏర్పడింది.

తెనాలిలో నేను ఉన్నప్పుడు నటనారంగంలో శిక్షణాతరగతులు నడిపాము. దానికి ప్రోత్సహించింది తమ్ముడు కాళిదాసు, కందిమళ్ళ సాంబశివరావు. ఇక్కడ ఒక విషయాన్ని ప్రత్యేకంగా ప్రస్తావించాలి. ఆ కార్యక్రమాన్ని పర్యవేక్షించాల్సిన గట్టి అవసరం ఏర్పడింది. నేను, కందిమళ్ళ ఉన్నవారిలో జల్లెడ పడితే మాకు దొరికింది తమ్ముడు కాళిదాసు. దాదాపు 70 మంది ఉద్దండులైన కళాకారులు వచ్చారు. 'కళాకారులకు శిక్షణా తరగతులేంటి?' అని నన్ను ఎద్దేవా చేసినవారు కూడా ఉన్నారు. కానీ నేను ఒక విషయం వెల్లడించాల్సి వచ్చింది. ఎంతటి గొప్పవారైనా సభావేదిక మీద మనకు పాఠాలు చెప్తున్నారు అనగానే ముందు తనకు తెలిసిన విషయాన్ని బయటపెడ్తారు. అక్కడ జరిగిందీ అదే. ఉదాహరణకు హరికథపై గట్టిపట్టున్న ఆచార్య తూమాటి దొణప్పగారు విషయాన్ని పొరలు పొరలుగా విప్పి అంతరాంతరాలలో ఏముందో అక్కడ హాజరైన విద్యార్థులకు వివరించి చెప్పారు. అలాగే బుర్రకథ పితామహుడు 'పద్మశ్రీ' నాజర్‌గారు పళ్ళు పటపట కొరుకుతూ తన హావభావ ప్రదర్శనతో విద్యార్థులను మైమరిపించారు. అలా విద్యార్థిగా వచ్చిన కందిమళ్ళ ఉపాధ్యాయుడై ఆధునిక నాటకరంగంలో జరుగుతున్న మార్పులు చేర్పుల్లో తనలోని ఆధునిక కళాకారుడుగా బయటకొచ్చాడు. ఇలా చెప్పుకుంటూ పోతే తమ్ముడు కాళిదాసు చుట్టూ తిరిగిన కళామతల్లి కథలెన్నో!

నిత్యం ప్రజలతో మమేకమై కళామతల్లి సేవలుచేసే కాళిదాసు తన జీవితంలో చేసిన మరో కార్యం అఖిలాంధ్ర కళాకారుల సాంస్కృతిక సంక్షేమకేంద్రం స్థాపించి వ్యాపింపచేయటం. దాదాపు లక్షకుపైగా సభ్యత్వం కలిగిన ఈ సంఘం తన తొలి మహాసభ తమ్ముడు కాళిదాసు చొరవతో తెనాలిలో జరపటం ఒక గొప్ప విషయం. దానికి వచ్చిన అడ్డంకులెన్నో. ఆ సమయంలో పెద్దలు వల్లూరి వెంకట్రామయ్యచౌదరి, నేతి పరమేశ్వరశర్మ, డాక్టర్ ఏ.పి.విఠల్, స్వర్గీయ రావి రవీంద్రనాథ్ తదితరుల సహకారంతో కార్యనిర్వాహకవర్గాన్ని ఏర్పాటు చేశాము. ఈ సమయంలో స్వర్గీయ ఉన్నం బసవయ్య పాత్రని మర్చిపోలేము. ఆంధ్రప్రదేశ్ కళారంగంలో అదొక గొప్పసంచలనం. ఇంతటి బృహత్కార్యాన్ని నెరవేర్చటంలో తమ్ముడు కాళిదాసుకు కళారంగంపట్ల ఉన్న కమిట్‌మెంట్‌ను తెలియచేస్తుంది. ఇంకా తెలియచేయాలంటే చాలా ఉంది. ఒక్క మాటలో చెప్పాలంటే తమ్ముడు కాళిదాసు కళాకారుడేకాక మంచి ఆర్గనైజర్‌గా మారిపోయి కళాకారులను గుర్తించటమే కాకుండా వారికి శిక్షణాశిబిరాలు నిర్వహించటం, ప్రభుత్వం, యూనిసెఫ్‌వారు నిర్వహించిన కళాయాత్రల్లో పట్టువదలని ఆర్గనైజర్‌గా ప్రజానాట్య మండలిని ముందుకు నడపటంలో, కామ్రేడ్ సుందరయ్యగారి బాటలో తను నడవటమే కాకుండా మా మరదలు విజయలక్ష్మిని కూడా ఆ బాటలోనే నిలిపాడు. అంతే కాకుండా కళాయాత్రలు క్రమశిక్షణగా నిర్వహించి ప్రభుత్వ అధికారుల వద్ద కూడా మంచి నిర్మాణదక్షుడుగా పేరు తెచ్చుకోవటం నాకు సంతోషం కలిగించింది.





**చాగంటి అమరమ్మ**
ఐద్వా (మహిళాసంఘం) సీనియర్ నాయకురాలు,
నాదెండ్ల, పల్నాడు జిల్లా.
సెల్: 9440265034

# మా మంచి అన్నయ్య

**కా**ళిదాసుగారికి నాదెండ్లగ్రామ పొలిమేరల్లో పొలాలు ఉండేవి. 1980 ప్రాంతాల్లో నాదెండ్లలో యువజన సంఘం ఏర్పడింది. శ్రీరామ్మూర్తి, రఘురామయ్య, గోపాలరావుల ఆధ్వర్యంలో సమావేశాల సందర్భంగా యడ్లపాడు నుండి వచ్చిన వారితో కలసి కాళిదాసుగారు కూడా వచ్చేవారు. ముందుగా మండవ మాణిక్యమ్మకు పరిచయమయ్యారు. ఎలా అంటే మాణిక్యమ్మ పాడుతుంటే తన గొంతు పొలంలోకి గాలివాటున చాలా శ్రావ్యంగా వినిపిస్తూ ఉండేది. మా గ్రామంలో గుడిలో భజన సంఘం తరపున పాటలు పాడుతూ ఉండేవాళ్ళం.

ఆ భజనసమాజంలో మాణిక్యమ్మగారిని గమనించి నాతోనూ, జగన్నాథమ్మ, కోటేశ్వరమ్మ, నాగేంద్రమ్మతో మాట్లాడేవారు. మేమందరం పాటలు బాగా పాడటం గమనించి కాళిదాసుగారు మా ఇళ్లకు వచ్చి, మా పెద్దవాళ్లతో పంటల గురించి మాట్లాడుకుంటూ పరిచయం పెంచుకున్నారు. మమ్మల్ని పాటలు బాగా పాడుతున్నామని మెచ్చుకుంటూ వారి దగ్గర ఉన్న కొన్నిపాటలు మాచేత పాడించేవారు. నా తమ్ముడు అమరయ్యతో హేతువాదసాహిత్యం మాకు ఇమ్మని చెప్పి ఇచ్చి వెళ్లేవారు. అలా మాచేత పాటలు పాడిస్తూ, పుస్తకాలు చదివిస్తూ మమ్మల్ని నెమ్మదిగా భజనసంఘం నుంచి ప్రజానాట్యమండలి గురించి తెలుసుకునేలా చేశారు. మమ్మల్ని రాజకీయ శిక్షణతరగతులకు తీసుకుని వెళ్లి, తరువాత ప్రజానాట్యమండలి సభ్యత్వం ఇప్పించారు. అలా మేము ప్రజానాట్య

మండలి కార్యకర్తలుగా మంచిదళంగా తయారుచేసి జిల్లాలో మంచి గాయనిలుగా మమ్మల్ని తీర్చిదిద్దారు. మా దళంకి జిల్లాలో చాలా మంచిగుర్తింపు వచ్చింది.

1990లో భారత జ్ఞానవిజ్ఞానసమితి ద్వారా జరిగిన అక్షర కళాయాత్రలో 45 రోజులపాటు నేను, మాణిక్యమ్మ, మా గ్రామంనుండి ఆర్కెస్ట్రావారు పాల్గొన్నాము. జిల్లావ్యాప్తంగా ఈ యాత్ర మాకు పెద్ద అనుభవం నేర్పింది. కళాయాత్ర చివరలో మూడురోజులు శిక్షణాశిబిరంలో మంచిటీచర్లతో క్లాసులు చెప్పించి రాజకీయశిక్షణ ఇవ్వడంలో కాళిదాసుగారి పాత్ర మరువలేనిది. అప్పటికి మా గ్రామంలో యువజన సంఘం, ప్రజానాట్యమండలి సంఘాలు మాత్రమే ఉన్నాయి. తరువాత నన్ను మహిళాసంఘం రాష్ట్రమహాసభలకు పంపించి, మహిళా సంఘం జిల్లాకమిటీ సభ్యురాలిగా చేసి మా గ్రామంలో మహిళాసంఘం కార్యక్రమాలు జరిగేలాగా నన్ను ప్రోత్సహించారు. మాణిక్యమ్మను ప్రజానాట్య మండలి రాష్ట్రకమిటీ సభ్యురాలిగా చేసి ఆ సంఘంలో ఆమె ఎదుగుదలకి కృషి చేశారు. జగన్నాధమ్మను రైతుసంఘం క్లాసులకి కాళిదాసుగారు దగ్గరుండి తీసుకెళ్లి, రైతుసంఘం సభ్యత్వం చేర్పించి, రైతుసంఘం జిల్లా కమిటీసభ్యురాలిగా ఎదిగేలాగా ఆమెను ప్రోత్సహించారు. ఆ విధంగా మా గ్రామంలో ఐదు ప్రజాసంఘాలతో కార్యక్రమాలు చేస్తూ పార్టీని నిర్మించడం జరిగింది.

తన పొలంలో పనిచేసుకుంటూనే కాళిదాసుగారు రాత్రిపూట మా గ్రామం వచ్చి మా ఇళ్ళల్లో ఉంటూ పెద్దవారితో కలిసిపోయి మా కుటుంబసభ్యుల్లో ఒకరిగా ఉండేవారు. కాళిదాసు గారికి ముక్కుసూటితనం క్రమశిక్షణ వారి ప్రత్యేకత. మా అన్నయ్య కార్యకర్తలను గుర్తించడంలోనూ, వారికి ఏ రకమైన తర్ఫీదు ఇస్తే వారు రాణిస్తారని అంచనా వేయటంలో మంచిదిట్ట. పుష్కలంగా నైతికవిలువలు పాటించడంలో అందరికంటే ముందుంటారు. ఆ రకంగా కార్యకర్తలను అర్థం చేసుకున్నారు కాబట్టే మాకంటే పెద్దవారు ఎవరు మా గ్రామంలో ముందు ఎవరూ లేకపోయినా, ఉద్యమ సంప్రదాయం లేకపోయినా మాతో పెద్ద ఉద్యమాలున్న గ్రామాలలాగా మా గ్రామంలో ఐదు పార్టీ, ప్రజాసంఘాలు పనిచేయటం జిల్లాలో మాతోపాటు మా గ్రామానికి కూడా మంచి గుర్తింపు రావడానికి మా అన్నయ్య ప్రధానమైన కారణం అంటే అతిశయోక్తికాదు.

కార్యక్రమం జరిగేటప్పుడు అక్కడ ఉండవలసినవారు లేకపోయినట్లయితే, కార్యక్రమాన్ని విజయవంతం చేయటంలో నైపుణ్యం ప్రదర్శించేవారు. మహిళల సమస్యలపై, రైతుల సమస్యలపై జరిగే సమావేశాలకు, క్లాసులకు దగ్గరుండి తీసుకెళ్లేవారు. ఆ స్ఫూర్తితో ప్రజానాట్యమండలి, మహిళా సంఘం, రైతుసంఘం గ్రామ బాధ్యతలు, డివిజన్ బాధ్యతలు మా దళం చూడగలిగింది. మమ్మల్ని పార్టీసభ్యులుగా చేసి శాఖ ఏర్పాటు చేశారు. కాళిదాసుగారు కార్యక్రమాలు బాగా జరిగేలా శ్రద్ధ పెట్టేవారు. మహిళా కార్యకర్తలపట్ల చాలా జాగ్రత్తలు తీసుకునేవారు. కార్యకర్తల కుటుంబాలకు పెద్దదిక్కుగా ఉండేవారు. ఆరోగ్యసమస్యలపై శ్రద్ధపెట్టి కార్యకర్తల యెడల జాగ్రత్తగా ఉండేవారు. మాకన్నా చిన్నవాడైనా 'అన్నయ్య' అని పిలవడం మాకందరికీ అలవాటు. వదిన జయమ్మగారు మమ్మల్ని సొంత కుటుంబ సభ్యులుగా ఆదరించేవారు. కాళిదాసుగారి అమ్మ వెంకాయమ్మగారు. 'అబ్బాయి మీకన్నా చిన్నవాడమ్మా, అన్నయ్య అని పిలవకండమ్మా' అని మాతో చాలా ఆప్యాయంగా అనేవారు. మేము 'అన్నయ్యా అనే పిలవగలము అమ్మా' అని చెప్పేవాళ్ళం. 'అంత మంచి అన్నయ్యకు అమ్మవైనందుకు నీకు ధన్యవాదాలు' అని చెప్తుంటే ఆమె ఆప్యాయంగా నవ్వుకునేది.

అన్నయ్యతో మా కుటుంబాలలో ఉన్న పిల్లలు, పెద్దలు అందరూ కలిసి పోయి మాట్లాడేవారు. మా కుటుంబాలలో పెళ్లిళ్లు కుదిర్చే దగ్గరనుండి ఏ రకమైన అవసరాలు వచ్చినా ముందుగా మేమందరం అన్నయ్యను సంప్రదించి తరువాత నిర్ణయించుతాము. ఊళ్ళో ఉండే మా తమ్ముడు అమరయ్యే కాకుండా మరొక తమ్ముడు నాసరయ్య అమెరికాలో ఉంటాడు. అన్నయ్య ఏది అడిగినా కాదనడు నాసరయ్య. ఎంతో అవసరం అయితే తప్ప సహాయం అడగడు. అది కూడా నిర్మాణ అవసరాలకు మాత్రమే. మా కుమారుడు శ్రీనివాసరావుకి కూడా అన్నయ్య అంటే చాలా ప్రేమ. అబ్బాయికూడా అమెరికాలోనే ఉంటాడు, ఎప్పుడూ శ్రీనును ఏ రకమైన సహాయం అడగలేదు. ఇటువంటి అన్నయ్యను మేము సొంత అన్నయ్యలాగానే అందరమూ చూస్తాము. మేమే కాకుండా చిన్నపిల్లలను కూడా పనికొస్తారని అంచనా వేసుకుంటే వదిలిపెట్టేవారుకాదు. మా గ్రామంలో మొగిలి ఆంజనేయులుని పాటలు పాడమని, పాడించుకుని, 'పనికొస్తాడమ్మా' అని నాకు

చెప్పి వాళ్ళ పెద్దవాళ్ళతో మాట్లాడి, గుంటూరు తీసుకెళ్లి ఆఫీసులో పెట్టుకుని డిగ్రీ పూర్తి చేయించి పార్టీ కార్యకర్తగా తయారు చేశారు. పార్టీలో పనిచేసే స్వాతిని పెళ్లి చేసుకుని ఇప్పుడు ఆంజనేయులు ప్రజాశక్తి విలేఖరిగా పనిచేస్తున్నాడు అంటే వెనుక కాళిదాసు అన్నయ్య కృషి ఉన్నది. ఉద్యమాల కోసం వచ్చి మమ్మల్ని సామాజిక కార్యకర్తలుగా తీర్చిదిద్ది, మాతో కలిసి మా కుటుంబంలో ఒకరైన మా మంచి అన్నయ్య అంటే మాకెంతో గౌరవం.





కామ్రేడ్ డి. రమాదేవి నాయకత్వంలో గుంటూరు జిల్లా సి.పి.ఐ.(ఎమ్) పాదయాత్ర జిల్లా నలుమూలలు తిరిగి గుంటూరులోకి ప్రవేశిస్తున్నప్పుడు (2005) స్వాగతం పలకటానికి పూలరేకులు సిద్ధం చేస్తున్న కాళిదాసుగారి అమ్మ నూతలపాటి వెంకాయమ్మ, ఎస్.ఎఫ్.ఐ. కార్యకర్త రావు రజని.



**సిహెచ్. ప్రమీల**
ఐద్వా మహిళాసంఘం నాయకురాలు,
గుంటూరు.
సెల్: 9490098935

# మొండిఘటం కామ్రేడ్ కాళిదాసు

**అ**నుకున్నది సాధించేవరకు నిబద్ధతతో పనిచేసేవారిలో కామ్రేడ్ ఎన్.కాళిదాసు ఒకరు. తను నమ్మిన మార్క్సిస్టు సిద్ధాంతాన్ని ఆచరణలో అమలు పరచడంలో ప్రత్యేకత సంతరించుకున్నారు. ఎంతటి పెద్దల సమక్షంలోనైనా తాను చెప్పదల్చుకున్న అంశాన్ని కుండబద్దలు కొట్టినట్లు చెప్పడంలో దిట్ట కాళిదాసు.

బహుశా 1974 ప్రాంతంలో యడ్లపాడులో మా అక్క ఉండడం వల్ల రెగ్యులర్‌గా అక్కడికి వెళ్లిరావడంతో అక్కడివారితో పరిచయాలు ఉండేవి. అప్పటికే అక్కడ యువజనసంఘం కార్యక్రమాలు ఉవ్వెత్తున కొనసాగుతున్న రోజులు. సంఘ కార్యక్రమాలు, ఆటలు, పాటలు, నాటికలు, కళారూపాలు, వాలంటీర్ వర్క్‌లు, శ్రమదానాలువంటివి ఏదో ఒకటి నిరంతరం జరుగుతూ ఉండేవి. యువజన సంఘం ఆ చుట్టుపక్కల గ్రామాల ప్రజానీకమంతటికీ తలలో నాలుకలా ఉండేది. కామ్రేడ్ పోపూరి రామారావు, కామ్రేడ్ కల్లూరి రామదాసు డైరెక్షన్‌లో కామ్రేడ్ పోపూరి సుబ్బారావు, రాజయ్య, ఎం. రామారావు, కె. హనుమంతరావు, ఎం. పద్మారావు, ఎం.సాంబయ్య, ఎం.సీతారామయ్య, జె.శంకర్రావు, నూతలపాటి కాళిదాసు తదితరులు (మచ్చుకు కొన్నిపేర్లు మాత్రమే) ఎక్కడ ఏ చిన్నసమస్య వచ్చినా వెంటనే అక్కడ వాలిపోయేవారు. కామ్రేడ్ పి. రామారావు ఉపన్యాసాలు ప్రజల్ని ఆకట్టుకునేవి. నేను యడ్లపాడు వెళ్లినప్పుడుల్లా మాబావ పోపూరి కాళిదాసు

గారి వద్దనుండి కొన్ని పుస్తకాలు తెచ్చుకొని చదువుకునేదాన్ని. ఒక విధంగా నేను సిపిఐ(ఎం) కార్యకర్తగా ఎదగడానికి పునాది యడ్లపాడులోని ఆనాటి పరిస్థితులే.

కామ్రేడ్ నూతలపాటి కాళిదాసు పరిచయం అప్పటి నుండే ప్రారంభం అయింది. 1976 నుండి గుంటూరులో మేము నివాసం ఉండడం, ఎమర్జెన్సీలో నాయకులకు షెల్టర్‌గా మా ఇల్లు ఉండడం, అనంతరం సంఘ కార్యక్రమాల్లో విరివిగా పాల్గొనేదాన్ని. మహిళాసంఘం కార్యకర్తగా జిల్లా అంతటా పనిచేసే క్రమంలో యడ్లపాడు కేంద్రంగా ఆ చుట్టుప్రక్కల గ్రామాల్లో సభ్యత్వం, సమావేశాలు, కమిటీలు వేయడానికి, నాతో పాటుగా కామ్రేడ్ పి. అనంతరావమ్మ, కోటేశ్వరమ్మ, పి. పున్నమ్మ, మహాలక్ష్మమ్మ, రాజ్యం, కామ్రేడ్ నూతలపాటి జయమ్మ తదితరులం ఆయా గ్రామాలకు వెళ్లి వచ్చేక్రమంలో యువజనసంఘం నాయకులు తమ తోడ్పాటు ఎల్లవేళలా అందించేవారు.

ప్రధానంగా రవాణా, కమ్యూనికేషన్ సౌకర్యాలు లేని ఆ రోజుల్లో మాకు అనేక జాగ్రత్తలు చెప్పి, ఆ గ్రామానికి వెళితే ఫలానావారిని కలవండి, ఆ ఇంటిలో బస చేయండి, వారి ఇంట్లో మీరు ఉండవచ్చు, ఇబ్బంది ఏమి ఉండదు. ఇలాంటి సలహాలు అన్నీ నూతలపాటి కాళిదాసుగారు ఇచ్చేవారు. చిలకలూరిపేట డివిజన్ పార్టీకి యడ్లపాడు, మానుకొండవారిపాలెం కంచుకోటగా ఉండేవి. ఆ రెండు గ్రామాలు ప్రధానకేంద్రాలుగా ఒకరో, ఇద్దరో పార్టీనో, రైతుసంఘమో అనుకునే వారిని వెతికిపట్టుకొని, వారందరినీ పార్టీలోకి తీసుకురావడంలో కాళిదాసుగారి పాత్ర ప్రధానం.

1976 నుండి మేము గుంటూరులో నివాసం ఉండడంవల్ల జిల్లా కేంద్రంలో జరిగే ప్రతి కార్యక్రమంలో పాల్గొనేవాళ్లము. అలా అందరం కలిసి నప్పుడల్లా గ్రామాల్లో సంగతులు తెలుసుకోవడం వగైరా జరిగేవి. కాళిదాసుగారికి ఉన్న ప్రధానలక్షణం ఏ పనైనా చేయాలి అనుకుంటే, అది అయ్యే వరకు తాను నిద్రపోడు, ఇతరులను నిద్రపోనివ్వడు. మొండిఘటం అనడంలో సందేహంలేదు. జనంతో సంబంధాల విషయంలో వారికి ఏ చిన్న బీరకాయపీచు బంధుత్వం

ఉన్నా, వారితో నిత్యసంబంధాలు కొనసాగించడం వారికి వెన్నతో పెట్టిన విద్య. అది పార్టీ పని అయినా, ప్రజాసంఘాల పని అయినా, ఎన్నికలు, మహాసభలు, నిధులు సమకూర్చాలన్నా ఆ సంబంధాలన్నింటినీ ఉపయోగించేవారు. ముఖ్యంగా ఆ గ్రామం వెళ్లగానే ఎవరో ఒకరిది టూవీలర్ తీసుకొని, ఆ చుట్టుప్రక్కల గ్రామాల్లో తిరిగి కార్యక్రమాలు నిర్వహించేవారు.

కామ్రేడ్ పోపూరి రామారావు చిలకలూరిపేట నియోజకవర్గంలోని నాదెండ్ల సమితి అధ్యక్షునిగా పోటీ చేసినప్పుడు నియోజకవర్గం అంతా తిరిగి, ఆయా గ్రామాల్లో పరిచయాలు ఉన్న వారందరినీ రంగంలోకి దింపి పనిలో పాల్గొనేలా చేయడంలో కాళిదాసు ప్రముఖపాత్ర పోషించారు. యడ్లపాడు మండలాధ్యక్షునిగా కామ్రేడ్ పోపూరి రామారావు పోటీ చేసిన సందర్భంలో బాలకోటిరెడ్డిగారి మనుషులు మన కామ్రేడ్స్ కొరటాల సత్యనారాయణ, ఈదా మాధవరెడ్డి, పోపూరి సుబ్బారావు, జరుగుల శంకర్రావు, గుర్రాల అధికారి తదితరులను సొలసగ్రామంలో బంధించారు. సిపిఐ(ఎం) నాయకులందరినీ బంధించి వారి ఇష్టం వచ్చినరీతిలో కోటగ్రామంలో రిగ్గింగ్ చేయాలనే తలంపుతో ఈ పని చేశారు. ఆ కోట గ్రామంలోనే రీ–పోలింగ్ జరుగుతున్న బూత్‌లో కాళిదాసు పార్టీ తరుపున ఒక్కరే ఉన్నా, అదరక బెదరక మొక్కవోని దీక్షతో ఎన్నికల్లో పాల్గొన్నారు.

పార్టీ, ప్రజాసంఘాలు జిల్లా, రాష్ట్ర, ఆలిండియా పిలుపులు జయప్రదం చేయలన్నా మహాసభలు నిర్వహించాలన్నా ధర్నాలు, నిరాహారదీక్షలు చేయాలన్నా ఆ పనంతా నాదే అని బాధ్యతగా నిర్వహించడంలో కాళిదాసు తనకు తానె సాటి. ఈ కృషితో ఆయా గ్రామాల్లో ఉన్న సాటి ప్రజాసంఘాల కార్యకర్తల్ని రంగంలోకి దింపి, పనిలో పాల్గొనేలా చేయడంలోనూ ప్రధానపాత్ర పోషించేవారు.

పార్టీ కార్యకర్తలైనా, కుటుంబ సభ్యులైన ఏ ఆరోగ్య సమస్యలొచ్చినా డాక్టర్లతో మాట్లాడి, వారికి వైద్యసేవలు సక్రమంగా అందేలా చూసేవారు. డాక్టర్ సదాశివరావు, డాక్టర్ లక్ష్మణస్వామి, డాక్టర్ బసవపున్నయ్యవంటి వారితో సత్సంబంధాలు కొనసాగించేవారు. తమ వద్దకు వచ్చేవారి ఆరోగ్యాలపట్ల అత్యంత శ్రద్ధ వహించేవారు.

ప్రజానాట్యమండలి జిల్లా బాధ్యతలు చూడాలి, జిల్లా కేంద్రానికి రావాలి అని పార్టీ జిల్లానాయకత్వం నిర్ణయంమేరకు వారి కుటుంబం గుంటూరుకి షిఫ్ట్ అయింది. ఇక్కడ డాక్టర్ కళాధర్, డాక్టర్ బాబురావు, డాక్టర్ రమణ యశస్వి, డాక్టర్ ప్రశాంత్ వంటి వైద్యులతో సంబంధాలు పెరిగాయి. జిల్లా నలుమూలల నుండి అనేకమంది కామ్రేడ్స్ ఆరోగ్యరీత్యా ఎలాంటి సహాయం కావాలన్నా కాళిదాసు గారు గుంటూరులో ఉన్నారు, అక్కడికి వెళితే చాలు ఆయన చూసుకుంటారు అనే ధీమాని కల్గించారు.

ప్రజానాట్యమండలి ఏర్పడడానికి జిల్లా నలుమూలలా కళాకారులను దుర్భిణి వేసి వెతికి ఒకటికి పదిసార్లు వారి ఇండ్లకు వెళ్లి, వారిని ఒప్పించి, వారి కుటుంబసభ్యులతో మాట్లాడి వారిని ప్రజానాట్యమండలిలో పని చేసేలా కృషి చేయడంలో కాళిదాసుగారిది ప్రముఖపాత్ర. అంజిరెడ్డి (సంతగుడిపాడు), పివి రమణ, రెంటపాళ్ళ పాటలదళం, డప్పులదళం, అమరమ్మ, జగన్నాథమ్మ, నాగేంద్రం, టి. కోటేశ్వరరావుగార్ల పాటలదళం, వీధినాటకదళం, కోలాటాలు, డప్పులశిక్షణ, పాటలశిక్షణ ఇప్పించడంలాంటి కార్యక్రమాలతో క్యాడర్‌ని ప్రోత్సహించడం చేసేవారు.

తుమ్మలపాలెం అమరవీరుల స్తూపాలు పునర్నిర్మాణం చేయడంలోనూ, కామ్రేడ్ బ్రహ్మయ్య వర్ధంతిని ప్రతి ఏడాది జరపడం యడ్లపాడు ఆనవాయితీ. క్రమం తప్పకుండా వాటిని నిర్వహించడంలో కాళిదాసుపాత్ర తప్పకుండా ఉంటుంది.

కాళిదాసుకు అన్ని విధాలుగా సహకరించడంలో కామ్రేడ్ జయమ్మ పాత్రను తప్పనిసరిగా చెప్పుకోవాలి. యడ్లపాడు అయినా, గుంటూరు అయినా తమ ఇంటికి కార్యకర్తలు, నాయకులు ఎవరు వచ్చినా వారికి భోజనం పెట్టడం తనకు వెన్నతో పెట్టిన విద్య. ఎప్పుడు ఆమె విసుగు, విరామం లేకుండా కార్యకర్తల్ని, నాయకుల్ని ఆదరించేవారు. ఇప్పటికీ ఆ ఆప్యాయతని కొనసాగిస్తున్నారు.

ఎస్ఎఫ్ఐలో పని చేసే అమ్మాయిలు అంటే వారికి ఎనలేని అభిమానం. వారిని తమ సొంతబిడ్డల్లా ఆదరించారు అంటే అతిశయోక్తి కాదు. వారిరువురు

ఆ పిల్లలకు సంఘంలో ఎలా పని చేయాలి, కామ్రేడ్స్‌పట్ల ఎలా ఉండాలో నేర్పేవారు. విద్యార్థి ఉద్యమంలో పని చేసేలా ప్రోత్సహించేవారు. వారిలో ప్రస్తుతం డాక్టర్లుగా, లాయర్లుగా, ఇతర ఉద్యోగాల్లో ఉన్నా నేటికీ ఆ దంపతులతో నిత్యసంబంధాలు కొనసాగిస్తున్నారు.

గుంటూరుజిల్లా పార్టీ కార్యాలయం నిర్మాణ బాధ్యతను పార్టీ కాళిదాసుగారికి అప్పగించగా, దానిని సమర్ధవంతంగా నిర్వహించారు. అనంతరం ఆఫీస్‌పైన డైనింగ్‌హాల్ నిర్మాణం చేయాలని రాష్ట్రకమిటి సూచించినప్పుడు, ఆ హాల్ నిర్మాణానికి నిధులు సేకరించడంలో, కామ్రేడ్ బొల్లు శంకర్రావుని ప్రధాన దాతగా ఒప్పించడంలో కాళిదాసు, హరిబాబు కృషి చేశారు. ప్రధానంగా చిలకలూరిపేట డివిజన్‌లో హాల్ నిర్మాణానికి ఎక్కువ నిధులను సమీకరించారు. జిల్లా నలుమూలల నుండి నిధులు సేకరించి హాల్ నిర్మాణం పూర్తి చేయడంలో ప్రముఖపాత్ర పోషించారు.

కాళిదాసుకు మంచితనం, కలుపుగోలుతనంతోపాటుగా వేపకాయంత వెర్రి కూడా ఉంది. కార్యక్రమాల నిర్వహణ, ఆఫీస్ నిర్వహణవంటి అనేక సందర్భాల్లో కార్యకర్తలు చెప్పిన, ఒప్పుకున్న పనిని అనుకున్న సమయానికి చేయకపోతే గయ్ గయ్‌మని కేకలేస్తారు, అరుస్తారు. ఇది కొందరు కార్యకర్తలకు కంటగింపుగా ఉండేది.

ప్రజాసంఘం పని అయినా అకౌంట్స్ సక్రమంగా రాయకపోయినా, టైంకి అకౌంట్స్ ఫైనల్ చేసి ఇవ్వకపోయినా, "ఇలా అయితే ఎలా...మనం అందరికీ ఆదర్శంగా ఉండాల్సినవాళ్లం...మనమే అకౌంట్స్ ఇవ్వకపోతే ఎలా..."అని కోపగించుకునేవారు. ప్రజాసంఘాల బాధ్యులు 'అమ్మో కాళిదాసుగారు నాలుగుసార్లు చెప్పారు, మార్చి ఎండింగ్ వస్తుంది, అకౌంట్స్ రాయాలి' అని కొన్ని రోజులు ఏ పని పెట్టుకోకుండా అకౌంట్స్ వ్రాసేవారు. ఇది కొంతమంది కామ్రేడ్స్‌కు మింగుడు పడేది కాదు.

అనుకున్న పని అనుకున్న సమయానికి జరగకపోతే విపరీతంగా కోప్పడేవారు. ఇలా బిపి పెరిగి గుండెకు ఇబ్బంది అయి వైద్యం చేయించు

కున్నప్పటికీ, రెస్ట్ తీసుకోమని డాక్టర్స్ చెప్పినా పడుకుంటే పనులు ఎలా జరుగుతాయి అని కొంత సమయం మాత్రమే రెస్ట్‌కు కేటాయించి, పనిలో నిమగ్నమయ్యేవారు.

బ్రతికినంతకాలం సమాజశ్రేయస్సు కోసం చేతనైనంత పని చేయాలి అనే దృఢసంకల్పంతో కృషి చేస్తున్న కామ్రేడ్ కాళిదాసు జీవితాన్ని ఆదర్శంగా తీసుకొని, ఆ కృషిని నేను సైతం అంటూ ప్రతి ఒక్కరం చేయి చేయి కలుపుదాం, సమాజసేవకు అంకితమవుదాం.





ప్రముఖ కార్డియాలజిస్ట్ డా. గోపాలకృష్ణ గోఖలే, డా. నాగేంద్రప్రసాద్‌తో కాళిదాసు



**కానాల గంగాధరరావు**
రిటైర్డ్ ఎంప్లాయ్, ఏపిఎస్ఆర్టిసి,
గుంటూరు.
సెల్: 9490098891

# కాళిదాసు పార్టీకి బాడీగార్డ్

ఎక్కడో పుట్టాం, ఎక్కడో పెరిగాం, గుంటూరు సిపిఐ(ఎం) పార్టీ వేదికలో కలిశాం. ఇద్దరి భావాలు కలిసాయి. ఇద్దరం నమ్ముతున్న సిద్ధాంతం ఒకటే. ఆ సిద్ధాంత ఐక్యతే మమ్మల్ని ఆత్మీయులుగా, స్నేహితులుగా చేసింది.

సిపిఐ(ఎం) పార్టీలో గుంటూరులో కామ్రేడ్ పుతుంబాక వెంకటపతిని ఎక్కువగా అభిమానించేవారము. అలాగే ఈదా మాధవరెడ్డిగారు, కె.కళాధర్‌గారు, కె.ఎల్.ప్రసాద్‌గారు, వి.సాంబశివరావుగారు, కె.యస్.లక్ష్మణరావుగారు, సి.హెచ్.ప్రమీలగారు వీరందరితోకూడా ఒక ఆత్మీయబృందంగా పనిచేసేవారం. ఈ దశలో కాళిదాసుగారు నాకు మరింత సన్నిహితుడైనాడు. నా కష్టనష్టాలలో ఓదార్పునిచ్చేవాడు. వివిధ అంశాలపై వైరుధ్యభావాలను చర్చించుకుని సవరించుకునేవారం.

ఒక్క మాటలో చెప్పాలంటే కాళిదాసుగారు పార్టీకి నిరంతరం బాడీగార్డ్‌గా పనిచేసేవాడు. అలాగే పార్టీసభ్యులకు కూడా అండదండగా ఉండేవాడు. రాగద్వేషాలకు అతీతుడు. ఎన్నోఏళ్లుగా నాలో దాచుకున్న విషయం నేను ఈ సందర్భంగా చెప్పదలిచాను. అది 1985–87 సంవత్సరకాలం అనుకుంటున్నాను. ప్రజాశక్తి దినపత్రిక గురించి నేనొక పాట వ్రాసి, దానితో నగరంలో ప్రచారం చేసాం.

అదే సందర్భంలో ప్రజాశక్తికి విరాళాలు వసూలు చేయడానికి ప్రజానాట్య మండలి దళం నెల్లూరునుండి వస్తుందని చెప్పారు. ఆ దళం గుంటూరు శ్రీ వెంకటేశ్వర విజ్ఞానమందిరంలో ప్రదర్శనలు ఇవ్వనుంది. ఈ వేదికపై ఆడేందుకు నేను "అదిగో తూరుపు" దృశ్యగేయం వ్రాసి, డ్యాన్స్ వేయించాలని నా తమ్ముడు వెంకటేశ్వరరావు, కాళిదాసు కూతురుతో ప్రాక్టీస్ చేయించాను. 'నృత్యం వారిరువురు చక్కగా చేస్తున్నారు. మంచిప్రదర్శన ఇస్తున్నానండి' అని వెంకటపతిగారికి తెలిపాను. ఆ బృందానికి విఠల్‌గారు బాధ్యుడు. వారితో మాట్లాడాను, నెల్లూరు సౌండ్ ఇంజనీర్ హజరత్‌రెడ్డిగారు అనుకుంటాను. ఇంతకీ విషయం ఏమిటంటే విఠల్‌గారు 'ఈ నృత్యానికి టైం కుదరదు' అని మమ్మల్ని నిరుత్సాహపరిచాడు.

ఈ సందర్భంలో కామ్రేడ్ కాళిదాసు నాకు ధైర్యం చెప్పాడు. ఈ నృత్యం ఆరోజు నెల్లూరుబృందంకన్నా ముందు 15 నిమిషాలపాటు ప్రదర్శనకు అంగీకరింప చేశారు ఈలోగా కాళిదాసుగారి కూతురు మరణించింది. మేమంతా కుప్ప కూలిపోయాం. ఆ సందర్భంలో కాళిదాసుగారు నన్ను ఓదార్చి 'వేరొక అమ్మాయితో ప్రాక్టీస్ చేయి, ఇంకా 15 రోజులు సమయం వుం'దని చెప్పారు.

వారి మాటప్రకారం "అదిగో తూరుపు" నా మేనకోడలుకి ప్రాక్టీస్ ఇచ్చినాను. తమ్ముడితో కలిసి ప్రదర్శన జయప్రదం చేశాం. ఆ విధంగా తాను పుట్టెడు దుఃఖంలో ఉండి కూడా కార్యక్రమం ఆగకూడదనే ఆలోచన చేయడం ఇతరులకు ఓదార్పు సలహాలు ఇచ్చే మంచిమనిషి కాళిదాసుగారు.

మేమిరువురం 'అన్నా' అని నేను సంబోధిస్తే కాళిదాసుగారు కూడా 'అన్నా' అని నన్ను పిలిచేవాడు. నా చిన్నకూతురు పెళ్లి తాను ఇష్టపడినవానితో చేయాలని నేను అనుకుంటే అవతలవైపువారు అంగీకరించలేదు. కాళిదాసుగారు జోక్యం చేసుకొని మా అల్లుడి తల్లిదండ్రులతో, వారి కుటుంబసభ్యులతో మాట్లాడి ఆ వివాహం జరిపించాడు. ఈ సందర్భంగా నాకు ఆర్థికంగా ఇబ్బందులు ఎదురైతే నాకు కొంతసహాయం చేశాడు.

## ఉద్యమాలలో ఆయనపాత్ర

జిల్లాలో లేదా గుంటూరులోగానీ ఏ ప్రజాసంఘం తన హక్కులకోసం పోరాడుతున్నా ఆ పోరాటంవద్ద ఖచ్చితంగా ఉండి నిలబడి సూచనలు ఇచ్చేవాడు. పోలీసులు వాదనకు దిగితే వారితో ఎదురొడ్డి నిలిచి సంప్రదింపులు జరిపి పోరాటంకు ఆటంకాలు రాకుండా చూసేవాడు.

ప్రధానంగా నేను ఆర్టీసీలో కార్మిక హక్కులసాధనకై ఉద్యమించినా బహిరంగ సభలు జరిపి కాళిదాసు, ఈదా మాధవరెడ్డి ముందు నిలబడి ధైర్యం కలిగించేవారు. కళారూపాల ద్వారా అనేకమంది కార్యకర్తలను తయారుచేశారు. క్రమశిక్షణ పాటించాలని అంటూ ఉంటాడు. దానికి కొందరు నొచ్చుకోవచ్చు. మిత్రుడిలో ఉన్న మంచిలక్షణాలు అనేకం. ఎవరికైనా కష్టంవస్తే అతనితో కూర్చొని మాట్లాడతాడు. వైద్య అవసరాలు ఏమైనా ఉంటే జిజిహెచ్‌లో డాక్టర్లతో మాట్లాడి సహకరిస్తాడు. వ్యక్తిగతంగా కార్యకర్తల ఇళ్లవద్ద ఇతరులతో గొడవలొస్తే వెంటనే అక్కడ వాలతాడు. వారికి సర్ది చెపుతాడు. ఈ విషయం చెప్పవచ్చో, లేదోగాని డాక్టర్‌గారి హాస్పిటల్‌వద్ద ఒక పేషెంట్‌తో పెద్దగొడవ జరిగితే నన్ను కూడా రమ్మని ఫోన్ చేసి, హాస్పిటల్‌వద్ద నాకన్నా ముందు ఉండి పరిష్కారానికి చొరవ చేశాడు.

పార్టీ నిర్మాణం అంటే హక్కులకోసం ఉద్యమించడం, సిద్ధాంత వివరాలు చెప్పడం, సమావేశాలు జరపడం, క్లాసులు నడపడం మనపార్టీకున్న మంచి లక్షణాలు. అలా నడిపిన సందర్భాలలో తయారైన కార్యకర్తలను నిలబెట్టుకోవడం, కాపాడుకోవడం, కుటుంబ సంబంధాలు, ఆ సంబంధాల ద్వారా ఆ కుటుంబాలను పార్టీకి దగ్గర చేయడం అనేది కూడా పార్టీ నిర్మాణంలో ప్రముఖ పాత్రగా ఉంటుంది.

కళాకారుడుగా ప్రారంభమైన తాను పార్టీ నిర్మాణంలో తనదైన సరళితో ముందుకు సాగాడు. ఈరోజు తాను క్రిందిస్థాయి కార్యకర్తలు మొదలు పొలిట్ బ్యూరో సభ్యులదాకా కాళిదాసు పరిచయమై ఉన్నాడు.

## తన ఇల్లాలు

ఇంట గెలిచి రచ్చ గెలవమన్నారు. మాతరం అందరం ఇంటిలో భార్య, పిల్లలను సిపిఐ(ఎం) ఉద్యమాలతో అనుసంధానం చేశాం. మహాసాధ్వి జయమ్మగారు. పార్టీ కార్యకర్తలు అందరిని తన బిడ్డలుగా చూసుకునేది. మహిళా ఉద్యమాలకు సహకరించేది. ప్రతి ఒక్క కార్యకర్తని, నాయకులను ఆప్యాయంగా చిరునవ్వుతో స్వాగతించేది. కాళిదాసుతో నా ఈ కొద్ది మాటలతో ముగిస్తున్నాను.





**కోలకొట్ల వెంకటేశ్వర్లు**
ప్రజానాట్యమండలి పూర్వ అధ్యక్షులు,
గుంటూరు జిల్లా.
సెల్: 9182501694

# రాళ్ళలో రత్నాలను వెలికితీసిన కాళిదాసు

ప్రజానాట్యమండలి పునరుద్ధరణ తరువాత విజయవాడ మాంటిస్సోరి కళాశాలలో కళారూపాలు ప్రదర్శించటానికి గుంటూరుజిల్లా నుండి 20 మంది కళాకారులను వెంకటపతిగారు పంపగా విజయవాడ వెళ్ళారు. అక్కడనుండి వచ్చిన తరువాత గుంటూరుజిల్లా ప్రజానాట్యమండలి కన్వీనింగ్ కమిటి ఏర్పాటు చేసి, దానికి కన్వీనర్‌గా కాళిదాసుగారిని పెట్టారు. ఆ కమిటిలో నేను కూడా ఉన్నాను. అప్పటిదాకా జిల్లాలో కళాకారులు చాలామంది ఉన్నప్పటికి, మన ప్రజానాట్యమండలిలో నామమాత్రంగా ఉండేవారు. అప్పటి నుండి కాళిదాసుగారి కృషితో జిల్లా మొత్తంనుండి 1985లో ఫణిదం గ్రామంలో రాష్ట్ర శిక్షణాశిబిరం ఏర్పాటు చేయటం జరిగింది. ఇది మా గ్రామం. ఈ శిబిరంలో పాటలు, నృత్యాలు, అభినయగీతాలు, జగ్గరాజుగారి గారడీ మొదలగువాటిలో శిక్షణ ఇచ్చారు. 83 మంది కళాకారులు పాల్గొనగా ఈ శిబిరం విజయవంతంగా జరిగింది. అక్కడ నుండి దాదాపుగా కాళిదాసుగారు స్వంతపనులు తగ్గించుకొని జిల్లా మొత్తం మీద కళాకారులను గుర్తించటానికి అవిరామకృషి చేశాడు. దాదాపు అన్ని డివిజన్లు తిరిగి డివిజన్ కన్వీనింగ్ కమిటీలు ఏర్పాటు చేశారు.

మాకు 'రైతు' వీధినాటిక స్క్రిప్టు అందించారు. మా గ్రామంలో అల్లాభక్షుగారు, నేను కలిసి టీమ్‌ను తయారుచేసుకొని సుమారు 15 ప్రదర్శనలు ఇచ్చాము. మా నాటికలో మహిళలపాత్రలను కూడా పురుషులతోనే చేయించాము. అలాగే ప్రదర్శనలు చేశాము. అప్పుడు కాళిదాసుగారు మా ప్రదర్శన చూసి

"మీరు చిలకలూరిపేటలో మహాసభ సందర్భంగా జరిగే శిక్షణకు రండి, మహిళా కళాకారులను నేను ఏర్పాటు చేస్తా"నని చెప్పి, మా గ్రామానికి వచ్చి కళాకారుల ఇంటింటికి తిరిగి 6 రోజులు మా టీమ్ మొత్తం చిలకలూరిపేటకు వచ్చేవిధంగా ఒప్పించి శిక్షణాశిబిరంలో పాల్గొనేట్లు చేశారు.

చిలకలూరిపేటలో 6 రోజులపాటు పాటలు, డప్పులు, పల్లెసుద్దులు, 'రైతు' వీధినాటిక, ఆ చుట్టుప్రక్కల గ్రామాలలో కోలాటశిక్షణలు అన్నీ కలిపి శిక్షణ ఇచ్చారు. మాకు చెప్పిన విధంగా మా టీమ్‌కు ప్రత్యేకశ్రద్ధ పెట్టి అంత పనిలో ఉండి కూడా నూతక్కినుండి క్రోసూరునుండి మహిళాకళాకారులను పిలిపించి మా టీమ్‌కు అప్పగించారు. దర్శకుడిగా శాంతారావు పాల్గొన్నారు. ఈ మహాసభ విజయవంతంగా జరిగింది. ఇక్కడ మేము నేర్చుకున్న రైతునాటికను సత్తెనపల్లి బ్యాంక్ ఆఫీసర్ అయిన అల్లాభక్షుగారి కృషితో అందరిని ప్రోత్సహించి ఆయన సొంతఖర్చులతో హైదరాబాద్ వరకు రాష్ట్రమంతా 110 ప్రదర్శనలు ఇవ్వటం జరిగింది. చిలకలూరిపేట మహాసభలోనే నేను (కోలకొట్ల వెంకటేశ్వర్లు) అధ్యక్షులుగా, కాళిదాసుగారు కార్యదర్శిగా ఎన్నికైనాము. తదుపరి అన్ని డివిజన్లలో మహాసభలు జరిపి కమిటీలు ఏర్పాటు చేశారు.

ఫణిదం గ్రామంలో ప్రత్యేకంగా డప్పుల శిక్షణాశిబిరం ఏర్పాటు చేసి కృష్ణాజిల్లా నుండి ఇద్దరు గురువులను పిలిచి 15 రోజులపాటు శిక్షణాశిబిరం జరిపారు. ఈ శిబిరంలో 60 మంది పాల్గొన్నారు. పాలపాడు, రెంటపాళ్ళ దళాలు అద్భుతంగా విన్యాసాలు నేర్చుకుని రాష్ట్రస్థాయిలో మంచిప్రదర్శనలు ఇచ్చేవిధంగా తయారైనారు. నేను అంతకుముందు స్టేజినాటికలకు దర్శకత్వం వహించేవాడిని. కాళిదాసుగారి చొరవతో నేను వీధినాటికలకు కూడా దర్శకునిగా తయారయ్యాను.

కాళిదాసుగారు మంచి హెల్పింగ్‌నేచర్ మనస్తత్వం గలవారు. గుంటూరులో ఉన్నప్పుడు ఎంతోమందికి సహాయం చేసి ఉపయోగపడేవారు. ఉదాహరణకు నాకు ప్రొస్టెయిట్‌గ్రంథి ఆపరేషన్ చేయవలసి వస్తే డాక్టర్ అలపర్తి లక్ష్మయ్యగారి వైద్యశాలలో ఉన్నాను. డాక్టర్‌గారు రక్తం కావాలని ఐదు రోజులు ఆపరేషన్ చేయకుండా ఆపారు. అప్పుడు రక్తంకోసం కాళిదాసుగారికి ఫోన్ చేస్తే వెంటనే వైద్యశాలకు వచ్చి నన్ను పరామర్శిస్తున్నారు. అదే సమయంలో

డాక్టర్‌గారు వార్డులో రౌండ్స్‌కి వచ్చి కాళిదాసుగారిని చూసి "నువ్వేంటి ఇక్కడున్నావు?" అని అడిగారు. అప్పుడు "వెంకటేశ్వర్లుగారి కోసం వచ్చాను, ఈయన మా ప్రజానాట్యమండలి జిల్లాఅధ్యక్షుడు" అని చెప్పారు. వెంటనే డాక్టర్‌గారు "మీరు ముందే కాళిదాసుగారి పేరు చెప్పవచ్చు కదా, ఎందుకు చెప్పలే"దని అన్నారు. ఆ తరువాత డాక్టర్‌గారు కాళిదాసుగారితో "నేను చూసుకుంటాను, మీరు వెళ్ళం"డని అన్నారు. అప్పటివరకు రక్తం కావాలని అడిగినవారు, ఆ తరువాత ఆ ప్రస్తావన లేకుండా వారే రక్తం ఏర్పాటు చేసి వెంటనే ఆపరేషన్ చేశారు.

నాలాగా ఆఫీసు పనులుగానీ, ఆరోగ్యరీత్యా హాస్పటల్ పనులుగాని కాళిదాసుగారికి ఫోన్ చేస్తే తెలిసిన వెంటనే వారికి సహాయం అందించేవారు. దానికి ఉదాహరణ కాలేజిలో చదివే నిరుపేద యువకుల వివరాలు తెలుసుకొని, వారిలో వున్న నైపుణ్యాన్ని వెలికితీసి వాళ్ళని ప్రోత్సహించి ఆదరించేవాడు. చదువుకునేవారు ఉండటానికి రూమ్స్ దొరకకపోతే కొన్నాళ్ళు ఆఫీసులోనే ఉంచి ఏర్పాట్లు చేసి హాస్టల్స్‌లో చేర్చేవారు. వారిని మంచిగుర్తింపు వచ్చే కళాకారులుగా తయారు చేశాడు. గ్రామాల నుండి వచ్చేవారు 'కాళిదాసుగారు గుంటూరులో లేకపోయాడే' అని బాధపడేవారు ఉన్నారు. అలా బాధపడేవారు నాతో స్వయంగా కాళిదాసుగారి గురించి చెప్పేవారు. అవసరం అయితే ఆర్థికంగా సహాయపడేవాడు. మంచి ఉద్యోగులు, డాక్టర్లను చూడటంతోనే పరిచయం చేసుకొని మంచిమనస్తత్వం కలిగినవారితో స్నేహసంబంధాలు ఏర్పాటు చేసుకొని, జిల్లాలో ప్రజానాట్య మండలిని నడపటానికి కావలసిన ఆర్థికవనరులను సంపాదించేవాడు. ప్రజానాట్యమండలి రెండవ మహాసభ నర్సరావుపేటలో జరిగింది. అక్కడ చిన్నపురెడ్డి, మస్తాన్‌రెడ్డి అనే కుర్రాళ్ళ సహాయంతో మహాసభకు కావలసిన కళాకారులను, ఆర్థికవనరులను ఏర్పాటు చేశారు.

మొత్తం మీద "రాళ్ళలో రత్నాలను వెలికితీసే శక్తిసామర్థ్యాలు కలిగినవాడు." ఇదేకాక ఇంకా ఎన్నో కార్యక్రమాలు ఉన్నాయి. ప్రజానాట్యమండలి కార్యదర్శిగా రిలీవ్ అయిన తరువాత కూడా ప్రజానాట్యమండలికి కావలసిన ఆర్థికవనరులను సమకూర్చాడు.



**ఎల్.ఎస్. భారవి**
కరస్పాండెంట్,
ప్రొ॥యం.వి.యస్ కోటేశ్వరరావు స్కూల్
పుచ్చలపల్లి సుందరయ్య నగర్, గుంటూరు,
సెల్: 9490300859

# కాళిదాసు పార్టీకి మాత్రమే దాసుడు

**నే**ను 1990లో మెడికల్ రిప్రజెంటెటీవ్స్ యూనియన్‌కి జిల్లా అధ్యక్షుడ నయ్యాను. 1992 నుండి శేఖరరెడ్డి, ఆ తరువాత జిలానీగారి ద్వారా బ్రాడీపేటలోని పార్టీ ఆఫీసుకి రావటం ప్రారంభించాను. మొట్టమొదటిసారిగా ఇక్కడే కాళిదాసు గారిని చూశాను. కామ్రేడ్ కొరటాల సత్యనారాయణని ఆఫీసులోకి తీసుకువస్తూ, పెద్దాయన ప్రయాణంలో తెచ్చుకున్న దిండుని చంకలో పెట్టుకుని, ఇంకో చేత్తో బ్యాగు పట్టుకుని వీరభక్త హనుమాన్‌లాగా వచ్చారు. కామ్రేడ్ సింహాద్రి శివారెడ్డి కాళిదాసుని పరిచయం చేశారు. పంజరంలా ఉండే పెంకుటిల్లులో పైన గదిలో మా పరిచయం. ఆ కళ్ళలో ఏవో మెరుపులు. ఆ తర్వాత కాలంలో నాకు అర్థమయ్యింది. అవి మెరుపులు కావు...ఉరుములు అని. పార్టీపట్ల నిబద్ధత, విధేయత, విశ్వాసము ఉన్నవారిలో కనిపించే ఉరుములు.

నాటినుంచి నేటివరకు మా స్నేహం అజరామరంగా కొనసాగుతుంది. ముక్కుసూటిగా పోవటం, కుండబద్దలు కొట్టినట్లు మాట్లాడటం, పార్టీని నమ్మిన కార్యకర్తల కష్టాలన్ని తన కష్టాలుగా భావించి సహాయపడటం, పగలయినా, అర్థరాత్రి అయినా ఆపదలో ఉన్న వారికోసం పరిగెత్తే తత్వం.

కాళిదాసు అన్నతో ఉన్న ఈ మూడు దశాబ్దాల సాహచర్యంలో కొన్ని ప్రత్యేక సంఘటనలు ఇక్కడ ప్రస్తావించాలి. మొదటిది "గుంటూరు ఘంటారావం."

గుంటూరుజిల్లా సమగ్రాభివృద్ధి కోసం జిల్లామొత్తం దాదాపు 42 రోజులు పార్టీ నాయకత్వం పాదయాత్ర చేసిన కార్యక్రమంలో నేను కూడా కొన్ని రోజులు పాల్గొన్నాను. ఈ కార్యక్రమం రూపకల్పనలో పార్టీ జిల్లాకమిటి అంతా సమష్టిగా పనిచేసినా, అమలుచేయటంలో, ఆచరణలో, ప్రణాళికలో నూతలపాటి కాళిదాసుగారు ముఖ్యపాత్ర పోషించారు. ప్రచారరథం మరియు ఆ బృందం ఏర్పాట్లలో, పాదయాత్ర బృందంకోసం జరిగిన ఏర్పాట్లలో ఆయన అడుగడుగునా తీసుకున్న జాగ్రత్తలు, పద్ధతులు ఎంతో స్ఫూర్తిని కలిగించాయి.

2010లో "ఆల్ ఇండియా కిసాన్‌సభ" మహాసభలు గుంటూరులో శ్రీ వెంకటేశ్వర విజ్ఞానమందిరంలో జరిగాయి. ఆ సందర్భంగా ఏసి కళాశాల ఉల్ఫ్ హాల్‌గ్రౌండ్స్‌లో ఎగ్జిబిషన్ ఏర్పాటు చేశాము. వ్యవసాయరంగానికి సంబంధించినవి, ప్రకృతి సంపదలు, పశు, పక్ష్యాదుల ప్రదర్శన భారీఎత్తున మూడురోజులపాటు జరిగింది. ఆ ఎగ్జిబిషన్ కమిటిలో ఉన్న నాకు కాళిదాసుగారు ఇచ్చిన సహాయ సహకారములు మరవలేనివి. స్టాల్స్ ఏర్పాటుతోపాటు, వ్యవసాయ పరికరాలు, పనిముట్లు, యంత్రాలు, ఒంగోలు జాతిగిత్తలు, వైవిధ్యభరితమైన ప్రదర్శనాంశాలు ఏర్పాటు చేయటంలో కీలకపాత్ర పోషించారు.

ఆఖరుగా నేను మర్చిపోలేనిది, అందరికీ గుర్తుండేలా నిలిచిపోయింది భూపోరాటంలో పేదల కేంద్రంగా మారిన సుందరయ్యనగర్‌కాలనీ ఏర్పాటులో, ఆ తరువాత కాలనీ కార్యదర్శిగా ఉన్న ఆంజనేయులుమీద రౌడీషీటర్లు హత్యాయత్నం చేసినప్పుడు, మొత్తం ముఖం ఛిద్రమైపోయింది. ఇక బ్రతకడం కష్టం అనుకున్న పరిస్థితులలో గుంటూరు ప్రభుత్వ ఆసుపత్రిలో డాక్టర్లందరిని వెంటబడి, పరిచయం లేకపోయినా తన చొరవ, దూకుడుతో అందరిని పరిగెత్తించి, దాదాపు 6 గంటలు సర్జరీ చేయించి ఆంజనేయులు కోలుకోవటానికి ఒక ప్రధాన కారకుడుగా కాళిదాసు కృషి అమోఘం. ఇలా చెప్పుకుంటూపోతే చాలా సందర్భాలలో ఆయన పాత్రని తలుచుకోకుండా ఉండలేని పరిస్థితి.

వ్యక్తిగతంగా నేను ఉద్యోగం కోల్పోయి, అప్పులపాలై, ఆస్తులు పోగొట్టుకునే సందర్భం వచ్చినప్పుడు కాళిదాసుగారు సరైన సూచనలు అందించి, నాకు మానసిక

స్థైర్యాన్ని ఇచ్చి, “మానవ సంబంధాలన్నీ ఆర్థికసంబంధాలే” అన్న సూత్రాన్ని నిజ జీవితంలో అర్థమయ్యేలా చేసి మరింత దృఢంగా ముందుకు సాగేలా చేశారు.

చూడటానికి మొరటోడులా కనిపించే మన కాళిదాసు నిజానికి మనసున్న కాళిదాసు. ఆయన ఎవరికీ దాసుడుకాదు. కేవలం పార్టీకి మాత్రమే దాసుడుగా నిలబడి నాలాంటి వారెందరికో స్ఫూర్తిదాయకమయ్యాడు.





యడ్లపాడు గ్రామంలోని ప్రాథమిక వైద్యశాలలో నూతలపాటి కాళిదాస్ గారికి సన్మానం చేసి మాట్లాడుతున్న డాక్టర్ లక్ష్మణ్‌నాయక్‌గారు, హాస్పిటల్ స్టాఫ్.



**Md చిష్తీ ఆవాజ్**
రాష్ట్ర కార్యదర్శి
**Md షకీల బేగం**
ఉపాధ్యాయిని.
(UTF)
9493468148

# భారతీయుడు కాళిదాసు

**ఉ**మ్మడి గుంటూరుజిల్లా వామపక్ష ఉద్యమానికి పాతతరం తర్వాత ఈ తరానికి పెద్దదిక్కు అయిన కాళిదాసు, జయమ్మగార్లను చూడగానే భారతీయుడు సినిమాలో కమలహాసన్, సుకన్య పాత్రలు గుర్తుకొస్తాయి. తాము నమ్మిన సిద్ధాంతం కోసం ఎన్ని ఇబ్బందులు, ఆటంకాలు వచ్చినా ధైర్యంగా, ఆత్మవిశ్వాసంతో నిలబడిన ఈ జంటకు జనంతో విస్తృతమైన సంబంధాలు ఉంటాయి. కాళిదాసు గారికి సినిమా, సాహిత్యరంగంలో అవకాశాలు వచ్చినా పార్టీకోసం తన వ్యక్తిగత ఎదుగుదలను త్యజించిన నిరాడంబరుడు.

కార్యకర్తల్లో తాను గమనించిన వ్యక్తిగత పోకడలను, వారు ఏ పై బాధ్యతలో ఉన్నా నిస్సంకోచంగా, ముక్కుసూటిగా విమర్శించే కాళిదాసుగారు వారిపట్ల అంతే బాధ్యతాయుతంగా ఉంటూ, వారి సమస్యలను పరిష్కరించడంలో ఎంతో చొరవతో వ్యవహరిస్తారు. గత పది ఏళ్ళలో ఆయనతో పరిచయమేకాక కుటుంబ అనుబంధం కూడా ఏర్పడింది. ఒకసారి మా అబ్బాయిని 'ఏం చదువుకుంటున్నావురా' అని అడిగారు. ఇంటర్మీడియట్ యంపిసి అని సమాధానం చెప్పాడు. ఓరి! "దొంగ లెక్కలు చేసి చూపించడానికి కష్టపడుతున్నావ్ రా" అని నవ్వారు. నిజమే బూర్జువా ప్రభుత్వాలు పెట్టుబడిదారుల కోసం సామాన్యులను దోపిడీ చేయడానికి ఏర్పరిచిన ఈ విద్యావ్యవస్థలోని విద్య ఎవరికి తోడ్పడుతుంది? పెట్టుబడిదారుడికి తప్పా!

దాన్ని ఒక్కమాటలో చెప్పగలిగే చాతుర్యం కాళిదాసుగారి ప్రత్యేకత. కొన్ని సందర్భాలలో సర్దుబాటులను రాజీధోరణిగా భావించి అసహనాన్ని వ్యక్తపరుస్తారు. అప్పుడప్పుడు చిన్న పొరపాటును కూడా పెద్దతప్పుగా వాదిస్తారు. ఆయన నిబద్ధత, నిక్కచ్చితనం కొందరికి చాదస్తం అనిపించినా వ్యక్తిగత అభిమానంకంటే పనికి ప్రాధాన్యతనిచ్చే ఆయన తత్వం నేటితరానికి ఆదర్శం.





కరోనా కాలంలో గుంటూరు సుందరయ్యనగర్‌లోని ఎం.వి.ఎస్. కోటేశ్వరరావు మెమోరియల్ స్కూలు కమిటీ ఆధ్వర్యంలో సంఘసేవలో మిత్రులతో కాళిదాసు.



**ఎస్. రామరాజు**
పారిశ్రామికవేత్త,
మంగళగిరి.
9057905566

# కమ్యూనిస్టు కార్యకర్తలకు ఆదర్శం

**కా**ళిదాసుగారి గురించి ఒక పుస్తకం వస్తుంది అని తెలిసినపుడు ఆ ఆలోచన చేసినవారిని అభినందించాలని ముందుగా అనిపించింది. ఎందుకంటే ఒక కమ్యూనిస్టు కార్యకర్త తనకి తెలిసిన పరిమిత సిద్ధాంతంతో పూర్తిగా దిగి పని చేస్తే ఎటువంటి ఫలితాలు తీసుకురావచ్చో చెప్పటానికి నూతలపాటి కాళిదాసుగారి పనివిధానం ఒక ఉదాహరణ. 1995-96 ప్రాంతంలో నేను మొదటిసారి కాళిదాసు గారిని గుంటూరు సిపియం ఆఫీసులో చూశాను. నాకు ఆయన్ని పరిచయం చేస్తూ ప్రజానాట్యమండలి జిల్లాకార్యదర్శి అని చెప్పారు. ఆయనతో మాట్లాడాక అసలు ఇతనికి కళలతో సంబంధం ఏమిటి? పాటలతో సంబంధం ఏమిటి? ఈయన ప్రజానాట్యమండలిలో ఏం చేస్తాడు అని అనుకున్నా. అప్పుడు నేను ఆచార్య నాగార్జున యూనివర్సిటీలో ఉండేవాడిని. గుంటూరు ఆఫీసుకు వెళ్ళినప్పుడల్లా కాళిదాసుగారు తరచుగా కలిసేవారు. క్రమక్రమంగా ఆయన పనివిధానాన్ని గమనించి నేను చాలా ఆశ్చర్యపోయాను.

ఆ తరువాత కాలంలో కార్యకర్తగా గుంటూరు ఆఫీసులో ఉన్నాను. అప్పుడు కాళిదాసుగారిని, ఆయన పనివిధానాన్ని దగ్గరగా గమనించే అవకాశం వచ్చింది. పల్లెటూరినుండి పట్టణానికి వచ్చి కమ్యూనిస్టుపార్టీ మీద అభిమానంతో పార్టీకోసం ఆయన చేసిన కృషిని చూశాక కమ్యూనిస్టుగా ఉన్నంత కాలం కాళిదాసుగారిలాగా

ఉంటే చాలు అని అనిపించింది. ఒక కార్యక్రమం తీసుకుంటే ఆ కార్యక్రమం ఎలా చేయాలి, దానిలో ఎవరెవరిని భాగస్వామ్యం చేయాలి, అలాగే అందరితో సమన్వయం చేసుకుంటూ తీసుకున్న కార్యక్రమాన్ని జయప్రదం చేయటంలో కాళిదాసుగారు విశేషనైపుణ్యం ఉన్నవారు.

అలాగే ఒక కార్యకర్తని గుర్తిస్తే అతన్ని తయారు చేసుకోవటం కోసం ఆయన పడే తపన ఎలాంటిదంటే, కన్న కొడుకు భవిష్యత్తుని సక్రమంగా నిర్మించటానికి తండ్రి పడే తపనలాంటింది. నా సహచరులుగా ఉన్న రమణని, అంజిరెడ్డిని కార్యకర్తలుగా కాపాడుకోవటం కోసం వారికి వచ్చే ఇబ్బందులను నిరంతరం గమనిస్తూ వాటి నుండి వారిని కాపాడుతూ, అండగా నిలుస్తూ కార్యకర్తలుగా రూపొందించిన విధానం నాకు బాగా నచ్చింది.

2001లో రాధికతో నా వివాహాన్ని కాళిదాసుగారు అధ్యక్షత వహించి జరిపించారు. ఆ సందర్భంగా ఆయన మాట్లాడుతూ భార్యాభర్తలమధ్య వచ్చే అపోహలను, కోపతాపాలను కమ్యూనిస్టులుగా మనం ఎలా అధిగమించాలో చెప్పారు. అది ఇప్పటికీ నాకు గుర్తున్నది. నేను గుంటూరునుండి ఉద్యమ అవసరాల రీత్యా బాపట్ల వెళ్ళాక జిల్లాకేంద్రం నుండి కాళిదాసుగారు అనేక సందర్భాలలో ఆయన ఉద్యమ అనుభవాలను ఉదాహరణలు చెప్తూ అనేక సూచనలు చేసేవారు. వయస్సురీత్యా మాకంటే పెద్దవారైనా మాతో కలిసిపోయి మా సాధకబాధకాలను పంచుకునేవారు.

కాళిదాసుగారికంటే ముందుగా జయమ్మ ఆంటీ గురించి చెప్పాలి. శివారెడ్డిగారిని ఆమె కనురెప్పలా కాపాడుకుంటూ వచ్చేది. ఉదయం లేచిన దగ్గర నుండి శివారెడ్డిగారి బాగోగులు చూడటం, ఆయనకు కావలసినవి రెడీ చేయటం, ఇంటికి ఎవరొచ్చినా వారిని ఆప్యాయంగా పలకరించి, మాలాంటివారిని కన్నబిడ్డల్లాగా చూసుకోవటం ఆమెకు మాత్రమే చెల్లు. ఇంటికి ఎవరెళ్ళినా వారిని ఏదోకటి పెట్టి తినకుండా వెళ్ళనిచ్చేదికాదు. ఇంటిలో నిరంతరం పని చేస్తూనే శివారెడ్డిగారికి, కాళిదాసుగారికి కావలసినవి సమకూరుస్తూ అవకాశం ఉన్నప్పుడల్లా మహిళా సంఘం కార్యక్రమాల్లో పాల్గొనటం అందరికీ ఆదర్శనీయం. కొద్దిసేపు

పనిచేస్తే అలసిపోయి ఆ ఇంకేం పని చేస్తాములే అనుకునే ఈ రోజుల్లో జయమ్మ ఆంటీ నిత్యం ప్రతివస్తువుని శుభ్రంగా ఉంచటం ఆమె లక్షణం. ఆమెవల్ల కాళిదాసుగారు ఎన్ని ప్రాంతాలు తిరిగి వచ్చినా, ఏ పనిచేసినా ఇప్పటికీ ఆరోగ్యంగా ఉన్నారంటే ఆ ఘనత జయమ్మ ఆంటీదే.

నేను కొన్ని అననుకూల పరిస్థితులలో పూర్తికాలం కార్యకర్తగా వైదొలిగి వ్యాపారంలోకి వచ్చాను. కాళిదాసుగారు నేను పూర్తికాలం కార్యకర్తగా ఉన్నప్పుడు ఎలా చూసేవారో, ఎలాంటి ప్రేమాభిమానాలు ప్రదర్శించేవారో ఇప్పటికీ నాపట్ల అదేభావంతో ఉన్నారు. నేను యడ్లపాడు మీదుగా వెళ్తుంటే కాళిదాసుగారికి ఫోన్ చేయకుండాగాని, పలకరించకుండా ఉండటంకానీ అరుదు. ఆయనిప్పటికీ పాతిక సంవత్సరాల క్రితం ఏ ఉత్సాహంతో, ఏ స్ఫూర్తితో పనిచేశారో, అలానే కొనసాగుతూ ఉండటం నేటి కమ్యూనిస్టు కార్యకర్తలకి చాలా ఆదర్శనీయం.





ఎస్. రామరాజు, రాధిక వివాహం జరుపుతున్న కామ్రేడ్ సింహాద్రి శివారెడ్డి, కాళిదాసు.



**నల్లపనేని తాండవకృష్ణ**
ప్రిన్సిపల్
ప్రొ॥ యం.వి.యస్.కె. స్కూల్
సుందరయ్య నగర్, గుంటూరు.
సెల్: 9490300642

# ఉద్యమ సహచరుడు కాళిదాసు

1990 అక్టోబరు 2 నుండి నవంబరు 14 వరకు (గాంధీజయంతి నుండి నెహ్రూ జయంతి వరకు) భారత జ్ఞానవిజ్ఞానసమితి ఆధ్వర్యంలో ప్రాథమిక విద్య ప్రాధాన్యతను ప్రజలకు తెలియచేయుటకుగాను రాష్ట్రవ్యాప్తంగా అక్షర కళాయాత్రలు జరిగాయి. మన గుంటూరుజిల్లా కళాయాత్ర కళాబృందానికి నూతలపాటి కాళిదాసుగారు కన్వీనర్.

తాడికొండ సాంఘికసంక్షేమ గురుకులపాఠశాలయందు కళారూపాల రూపకల్పన కొరకు శిక్షణాశిబిరం నిర్వహించడం జరిగింది. అద్భుతమైన కళారూపాలు తయారు చేయబడ్డాయి. కాళిదాసుగారు చూడటానికి నాటుగా, మోటుగా అనిపించినా వారి మనసు చాలా సున్నితమైనది. ఇతరులకు సహాయం చేయడం, బాగోగులు చూడటంలో ముందుంటారు. తను అనుకున్నది సరైనదని తాను భావిస్తే దానిని అమలు చేయటానికి ఎంతటి కష్టమైన వెనుకాడని స్వభావం.

ఎదుటివారు తన భావనకు సుముఖంగా లేనప్పటికి వారిని ఎలాగోలా ఒప్పించి తను అనుకున్నదే నెరవేర్చటంలో ఆయనకు ఆయనేసాటి. ఇతరులకోసం చాలా కష్టపడి, తన కోసం ఆలోచించుకునే స్వభావం తనలో అసలు కానరాదు.

మా గ్రామమైన లింగారావుపాలెం యడ్లపాడు మండలం పరిధిలోనిది కావడంతో నా హైస్కూలు విద్య యడ్లపాడులో జరగడం, మా గ్రామం, యడ్లపాడు కమ్యూనిస్టు భావాలు గల గ్రామాలు అయినందున నేను కూడా యువజన,

ప్రజానాట్యమండలిలో పని చేసియున్నందున కాళిదాసు, పద్మారావు, శంకరరావుగార్లతో కలసి పనిచేసే అవకాశం కలిగింది.

వీథినాటకాలు, 'అద్దం', 'మనచరిత్ర', 'సారాసంహారం' స్టేజి నాటిక, 'హాలికులు సేమమా'లాంటి నాటికల రిహార్సల్స్, ప్రదర్శించడం, ప్రజానాట్య మండలి తాలూకా, జిల్లాకమిటీలలో కాళిదాసుగారితో కలసి పనిచేయడం జరిగింది. చిలకలూరిపేట, నర్సరావుపేటలలో జరిగిన ప్రజానాట్యమండలి మహాసభల నిర్వహణలో, జయప్రదం చేయడంలోను, శిక్షణాశిబిరాల నిర్వహణలో కాళిదాసుగారి పాత్ర గణనీయంగా ఉండేది.

సుందరయ్య నాటకోత్సవాలు, పి.ఆర్. (పోపూరి రామారావు) విజ్ఞాన కేంద్రం యడ్లపాడులో నిర్వహించడంలో చాలా క్రియాశీలపాత్ర పోషిస్తున్నారు. జిల్లాలో ప్రజానాట్యమండలి, నిర్మాణంలోను కళారూపాల తయారీలోను రాష్ట్రంలోని అన్ని జిల్లాలకంటే ఉన్నతంగా తీర్చిదిద్దారనడం అతిశయోక్తి మాత్రంకాదు.

వారి బంధువుల గ్రామమైన సంక్రాంతిపాడు మా ఊరిమీదుగా వెళ్ళవలసి ఉంటున్నందున, నేను ఉద్యోగరీత్యా మా ఊరునుండి యడ్లపాడుమీదుగా చిలకలూరిపేట, గుంటూరు వెళ్ళడంవల్ల తరచుగా కలుసుకొనేవారం. కాళిదాసు గారి సతీమణి జయమ్మగారిని అక్కయ్య అనిపిలుస్తాను. కాని కాళిదాసుగారిని 'గారు' అని పిలువడం అలవాటైంది. ఆయన మాత్రం నన్ను అరేయ్ ఒరేయ్ అని ఆప్యాయంగా పిలిచే స్వతంత్రం నామీద ఆయనకు ఉంది.

ఒక ఆశయం కోసం పనిచేస్తున్న సహచరులుగా మేమెన్నడూ దూషించు కున్న లేక బాధపడ్డ సంఘటనలు మచ్చుకైనా కానరావు. అనేక సందర్భాలలో వారింటికి వెళ్ళడం తరచుగా భోజనం చేయడం జరిగేది. నాపట్ల చాలా ప్రేమగా, ఆప్యాయంగా వ్యవహరించేవారు వారివురూ. నేను కూడా వారిపట్ల అదేవిధమైన భావనను కలిగియున్నాను.

45 రోజులు ప్రదర్శనలు, 15 రోజుల శిక్షణ మొత్తం రెండునెలలు అక్షర కళాయాత్రలో 40 మంది కళాకారులు బృందంలో మహిళాకళాకారులు కూడా ఉన్నప్పటికి ఎవరికి, ఏమాత్రం అసౌకర్యం కలుగకుండా జీలకర్ర, వేడినీళ్ళు, ఆహారం, మందులు, విశ్రాంతి అన్ని జాగ్రత్తలు తీసుకొని టీమును చాలా క్రమశిక్షణాయుతంగా నడపడం కాళిదాసుగారి ప్రత్యేకత.

గుంటూరుజిల్లా ప్రాచుర్యాన్ని తెలియచేసే 'ఉద్యమాల పురిటిగడ్డ గుంటూరు మన జిల్లా' అంటూ గొప్పపాటను దశరథగారితో వ్రాయించడం గొప్ప విషయం. "తెలుసుకోరా పౌరుడా, ఇకనైనా ఈ నిజం ఇకనైనా మార్క్సిజం" అంటూ కమ్యూనిజం ప్రాధాన్యతను తెలిపే పాటను చిలకలూరిపేటప్రాంతం రచయిత కొప్పుల వసంతరావుగారితో వ్రాయించటం జరిగింది. చిలకలూరిపేట ప్రాంతం లోను, గుంటూరులో నేను యు.టి.ఎఫ్ బాధ్యతలలోను, కాళిదాసుగారు పార్టీ కార్యాలయ కార్యదర్శిగాను, మరియు ఇతర బాధ్యతలలోను 1980 నుండి 2024 వరకు కాళిదాసుగారు నేను కలసి దాదాపు నాలుగున్నర దశాబ్దాలు పనిచేసే అవకాశం మాకు కల్గింది.

తనకు చదువు తక్కువని కాళిదాసుగారంటారు. కమూనిస్టులు అక్షరాస్యులు కాకపోయినా ఖచ్చితంగా విద్యావంతులే. సమాజాన్ని, ప్రజల్ని, ప్రజాసమస్యలని అధ్యయనంచేసి, వాటి పరిష్కారానికై చేసే పోరాటాలలోనే వారు విద్యావంతు లవుతారు. చదువగలగడం, వ్రాయగలగడం, అర్థం చేసుకోగలగడం, లెక్కలు చూడగలగడం, ఆడిట్ చేయడంలాంటి పనులుకూడా చేయగల మన కాళిదాసు గారికి చదువు తక్కువ ఎలా అవుతుంది. పెద్దపెద్ద విద్యార్హతలుగలవారు కూడా పైపనులు చేయలేకపోవచ్చు. అందుకే పైపనులన్నీ సమర్థవంతంగా చేయగల మన కాళిదాసుగారిని నిజమైన విద్యావంతుడుగా భావిస్తాను.

ఆంధ్రప్రదేశ్‌లో రైతాంగ ఆత్మహత్యల నేపథ్యంలో 'హాలికులు సేమమా' నాటిక, మద్యపానం జనజీవితాలను ఎలా పాడు చేస్తున్నదని తెలియచేసే 'సారాసంహారం', మొదలైన నాటికలను రూపొందింపచేయడం, రాష్ట్రవ్యాప్తంగా ప్రదర్శింపచేయడం ప్రజాప్రయోజన ప్రయోగాలే.

గుంటూరుజిల్లా పార్టీ కార్యాలయ నిర్మాణంలోను, నిర్వహణలోను, చాలా సమర్ధవంతమైనపాత్ర పోషించారు. మహాసభల నిర్వహణలోను, భోజన సదుపాయాలు, వనరుల సమీకరణలోను తన శక్తిసామర్థ్యాలను, పరిచయాలను ఉపయోగించి జయప్రదం చేయడంలో ప్రథమపీఠిన ఉండేవారు. ఆ కృషిని గురించి మాటలలో తెల్పడం సాధ్యంకాదు. కాని అసాధ్యమైనదాన్నికూడా సుసాధ్యం చేయగలదిట్ట మన కాళిదాసుగారు అనటంలో సందేహించాల్సిన అవసరం లేదు.



**నాదెండ్ల శ్రీనివాస్**

విభాగాధికారి,

ఆంధ్రప్రదేశ్ సచివాలయం.

సెల్: 8309858316

# ఆణిముత్యమై నిలిచిన వానచినుకు

**మ**నిషి ధరించే వివిధ భూమికలకు మూలధాతువులు ఆ మనిషికున్న శక్తియుక్తులే.

నూతలపాటి కాళిదాసు అన్న యడ్లపాడు మట్టిలో మొలిచిన మొక్కే కానీ చెట్టంత ఎదిగిపోయిన మనిషి. ఆణిముత్యమై నిలిచిన వానచినుకు. యడ్లపాడులో వినూత్నచైతన్యానికి నాంది పలికిన ప్రగతిశీలి. సూటిగా దూసుకుపోయే చూపులున్నవాడు. విరామచిహ్నంలేని వాక్యంలాంటివాడు. వ్యవసాయమైనా, సాంస్కృతిక కార్యక్రమమైనా తన కర్తవ్యాలను నిర్వహించడంలో మబ్బులు కమ్ముకొచ్చినా విశ్రమించని సూర్యకిరణంలాంటివాడు కాళిదాసు అన్న.

కళాకారుడిగా రైతుల కష్టాలను అతి సమీపంగా పరిశీలించి, చిందిన స్వేదబిందువులకు సరైన సమయానికి సస్యఫలాలు అందకపోవడం గమనించి, వారి కష్టాలకు ఒక కళారూపమిచ్చి, “హాలికులు సేమమా?” అనే నాటికను రూపొందించి, అనేకచోట్ల ప్రదర్శించి అనేక బహుమతులు గెలుచుకున్న కళాకారుడు.

కమ్యూనిస్టుపార్టీ కార్యకర్తగా సాటిమనిషిపై స్వారీచేసే శాసనాలను, తలకెక్కిన మౌఢ్యాలను ప్రతిఘటించడంలో ఆగ్రహించి కదిలిన బడుగు. బలహీనుల పక్షాన నిలిచి ప్రశ్నించిన పిడుగు నూతలపాటి కాళిదాసుగారు.

నేటి యువతకు ఆదర్శప్రాయుడై నిలిచి యడ్లపాడులో అపూర్వ ఉదయాలనూ, అర్ధరాత్రి ఉషోదయాలనూ అందించి, తన జీవనయాత్రను జైత్రయాత్రగా మలచుకున్న నూతలపాటి కాళిదాసుగారు ముందున్న మజిలీలు దాటుకుంటూ, పునరుద్దీప్త సంకల్పంతో పురోగమించాలని, సంక్షుభిత సమయాల్లో మరెందరికో వెన్నంటి నిలిచే రక్షాకవచమై నిలవాలని కోరుకుంటున్నాను.





అరుదుగా దొరికే ఉల్లాస వేళలలో...



**నంబూరు నాగేశ్వరరావు**
రైతుసంఘం నాయకుడు,
లింగారావుపాలెం.
సెల్: 9491128991

# మార్క్స్ సిద్ధాంతమే జీవనవిధానం

**నూ**తలపాటి కాళిదాసుగారు నాకు అత్యంత ప్రీతిపాత్రుడు. సోదర సమానుడేకాక, చిన్నప్పటి నుండి అనేక సందర్భాలలో వ్యవసాయరంగంపైన, అనేక సామాజిక విషయాలలో రుగ్మతల గురించి, అలాగే వ్యక్తిగత విషయాలు సోదాహరణంగా విశ్లేషించుకునేవారం. కాళిదాసు గారి గురించి వ్రాసేముందు ఆయన జీవితాన్ని ఈ సమాజం కోసం, అనేక అపరిష్కృత సమస్యల పరిష్కారం కోసం, తన జీవితకాలాన్ని ఏ పరమార్థం కోసం వెచ్చించాడో, ఏ పరమాశయం కోసం తన కాలాన్ని అర్పించాడు అని గుర్తు చేసుకున్నప్పుడు ఆ రకమైన శ్రమ పాత్ర ముందు నా వరకు నేను అంతరాత్మశోధనలో తలదించుతాను.

ఈ మన ప్రాంతానికే మంచి ఆదర్శపురుషుడైన, ఒక మంచినాయకుడి ఆధ్వర్యంలో మాలాంటి అనేకమంది గురుతుల్యులుగా, ఒక మంచి సామాజికస్రవంతిని, త్యాగపూరిత ధోరణిని నేర్పిన పోపూరి రామారావుగారి ప్రభావంతో ఎదిగినతీరుని మేమందరం మరవజాలం. ఆయన వ్యక్తిగతం నుంచి జీవనజీవితవిధానం వరకు అలవర్చుకున్న అంశాలే ఈనాటికీ మాలో కొంత మిగిలి ఉన్నాయి. సహస్రాబ్ది మహామేధావి, ప్రాపంచిక మానవాళి మహోన్నత అహరహం ఎంతో మంది మేధావులను తయారు చేసిన కర్మాగారం అంతటి కార్ల్‌మార్క్స్ సిద్ధాంతాలే. ఆ ప్రభావాన్ని ఎంతో కొంత జీర్ణించుకున్న, అలవర్చుకున్న అంశాలే ఈనాటికీ మాలో మిగిలున్నాయి.

1978వ సంవత్సరంలో సిపిఐ(ఎం) పార్టీలో సభ్యులుగా చేరి, ఆ పార్టీ ప్రవంతిలో సుమారు గత 50 సంవత్సరాలపాటు పార్టీ ఇచ్చిన అనేక పిలుపులు, ఉద్యమాలలో పాల్గొని అమలు జరిపిన సంప్రదాయం మా ముందు అనేక అనుభవాలను, అనేక సామాజిక పరిణామాలు, వాటి గమనగతులను, అనేక ఫలితాల ప్రభావాలను, కాలంతో గమనించిన అనేక అనుభవాలను చూశాం. నూతలపాటి కాళిదాసుగారు పార్టీకోసం పూర్తికాలంగా గత 40 సంవత్సరాలపాటు గుంటూరులో జిల్లా ఆఫీస్‌నుండి ఆయా ప్రాంత, కాలాలనుబట్టి ఎదురైన అనేక అనుభవాలతో జిల్లా నాయకుడిగానే కాక, రాష్ట్రవ్యాప్త ఉద్యమాలను, అనేకమంది మేధావుల, విభిన్నస్వభావాలుగల అనేకమందితో భారీగా పరిచయాలు ఏర్పరచు కున్న ప్రత్యేక వ్యక్తిత్వం.

అనేక సాహిత్య, సాంస్కృతిక మేళవింపైన గుర్రం జాషువా సాహిత్యానికి అధిపతిగా, సామాజిక స్థితిగతులను అనుభవంలోకి తెచ్చుకున్న కారణంగా కళారంగంలో, రంగస్థలంలో అనేక వేదికలను, విభిన్నపాత్రలను అలవోకగా అలరించాడు. సమాజంలో సంస్కృతి ద్వారా సంక్రమించిన ఈ వ్యవస్థ సృష్టించిన నాయకపాత్రనుండి స్వార్థపూరిత రాజకీయ నాయకులను రంగరించుకున్న పాత్రలనుండి, ఎమ్మెల్యేకి ఎడమభుజంలాంటి పాత్రలవరకు, ఆధ్యాత్మికంగా పండించిన ఫలప్రద ప్రముఖుడు అనడంలో అతిశయోక్తిలేదు. ఈ వ్యవస్థ సృష్టించిన అనేక ఆగర్భదరిద్రులను, అభాగ్యులను, అశాంతిలను, అనేకులను తన పాత్ర పోషణలు అనుభవంలోకి తెచ్చుకున్న ప్రతిభాశాలి.

కుటుంబస్థితిగతులలో చిన్నపాటి రైతు అయినా తోటి సహచరిని సహితం పార్టీ సిద్ధాంతాన్ని, అనేక అనుభవాలను అలవర్చుకున్న స్త్రీగా, ఆచరణలో రుజువు చేసుకున్న స్త్రీగా ఆచరణలో రుజువుపరిచిన మంచిమహిళగా ఆమెకు నా ధన్యవాదాలు. వారి జంటకు కలిగిన ఒక అమ్మాయి అంతా 15 సంవత్సరాల లోపే అకాలంలో అసువులు విడిచి వారి కుటుంబభవిష్యత్తు అస్తిత్వాన్ని ఆర్పేసినను ఏమాత్రం చలించక, ధైర్య, సాహసాలతో, అపార అనుభవపార్టీతో ఈ సమాజానికి ఉపయోగపడదామనే అస్తిత్వాన్ని నింపుకున్న జంట వారిది. ప్రస్తుతం నడుస్తున్న

వర్తమాన వ్యవస్థలో వ్యక్తిగత ఆస్తుల కోసం, భోగలాలస కోసం పోటీపడి, తరువాత తరాల కోసం తపించే నేటిరోజులలో ఆస్తిపాస్తులు, అనువంశికులను దారపుత్రాదుల కోసం అపుత్రస్య గతినాస్తి. వంశక్షయం వంటి అనేక అనుభవాలు తన ముందు వేలాడుతున్నను, సమాజమే సమస్తమనుకుని జీవితాన్ని సంఘం కోసం వెచ్చించినందుకు ధన్యవాదములు.

నరుడు మెచ్చెనేని నారాయణుడు మెచ్చు
దీనులందు దేవదేవుడుండు
మానవార్చనకు మించి
భువిలోనే లేదురా

అన్న నార్లవారి గీతపద్యం మానవులమైన మనకు కొంత అతిశయం అనిపించినను సందర్భోచిత ఉపమానాన్ని వివరించినందుకు మన్నించగలరు. ప్రతి మనిషికి జనన, మరణాలు ఉంటాయి. జననం ఎంత ధర్మమో మరణమంతా తథ్యం అని మహాకవులన్నట్లు, ఈ రెండింటిమధ్య గడిపిన జీవితకాలాన్ని ఏ సమూహ సమస్యల కోసం, ఏ కుటుంబ సమస్యలనుండి అనేక ఆస్తిపాస్తులవరకు, అనేక సంస్థల పేచీలనుండి, ప్రతి ఇద్దరిమధ్య వ్యక్తిగత పేచీలనుండి, ఎక్కడ సమస్యలు ఉంటే అక్కడ ప్రత్యక్షమయ్యే మంచిస్వభావం కలిగిన కాళిదాసుగారికి ఇకనుండి తన మిగిలిన కాలాన్ని తాను ఎంచుకున్న ఆశయానుసారం గడిపేందుకు సహచరికి కూడా తోడ్పడాలని, ఆ విధంగా శేషజీవితాలను గడిపేందుకు సిద్ధపడతారని ఆశిస్తున్నాను.





**పిన్నమనేని పాములయ్య**
న్యాయవాది
ఉషోదయ కళాపరిషత్ వ్యవస్థాపక అధ్యక్షులు
నటులు, దర్శకులు, రచయిత
సత్తెనపల్లి. సెల్: 9989484950

# విలువలున్న కళాజీవి కాళిదాసు!

**మ**నిషి విలువలతో రాజీ పడకూడదు. విలువలపట్ల స్పష్టమైన అవగాహన కాళిదాసుకుంది. సామర్థ్యాన్ని సత్ఫలితం కోసం వినియోగించే సుగుణవంతుడు కాళిదాసు. నిజాయితీని పాటించే నిబద్ధతగల జీవితం ఆయనది. అది కళారంగంలో కావచ్చు, నిత్యజీవితంలో కావచ్చు. అందుకే కార్యకర్తనుండి కళాకారునిగా ఎదిగి, నాయకత్వ బాధ్యత నిర్వహించగలుగుతున్నాడు. నాకు అత్యంత సన్నిహితుడయ్యాడు. తనపట్ల, తనచుట్టూ ఉన్నవారిపట్ల బాధ్యతలను గుర్తుంచుకొని 'కార్యాచరణ' చేపట్టేవ్యక్తి కాళిదాసు. తనకప్పగించిన పని సజావుగా ప్రణాళికాబద్ధంగా, సమర్ధవంతంగా పూర్తి చేయటం, నిష్ణాతులను గుర్తించి పనిలో భాగస్వాములను చేయటం, మెళుకువలతో కార్యసాధనతో విజయవంతం చేయటం కాళిదాసుకు నిత్యకృత్యం. ఆయన చేపట్టే కార్యక్రమాల నిర్వహణ తీరు మాకెంతో స్ఫూర్తివంతంగా నిలిచాయి. మనుషులను ప్రేమించే మంచి మనసు కాళిదాసుది. నిత్యపలుకరింపు ఆయనకు పరిపాటి. మాకది పులకరింపు కూడా!

జిల్లాలో కళారంగ అభివృద్ధి, కళాసంస్థల మధ్య వారధిగా వుండి 'ప్రజానాట్యమండలి'ద్వారా కళాప్రదర్శనలు తయారు చేయించి, తర్ఫీదు యిప్పించి, ప్రజానాట్యమండలి నాయకత్వబాధ్యత స్వీకరించి ఎందరో కళాకారులకు స్ఫూర్తివంతమయ్యారు. యడ్లపాడు, చిలకలూరిపేట పరిసరప్రాంత కళాకారుల ప్రోది, కళారూపాలసృష్టికి, పరిషత్ ప్రదర్శనలకు ఆయన కృషి, సహకారం

మరువలేనిది. కళారూపాలను ప్రజల్లోకి తీసుకెళ్ళాలనే కాళిదాసు తపన బహుప్రశంసనీయం. స్వయంగా తాను కళాకారుడు. ప్రసిద్ధదర్శకులు, నటులతో కలిసి అనేక నాటిక, నాటకాలలో అనేక పాత్రలు పోషించి మంచి కళాకారునిగా గుర్తింపు పొందారు. రాష్ట్రకళారంగ చరిత్రలో నూతలపాటి కాళిదాసుకు మరువలేని మంచి స్థానముంది.

ధైర్యం శక్తినిస్తుందంటారు. ఆ శక్తి కొన్నింటి ఉద్భవానికి, ఊపిరికి ఊతమౌతుంది. సత్తెనపల్లిలో 'ఉషోదయ కళాపరిత్' ఆధ్వర్యంలో సఫ్దర్ హష్మీ స్ఫూర్తితో వీథినాటికల పోటీలు, ప్రదర్శనలు జరపడానికి కాళిదాసు కారకుడు. కళాపరిషత్ ఏర్పాటు, నిర్వహణలో ముఖ్యభాగస్వామి. పోటీలనుండి వీథినాటికల మహోత్సవాలవైపు నడిపించారు.

వ్యక్తిగతంగానే కాదు, మా కళాసంస్థ బాధ్యులకు, మా కుటుంబానికి, మా కళాకారులకు అత్యంత సన్నిహితం, విడదీయలేని సంబంధం, ఆత్మీయత పంచియిచ్చిన మా మార్గదర్శి 'కాళిదాసు.' మా కార్యక్రమాలన్నీ ఆయన చేతులమీదుగా నడిచాయి. ప్రముఖ కళాకారులు, గుణనిర్ణేతలు, నటులు, దర్శకులు శ్రీ కారుమూరి సీతారామయ్య (పర్చూరు), శ్రీ రాజాతాతయ్య (పాలకొల్లు) లకు ఆత్మబంధువుగా నిలిచి 'ఉషోదయ కళాపరిషత్' కార్యక్రమాలన్నింటిని (వీథినాటికలు, ఏకపాత్రలు, పాటలపోటీల నిర్వహణ) విజయవంతం చేయటంలో ప్రధానపాత్ర కాళిదాసుది. ఆయన ఓ సృజనాత్మక కళాకారుడు – కార్యదీక్షాపరుడు – సమన్వయ నాయకత్వ వ్యవస్థ – చైతన్య రథసారథి. తపన, కార్యాచరణ, నిరంతరకృషితో కళాబంధువైన కాళిదాసు విలువలు, సౌశీల్యంగల కళాజీవి. ఆయనను మనస్ఫూర్తిగా అభినందిస్తున్నాను.





**ఆర్.వి.రాఘవయ్య**
జిల్లా కార్యవర్గ సభ్యులు,
ప్రజానాట్యమండలి, గుంటూరు.
9985875276

# నిర్మాణాత్మక, నిబద్ధతకు సమర్థుడు

**ఆం**ధ్ర ప్రజానాట్యమండలి పునర్నిర్మాణం జరిగిన తర్వాత రాష్ట్రంలో ఆంధ్ర ప్రజానాట్యమండలి కళారూపాలు, అనేక దళాలు నిర్మాణం జరిగింది. మన గుంటూరుజిల్లాలో తాడేపల్లి, ఉండవల్లి, మంగళగిరి, కాజ, కంతేరు, నూతక్కి యడ్లపాడులాంటి ప్రాంతాల్లో అనేకమంది కళాకారులు స్టేజినాటకాలు, అభ్యుదయ నాటికలు ఆడేవారు. ఆ క్రమంలోనే సంఘాన్ని విస్తృతపరిచి మరిన్ని దళాలను తయారుచేయడానికి పనిచేయగల సామర్థ్యంగల కార్యకర్త కోసం జిల్లాపార్టీ ప్రయత్నిస్తున్న సమయంలో యడ్లపాడులో జరుగుల రామారావు, ముత్తవరపు పద్మారావు, నూతలపాటి కాళిదాసు, శంకరరావువంటివారు అంధ్ర ప్రజా నాట్యమండలి ద్వారా ఎన్నో నాటికలు, నాటకాలు ప్రదర్శిస్తుండగా వారిలో నిర్మాణాత్మకంగాను, నిబద్ధతతోను పని చేయగల సమర్థుడు కాళిదాసుగారని గుర్తించిన పార్టీ జిల్లానాయకులు పుతుంబాక వెంకటపతిగారు కాళిదాసుని జిల్లా కేంద్రంలో పనిచేయాలనీ కోరడం, ఆయన ఒప్పుకోవడం వెంటనే కాళిదాసు కన్వీనర్‌గా కన్వీనింగ్ కమిటిని 1985లో ఏర్పాటు చేయడం జరిగింది.

ఆ సందర్భంలో 1986లో తాడేపల్లిలో సుందరయ్యనగర్ ఏర్పాటు కావడం అక్కడ పేదలు ఇళ్లు వేసుకున్నప్పటినుంచి ఆ ప్రాంతంపై ప్రత్యేకదృష్టి పెట్టి అనేక కళారూపాలను తయారుచేయడంలోను, వాటిని నిర్మాణంలో ఇముడ్చు కోవడంలోను కాళిదాసు చేసిన కృషి మరువలేనిది. ఇక్కడే శాంతారావు, దేవి,

జగన్, వివి, పట్టాభి వెంకటరావు, కెఎస్.కుమార్, భానుప్రసాద్, బత్తుల రాజు, కొట్టే శ్రీరాములు, ఉష, గిరిజగార్ల సహకారంతో సుందరయ్యనగర్‌ని కళాకేంద్రంగా తీర్చిదిద్దారు. ఆ కాలంలోనే బత్తుల రాజు నాయకత్వంలో కోలాటం, నృత్యాలు, విచిత్ర వేషాలు, తయారు చేయించారు.

సుందరయ్యనగర్ కేంద్రంగా అనేక కళారూపాలను తయారు చేసి, రాష్ట్రవ్యాప్తంగా ప్రదర్శించడం జరిగింది. ఈ సందర్భంగా జరిగిన సమతా కళాయాత్ర, అక్షర కళాయాత్రలను దిగ్విజయంగా జయప్రదం చేశారు. 'భారతమ్మ ఎక్కడ?', 'ప్రశ్నించండి', 'పూజకు పనికిరాని పువ్వు', 'రెప్పచాటున నిప్పు'లాంటి నిజంలాంటి మహిళా ప్రాధాన్యతగల కథాంశాలతో అనేక వీధినాటికలు ఇక్కడే కాళిదాసుగారి నాయకత్వాన పురుడుపోసుకున్నాయి. అలాగే జిల్లాలో ఇతర దళాలకు కూడా తగిన సూచనలు, సలహాలిస్తూ సంఘాన్ని బలోపేతం చేయడానికి ఎంతో కృషి చేశారు.

ఆంధ్ర ప్రజానాట్యమండలి అభివృద్ధిలో కాళిదాసుశైలి ప్రత్యేకంగా ఉండేది. జిల్లాలో కళాకారులను గుర్తించి వారిని ఉద్యమంలోకి తీసుకురావడానికి వారి వృత్తులనుబట్టి ఆయా గ్రామాలకు వెళ్లేవారు. వారిని కలవడానికి అర్ధరాత్రిళు కూడా లారీలపై ప్రయాణాలు చేసి మారుమూల గ్రామాలకైనా కాలినడకనవెళ్లి కళాకారులతో మాట్లాడి, కుటుంబసభ్యులను ఒప్పించి ఉద్యమంలోకి తీసుకొచ్చిన సందర్భాలు అనేకం. దళంలో పనిచేస్తున్న కళాకారుల ఆర్థికస్థితిగతులను పరిశీలించి, ఆ ప్రాంత ఉద్యమబాధ్యులతో మాట్లాడి ఆ కళాకారులకు కుటుంబాలకు ఆర్థికవనరులు ఏర్పాటు చేయించేవారు.

దళాలు నడుస్తున్నచోట కన్వీనింగ్ కమిటీలను ఏర్పాటుచేసి ఆ కమిటీలతోనే నిరంతరం అంటిపెట్టుకొని, వారి పని పద్ధతులను మెరుగుపరుస్తూ పటిష్టమైన కమిటీలుగా, దళాలుగా తీర్చిదిద్దడంలో ఆయన ప్రత్యేకశ్రద్ధ చూపేవారు. ఈ సందర్భంగానే పాటల శిక్షణాశిబిరాలు గుంటూరు, నంబూరు, కంతేరు, మంగళగిరి ప్రాంతాల్లో పెట్టి కొత్తకళాకారులను తయారుచేయడానికి, ఉద్యమ అవసరాలు తీర్చడానికి ఎంతో తపనపడ్డారు.

అప్పటి వరకు కన్వీనింగ్ కమిటీగా ఉన్న ఆంధ్ర ప్రజానాట్యమండలిని 1994లో చిలకలూరిపేటలో మొదటి మహాసభని జరుపుకుంది. ఈ సందర్భంగా వారంరోజులపాటు పాటలు, డప్పులశిక్షణ, రైతు వీధినాటికలను తయారు చేయడం జరిగింది. ఈ సందర్భంగా ఉద్యమబాధ్యులు ఇంత పెద్దకార్యక్రమాన్ని మనం చేయలేము అని అంటే, కళారూపాల ప్రాధాన్యతను నాయకత్వానికి వివరించి, ఘర్షణపడి మహాసభలను జయప్రదం చేయడం జరిగింది. ఇక్కడ నేర్పిన రైతు నాటిక ఉమ్మడిరాష్ట్రంలో 100కి పైగా ప్రదర్శనలు ఇచ్చిన సందర్భంగా 100 ప్రదర్శనల పండుగను కూడా మన జిల్లాలో నిర్వహించుకున్నాం. ఇక్కడ నేర్చుకున్న డప్పుశిక్షణద్వారానే డప్పువిన్యాసాలు రాష్ట్రవాప్తంగా అనేక దళాలు తయారయ్యాయి. ఈ శిక్షణాశిబిరంలో నేర్చుకున్న కళారూపాలు ఉద్యమానికి ఎంతగానో దోహదపడ్డాయి.

మతసామరస్యం కాపాడాలని ఉండవల్లి సెంటర్లో మనచరిత్ర, పది పాటలు తయారు చేయడం, అవి ఇప్పటికీ రాష్ట్రవ్యాపితంగా అనేక దళాలు పాడడం జరుగుతుంది. ఉద్యమ అవసరాలను దృష్టిలో పెట్టుకొని దళాలు విస్తృత పరచడంలో భాగంగా ఉండవల్లిగ్రామస్తులతో 'మేరా భారత్‌మహాన్', 'కల్లోలభారత్', 'గాంధీ పుట్టినదేశంలో', 'ఈ దేశం ఎటుపోతుందో', 'చేయిచేయి కలపండి' వంటి వీధినాటికలు, మంగళగిరి డివిజన్ కమిటీ ఆధ్వర్యంలో 'అప్పులు బాబోయ్ అప్పులు', 'ధరలండీ ధరలు', 'చరకా తడాఖా', 'కుక్కమూతి పిందెలు', 'ఎలిమెంటరి స్కూల్'వంటి అనేక వీధినాటికలను ప్రజాతంత్ర ఉద్యమానికి అనుసంధానంగా, రాష్ట్ర వీధి నాటకోత్సవాలను ప్రదర్శించడంలో కాళిదాసుగారి పాత్ర కీలకమైనది. నిరంతరం కళాకారులను పర్యవేక్షిస్తూ తగిన సలహాలు, సూచనలిస్తూ కళాకారులు నైపుణ్యాభి వృద్ధికి కృషి చేసేవారు.

**వ్యక్తిగతశ్రద్ధ:** కళాకారులతోను, వారి కుటుంబ సభ్యులతోనూ సత్సంబంధాలను కొనసాగిస్తూ కుటుంబ సమస్యలను పరిష్కరించడానికి, ఎవరికి ఏ అవసరమొచ్చినా నేనున్నానని ముందుండేవారు. అలాగే కళాకారులకు అభ్యుదయ వివాహాలు జరిపించడానికి ఇరుపక్షాల పెద్దలతో మాట్లాడి వారిని ఒప్పించి,

సమన్వయపరిచి పెళ్లిళ్లు చేశారు. అలా చేసినవారిలో నూతక్కి లాజరుగారి కుమార్తె, అంజిరెడ్డి, అలాగే వడ్డేశ్వరంలో అంకమ్మరావు, వెంకటేశ్వర్లుకూడా. నూతక్కి లాజరుతో బుర్రకథ దళం తయారుచేయడంలో కీలకంగా వ్యవహరించారు. దళంలోని అంకమ్మరావు, వెంకటేశ్వర్లుల ఆరోగ్యసమస్యల పరిష్కారానికి కృషి చేశారు.

**నిర్మాణం:** గుంటూరు, సత్తెనపల్లి, చిలకలూరిపేట, నరసరావుపేట, తెనాలి, బాపట్ల, రేపల్లె, వినుకొండ, పొన్నూరు, మంగళగిరి వంటి ప్రాంతాల్లో డివిజన్ కమిటీలను ఏర్పాటుచేసి సంఘ నిర్మాణానికి కృషిచేశారు. కమిటీలను నడపడంలోను, కళాకారులను నిర్మాణాత్మకంగా తయారు చేయడంలోనూ కాళిదాసు చూపిన చొరవ మరువలేనిది. నిర్మొహమాటంగా మాట్లాడడం, నిష్కర్షగా వ్యవహరించడంవల్ల కొంతమంది కళాకారులూ నొచ్చుకున్నా, ఇబ్బందిపడిన సందర్భాలు, తిట్టుకున్న ఘటనలు కోకొల్లలు.

కర్తవ్యనిర్వహణలో ముందుండే కాళిదాసు కళాకారులకు రాజకీయవిద్య అవసరమని గుర్తించి ప్రతి శిక్షణాశిబిరంలోనూ రాజకీయ క్లాస్ చెప్పించడం, కళాకారుల వరకు ప్రత్యేకంగా క్లాస్ నిర్వహించడం చేసేవారు. అలాగే ఆర్థిక అంశాలను ఎప్పటికప్పుడు రికార్డ్ చేసి, ఆడిట్ చేయించేవారు. ఆర్థిక అంశాల్లో తప్పులు జరిగితే ఒప్పుకునేవారు కాదు. ఆరోగ్యం సహకరించకపోయినా నమ్మిన సిద్ధాంతం కోసం ఆటుపోటులను తట్టుకొని ప్రజానాట్యమండలి అభివృద్ధి కోసం, కళాకారుల అభ్యున్నతి కోసం నిరంతరం పరితపించి సంఘాన్ని ముందుకు నడిపించిన కృషీవలుడు మన కాళిదాసుగారు.





**రావెల సాంబశివరావు**
విశ్రాంత రిజిస్ట్రార్,
ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం
సెల్ : 99590 89630

# కళాయోధుడు కాళిదాసు

**య**డ్లపాడు గ్రామంలో ఒక రైతు కుటుంబంలో 1953లో నూతలపాటి వెంకటేశ్వర్లు, వెంకాయమ్మల గృహంలో తెలుగు నాటకరంగంలో ఓ తొలికేక వినిపించింది. అప్పటికి ఎందరెందరో ఆ రంగంలో తొలికేకలు వేసిన వారున్నారు. తన చదువుకు ఎన్నెన్నో అవరోధాలు కలిగి ఆగినా, తన సేవను కళారంగానికి అంకితం చేసిన కళాయోధుడు కాళిదాసు. ఉన్నది ఐదెకరాలే అయినా, తండ్రి తాను జన్మించి ఒక్క సంవత్సరం గడిచీ గడవగానే ఈ లోకాన్ని విడిచివెళ్లినా, తల్లి వెంకాయమ్మ కాళిదాసును అపురూపంగా తీర్చిదిద్దడమే కాకుండా, నిజాయితీగా పెంచాలనే యోచనతో ముందుకు సాగింది. ఆర్థికంగా ఇబ్బందులుకు గురికారాదనే పళ్లబిగువుతో పట్టుదలగా కృషిచేసిన ఆదర్శమహిళ వెంకాయమ్మగారు. కాళిదాసును ఒక ప్రయోజకునిగా తీర్చిదిద్దాలనుకొని, ఆమె వ్యవసాయ కార్మికురాలిగా రూపుదాల్చింది.

కొడుకుని అందలాలెక్కించాలానే ఆశ ఆమెకు లేదు. ఒక మంచిమనిషిగా బ్రతుకుతూ నలుగురికీ తలలో నాలుకగా ఉంటూ, వాళ్లకు ఎన్నడైనా సహాయం అందించగలిగితేచాలు అనే తృప్తి ఆమెది. అయితే గ్రామంలోని ఓ ప్రైవేట్‌మాస్టారి తల్లికి ఈ కుర్రాడి పనిలో ఏదో తేడా కనిపించింది. ఆమె పేరు ఈగమ్మగారు. ఆమె ఆనాడు కాళిదాసుకు అందచేసిన ఓ బోడిపలక కాబోయే కళాకారుని గుండెలో ఎన్ని ఉప్పెనలు రేపిందో...అలా రెండు, మూడేళ్లు గడిచాయి.

ఈగమ్మగారి కుమారుడు భాస్కరరావు మాస్టారి పర్యవేక్షణలో కాళిదాసు చురుకుగా చదువు నేర్వసాగాడు. అటువంటి కుఱ్రవాడికి ఉన్నత పాఠశాల ఎంట్రన్స్ పరీక్షల్లో నెగ్గడం అదెంత పని?

కాళిదాసు పాఠశాల విద్యార్థిగా రూపుదాల్చాడు. ముత్తవరపు హనుమాయమ్మ (ఈశ్వరమ్మ) మేనత్తకు తన కుమారుడు సంచి కాళిదాసుకు ఇవ్వడంతో, చదువుమీద కాళిదాసుకు మోజు పెరిగింది. తాను నూటికి నూరుపాళ్లు విద్యార్థిగానే బ్రతకదలిచాడు. ఇంక "గొడ్లకాడ బుడ్డాడి వేషం" వేయనన్నాడు. ఆ అబ్బాయి కుదురుగా వ్రాసే అక్షరాలు చూసేవాళ్లకు ముచ్చట గొలుపుతున్నాయి. వాటిలోనే ఎన్నెన్నో కళాఖండాలు ప్రతిఫలించసాగాయి.

పాఠశాలఫీజు అప్పట్లో ఐదు రూపాయలు. అయినా వర్షలేమి, అధిక వర్షాలతో జూదం బారినపడిన ఆ ప్రాంత వ్యవసాయదారులకు ఓ ఐదెకరాలు పొలం ఉన్నా, ఐదు రూపాయలు వెనకేయడం గగనమే. అమ్మ అతికష్టంమీద మూడు రూపాయల పావలా ఇచ్చింది స్కూల్‌ఫీజు కోసమని. మన కాళిదాసు ఆ డబ్బుతో ఒక కలం, సిరాబుడ్డి, నోట్‌బుక్స్ కొనుక్కొని తాను ఎన్నేళ్లుగానో కంటున్న కలను సాకారం చేసుకున్నాడు. ఆ విషయం తెలిసి అమ్మ ఉక్రోషం కట్టలు తెంచుకుంది. డబ్బు విలువ ఎరిగిన ఆమె కొడుకుని గట్టిగానే దండించింది. అంటే ఆనాటినుండి మనసులో కలతతో బడిమీద అలక ఏర్పడిందిగాని పాఠశాలతో అనుబంధం ఈ కళాకారునికి ఈనాటికీ తీరిందికాదు.

ఎదిగే కుఱ్రవాని వయస్సు ఆగేది కాదు. కాళిదాసు క్రమంగా యుక్తవయస్సువాడైనాడు. 1971 మార్చి 13న చినకోండ్రుపాడు గ్రామానికి చెందిన విజయలక్ష్మి అనే జయమ్మతో వివాహం జరిగింది. వారిదీ రాజకీయాలు తెలిసిన కుటుంబమే కనుక దాంపత్యం అనుకూలంగా సాగింది. గ్రామంలో కోనేటి బ్రహ్మయ్య అనే కామ్రేడ్‌ని అన్యాయంగా పొడిచి చంపిన ఘటనతో ఆయన స్మృత్యర్థం ఏటా మార్చి 18న సాంస్కృతిక కార్యక్రమాలు జరిపేవాళ్ళు. ఆ వేడుకల్లో పాల్గొనడం, యువజన సంఘాల ఏర్పాటు ఈ యువకునికి నిత్యకృత్యాలు కాసాగాయి.

మెల్లగా యువనాయకునిగా పేరుప్రఖ్యాతలు గడిస్తున్నాడు. 1977 నాటి తుఫాన్ తాకిడి, అప్పటి పార్టీ ఆందోళన కార్యక్రమాల్లో చురుకుగా పాల్గొనడం కాళిదాసుకు యెనలేని గుర్తింపును తెచ్చిపెట్టాయి. 1979 నాటికి ఆయన మార్క్సిస్టు పార్టీ సభ్యులయ్యారు. ఆ ప్రాంతాల్లో ఏ కార్యక్రమాలు జరిగినా ముందుండేవాడు. భయానికి దూరంగా జరిగిన ఆదర్శయువకునిగా రూపుదాల్చాడు. 1980 నాటికి యువజన సంఘానికి డివిజన్ అధ్యక్షుడయ్యాడు. పుతుంబాక వెంకటపతిగారు, పోపూరి రామారావుగారి అండదండలు దండిగా లభించసాగాయి. 1985లో ప్రజానాట్యమండలి జిల్లాకన్వీనర్‌గా నియమితులయ్యారు. సంఘకార్యకమాలు హోరు జోరుగా సాగించారు.

కాళిదాసు స్నేహం కేవలం తన పార్టీవారికే పరిమితం కాలేదు. అది డాక్టర్ సదాశివరావు దంపతుల చుట్టూ అల్లుకుంది. 11, 12 ఏళ్ల వయస్సులో తను జబ్బుతో వచ్చినప్పుడు డాక్టర్ సదాశివరావుగారితో లభించిన చనువు జీవితాంతం చిగురులు తొడుగుతూనే ఉంది. తమ వైద్యశాలకు ప్రజావైద్యశాల అని పేరుపెట్టడం, పేదలకు ఉచితంగా సేవచేయడం ధ్యేయంగా పెట్టుకున్న డాక్టర్‌గారి జీవితం కాళిదాసును చిన్ననాటినుండే ఆకర్షించసాగింది. తాను రాజకీయరంగంలో పేదలపార్టీపక్షాన నిలిచినందున ఏ పేదవానికి సహాయం కావాల్సివచ్చినా చిలకలూరిపేటవైపువెళ్లే బస్ ఎక్కకుండా రోగిని గుంటూరులోని ప్రజావైద్యశాలకు చేర్చేవాడు. అందులో డబ్బులు చెల్లించగలిగేవాళ్లుండేవాళ్ళు. రెక్కాడితేకాని డొక్కాడనివాళ్లూ ఉండేవాళ్ళు. అందరినీ సమానంగా చూసేవాడు అక్కడి సదాశివుడు.

మా విశ్వవిద్యాలయ ఉద్యోగులసంఘం నాయకులు హరిబాబుకు ఈ కళాపరిషత్‌ల సలహాదారుని సన్నిహితసంబంధం కవిరాజు త్రిపురనేని శతజయంతి ఉత్సవాల్లో రూపుదాల్చింది. ప్రక్క ఊరి ఆలోకం పెద్దబ్బయ్య, కాళిదాసు, యడ్లపాడుకు చెందిన ఒకే పాఠశాలలో చదువుకోవడం, దాని పునరుద్ధరణ కార్యక్రమాలు, డాక్టర్ సదాశివరావుగారి వైద్యశాల రజతోత్సవ వేడుకలు, ఆయన షష్టిపూర్తి కార్యక్రమాల్లో మా పరిచయం గాఢం కాసాగింది.

లింగారావుపాలెం గ్రామానికి చెందిన ఆలోకం పెద్దబ్బయ్యద్వారా పరిచయం కాసాగారు. వారిలో ప్రధానంగా చెప్పుకోదగినవారు నంబూరు నాగేశ్వరరావు. పార్టీ రాజకీయ పాఠశాలల్లో యువతకు పాఠాలు నేర్పినవారు. ఆయన గుంటూరు వచ్చినప్పుడల్లా ఇరువురం కలిసి కబుర్లు చెప్పుకుంటూ ఉండేవాళ్ళం. ఆ కబుర్లలో కనీసం ఒక్కసారైనా కాళిదాసు తళుక్కుమనేవాడు. యడ్లపాడు, తక్కెళ్లపాడు గ్రామాలమధ్య సాంస్కృతికరంగంలో మైత్రీబంధం గాఢంగా పెనవేసుకోవడానికి కారణం జరుగుల రామారావుగారి వలన. కనుక తాను డాక్టర్ సదాశివరావుగారికి మరింత దగ్గరయ్యానని చెప్తారు కాళిదాసు. లలితకళానికేతన్ పతాకంపై డాక్టర్ కాసరనేని సదాశివరావు కళాపరిషత్ ప్రదర్శనలకు హోదానెరగని అంబాసిడర్ ఈ సుప్రసిద్ధ కళాకారుడు.

1994లో ప్రజానాట్య మండలి జిల్లాకార్యదర్శిగా ఎన్నికైన కాళిదాసు, ప్రధానమైన కళాసేవ కొనసాగింపు గుర్తుగా "పంజా" నుండి "హాలికులు సేమమా" వరకు అనేక ప్రదర్శనలు నిర్వహించారు. 1987-88లో గుంటూరుకి మకాం మార్చిన తర్వాత నాటకాల్లో వేషాలు వేయడం మానేసి, దర్శకత్వ బాధ్యతలు చేపట్టారు. అక్షరదీప్తి-జన విజ్ఞానయాత్రలు, కళాయాత్రలు, జిల్లా బస్సుయాత్రల్లో అంతా తానై వ్యవహరించారు.

"సారా సంహారం", "సారా సర్కారు" ఈయనకు మోయలేని కీర్తి ప్రతిష్ఠల్ని ఆర్జించి పెట్టాయి. UNICEF తరుపున ప్రదర్శించిన లఘు కళారూపాల్లో ప్రధానపాత్ర పోషించారు. గుంటూరులోని డాక్టర్ కాసరనేని సదాశివరావు కళాపరిషత్‌కు సలహాదారుగా సేవలందిస్తున్నారు. డాక్టర్ సదాశివరావుగారి శతజయంతి సందర్భంగా కళాభిమాని ముప్పా అంకమ్మరావుగారితో కలిసి విశేష సేవలందించాడు.

6వ తరగతితో చదువు చాలించిన కాళిదాసుకు ఇదంతా ఎలా సాధ్య పడింది అనే ప్రశ్న ఎదురైతే, సమాధానం కొరకు వేధిస్తే, కాళికాదేవి చూపెట్టిన రెండు పాత్రల్ని గుటుక్కున ఖాళీచేసిన కాళిదాసు చటుక్కున గుర్తుకురాకమానదు.





**డా॥ వి. ప్రగతిపవన్**
హోమియో డాక్టర్,
గుంటూరు.
9491185045

# క్రమశిక్షణ కలిగిన స్నేహశీలి

**నూ**తలపాటి కాళిదాసుగారితో నాకు ఉన్న పరిచయం గురించి చెప్పాలంటే నా కుటుంబం గురించి, పార్టీకి మా కుటుంబానికి ఉన్న పరిచయం చెప్పాలి.

మా నాన్న వి. ఏడుకొండలుగారు విద్యార్థిదశనుండి ఎస్ఎఫ్ఐలో, తర్వాత మార్క్సిస్టు పార్టీలో ఉండేవారు. మా అమ్మ రాజేశ్వరిని ఆదర్శవివాహం చేసుకున్నారు. తర్వాత వాళ్ళిద్దరి జీవితం సిపిఎం పార్టీతోనే కొనసాగింది. ఉద్యోగరీత్యా మంచిర్యాల లక్సెట్టిపేట తర్వాత గుంటూరు వచ్చారు. మా నాన్న ఉద్యోగసంఘాల్లో, మా అమ్మ మహిళాసంఘంలో మరియు పార్టీ కార్యక్రమాల్లో చురుగ్గా పాల్గొనేవారు.

మేము మల్లవరం అనే గ్రామంలో ఉండేవాళ్లం. ఆ గ్రామంలో మా అమ్మా, నాన్న అనేక పార్టీకార్యక్రమాలను నిర్వహించేవాళ్లు. అందులో భాగంగా ఒకసారి ప్రజానాట్యమండలి ఆధ్వర్యంలో ఒక నాటకప్రదర్శన నిర్వహించడం జరిగింది. అప్పుడు మొదటిసారి నాకు కాళిదాసుగారు పరిచయం అయ్యారు. కార్యక్రమానికి వచ్చిన కళాకారులకు మా ఇంట్లోనే వసతి ఏర్పాటు చేయడం జరిగింది. ఎంతో చురుగ్గా ఉంటూ, అందరినీ కలుపుకుపోతూ ఆ నాటకప్రదర్శన విజయవంతం కావడంలో కాళిదాసుగారు ముఖ్యపాత్ర పోషించారు. అదేవిధంగా కాళిదాసుగారు

యడ్లపాడులో ఉన్నప్పుడు అక్కడ నిర్వహించిన కళారూపాలకు కూడా మేము హాజరయ్యేవాళ్ళం.

మా చిన్నతనంలో ఎప్పుడైనా స్కూల్‌కి సెలవులు వచ్చినప్పుడు అమ్మ కార్యక్రమాలు ఏమైనా ఉంటే మమ్మల్ని కూడా పార్టీ ఆఫీసుకి తీసుకువెళ్లేవారు. అప్పుడు అక్కడ ఉన్న కామ్రేడ్స్ పలకరింపులు, వారి ఆప్యాయతలు మాకు కుటుంబ వాతావరణాన్ని తలపించేవి. అందులో కాళిదాసుగారు ఒకరు. అక్కడ మేము పార్టీ జెండాలమధ్య, ప్రజానాట్యమండలి డప్పులతో ఆడుకుంటూ ఉండేవాళ్ళం. అమ్మ పార్టీ కార్యక్రమాలు పూర్తి చేసుకొని ఇంటికి తీసుకువెళ్లేవారు. మిగిలిన పిల్లలకు సెలవులకు అమ్మమ్మవాళ్ళ ఇంట్లో జ్ఞాపకాలు ఉంటే మాకు పార్టీ ఆఫీసుల్లో కామ్రేడ్లతో, ఎర్రజెండాలతో అనుబంధాలు, అనుభవాలు ఉన్నాయి. అలాంటి పరిచయాల్లో కాళిదాసుగారు ఒకరు.

పార్టీలో ఏ కార్యక్రమం జరిగినా ప్రజానాట్యమండలి డప్పు మోగాలి, పాటలు, కాళిదాసుగారు ఉండాల్సిందే అన్నట్లుగా అనిపించేది మాకు. అందరితో కలిసిపోవడం అందరిని కలుపుకు పోవడం నేను కాళిదాసుగారిలో గమనించిన లక్షణం. కేవలం తన పని తాను చూసుకోకుండా కార్యక్రమం విజయవంతం అయ్యేవరకు పూర్తిగా బాధ్యత తీసుకునేవారు.

నేను ఇంటర్‌కి వచ్చిన తర్వాత ఎస్ఎఫ్ఐ గుంటూరు డివిజన్‌లో పని చేశాను. అప్పటికి కాళిదాసుగారు యడ్లపాడు నుండి పార్టీకార్యక్రమాల నిమిత్తం గుంటూరుటౌన్ పార్టీ ఆఫీసులో ఉండేవారు. నూతలపాటి కాళిదాసుగారు పార్టీ సభ్యులతో మెలిగే విధానంగాని, ముక్కుసూటిగా మాట్లాడే విధానం, పార్టీలో ఒప్పుకున్న కార్యక్రమాన్ని బాధ్యతగా నిబద్ధతగా చివరివరకు నిర్వహించి విజయవంతం చేయడం ఆదర్శంగా ఉండేవి. అంతేకాకుండా కేవలం ప్రజానాట్య మండలి కాకుండా ఇతర ప్రజాసంఘాలతో కూడా కార్యక్రమాల గురించి చర్చించడం, తనకు అనిపించిన విషయాన్ని కచ్చితంగా వ్యక్తపరచడం, సలహాలు ఇవ్వడం నేను కాళిదాసుగారిలో గమనించాను.

ఎస్ఎఫ్ఐ విద్యార్థులను ఆప్యాయంగా పలకరించడం ఎవరు కనిపించినా కుశలప్రశ్నలు, భోజనం చేశారా అని అడగడం నాకు మంచిగా అనిపించేవి. అదే కాకుండా ఎస్ఎఫ్ఐ విద్యార్థుల్లో కళాకారులను గుర్తించి ప్రజానాట్యమండలి ద్వారా వాళ్ళకి డప్పులశిక్షణ, పాటలు పాడటం, నాటికలు శిక్షణ ఇవ్వడం అతను వ్యక్తిగతంగానే కాకుండా పార్టీ అభివృద్ధికి ఎంత నిబద్ధత కలిగిన నాయకుడో తెలియజేస్తుంది. నా ఉద్దేశం ప్రకారం కమ్యూనిస్టుగా చివరి వరకు జీవించాలి అంటే పార్టీ మీద ఇష్టం ఉంటే సరిపోదు, సిద్ధాంతం మీద అవగాహన, గట్టి నమ్మకం, ఆచరణలో అలుపెరుగని పట్టుదల, ఆలోచన ఉండాలి. అవి అన్నీ కాళిదాసుగారు కలిగి ఉన్నారు అనేది నా అభిప్రాయం. నూతలపాటి కాళిదాసుగారితో నాకున్న అనుభవాలు చెప్పడం అంటే నా వరకు పార్టీతో ఉన్న కొన్ని అనుభవాలు చెప్పడమే. ఎందుకంటే అతని జీవితంలో పార్టీ, వ్యక్తిగతం అనేది ఏమీలేదు. అంతా పార్టీ ప్రయాణమే.






బుర్రకథ పితామహుడు 'పద్మశ్రీ' నాజర్ 7వ వర్ధంతి సందర్భంగా లాయర్ వై. కోటేశ్వరరావు, ఆంధ్రప్రదేశ్ ప్రజానాట్యమండలి రాష్ట్రనాయకులు కామ్రేడ్ ఘని, మాట్లాడుతున్న నూతలపాటి కాళిదాసు, అభ్యుదయ రచయితల సంఘం నాయకులు పెనుగొండ లక్ష్మీనారాయణగారు తదితరులు



**కాపు శ్రీనివాస్**
సోషల్ మీడియా కార్యకర్త
**T. వినోద** (UTF) టీచర్
9490098654

# గుర్తింపు కోరని నాయకుడు

**కా**ళిదాసుతో మొదటి పరిచయం పెదనందిపాడులో జరిగింది. 1985లో సాహిత్య పక్షోత్సవాల సందర్భంగా ఆయన తోపుడుబండిపై పుస్తకాలు పెట్టుకుని వెళ్తున్నారు. నేను పెదనందిపాడు ఆర్ట్స్ కాలేజీ నుండి వెళ్తూ పుస్తకాలు చూసి కొన్ని ఎంచుకుని కొనుగోలు చేశాను. నేను ఎంపిక చేసిన పుస్తకాలు చూసి 'నువ్వు ఎవరు?' అని అడిగాడు. 'నేను పెదనందిపాడు ఆర్ట్స్ కాలేజీలో ఎస్ఎఫ్ఐ కార్యకర్తగా పని చేస్తున్నాను' అని చెప్పాను. ఆ విధంగా పుస్తకాలు మా ఇద్దరి పరిచయానికి వారధిగా నిలిచాయి. తర్వాత నేను ఉద్యమ అవసరాలరీత్యా గుంటూరు సిపిఎం జిల్లా పార్టీ ఆఫీసు కార్యదర్శిగా వచ్చాను. కాళిదాసు గుంటూరు వచ్చినప్పుడల్లా నాతో మాట్లాడిన తర్వాతనే వెళ్లేవాడు. ఆ విధంగా మా పరిచయం స్నేహంగా మారింది.

1992 నుండి చిలకలూరిపేట ప్రాంతంలో యువజనోద్యమంలో పని చేయటానికి వెళ్లేసమయానికి నాకు ఆ ప్రాంతంలో పోపూరి రామారావుగారితో పాటు పరిచయం ఉన్న రెండో వ్యక్తి కాళిదాసు మాత్రమే. యడ్లపాడులో కాళిదాసు గారి ఇల్లు కేంద్రంగా యడ్లపాడు, చుట్టుపక్కల గ్రామాల్లో యువజన కార్యకలాపాల నిర్వహణకు నాకు ఎంతో సహకరించారు. ఆ కాలంలోనే యడ్లపాడు, లింగారావుపాలెం, నాదెండ్లల్లో ప్రతి సంక్రాంతికీ గ్రామీణ సాంస్కృతిక ఉత్సవాలు పెద్దఎత్తున జరిగేవి. ఈ కార్యక్రమాల సందర్భంగా ఎంతో మందిని ఆయా గ్రామాల్లోని యువజనులను పరిచయం చేశారు. ఆ గ్రామీణ సాంస్కృతికోత్సవాల

సందర్భంగా ఆయా గ్రామాల్లో ప్రతి ఏటా ఏదో ఒక పేరున్న నాటిక, నాటకం ప్రదర్శన జరిపేవాళ్లం. అందుకు కావల్సిన నాటిక/నాటకం బృందాలను గుర్తించటంలో వారిని సంప్రదించి ఒప్పించటంలో కాళిదాసుదే కీలకపాత్ర.

యడ్లపాడు వెళ్తే ఎక్కడ ఉండాలి అని ఆలోచించే అవసరం, అవకాశం రాలేదు. నేరుగా సొంత ఇంటికి వెళ్లినట్లే కాళిదాసు ఇంటికి వెళ్లేవాడిని. అక్కడ అప్పటికే సాంస్కృతికరంగంలో తనదైన ముద్ర వేసుకున్న కళాకారులు నిత్యం ఇంటికి వస్తూ పోతూ ఉండేవారు. ఆ విధంగా నాకు వారితో ఏర్పడిన పరిచయం కొందరితో స్నేహంగా మారి నేటికీ కొనసాగుతోంది. వయసురీత్యా నాకంటే పెద్దవాడు అయినప్పటికీ మా ఇద్దరి మధ్య జరిగే చర్చల్లో ఏనాడూ ఆ పెద్దరికం ప్రదర్శించేవాడు కాదు. అప్పుడప్పుడూ నన్నే పెద్దవాడిని చేసి మాట్లాడటం, ప్రేమతో పోట్లాడటం వంటివి చేసేవాడు.

తర్వాత ఆయన జిల్లా ప్రజానాట్యమండలి బాధ్యతలు చేపట్టాలన్న నిర్ణయం జరిగింది. ఈ నిర్ణయంలో భాగంగా జిల్లా ప్రజానాట్యమండలి మహాసభలు, శిక్షణాశిబిరం చిలకలూరిపేటలో జరిగాయి. ఆ శిక్షణాశిబిరం ప్రణాళిక రూపకల్పన, ఏర్పాట్లు, నిర్వహణలో ఆయనతోపాటు మరింత సన్నిహితంగా పనిచేసే అవకాశం దక్కింది. వివిధ రకాలైన వ్యక్తులు, వివిధ సామర్థ్యాలు కలిగిన వ్యక్తులు అందరినీ ఒకచోట జమచేసి ఓ ఉమ్మడి లక్ష్యం కోసం పని చేయించటంలో, ఫలితాలు సాధించటంలో కాళిదాసు నైపుణ్యం, ప్రతిభ సామర్థ్యం నాకు ఆ శిబిరం నిర్వహణతోనే అర్థం అయ్యాయి. నాటినుండీ నాలుగైదేళ్ల క్రితం వరకూ రాష్ట్రంలో ఏదైనా పెద్దశిబిరం, శిక్షణాకార్యక్రమం నిర్వహించాలంటే పార్టీ ఆయనకు బాధ్యత అప్పగించకుండా నిర్వహించిన సందర్భాలు లేవని చెప్పొచ్చు.

అక్షర కళాయాత్రకు నాయకత్వం వహించినవారిలో ఒకరిగా కాళిదాసు నెల్లూరు నుండి ఇచ్ఛాపురం వరకూ ఆ యాత్రతో కొనసాగారు. వివిధ ప్రాంతాల్లో కళారంగంలో పని చేస్తున్న పలువురు ప్రముఖులతో ఈ సందర్భంగా ఏర్పడిన సంబంధాలు ఆయన నేటికీ కొనసాగిస్తున్నారు. ఎంత గొప్ప కార్యక్రమం అయినా స్టేజీపై తానుండాలన్న తలంపులేని మనిషి. ఇటువంటి లక్షణాలున్న వ్యక్తులు నేడు అరుదుగా కనిపిస్తారు.

చిలకలూరిపేటలో జరిగిన ప్రజానాట్యమండలి శిక్షణాశిబిరం, మహాసభల తర్వాత ప్రజానాట్యమండలి కార్యదర్శిగా కాళిదాసు మకాం యడ్లపాడునుండి గుంటూరుకు మార్చాడు. అప్పటినుండీ గుంటూరు కేంద్రంగా మా స్నేహం మరో రెండున్నర దశాబ్దాలు కొనసాగింది. కాలవైచిత్రి అంటే ఇదేనేమో! నేను గుంటూరు ఆఫీసు కేంద్రంగా నివాసం ఉన్నప్పుడు కాళిదాసు గుంటూరు వస్తే అన్ని పనులూ అయ్యాక నన్ను కలవకుండా వెళ్లేవాడుకాదు. అదే విధంగా ఆయన గుంటూరుకు నివాసం మార్చిన తర్వాత నేను యువజనోద్యమం పనుల మీదగానీ, పార్టీ పనులమీదగానీ గుంటూరు వచ్చినప్పుడల్లా ఆయన ఉంటే కలవకుండా వెళ్లేవాడిని కాదు. ఒక ప్రాంతంలో పనిచేసి రావటం, ఒకే ప్రాంతానికి చెందినవాళ్లమే కావటం, ఒకే ఆశయం కోసం పని చేస్తున్నవాళ్లం కావటంవల్లనే ఈ సాన్నిహిత్యం సాధ్యమైంది. దీర్ఘకాలం నిలబడింది. నేటికీ కొనసాగుతోంది. యడ్లపాడులో వాళ్ల ఇల్లు నాకు నివాసంగా ఉన్నట్లే గుంటూరులో కూడా ఆయన ఇల్లు నాకు నివాసం అయ్యింది.

చిలకలూరిపేటలో భారత ప్రజాతంత్ర యువజన మహాసభ జరపాలని నిర్ణయం జరిగేనాటికి నాకు ఇంకా స్థానికంగా అంత గట్టి పరిచయాలు ఏర్పడలేదు. ఆ ప్రాంతానికి చెందినవాడు, ఆ ప్రాంతంలో పని చేసినవాడు కావటంతో నా కోరికమేరకు జిల్లా పార్టీ నిర్ణయం మేరకు దాదాపు నెల రోజులు పేటలోనే మకాం వేసి మహాసభ జయప్రదం కావటంలో కీలక సహకారం అందించాడు. ఇంకా చెప్పాలంటే ఆయన సహకారం, జోక్యం, చొరవ లేకపోతే ఆ మహాసభ అంత ఘనంగా జరిగేది కాదు. ఆ మహాసభ అనేక విధాలుగా జిల్లా యువజన మహాసభల్లో గుర్తింపు పొందిన మహాసభగా నిలిచిపోతుంది.

పాలపర్రులో రాష్ట్ర ప్రజానాట్యమండలి శిక్షణాశిబిరం ఐదురోజులపాటు జరిగింది. తాటాకు పందిళ్లల్లో బోధన ఈ శిబిరంలో ఓ ప్రత్యేకత. పాలపర్రుకు గుంటూరునుండి నేరుగా రవాణా సదుపాయం లేదు. వివిధ ప్రాంతాలనుండి వచ్చేవారు గుంటూరు వరకూ వచ్చినా అక్కడ నుండి రెండు బస్సులు మారి రావటం కాలయాపనతో కూడుకున్న పని. పైగా పెదనందిపాడు నుండి చిలకలూరిపేట వెళ్లే బస్సులు ఆ రోజుల్లో పరిమితంగానే తిరిగేవి. ఈ పరిస్థితుల్లో

శిబిరానికి వచ్చేవారి ప్రయాణ ఏర్పాట్లు ఎలాగా అని మధనపడుతున్నవేళ కాళిదాసు ఓ పరిష్కారంతో మా ముందు హాజరయ్యాడు. శిక్షణాశిబిరానికి వచ్చేవారిని నేరుగా గుంటూరు రైల్వేస్టేషన్నుండి లారీలో ఎక్కించుకుని పాలపాడు తీసుకురావటం అన్నది ఆ పరిష్కారం. శిబిరానికి వస్తున్నవారిలో అప్పటికే రాష్ట్రస్థాయి గుర్తింపు కలిగిన కళాకారులున్నారు. అయినా అందరినీ ఒప్పించి తన ఆలోచన అమలు చేశాడు. ఇటువంటి వినూత్న ఆలోచనలు, ఆయా సందర్భాలు, మనకున్న పరిమితులనుండే తలెత్తేవి. సందర్భానికి తగ్గట్టుగా చిట్కా పరిష్కారాలు కనుక్కోవటంలో ఆయనది అనుభవం కలిగిన బుర్ర.

క్షేత్రస్థాయి పనిలో ఎంత వినూత్నంగా ఆలోచించి ఎంత కష్టపడతాడో అంతే ముక్కుసూటి వ్యవహారం కలిగిన మనిషి. తప్పు జరిగినా, జరిగినట్లు తన దృష్టికి వచ్చినా ఎవ్వరినీ ఉపేక్షించేవాడుకాదు. మన అనుకుంటే వాళ్లకు ఏ ఇబ్బంది వచ్చినా చివరికంటా అండగా ఉండటం ఆయనకు వయోబేధంతో నిమిత్తం లేకుండా ఎంతో మందిని ఆత్మీయులను చేసింది.

తానున్న చోటుని ఎంతో మంది యువకార్యకర్తలకు కేంద్రంగా మారుస్తాడు. ఆయన ఇంట్లో ఉన్నా లేకపోయినా ఇంటికి వెళ్లి ఉండేంత చనువు అవకాశం ఆయన పంచే ఆత్మీయతతోనే వచ్చేవి. నైపుణ్యం కలిగిన యువకులను గుర్తించి వారిని అభివృద్ధి చేయటంలో ఎన్ని అవాంతరాలు ఎదురైనా వెనుదిరగక ప్రయత్నం చేస్తాడు. పూర్తి శక్తిసామర్థ్యాలు వెచ్చిస్తాడు. అవసరం అయితే అటువంటి యువకులకు ఉన్న వ్యక్తిగత సమస్యలు కూడా తన వ్యక్తిగత సమస్యలుగా భావించి భుజాన వేసుకుంటాడు. ఏదైనా పని విషయంలో సందేహం వచ్చినప్పుడు తన ఆలోచన, తనపని సరైనదా కాదా అని చర్చించి ఓ నిర్ణయానికి రావటం ఆయనకున్న ప్రత్యేక లక్షణాల్లో ఒకటి. నచ్చని విషయాలను మొఖమాటం లేకుండా కుండబద్దలు కొట్టినట్లు చెప్పగలగటం ఆయనకున్న మరో ప్రత్యేకత. ఈ లక్షణాలు అందరికీ ప్రియమైనవి కావు కనుక కొంతమందిని ఆయనకు దూరం చేశాయి.

కాళిదాసు, నేను, కొండూరి వీరయ్య ఓ మిత్రత్రయం. అప్పట్లో జిల్లా పార్టీ కార్యదర్శిగా పని చేసిన సీనియర్ కమ్యూనిస్టు నాయకుడు త్యాగశీలి సింహాద్రి శివారెడ్డి అందరికీ ఆత్మీయులు, ఆదర్శప్రాయులు. ఆయన మా ముగ్గురినీ

త్రిమూర్తులు అని పిలిచేవారు. కాళిదాసుకి మహేశ్వరుడు అని పేరు పెట్టారు. ముగ్గరమూ ఒకే సమయంలో ఒకే చోట కనిపిస్తే చాలు...'ఈ రోజు మీ పంచాయితీ ఏ విషయం మీదా...' అని నవ్వుతూ అడిగేవారు శివారెడ్డిగారు. మన కాళిదాసుకు కూడా మహేశ్వరుడికి ఉన్నంత కోపం, ప్రేమ ఉండేవి. మేం ముగ్గరం కలిస్తే ఏదో ఒక అంశంపై గంటలకొద్దీ అర్ధరాత్రుళ్లవరకూ వాదోపవాదాలు, చర్చోపచర్చలు నడిపిన రోజులు, చర్చించి ఏకాభిప్రాయానికి వచ్చిన అంశాలు, విభేదించిన అంశాలు నేటికీ గుర్తున్నాయి. ఈ క్రమంలో ఎన్నో విషయాలు తెలుసుకోవడానికి ఈ చర్చలు, వాదోపవాదాలు ఉపయోగపడ్డాయి. ఎన్నో మంచి కార్యక్రమాలకు, గొప్ప సమన్వయానికీ మా ఈ మిత్రత్రయం సమావేశాలు వేదికలయ్యాయి.

మానవసంబంధాల విలువ తెలిసిన మనిషి. బంధువులు కానీ పార్టీ సహచరులకు గానీ ఆయన ఓ పెద్ద దిక్కు. అందరితోనూ ఎంతో ఓపికగా దీర్ఘకాలం సంబంధాలు కొనసాగిస్తూ వస్తున్నాడు. వాళ్లల్లో ఎవరికి ఏ చిన్న ఇబ్బంది వచ్చినా ఓ పెద్దదిక్కుగా ఆయన దగ్గరకు రావటం, ఎంత మంది ఎన్ని రకాల సమస్యలతో వచ్చినా వచ్చినవాళ్లు నిరాశ పడుకుండా, నీరసపడకుండా చేదోడువాదోడుగా నిలవటం ఆయనకు మాత్రమే సాధ్యమైన విద్య. కొత్త కార్యకర్తలైనా, పాతవాళ్లయినా, గతంలో కలిసి పని చేసిన వారెవ్వరైనా అందరూ ఆయనకు కుటుంబ సభ్యులే. వాళ్లకు కూడా అటువంటి స్వేచ్ఛ ఇవ్వటం ఆయన మానవసంబంధాలకు ఇచ్చే విలువ గురించి తెలియచేసే అంశం.

కాళిదాసులో ఉన్న మరో ప్రత్యేకత ఏమిటంటే ఆయన నమ్మిన రాజకీయాలు. తనతో కలిసి పని చేసినవారితో ఎప్పుడూ రాజకీయాలు, దేశంలో జరుగుతున్న మార్పులు, పార్టీ పరిస్థితులు, కార్యకర్తల సాధకబాధకాలు పంచుకుంటూ ఉండేవాడు. పార్టీ కార్యాలయంలో వాళ్లు ఉండే చిన్నగది ముందు విశాలమైన ఆవరణ ఉండేది. రాత్రిపూట భోజనాలయ్యాక ఆఫీసులో ఉండే యువకులు, విద్యార్థులు లేదా ఇతర ప్రాంతాలనుండి వచ్చి తాత్కాలికంగా ఆఫీసులో ఉండేవారితో ఇష్టాగోష్టి నడుస్తూ ఉండేది. ఇక త్రిమూర్తులుగా ఉన్న మేము ముగ్గరం కలిస్తే రాత్రంతా కనీసం రెండుసార్లయినా జయమ్మ కాఫీ లేదా టీ

పెట్టి ఇవ్వాల్సి వచ్చేది. ఆఫీసులో ఉండే విద్యార్థినాయకులు, ఏమి చదువుతున్నారో గమనిస్తూ వారిని పర్యవేక్షిస్తూ ఉండేవాడు. వాళ్లకు ఏ చిన్నసమస్య వచ్చినా ఆ దంపతులు తమ సమస్యగానే భావించేవారు.

కాళిదాసు దగ్గర ఉన్న ప్రత్యేకతలలో మరొకటి ఆసుపత్రుల్లో ఉన్న పరిచయాలు. గుంటూరు ప్రభుత్వ జనరల్ ఆసుపత్రిలో చికిత్స కోసం అప్పట్లో ఏలూరు జూట్ మిల్లు కార్మికులు మొదలు రాష్ట్రంలోని పలు ప్రాంతాల నుండి కార్మికులు సాధారణ వ్యక్తులూ వస్తూనే ఉంటారు. వాళ్లల్లో ఎక్కువమంది వివిధ జిల్లాల్లోని పార్టీ, ప్రజాసంఘాలద్వారా గుంటూరు జిల్లా పార్టీకి కబురు తీసుకొస్తే అర్ధరాత్రి, అపరాత్రి అయినా కాదనకుండా వాళ్లను తీసుకుని గవర్నమెంట్ ఆసుప్రతికి వెళ్లేవాడు. పేషెంట్ అత్యవసర పరిస్థితినిబట్టి సంబంధిత విభాగంలోని డ్యూటీ డాక్టర్‌తో నేరుగా వెళ్లి మాట్లాడి ఒప్పించి తన వెంట వచ్చిన పేషెంట్‌ను చూశాకనే వదిలేవాడు. ప్రైవేటు ఆసుపత్రుల్లో కూడా ఆయనకున్న పరిచయాలు అనేకం. గుంటూరులో కళాధర్‌గారు ప్రజావైద్యశాల నడిపినంతకాలం ఎప్పుడు కావాలంటే అప్పుడు ఫోన్‌కూడా చేయకుండా వాలిపోయేవాడు. తన వెంటవచ్చిన పేషెంట్లను చూపించి వచ్చేవాడు.

కాళిదాసు ఈ విధంగా పని చేయగలగటంలో ఆయన జీవితసహచరి, అందరికీ జయమ్మ ఆంటీగా పరిచయం ఉన్న విజయలక్ష్మి సహాయ సహకారాలు ఎంతో ముఖ్యమైనపాత్ర పోషించారు. ఆయన బట్టలు మల్లెపువ్వుల్లాగా తెల్లగా సిద్ధంచేసే జయమ్మ మనసు ఇంటికి వచ్చినవాళ్లందరినీ సొంతబిడ్డల్లా చూసుకోవటంలో కూడా మల్లెపువ్వే. పార్టీ కార్యకర్తలనే కాదు. కాళిదాసుతో ఆసుపత్రి పనికి వచ్చినవారికి కూడా ఆ ఇల్లు సొంత ఇల్లే. వాళ్లు గుంటూరులో ఉన్న కాలంలో మొదట్లో బ్రాడీపేట రెండోలైను పన్నెండో అడ్డరోడ్డులో ఉండేవారు. సింహాద్రి శివారెడ్డిగారు కూడా గుంటూరు కేంద్రంగా పని చేయటం ప్రారంభించిన తర్వాత అదే కాంప్లెక్స్‌లో ఇల్లు అద్దెకు తీసుకున్నారు. అద్దె ఇంట్లో ఉన్నాను అన్న భావన ఆయనకు ఎప్పుడూ కలగకుండా చూసుకున్నారు జయమ్మ. వయోభారంతో ఉన్న పార్టీ నాయకులను తల్లితండ్రులతో సమానంగా చూసుకునే దంపతులు వాళ్లు.

గుంటూరులో పార్టీ కార్యాలయం కొత్తభవనం నిర్మించినప్పుడు మూడోఫ్లోర్‌లో ఓ చిన్నగది ఏర్పాటు చేసి కాళిదాసు దంపతులు అక్కడ ఉంటూ భవనపర్యవేక్షణ చూడాలని పార్టీ నిర్ణయిస్తే దాన్ని అంగీకరించి అక్కడకు మారారు. అప్పటినుండీ పార్టీ కార్యాలయాన్ని శుభ్రంగా ఉంచటంలో, పనివారితో జాగ్రత్తగా పని చేయించటంలో జయమ్మదే ప్రధానపాత్ర. కాళిదాసు బట్టలు ఎంత తెల్లగా ఉంచేదో పార్టీ కార్యాలయాన్ని కూడా అంతే పరిశుభ్రంగా ఉంచేలా పర్యవేక్షించేది ఆమె.

పెద్దనాయకులు అయినా చిన్నకార్యకర్తలు అయినా అందరితోనూ తలలో నాలుకగా మెలిగే మనిషి జయమ్మ. కొరటాల, మోటూరు వంటివారు ఆ ఇంటికి శాశ్వత బంధువులే. పార్టీ నాయకులు ఏ సమావేశానికి ఎవరు వస్తున్నారో ముందుగానే తెలుసుకుని వారి ఆహారపు అలవాట్లకు తగినట్లుగా భోజనం సిద్ధం చేసి ఆహ్వానించేది. బహుశా కాళిదాసుతో ఇంతకాలం కలిసి జీవించినక్రమంలో కాళిదాసు ఎంచుకున్న పని, మార్గంలో ప్రయాణించటం గమనించిన తర్వాత ఏనాడూ ఎదురు చెప్పి ఉండదు. అదే సమయంలో ఏదైనా విధానపరమైన అంశాలు చర్చలు జరుగుతుంటే తాను కూడా తన పని చేసుకుంటూనే ఓ చెవి చర్చల వైపు వేసి ఉంచేది. పనయ్యాక తాను నిర్మొహమాటంగా తనకు తెలిసినంతలో ఆ విషయాలపై జోక్యం చేసుకునేది. ఆమె రోజంతా ఇంటికి పరిమితం అయినా  పార్టీపై క్షేత్రస్థాయిలో పనిచేసే ఏ కార్యకర్తకూ తీసిపోనంత అంకితభావంతో ఉన్న వ్యక్తి ఆమె. ఇప్పటికీ వారిది ఆదర్శప్రాయమైన జంటగానే ఉంటుంది.

తను చేసే పనిని తల్లికూడా అర్థం చేసుకునేలా అనునయంగా చెప్పుకుంటూ వచ్చాడు కాళిదాసు వచ్చాడు. ఊళ్లో ఉన్నప్పటినుండీ ఉన్న చనువుతో 'మీవాడు ఏమి చేస్తున్నాడు' అని అడిగితే 'చదువుకుంటే కలెక్టర్ అయ్యేవాడయ్యా చెప్తే వినలేదు' అని  నవ్వేది. రానురాను కాళిదాసు ప్రజాజీవితంలో చేస్తున్న కృషి, ఏదో ఒక సమస్యమీద ఇంటికి వస్తూపోతూ ఉండే మనుషులు, వారితో జరిగే సంభాషణలు విన్న తర్వాత క్రమంగా కొడుకు చేస్తున్న పని కలెక్టర్ పనికన్నా విలువైనదన్న సంతృప్తి ఆమెకు దక్కింది. వృద్ధాప్యంలో తల్లి తండ్రులను

వృద్ధాశ్రమానికి పంపే ఈ రోజుల్లో కడదాకా తల్లిని వెంటపెట్టుకుని ఆ పార్టీలోనే ఆమెకు అంతిమ వీడ్కోలు పలికారు.

పుట్టిన తర్వాత చనిపోయేవరకూ అందరమూ బతుకుతాము. బతకటం వేరు. జీవించటంవేరు. కాళిదాసుది బతుకు కాదు. జీవితం. ఆ జీవితానికి ఎంచుకున్న లక్ష్యాలున్నాయి. ఆదర్శాలున్నాయి. ఒకరికి చెప్పేముందు ఆ ఆదర్శాలు పాటించే ఆచరణ ఉంది.

రోజురోజుకూ ఏదో ఒక కారణంతో కుటుంబ ఖర్చులు పెరిగిపోతున్న రోజులు ఇవి. కానీ పార్టీపట్ల విశ్వాసం, పార్టీ ఆదేశించిన జీవనశైలి పట్ల నిబద్ధత కలిగినవాడు కాబట్టే కాస్తంత చీకు చింతాలేని జీవితం గడిపేంత వనరులు ఉన్నా అవన్నీ పక్కనపెట్టి పార్టీ ఇచ్చే అలవెన్సుకు లోబడి కుటుంబ అవసరాలు పొదుపుగా తీర్చుకోవటం కాళిదాసులో మాత్రమే కనిపించే ప్రత్యేక లక్షణం.

ఎంత పెద్ద అవసరం వచ్చినా అప్పుకోసం చేయిచాచిన సందర్భం నాకు గుర్తులేదు. అలాగని ఎవరినీ యాచించిందీలేదు. పైగా పాతతరం కమ్యూనిస్టు యోధులతో కలిసిన ప్రభావం కాళిదాసుపై ఉంది. అందుకే కొరటాలగారు, సింహాద్రి శివారెడ్డిగారు వారిస్తున్నా వినకుండా తనకున్న ఆస్తులు అమ్మి పార్టీలో పని చేశారు. శివారెడ్డిగారు కాళిదాసును పిలిచి మందలించారు. తమ తరం పార్టీలోకి వచ్చేటప్పటి పరిస్థితులతో పోలిస్తే నేటి పరిస్థితులు చాలా మారాయనీ, అయినదానికీ, కానిదానికీ ఆస్తులు అమ్ముకుంటూ పోతే నిజంగా ఉద్యమ అవసరం వచ్చినప్పుడు అటు ఉద్యమానికీ, ఇటు తన సొంత జీవనానికి ఇబ్బంది వచ్చే ప్రమాదం ఉందనీ, కాబట్టి చివర్లో మిగిలిన పొలాన్నైనా అమ్మకుండా ఉండాలని హితవు చెప్పారు. చివరికి కాళిదాసు ఉన్న చివరిపొలం చెక్కను అమ్మి ఆ వచ్చిన డబ్బును పోస్టాఫీసు ఫిక్స్‌డ్ ఖాతాలో జమ చేసుకుని దానిపై వచ్చే వడ్డీతో కుటుంబం గడుపుతూ పార్టీనుండి అలవెన్సు కూడా తీసుకోకుండా పని చేస్తున్నారు. బహుశా ఆస్తులు అమ్మి పార్టీకి పని చేసినవారిలో కాళిదాసుది చివరితరం అయి ఉంటుంది.

బాధ్యతల్లో ఉన్నా లేకున్నా ఉద్యమకారుడిగానే జీవితాన్ని గడుపుతున్న మా మంచి మిత్రుడు కామ్రేడ్ కాళిదాసు.



**గుడిశ నటరాజు**
KVPS రాష్ట్ర నాయకుడు,
విజయవాడ.
9490098420

# తెనాలిప్రాంత కళాకారులను ప్రజాసంస్కృతి వైపు అడుగులు వేయించిన కాళిదాసు

ప్రజల సంస్కృతివైపుకు తెనాలిప్రాంతం కళాకారులను అడుగులు వేయిస్తూ పాటలు, నృత్యాలు, కోలాటం, వీధినాటికలు, పల్లెసుద్దులు మొదలగు జానపద కళారూపాలు నేర్పించేందుకు తపనబడిన వ్యక్తి నూతలపాటి కాళిదాస్.

సిపిఎం పార్టీ అభిమానులుగా ఉమ్మడి గుంటూరు జిల్లాలో సాంస్కృతిక రంగంలో స్టేజి నాటికలు, నాటకాలు చిలకలూరిపేట డివిజన్ పార్టీ ప్రధాన నాయకులు కామ్రేడ్ రామారావు సహకారంతో, కాళిదాసు ఆర్గనైజర్గా యడ్లపాడు గ్రామం కేంద్రంగా నాకు తెలిసినంతవరకు చుట్టప్రక్కల గ్రామాల్లో కళాకారులను కూడగట్టి ప్రదర్శనలు వేయిస్తూ ఉండేవారు. ఆ ప్రాంతంలో, ఇతర గ్రామాల్లో కళాబృందాలుకూడా కళా ప్రదర్శనలు ఇస్తుండవచ్చు.

కానీ నేను నివాసం ఉంటున్న ప్రాంతం దుగ్గిరాల మండలం, తుమ్మపూడి గ్రామంలో కామ్రేడ్ వల్లభనేని సాంబశివరావు నాయకత్వంలో నాటికలు, నాటకాలు "మేడే" సందర్భంగా ప్రదర్శన ఇస్తూ ఉండేవారము.

## నిబద్ధత–మానవత్వం

కళాంశాల రూపకల్పనలో మూఢనమ్మకాలు, అశాస్త్రీయతకు తావివ్వకుండా, శ్రమవిలువ, మహిళాచైతన్యం, సామాజికన్యాయం, పేదలపట్ల

ఔదార్యం, ప్రేమతత్వంతో ఉండాలని పట్టుబట్టినవాడు. జిల్లా కళాబృందాలలోకి గ్రామాలనుంచి మహిళా కళాకారులు వచ్చిన సందర్భంలో వారికి ప్రత్యేకవసతి సౌకర్యాలు కల్పించేవారు. వారికి నైతికతయొక్క ప్రాధాన్యతను తెలియపరచేవాడు. మహిళాకళాకారులను హేళనగాకానీ, చులకనగా కామెంట్ చేసేవారిపట్ల చాలా కరుకుగా, వారు ఏ స్థాయివారయినా నిష్పక్షపాతంగా, కఠినంగా వ్యవహరించేవారు. ఒక విధంగా మహిళా పక్షపాతిగా నిబద్ధత కలిగి ఉండేవారు కాళిదాసుగారు.

మహిళలను తనబిడ్డల్లా, అక్కాచెల్లెళ్ళలా వారితో ప్రేమగా ఉండేవాడు. ఆనాటి ప్రజానాట్యమండలి ఉమ్మడి రాష్ట్రకార్యదర్శి శ్రీమతి ఆండాళ్ళదేవి, భర్త శాంతారావులు ఉమ్మడి రాష్ట్రంలో కళాకారుల శిక్షణా, వర్కషాపుల్లో బిజీగా ఉన్న సమయంలో నెలల పిల్లాడిగావున్న వారి కుమారుడు "మిన్ను"ని రోజులు తరబడి అమ్మమ్మ, తాతయ్యలుగా పిల్లాడ్ని సాకిన ఔదార్యమూర్తులు విజయలక్ష్మి, కాళిదాసు దంపతులు. దేవి, శాంతారావులు యడ్లపాడుకు వస్తే పుట్టింటికి వచ్చినట్లే ఫీలయ్యేవాళ్లు. ఇంటినుంచి వెళ్ళేప్పుడు తన పిల్లకు యిచ్చినట్లే సంప్రదాయ ఊరపచ్చళ్లు, పిండివంటలు సంచిలో సర్ది ప్రేమగా పంపించేవాళ్ళు. వారికి సొంత కూతురల్లుళ్ళు బాగా ప్రేమను పంచారు విజయలక్ష్మి, కాళిదాసుగార్లు.

గుంటూరు మెడికల్ కాలేజీలో ఎస్ఎఫ్ఐ ద్వారా పరిచయమైన డాక్టర్ హనుమంతరావు, డాక్టర్ శివబాబు, డాక్టర్ అన్నవరపు విజయలక్ష్మి, వాళ్ళ చెల్లెళ్లు, డాక్టర్ అనురాధ వారి మిత్రులలోని మహిళాబృందానికి ఉమ్మడి రాష్ట్ర కేంద్రంనుంచి శిక్షకులను రప్పించి మహిళల హక్కులు, రక్షణకు సంబంధించిన అంశాలతో కూడిన వీధినాటికను నేర్పించి కాలేజీల్లోనూ, నగర పేదబస్తీల్లో డాక్టర్లనే వ్యత్యాసం లేకుండా మట్టిరోడ్లపైన ప్రదర్శన్లు ఇప్పించారు కాళిదాసు. ఈ విధంగా పరిచయం అయిన గుంటూరు గవర్నమెంట్ హాస్పిటల్ హౌస్‌సర్జెన్స్‌గా పనిచేస్తున్న డాక్టర్లతో జిల్లా నలుమూలలనుంచి హాస్పిటల్‌కు వచ్చిన పేదవారికి డాక్టర్లద్వారా వైద్యసేవలు అందించి, మానవత్వాన్ని చాటారు కాళిదాసు.

## వెనుదిరగని పట్టుదల

ఉద్యమ ఉమ్మడి లక్ష్యాల సాధనపట్ల ప్రజాకవి వేమన చెప్పినట్లు:

"పట్టు పట్టరాదు, పట్టి విడవరాదు,
పట్టెనేని బిగియ పట్టవలయు,
బట్టి విడుచుటకన్నా ప్రాణమిచ్చుట మేలు."

అన్నట్లుగా కాళిదాసుగారి పట్టుదలను అభినందించక తప్పదు. కొన్ని ఘటనలు చూస్తే!

రాష్ట్రప్రభుత్వం నిర్వహించిన సైన్సు, మహిళలకు రిజర్వేషన్లు, అక్షరాస్యత, బాలలవెట్టిచాకిరి మొదలగు కళాయాత్రలు జిల్లాలో, రాష్ట్రంలో నిర్వహించే సందర్భంలో గ్రామాలనుంచి వచ్చిన కళాకారుల గౌరవేతనం, శిక్షణ వర్క్‌షాపుల్లో మౌలికవసతులు కల్పనలో, కలెక్టర్లు, భాషాసాంస్కృతికశాఖ అధికారులతో చర్చించే సందర్భంలో తన మనస్సులోని భావాలను వ్యక్తపరచటంలో వెనక్కు తగ్గకుండా, కళాకారుల వసతులు సమకూర్చడంలో వెనుదిరగని తత్వం.

కళాంశాలు రూపకల్పనలోనూ, పాటలు, నాటికలరచనలలో ప్రజలకు అర్థమయ్యేభాష ఉండాలని పట్టుబట్టేవాడు. ఉన్నత అధికారులతో చర్చలకు వెళ్లినప్పుడు వాళ్లు ఆంగ్లభాషలో మాట్లాడుతున్న సందర్భంలో, ఇతర కళాసంఘాల మిత్రులు అర్థమైనట్లు తలలాడించినా, కాళిదాసు అధికారులతో "క్షమించాలి. నేను పెద్దగా చదువుకోలేదు. మీరు ఇంగ్లీష్‌లో ఏం మాట్లాడుతున్నారో నాకు అర్థం కాలేదు. మాకు అర్థమయ్యేట్లు తెలుగులో మాట్లాడండి. మాకు అర్థమవుతుంది" అని నిర్భయంగా బెరుకులేకుండా అడిగేవాడు.

జిల్లాలో కళాకారుల శిక్షణ వర్కుషాపులు నిర్వహించేందుకు, తెలిసిన ఉన్నత అధికారులు, కళాసంస్థలు, వ్యక్తులు, శ్రేయోభిలాషులు, బంధువులనుంచి చొరవతో నిధులను సమకూర్చటంలో దిట్ట. గుంటూరుజిల్లా ఉద్యమ కేంద్ర కార్యాలయం నిర్మాణం నిధులు వసూళ్ళలో పరిచయస్తులను ఏ ఒక్కరినీ వదలకుండా, ఎంచుకున్న కార్యసాధనను ఇతరులకు వివరించి, వారందరినీ అంగీకరింపజేసుకొని ఇతర దేశాలలో పనిచేస్తున్న మిత్రులను సైతం వదలకుండా పట్టుదలతో నిధులను సేకరించటంలో కాళిదాసుగారు అగ్రభాగాన ఉన్నారనటంలో అతిశయోక్తి కాదు.

## ప్రజాసంస్కృతి రూపాల విస్తరణ

ప్రజాసంస్కృతికి ప్రమాద ఘడియలు ప్రారంభమైన 1990 తొలిరోజులు రాష్ట్ర ప్రజాతంత్ర ఉద్యమం, సాంస్కృతికవారసులుగా ఉన్నవారితో చర్చలు జరిపి మితవాదభావాలను అడ్డుకునేందుకు మేధావులతో కళాకారుల వర్క్‌షాపు ఉమ్మడి మంగళగిరి మండలం, ఉండవల్లిలో 1993 ఉమ్మడి రాష్ట్రశిక్షణ జరపటానికి ప్రజాతంత్ర ఉద్యమనాయుకులు సింహాద్రి శివారెడ్డి, భీమిరెడ్డి సాంబిరెడ్డి, నిమ్మగడ్డ రామ్మోహనరావు, జెవి రాఘవులు ప్రోత్సాహంతో పాపిరెడ్డిగారి విజయబాల విద్యాలయంలో కాళిదాసు, స్థానికపెద్దలు జొన్న శివశంకర్, గాదె సుబ్బారెడ్డి, ఆర్‌వి రాఘవయ్య, దొంతిరెడ్డి వెంకటరెడ్డిగార్లు ఉండవల్లిలో ఆతిథ్యం ఇచ్చారు. 23 జిల్లాలనుంచి కళాకారులు, దర్శకులు రామనాథం, పాటల స్వరకల్పన చేసిన సంగీతవిద్వాంసుడు వేప నరసింహారావుగారు, శాంతారావు, దేవి, దేవేంద్ర, జగ్గరాజు అతిరథ మహారథులు హాజరయ్యారు.

ఈ శిబిరంలో శాంతారావు, దేవి, దేవేంద్ర రామనాథం, జగ్గరాజులు, అరుణ్‌జీలు స్వతంత్ర పోరాటచరిత్రలో ఆర్‌ఎస్‌ఎస్ మతోన్మాదచర్యల వలన దేశప్రజలు కోరుకుంటున్న మతసామరస్యానికి ఏర్పడ్డ ముప్పును కళ్ళకు కట్టినట్లు సమిష్టి భావసంఘర్షణలో పుట్టినదే “మన చరిత్ర” వీధినాటిక. “మసీదులో కాదురా! బీజేపీ బందీగా ఉన్నాడు రాముడు!” అన్న పాట దేవేంద్ర కలంనుంచి జాలువారింది. నల్లి ధర్మారావు, దశరథ, డాక్టర్ విజయకుమార్, పుల్లారావు వల్లంభట్ల, తదితర రచయితలు రచించిన పన్నెండు పాటలకు వేప నరసింహారావుగారు స్వరాలు అందించారు. ఈ పాటలు ప్రజలను ఆలోచింపజేశాయి. ఆదరణ పొందాయి.

మతసామరస్యాన్ని ప్రబోధించే “మన చరిత్ర” వీధినాటికను కాళిదాసు ప్రోత్సాహంతో తెనాలి డివిజన్ టీం నటరాజు టీంలీడర్‌గా 100 ప్రదర్శనలు ఇచ్చారు. ఉదారవాద ఆర్థికవిధానాలు, గాట్ ఒప్పందం, డంకెల్ ప్రతిపాదనల దుష్ఫలితాలను ప్రజలకు తెలియజేసేందుకు ఉమ్మడి కృష్ణాజిల్లా గుడివాడలో రాష్ట్రశిక్షణ శిబిరంలో పుట్టినది “అప్పా అమ్మకమా” వీధినాటిక. ఈ శిక్షణకు

గుంటూరుజిల్లా నుంచి కాళిదాసుగారితో నటరాజు పాటలకు కోటేశ్వరరావు, మంగమ్మ శిక్షణకు హాజరయ్యారు. ఈ నాటికను చిలకలూరిపేట, తెనాలి డివిజన్ తుమ్మపూడి కళాకారులు 100 ప్రదర్శనలు ఇచ్చారు.

కాంగ్రెస్ కేంద్రప్రభుత్వం అప్రజాస్వామ్య పద్ధతిలో ఎన్నికల్లో గెలిచిన ప్రజాప్రతినిధులను, ప్రలోభాలతో లోబర్చుకొని ఫిరాయింపులను ప్రోత్సహించింది. ఉదారవాద ఆర్థికవిధానాల అమలు, ప్రభుత్వరంగసంస్థలు విదేశీ, స్వదేశీ కార్పోరేట్ గుత్తపెట్టుబడిదారులకు కట్టబెట్టి, నిరుద్యోగాన్నిపెంచి, దేశాన్ని అప్పుల ఊబిలోకి నెట్టి, అవినీతికూపంలో కూరుకుపోయింది. దేశవ్యాప్తంగా ధరలుపెంచి ప్రజలపైన అధిక భారాలను మోపింది. ఈ సమస్యలను కళరూపాలుగా మలచి ప్రజలకు తెలియజెప్పే సందర్భంగా నెల్లూరులో రాష్ట్ర కళాశిక్షణ శిబిరం జరిగింది. గుంటూరుజిల్లా నుంచి నటరాజు, కాళిదాసుగారు, ఇతర మిత్రులు ఆనాటి శిక్షణ వర్క్‌షాప్‌లో "కబడ్డీ" నాటిక నేర్చుకోవటం, జిల్లాలో అన్ని మండలాల్లో ప్రదర్శనలు ఇవ్వడం జరిగింది.

## జిల్లా, రాష్ట్రస్థాయి శిక్షణాశిబిరాలు

కాళిదాసుగారు జిల్లాస్థాయి సైన్స్ కళయాత్ర శిక్షణ శిబిరం గుంటూరు సిటీలో ఆంధ్ర క్రైస్తవకళాశాల (ఏయల్సీ) బిఈడి కాలేజీ కాంపౌండ్‌లో రచయితల వర్క్ షాపు, కళాశిక్షణ శిబిరం నిర్వహించారు. ఈ శిబిరంలో మశూచి, డయేరియా, కలుషిత త్రాగునీరు, కోరింతదగ్గు, మూఢనమ్మకాలు, పర్యావరణ పరిరక్షణ అంశాలపై పాటలు, నృత్యరూపకాలు, నాటికలు శిక్షణ ఇప్పించ్చారు. అక్షరాస్యతపై జిల్లాలో ప్రచారం చేసేందుకు జిల్లా శిక్షణశిబిరం, వర్క్‌షాపు తాడికొండ మండల కేంద్రంలో పదిరోజులపాటు శిక్షణ ఇప్పించారు. శిబరంలో "చదువెందుకు?" నాటిక, చదువే మనిషికి జీవంరా! చదువే మనిషికి జ్ఞానంరా!" నృత్యరూపకం, "చంద్రునివెన్నెల చల్లదనం! సూర్యుని వెలుగుల వెచ్చదనం! "భావగీతం, పిట్టలదొర వ్యంగ్య ఏకపాత్ర, "పుత్తడి బొమ్మ పూర్ణమ్మ బుర్రకథ", "ముందే చెబుతున్న" పల్లె సుద్దులు, మొదలగు రూపకాలకు శిక్షణ ఇచ్చారు.

## డివిజన్లవారి శిక్షణ

జిల్లాలో డివిజన్లవారీగా తెనాలి డివిజన్ అనంతవరం, రేపల్లె, నూతక్కి, తుమ్మపూడి, చిలువూరు, కొల్లూరు, దోనేపూడి, అమర్తలూరు, ఈపూరుపాలెం, సత్తెనపల్లి డివిజన్లో ఫణిదం, రెంటపాళ్ళ, క్రోసూరు, చిలకలూరిపేట డివిజన్‌లో లింగారావుపాలెం, ఉన్నవ, యడ్లపాడు, నాదెండ్ల, చిలకలూరిపేటటౌన్, నరసరావుపేట డివిజన్లో వినుకొండ, పాలపాడు, నర్సరావుపేటటౌన్ ప్రాంతాల్లో శిక్షణ నిర్వహించారు.

## జిల్లాలో నిర్వహించిన రాష్ట్రస్థాయి వర్క్‌షాపులు, శిక్షణాశిబిరాలు

జిల్లాలో నిర్వహించిన రాష్ట్రస్థాయి వర్క్‌షాపులు, శిక్షణాశిబిరాలు, మతసామరస్యంపై ఉండవల్లిలో ఉమ్మడి రాష్ట్రస్థాయి రచయితల వర్క్‌షాప్, శిక్షణ శిబిరం. చిలకలూరిపేటలో రాష్ట్రస్థాయి పాటలు, డప్పులు శిక్షణ, వీధినాటిక, కోలాటం, పల్లెసుద్దులు రచయితల వర్క్‌షాపు, శిక్షణాశిబిరం 6 రోజులు నిర్వహించారు.

ప్రజానాట్యమండలి మహాసభలు నర్సరావుపేటలో జరుగుతున్నప్పుడు రాష్ట్రస్థాయి వీధినాటికల "షాట్"ను నిర్వహించే బాధ్యతలు కాళిదాసుగారు జయప్రదంగా నిర్వహించారు. సఫ్దర్‌హష్మి జననాట్య మంచ్ సభ్యురాలు అయిన ప్రొఫెసర్ సోనియాగుప్తా ఢిల్లీనుంచి, రాష్ట్రకార్యదర్శి దేవిగార్లను ఆహ్వానించి బహిరంగసభ నిర్వహించారు.

## రాష్ట్రంలో ఇతర జిల్లాల్లో జరిగిన వర్క్‌షాపులు, శిక్షణాశిబిరాలు

రాష్ట్రస్థాయిలో ఇతర జిల్లా ప్రాంతాలలో జరిగిన శిక్షణ వర్క్‌షాప్‌లకు జిల్లా రిసోర్స్ పర్సన్స్‌ని జిల్లాలోని ముఖ్యకళాకారులను తీసుకెళ్ళారు. అక్షరాస్యత పైన రాజమండ్రి ధవళేశ్వరంలో జరిగిన వర్క్‌షాప్‌కు కాళిదాసుగారు వెనిగళ్ళ గ్రామంనుంచి శ్యాము, నాదెండ్ల నుండి మాణిక్యమ్మ, జాలాది నుండి జరుగుల రామారావును, క్రోసూరునుంచి మంగమ్మ, తాడేపల్లి సుందరయ్యనగర్‌నుంచి రోహిణి కొండబాబులను తీసుకెళ్లారు.

సైన్స్ కళాయాత్ర హైదరాబాదు ట్యాంక్‌బండ్ అంబేద్కర్ భవన్లో జరిగిన రాష్ట్ర వర్క్‌షాపు, శిక్షణ శిబిరానికి కాళిదాసుగారు, నటరాజుతోపాటుగా జిల్లా టీం కూడా తీసుకువెళ్లారు.

చట్టసభల్లో మహిళలకు 33% రిజర్వేషన్ కల్పించాలని కళారూపాల యాత్రలు రాష్ట్ర మొత్తంగా ప్రచారం చేయాలని రాష్ట్రస్థాయి రచయితల వర్క్ షాపు, శిక్షణ శిబిరం హైదరాబాదు రంగారెడ్డిజిల్లా, ఇబ్రహీంపట్నం మండలంలో జరిగిన శిక్షణ, వర్క్‌షాప్‌లో దేవేంద్ర కలంనుండి "ఏం తక్కువమ్మ నీకు రాజ్యమేలను! నిన్ను ఆటపట్టించెటోళ్ళ-నోళ్ళ మూయను!" మరియు "వెలుగు రేఖలు వచ్చాయి మహిళలంతా కదలాలి! పాలనలో మనవాటా సాధించి తీరాలి!" పాటలను రచించారు. ఈ శిబిరానికి కాళిదాసుగారితోపాటు నటరాజు మన జిల్లా నుంచి దళాన్ని తీసుకుని వెళ్లారు.

ప్రకాశంజిల్లా కనిగిరి ప్రాంతంలో రాష్ట్రస్థాయి "కోలాటం" 20 రోజులు జరిగిన గురువులు శిక్షణకు తెనాలి డివిజన్ తుమ్మపూడి గ్రామంనుంచి పల్లి రాంప్రసాద్‌ను, రెంటపాళ్ళ నుంచి నాగేశ్వరావులను పంపించారు. కోలాటం గురువుల శిక్షణకు పంపించిన పల్లి రాంప్రసాద్ జిల్లాలో రేపల్లె, అనంతవరం, అమర్తలూరు, చిలువూరు, దోనేపూడి గ్రామాలలో కోలాటదళాలను ఏర్పాటుచేసి శిక్షణ ఇచ్చి వందలాది ప్రదర్శనలు ఇప్పించారు కాళిదాసు.

అక్షర కళాయాత్ర, సైన్స్ కళాయాత్ర, మహిళా 33 శాతం రిజర్వేషన్ యాత్రలు జిల్లాలో 50 మండలాలలో కళాయాత్రలో నడిపించారు.

మద్యపాన నిషేధం (సారా వ్యతిరేక ఉద్యమం) నడుస్తున్న సమయంలో యడ్లపాడు కళాకారులతో "సారా సర్కార్" కందిమళ్ళ సాంబశివరావుగారు రచించిన నాటికను జిల్లాలో అనేక ప్రదర్శనలు ఇప్పించటంలో ప్రధానపాత్రను వహించారు.

పత్తి రైతుల సమస్యలపైన జరుగుల రామారావు దర్శకత్వంలో "హాలికులు సేమమా" స్టేజినాటికకు పరిషత్తులో ప్రైజులు సాధించారు. ఈ నాటిక పలు ప్రాంతాల్లో ప్రశంసలు పొందటానికి ముఖ్యపాత్ర వహించారు.

## కళాకారులను, కార్యకర్తలను ఉన్నతస్థానాలకు ప్రోత్సాహం

చిలకలూరిపేట కేంద్రంగా యడ్లపాడు ఇతర ప్రాంతాలలో రచయితలను, కళాకారులను ప్రోత్సహించేవారు కాళిదాసు. కళాకారులు రిహార్సల్స్ జరపటానికి స్థలం, ప్రదర్శనలు ఇచ్చేందుకు నాటిక, నాటకాలలో ఉపయోగించే వస్తువులను సేకరించటంలో ముందుగా తగుజాగ్రత్తలు తీసుకునేవారు.

స్టేజినాటికల ద్వారా పరిషత్తుల్లో ఉత్తమ నటులుగాను, ఉత్తమ దర్శకులు గాను, స్క్రిప్టు రచయితలుగాను కందిమళ్ళ సాంబశివరావు (రచయితగా) జరుగుల రామారావు (దర్శకులుగా) ఉన్నతస్థానాలకు ఎదగటానికి కాళిదాసుగారు ఎంతో ప్రోత్సహించారు అనడంలో అతిశయోక్తి కాదు.

## ప్రతిభను గుర్తించి ప్రోత్సాహం

పెద్ది రామారావు గుంటూరులో డిగ్రీ చదువుతున్న సమయంలో కళా రంగంపై అతనికున్న మక్కువను గమనించి, డిగ్రీ పూర్తి అయిన తరువాత హైదరాబాదులో "థియేటర్ ఆఫ్ ఆర్ట్స్"ను చదివి, పట్టా పొందేవిధంగా ప్రోత్సహించారు. యడ్లపాడుకు సంబంధించిన సురేష్‌ను పరిషత్తు నాటకాల ద్వారా పరుచూరి బ్రదర్స్‌కు పరిచయంచేసి "ముఠామేస్త్రి" సినిమాలో నటించేందుకు అవకాశం రావడానికి సహకారం అందించారు. గుంటూరుజిల్లాలో ప్రస్తుతం జానపద, సామాజిక, రాజకీయ, అభ్యుదయ పాటలు పాడుతూ నగరప్రముఖులు, సంస్థల నుంచి ప్రశంసలు పొందుతున్న ప్రజానాట్యమండలి మాజీకార్యదర్శి రమణను, కళారంగం అవసరాలరీత్యా రమణను, నెల్లూరుజిల్లా నుండి గుంటూరుకు రప్పించి ఏసీ కాలేజీలో సీటు ఇప్పించి, హాస్టల్లో ఉండేందుకు అవకాశం కల్పించి, గాత్రసాధనకు, సంగీతం ఓనమాలు నేర్పించి మంచి గాయకుడిగా ప్రజల మన్ననలు పొందటానికి కాళిదాసుగారు పునాదిగా మారారు.

## ప్రజాతంత్ర ఉద్యమంలోకి కార్యకర్తల ఎంపిక

తెనాలి డివిజన్ తుమ్మపూడి గ్రామంలో కళాకారుడుగా 1982లో ఏసి కాలేజీలో చదువుతూ ఎస్ఎఫ్ఐలో ఉన్న జి. నటరాజును, పల్లె రాంప్రసాదులను, తెనాలి టౌన్‌లో చదవుతూ ఎస్ఎఫ్ఐలో పాటలు పాడుతున్న తురక నాగరాజును,

మరియు గుంటూరులో చదువుతూ ఎస్ఎఫ్ఐలో పనిచేస్తున్న నర్సరావుపేట ప్రాంతానికి సంబంధించిన అంజిరెడ్డిని ప్రజానాట్యమండలి జిల్లా సహాయ కార్యదర్శిని చేశారు. సత్తెనపల్లి దగ్గరున్న క్రోసూరు గ్రామవాసి మంగమ్మను, ఆర్టీసిలో కండక్టర్ జాబ్‌ను అప్పటి ఆర్.టి.సి.ఆర్.యమ్., అప్పటి కలెక్టర్‌గార్లతో మాట్లాడి ఇప్పించాడు. ప్రజానాట్యమండలి కార్యవర్గంలోకి తీసుకొచ్చారు. ఉపాధ్యాయుడిగా ఉన్న తాండవకృష్ణను, కోటేశ్వరరావు, పాలపాడు నుంచి మెట్టు కోటిరెడ్డి, యడ్లపాడునుంచి పీటర్‌ను, నాదెండ్ల నుంచి అమరమ్మ, మాణిక్యమ్మలను ప్రోత్సహించి కళారంగంలోకి తీసుకొచ్చారు.

## నటరాజుకు వ్యక్తిగత గురుసమానుడు కాళిదాసు

గుంటూరు ఎస్ఎఫ్ఐ కమిటీనుంచి ప్రజానాట్యమండలిలో 1983 నుంచి 1995 వరకు కాళిదాసుగారితో సాంస్కృతిక ఉద్యమగురువుగా ఆప్యాయతతో కూడిన సంబంధం మా మధ్య ఉండేది. ఉమ్మడిరాష్ట్రంలో జరిగిన వర్కుషాపులకు నన్ను పంపిచారు. రాష్ట్ర రిసోర్స్‌పర్సన్‌గా విజయనగరం, ప్రకాశంజిల్లాలకు శిక్షకులుగా పంపించారు.

నాకు పెళ్ళి చేయాలని కాళిదాసుగారు శాంతారావు, దేవిగార్లతో చెప్పి పలు జిల్లాలలో నాయకులద్వారా సంబంధాలు చూసేవారు. ఆ సందర్భంగా తాడేపల్లి సుందరయ్యనగర్‌లో ఉష w/o వెంకటేశ్వర్లు, గిరిజ w/o వెంకటరావుగార్ల సహాకారంతో ఈ ప్రాంతంలో పార్టీ నిర్వహిస్తున్న స్కూల్లో పనిచేస్తున్న, ఉన్నత కమ్యూనిటీకి సంబంధించిన టీచర్‌ను, నన్ను పెళ్ళి చేసుకొనేందుకు అమ్మాయిని, వారి కుటుంబ సభ్యులను ఉషక్క, గిరిజక్క, కాళిదాసుగారు, దేవి, శాంతరావుగార్లు ఒప్పించారు.

దేవి, శాంతారావుగార్లు, నేను ప్రకాశంజిల్లా సంతనూతలపాడులో అక్షర ప్రకాశం కళాయాత్ర శిక్షణాశిబిరం ముగిసిన తరువాత గుంటూరులో 1993 మే 30న, నా పెళ్ళి చెయ్యాలని నిర్ణయించారు. నావైపు కుటుంబసభ్యులు, బంధువులకు పెళ్ళికబుర్లు చెప్పటం జరిగింది. అమ్మాయివైపు కుటుంబసభ్యులు పెళ్ళి కబుర్లు చెప్పుకున్నారు. దేవి, శాంతారావులు ప్రకాశంజిల్లాలో శిక్షణ

ముగించుకొని, మే 28 సుందరయ్యనగర్ వచ్చాక అమ్మాయి కులాంతర వివాహం చేసుకోనని, దేవి, శాంతారావులతో చెప్పిందట. ఈ విషయం కాళిదాసుగారికి అమ్మాయి చెప్పిన అభిప్రాయం చెప్పారు. పెళ్ళికి అమ్మాయి అంగీకరించటంలేదని, నాకు, మా కుటుంబసభ్యులకు చెప్పటానికి ఎంతో వేదనచెందారు. చివరకు 1996 సంవత్సరం జూన్ 21 తేదిన, మా పెదనాన్నగారి మనవరాలు, సునీతతో వివాహం జరిగింది. నా వివాహం పార్టీ చెప్పిన పద్ధతిలో తెనాలిపార్టీ డివిజన్‌కమిటీ కార్యదర్శి పర్చూరి నాగేశ్వరరావుగారు, దేవి, దేవేంద్ర, కాళిదాసుగార్లు నా వివాహం చేశారు. ఆ తరువాత గుంటూరుజిల్లా పార్టీకార్యదర్శి పెద్దలు పుతుంబాక వెంకటపతిగారి మరణానంతరం జరిగిన పరిణామాలవలన గుంటూరుజిల్లా ఉద్యమంనుంచి అనఫిషియల్‌గా రిలీవ్ అయ్యి, కృష్ణాజిల్లా విజయవాడ కేంద్రంగా ప్రస్తుతం పూర్తికాలం కార్యకర్తగా పనిచేస్తున్నాను.

తెలిసినంతవరకు కాళిదాసుగారితో నాకున్న జ్ఞాపకాలు ఇవి.






జి. నటరాజు, సునీత వివాహంలో వేదికమీద పి. నాగేశ్వరరావు, దేవేంద్ర, కాళిదాసు.



**ఆలోకం పెద్దబ్బయ్య**
గుంటూరు కళాపరిషత్ గౌరవాధ్యక్షులు,
గుంటూరు.
9448093697

# ఆదర్శజీవి...మన నూతలపాటి కాళిదాసు

క్రమశిక్షణకల్గిన కార్యకర్త, సాధారణజీవితం, ప్రేమ ఆప్యాయతలతో అందరితో కలుపుగోలుగా ఉండే ఆదర్శజీవితం...పార్టీనిర్మాణంలో సాహిత్య, సాంస్కృతిక, విద్యా, వైద్యరంగాల్లో ఆయన చేసిన కృషి...ఒక్క యడ్లపాడు ప్రాంతానికే కాకుండా గుంటూరు జిల్లాలోనే తనకంటూ ప్రత్యేకస్థానం సంపాదించుకున్న వ్యక్తి ఎవరంటే ఆయన మన నూతలపాటి కాళిదాసు అనడంలో ఎలాంటి సందేహం లేదు.

నూతలపాటి కాళిదాసువారి మేనత్త లింగారావుపాలెం గ్రామవాసి కావడంతో బాల్యంనుంచే ఆ గ్రామంలో వస్తూపోతూ అక్కడివారితో మంచి సంబంధాలు కల్గియుండడంతో అలా నాతో కూడా మంచి ఆత్మీయబంధం ఏర్పడింది. కాగా ఆయన యడ్లపాడులో హైస్కూల్‌విద్య కూడా చదవలేకపోయినా మంచి క్రమశిక్షణాయుతమైన జీవనానికి అక్కడి ఆ ప్రాంతంలో ఉన్న వామపక్ష భావజాలం, చైతన్యవంత సమాజం ఉండాలనే కోరుకునే వ్యక్తులు ఎక్కువమంది ఉండడంవలన కాళిదాసు కూడా అదే స్ఫూర్తితో అడుగులు ప్రారంభించారు.

అలా చిన్న వయస్సులోనే యడ్లపాడులో ఉంటూ CPM వైపు ఆకర్షితులై పార్టీలో చురుగ్గా పాల్గొంటూ క్రియాశీల కార్యకర్తగా పని చేస్తూ ముందుకు వెళ్లారు. పార్టీ ఇచ్చిన ప్రతి పిలుపులను, ఉద్యమాలను జయప్రదం చేస్తూ...పార్టీ

నాయకులకు మంచి కార్యకర్తగా పేరు తెచ్చుకొని...గ్రామంలో అందరినీ సమీకరించి ప్రజానాట్యమండలి ద్వారా అక్కడ ఉన్న సమస్యలను ప్రతిబింబించేలా కళాజాతాలు, సాంస్కృతిక, నాటకరంగాల ద్వారా బాగా ప్రజల్లోకి తీసుకెళ్ళేందుకు విశేషంగా కృషి చేశారు. కాళిదాసులో ఒక ప్రత్యేకత కూడా ఉంది. ఒక ప్రక్క పార్టీ కార్యక్రమాలు విజయవంతంగా నిర్వహిస్తూనే తన జీవనాడి అయిన వ్యవసాయ పనులు కూడా శ్రద్ధగా నిర్వహించేవారు.

కాళిదాసులోని ఒక నిబద్ధతతో...ఒక క్రమశిక్షణాయుతమైన జీవన విధానాన్ని గమనించిన కామ్రేడ్ పుతుంబాక వెంకటపతి కాళిదాసు నివాస ముంటున్న యడ్లపాడు గ్రామానికి వచ్చి అన్ని విషయాలు సమగ్రంగా వివరించి, 1985లో ఉమ్మడి గుంటూరుజిల్లా ఆంధ్ర ప్రజానాట్యమండలి కన్వీనర్‌గా కీలకమైన బాధ్యతలు అప్పజెప్పడం జరిగింది. గుంటూరునగరంలో అనేకమంది వామపక్ష, అభ్యుదయభావాలు కల్గిన వైద్యులతో పరిచయం పెంచుకొని, వారితో సన్నిహితంగా ఉంటూ అనేక గ్రామాలు, ఇతర జిల్లాలనుండి అనారోగ్యం బారినపడిన పేద ప్రజలు వైద్యసేవల కోసం గుంటూరు నగరానికి వచ్చినప్పుడు వారికి ఆయా వైద్యులద్వారా వైద్యసహాయం అందేలా కృషి చేసేవారు. గ్రామీణ ప్రాంతాలనుండి వచ్చే పార్టీ కార్యకర్తలకు, పేదప్రజలకు ఆశ్రయం కల్పించి, భోజన సదుపాయాలు, మంచివిద్య అందేలా తగిన అవకాశాలు చూపించి ప్రోత్సహించేవారు. ఇలా బాధ్యతలు వహిస్తూ ఆయన సతీమణి జయమ్మగారు ఆయన చేసే ప్రతిపనిలో చేదోడువాదోడుగా ఉంటూ ఆయనకు పూర్తి సహాయసహకారాలు అందిస్తూ, అన్యోన్యదాంపత్యానికి నిదర్శనంగా ఉండేవారు.

## షాట్-99 (సఫ్దర్ హష్మి ఓపెన్ థియేటర్)

1999 ఏప్రియల్ 12, 13, 14 తేదీల్లో గుంటూరు పదవ రాష్ట్రవీథి నాటకోత్సవాలు నిర్వహణలో జన-ధన సమీకరణలో కామ్రేడ్ కాళిదాసు ప్రముఖ పాత్ర పోషించి, దిగ్విజయంగా జయప్రదం చేయడంలో కీలకభూమికగా నిలిచారు. ఈ ఈవెంట్‌కు డాక్టర్ కాసరనేని సదాశివరావుగారిని ఆర్గనైజింగ్ కమిటీకి

అధ్యక్షులుగా నియమించుకొని, పురప్రముఖులెందరినో భాగస్వాములుచేసి విజయవంతంగా నిర్వహించారు. ఈ సందర్భంగా సావనీర్‌ని ప్రచురణ చేసి ఆవిష్కరించడం జరిగింది.

కాళిదాసు నాతో చిన్నప్పటి నుండి సన్నిహిత సంబంధాలు కల్గి ఉండుటవలన ప్రతి అంశాన్ని నాతో చర్చించేవారు. అలాగే మా కుటుంబ సభ్యులతో కూడా సన్నిహిత సంబంధబాంధవ్యాలతో స్నేహంగా ఉండేవారు. కాళిదాసు నాతో కలిసినప్పుడల్లా ప్రతిఅంశం లింగారావుపాలెం, యడ్లపాడు గ్రామాల అభివృద్ధిపై చర్చిస్తూ మంచిసమాజం కోసం పనిచేయాలని తాపత్రయపడేవారు. ఇలాంటి పరిస్థితుల నడుమ మా కుటుంబసభ్యులను సంప్రదించి లింగారావుపాలెంలో నిర్మించిన కళ్యాణమండపానికి భూరివిరాళం ఇప్పించడంలో ఆయన నన్ను ప్రోత్సహించి ప్రధానభూమిక పోషించారు. ఆ విషయం ఇప్పటికీ గుర్తుకు తెచ్చుకుంటే నా జీవితంలో మంచిపని చేశామనే సంతృప్తి కల్గుతుంది.

ఇంకో ముఖ్య విషయమేంటంటే యడ్లపాడులోని లూథరన్ హైస్కూల్ డెవెలప్‌మెంట్ కమిటిలో మేమిద్దరం ప్రెసిడెంట్, వైస్‌ప్రెసిడెంట్‌లుగా బాధ్యతలు వహిస్తూ ముఖ్యకార్యదర్శి ముత్తవరపు రామారావుగారితో ట్రెజరర్ పుల్లగూర పాల్ సుధాకర్ (కన్నలు), మిగిలిన కార్యవర్గసభ్యులు, గ్రామస్తులు, పూర్వవిద్యార్థులు సహకారంతో లూథరన్ హైస్కూల్ శిథిలావస్థలో ఉన్న భవనాలను పునర్నిర్మాణం చేయడం, ప్రహరి నిర్మాణం చేయడం మాకు చాలా సంతోషం కల్గించింది.

యడ్లపాడులో కామ్రేడ్ పోపూరి రామారావు పేరుమీద నిర్మించిన పిఆర్ విజ్ఞానకేంద్రం నిర్మాణంలో మన కాళిదాసు చేసినకృషి మరువలేనిది. కామ్రేడ్ పుచ్చలపల్లి సుందరయ్యగారి పేరుమీద జరిగే వార్షికనాటకోత్సవాల నిర్వహణలో తన వంతు కృషిచేస్తున్నారు. కరోనాసమయంలో యడ్లపాడులో వైద్యశిబిరం నిర్వహణద్వారా ఆయన వంతుగా చేసిన సేవలు ఆదర్శనీయం. అంతే కాకుండా ఆదర్శవివాహాలు చేసుకున్న జంటలు ఎదుర్కొనే సమస్యలను ప్రత్యేకమైనశ్రద్ధతో



డాక్టర్ శివబాబు–విజయలక్ష్మి పెండ్లి



రంగస్థల ప్రముఖులు శ్రీ గోపరాజు విజయ్‌కుమార్‌ను సత్కరిస్తున్న కాళిదాసు, డాక్టర్ ముత్తవరపు సురేష్‌బాబు.



కొరటాల మీటింగ్ హాల్ ప్రారంభోత్సవం చేస్తున్న కామ్రేడ్ కొరటాల, కామ్రేడ్ సీతారామ్ ఏచూరి, కామ్రేడ్ లావు బాలగంగాధరరావు, డా. యలమంచిలి శివాజి, ఎం.పి., తదితరులు, స్వాగతం పలుకుతున్న కాళిదాసు.




కొండవీటి వేంకటకవి శతజయంతిసభలో పుస్తకావిష్కరణ. కాళిదాసు, కె.చిన్నయసూరి, ఆర్. చంద్రశేఖరరెడ్డి, కె.ఎస్. లక్ష్మణరావు, హైకోర్టు జడ్జి శ్రీమతి టి.రజని, శ్రీమతి కొండవీటి విజయలక్ష్మి, కె.రామరాజభూషణుడు, డా.కత్తి పద్మారావు, ప్రొ.ఎన్. వేణుగోపాలరావు



డాక్టర్ అనురాధ, డాక్టర్ మురళీకృష్ణలతో –విజయలక్ష్మి కాళిదాసు.




శ్రీ వెంకటేశ్వర బాలకుటీర్‌లో 60వ స్వాతంత్ర్య దినోత్సవం వేడుకలలో
కాళిదాసు. వేదికమీద మరుద్వతిగారు, కె. శాంతారావుగారు, విదేశీ ప్రతినిధులు.



జహీరాబాద్ వేసవి బాలల శిక్షణలోచిత్రలేఖనం పోటీలలో పాల్గొంటున్న
విద్యార్థినీ విద్యార్థులు, పరిశీలిస్తున్న కాళిదాసు, వలీ మాస్టారు.



డాక్టర్ రత్నకుమారి, డాక్టర్ శ్రీనివాస్, చి॥ సాహితిలతో కాళిదాసు-విజయలక్ష్మి



1990లో గుంటూరు జిల్లా అక్షర కళాయాత్ర  సందర్భంగా మాట్లాడుతున్న కాళిదాసు, మాణిక్యమ్మ, అమరమ్మ, రోహిణి, కళాప్రదర్శనకు సిద్ధంగా ఉన్న కళాకారులు.




డాక్టర్ కాసరనేని సదాశివరావు శతజయంతి సభ సందర్భంగా కాళిదాసును సత్కరిస్తున్న డాక్టర్ కె. వల్లీరాణి, డాక్టర్ ఉషాబాల, డాక్టర్ పాటిబండ్ల వెంకటేశ్వర్లు, డాక్టర్ కె. కృష్ణవర్ధన్, శ్రీ కె. జయశంకర్.



**విజయలక్ష్మిగారి పుట్టినిల్లు – చినకోండ్రుపాడు**

నిల్చున్నవారు: కృష్ణవేణి, ఐరా, కల్పన, వెంకట్రావు, కిరణ్.

కూర్చున్నవారు: కల్పన (బుల్లెమ్మాయి), గోపి, రాజ్యం, విజయలక్ష్మి, కాళిదాసు, సుబ్బారావు, సాంబశివరావు.




పోపూరి రామారావు విజ్ఞానకేంద్రం తరపున యడ్లపాడులో ప్రత్తి, మిర్చి సాగు ప్రదర్శనా క్షేత్రంలో మెళకువలు వివరిస్తున్న ప్రొఫెసర్ వేణుగోపాలరావు, రైతు నూతలపాటి సుబ్బరామమూర్తి, కాళిదాసు.




డా. కాసరనేని సదాశివరావు కళాసమితి వార్షికోత్సవాల సందర్భంగా గుంటూరులో కాళిదాసును అభినందిస్తున్న ఉమ్మడి రాష్ట్రమంత్రివర్యులు శ్రీ మండవ వెంకటేశ్వరరావు, శ్రీ లావు రత్తయ్య, శ్రీ మద్దినేని సుధాకర్, డా. యర్రా నాగేశ్వరరావు, డా. పాతూరి కిరణ్, శ్రీ. వై.వి ఆంజనేయులు, భాష్యం రామకృష్ణ తదితరులు.




పల్నాడు స్టూడెంట్ & యూత్ కల్చర్ ఫెస్ట్– ప్రారంభోత్సవం సందర్భంగా శ్రీ ఎ.వి. శివయ్య, శ్రీ కె. సాయికుమార్, శ్రీ ప్రత్తిపాటి పుల్లారావు, ఎం.ఎల్.ఏ., శ్రీ ఎన్. కాళిదాసు, శ్రీ కె.ఎస్. లక్ష్మణరావు, ఎమ్.ఎల్.సి., సి.పి.ఐ.(ఎమ్) పల్నాడు జిల్లా కార్యదర్శి శ్రీ గుంటూరు విజయకుమార్ తదితరులు.



ఆలిండియా ఏ.ఐ.కె.ఎస్. మహాసభల సందర్భంగా గుంటూరు వచ్చిన
సి.పి.ఐ.(ఎమ్) పొలిట్‌బ్యూరో సభ్యులు కామ్రేడ్ బృందాకారత్‌తో
కామ్రేడ్ రమాదేవి, కామ్రేడ్ స్వరూపరాణి, విజయలక్ష్మి, కాళిదాసు.



గుంటూరులో గవర్నమెంట్ హాస్పిటల్‌లో
ఒక దురదృష్టకర సంఘటనను
పరిశీలించటానికి వచ్చిన
వైద్య ఆరోగ్యశాఖామాత్యులు
డాక్టర్ కామినేని శ్రీనివాస్‌గారిని
కలిసి హాస్పిటల్‌లో జరిగిన ఘటనను
వివరిస్తున్న కాళిదాసు.

పరిష్కరించి, వారు జీవితంలో స్థిరపడడానికి మార్గం సుగమం చేసేవారు. నారాయణ పబ్లిక్‌స్కూల్‌లో నిర్వహించే జన విజ్ఞానవేదిక కార్యక్రమాలను ప్రోత్సహించేవారు. అలాగే యడ్లపాడు డెవలప్‌మెంట్ కమిటి, విజన్ ఫౌండేషన్ లింగారావుపాలెంలో నిర్వహించే ద్వైమాసిక వైద్యశిబిరాల నిర్వహణకు తన వంతుగా కృషిచేసేవారు.

మంచి మిత్రులు, ఆదర్శజీవి, ప్రజాశ్రేయోభిలాషి అయిన మా నూతలపాటి కాళిదాసు నిండునూరేళ్లు ఆయురారోగ్యాలతో జీవించాలని, అటువంటి మంచి వ్యక్తిత్వం ఉన్న కాళిదాసు గూర్చి భావితరాలకు తెలియచేయడానికి పుస్తకం రూపొందిస్తున్న శ్రీ సత్రాజు బాలచందర్‌గారికి కృతజ్ఞతలు.





గుంటూరు జిల్లా, నరసరావుపేటలో 1996 జిల్లా వీధినాటకోత్సవాలలో జననాట్యమంచ్ కళాకారిణి కామ్రేడ్ సోనియా గుప్తా (ప్రొఫెసర్) ఉపన్యాసాన్ని అనువదిస్తున్న ప్రజానాట్యమండలి రాష్ట్రనాయకురాలు కామ్రేడ్ పి.ఎ. దేవి.



**డా. ముత్తవరపు సురేష్‌బాబు**
పుడమి బిల్డర్స్ అధినేత,
హైదరాబాదు.
8885535888

# నాకు తెలిసిన నూతలపాటి

**నా**కు తెలిసిన నూతలపాటి అని ఎందుకు సంబోధించాను అంటే! అందులో నాది చిన్నస్వార్థం – నూతలపాటి కాళిదాసు అనవచ్చు కదా! అని కొందరు అనుకోవచ్చు! చెప్పానుగా చిన్న స్వార్థం అని!

నూతలపాటి ఆ పేరు ఉచ్చరిస్తేనే నాకు తెలియని అనుభూతి... కారణం... మూడుతరాలనుంచి వారి కుటుంబంతో మా కుటుంబానికి వున్న అనుబంధం అలాంటిది. కాళిదాసుగారి గురించి చెప్పబోయేముందు ఇంతకీ నేనెవరో చెప్పాలిగా...

నా పేరు ముత్తవరపు సురేష్‌బాబు. నేను నూతలపాటి కాళిదాసుగారికి వరుసకు మేనల్లుడిని. మా వూరు – నేను సగర్వంగా చెప్పుకునే యడ్లపాడు, కాళిదాసుగారి పుట్టినూరుకూడా! నూతలపాటి వెంకటేశ్వర్లు, వెంకాయమ్మలకు ఒక్కగానొక్క సంతానం.

వామపక్ష భావజాలంతో నిండిన ఊరు యడ్లపాడు. ఆ వూరిలో పుట్టి పెరిగిన మాకు అదే భావజాలం నిండుకుంది. ఆ వూరి భావజాలాన్ని అదేరీతిలో కొనసాగిస్తూ వస్తున్న ముఖ్యుల్లో ఒకరు నూతలపాటి కాళిదాసుగారు, ముద్దుగా నేను పిలుచుకునే పేరు “దాసుమామ.”

దాసుమామ గురించి చెప్పాలంటే...నిజాయితీ, పట్టుదల, కష్టపడేతత్వం ఆయన దగ్గరే చూసి నేర్చుకోవాలి. దాసుమామతో నాకు ఊహ వచ్చిన దగ్గర నుంచి దాదాపు నా ప్రయాణం సాగిందని చెప్పవచ్చు (మధ్య మధ్యలో కొన్ని సందర్భాల్లో తప్ప).

## నా చిన్నతనం నుంచి దాసుమామతో నా ప్రయాణం

యద్లపాడులో ఒక బజారులో నూతలపాటివారి ఇళ్లు వరుసక్రమంలో ఉంటాయి. నా చిన్నతనం ఎక్కువభాగం అక్కడే గడిపేవాడ్ని. దానికి కారణం, ముందే ఉదహరించాను. మూడుతరాల అనుబంధం మాది. మా తాత, మా నాన్న, నేను మూడుతరాల నుంచి ఆ యింటి అల్లుళ్లమే! అది చెప్పుకోవటానికి నాకు ఒక్కింత గర్వం!

ఎందుకంటే వారిలో ఉన్న మంచితనం, బంధుప్రీతి, ప్రతికష్టంలో తోడు నీడగా ఉండే స్వభావం, అన్నీ తామై ముందుకెళ్లేతత్వం కలిగినందువల్లనేమో! వారు అంటే నాకు వల్లమాలిన అభిమానం. ఇవన్నీ కలబోసిన వ్యక్తే మా నూతలపాటి కాళిదాసు మామ. ఈయనకు తగ్గట్టుగానే ఆయన సతీమణి విజయలక్ష్మిఅక్క దాసుమామకు ఏమాత్రం తీసిపోదు.

## వ్యవసాయ విధానం

నాకు ఊహ తెలిసిన దగ్గరనుంచి దాసుమామ వ్యవసాయం ఒకవైపు, గ్రామంలో అనేక కార్యక్రమాల్లో పాల్గొనటం మరోవైపు కొనసాగుతుండేది. 1975, 80 దశకాల్లో దాసుమామ అరకతో పొలం వెళ్లి తిరిగి సాయంత్రం ఇంటికి వచ్చే సమయానికి, బజారులో ఆరుబయట, 6 గంటలు 7 గంటలు మధ్య మంచాలు వరుసగా పరచుకొని, వాటిమీద కూర్చొని అందరూ కలసి భోంచేసే విధానం నా కళ్లముందు ఇంకా మెదలాడుతూనే ఉంది. నేను వారుపెట్టే గోరుముద్దలు తినటం ముఖ్యంగా విజయలక్ష్మి అక్కయ్య చేసే పచ్చళ్లతో ముద్దలు తినటం, దాసుమామ అన్నం కలుపుకొని తినే విధానం నా మదిలో ఇంకా మధురానుభూతులుగా మిగిలే ఉన్నాయి.

వ్యవసాయంలో కూడా నూతలపాటివారి కుటుంబాల్లో అత్యధిక మొత్తంలో సాగుచేయటమే కాక, అధిక దిగుబడులు సాధించటంలో కూడా సఫలీకృతు డయ్యేవాడు. ఇది ఆయన పనితనానికి నిదర్శనం.

## ముక్కుసూటి తత్వం

దాసుమామలో ఉన్న ముక్కుసూటితత్వం, మొండి పట్టుదల కారణంగా 75% మంచిగుణం అని సమర్థిస్తే 25% మంది విమర్శలు గుప్పించడం నేను గమనించాను. తనకు మంచి అనిపిస్తే ఆ పని మొదలుపెట్టి, పూర్తి అయ్యేంతవరకు తనకు నష్టం జరుగుతుంది అని తెలిసినా ఆ పని పూర్తి చేయటం తన ముక్కుసూటి తత్వానికి నిదర్శనం. ఒకటికాదు రెండుకాదు అనేక సంఘటనలు, గ్రామస్థాయి నుంచి డివిజన్, జిల్లా, రాష్ట్రస్థాయి నాయకుల వరకు తనకు నచ్చనిది విభేదించి, తన అభ్యంతరాలను నిర్మొహమాటంగా చెప్పటం దాసుమామ నైజం. ఈ సందర్భాలలో విమర్శలు ఎదుర్కోవటం కూడా దాసుమామకు అలవాటుగా మారిందనుకోండి.

ఇలా సాగుతున్న ఆయన కాలచక్రంలో అనుకోని విషాదం – తనకు వున్న యిద్దరు ఆడపిల్లల్లో రెండవపాప ఆడుకుంటూ నీటిలోపడి చనిపోవటం ఆ దంపతుల్లో విషాదం మిగిల్చింది. ఆ బాధను దిగమింగుకొని తిరిగి తమ పనిలో నిమగ్నమైన తరుణం అది. తర్వాత కొంతకాలానికి జిల్లా అధిష్ఠానంనుంచి కబురు, పూర్తికాలం కార్యకర్తగా జిల్లాలో కొన్ని బాధ్యతలు చూడాలని కోరింది. దానికి అమోదించిన దాసుమామ ఉన్న పొలం, కౌలుకి తీసుకున్నపొలం కూడా వేరేవారికి అప్పగించి, అప్పటికప్పుడు గుంటూరు వెళ్లడానికి నిర్ణయం తీసుకున్నాడు.

అయితే కొన్ని అనివార్య కారణాలవల్ల ఆ ప్రయత్నానికి ఆటంకం కలిగింది. పార్టీ పూర్తికాల కార్యకర్తగా జీతభత్యాలు అందించే పరిస్థితిలేదని పార్టీ అధిష్ఠానం వాయిదా వేసింది. అప్పటి జిల్లా బాధ్యతలు చూస్తున్న పుతుంబాక వెంకటపతిగారు అది చెప్పటానికి సంకోచిస్తున్న సమయంలో, తానే కల్పించుకొని, 'పర్వాలేదండి! జీతం లేకపోయినా పనిచేస్తాను' అంటూ కొన్ని సంవత్సరాలు ఎలాంటి పారితోషికం

అందుకోకుండా జిల్లాలో కొన్ని బాధ్యతలు చేపట్టారు దాసుమామ. ఈ సంఘటన ఆయన పట్టుదల, అంకిత భావానికి నిదర్శనం.

ఇలా ఆయన జీవితం కొనసాగుతున్న తరుణంలో ఆయన కుటుంబంలో మరో పెనువిషాద సంఘటన చోటుచేసుకుంది. ఈ సంఘటన రాయాలంటే నాలో చిన్నసంఘర్షణ. 1987లో ఇంటర్ మీడియట్ చదువుతున్న తన పెద్దకూతురు శోభారాణి అకాలమృత్యువాతపడటం ఆ కుటుంబాన్ని మరింత కుంగదీసింది. తమకున్న ఇద్దరు సంతానాన్ని కోల్పోయిన ఆ దంపతులు కోలుకోవటానికి కొంత సమయం పట్టిందని చెప్పుకోవచ్చు. కాలక్రమేణా బాధను మరచి తిరిగి పార్టీలో అనేక విభాగాల్లో చురుగ్గా పనిచేయటం ప్రారంభించాడు. ఈ సందర్భాన తన బాధను దిగమింగుకొని విజయఅక్క ఆయనకు మరింత సహకారాన్ని అందించింది.

ముఖ్యంగా ప్రజానాట్యమండలి బాధ్యతలు స్వీకరించి అనేక కార్యక్రమాలు చేపట్టారు. ప్రధానంగా కొన్ని అంశాలు ప్రస్తావిస్తాను.

## రాష్ట్రవ్యాప్తంగా సాగినయాత్ర

ప్రజానాట్యమండలి బాధ్యతలు చూస్తున్న శాంతారావు, దేవిలతోపాటు ఆయన ప్రయాణం కొనసాగించారు. అక్షరకళాయాత్ర పేరుతో అనేక కళా రూపాలను రూపొందించి ఎంతోమంది నూతన కళాకారులను, గాయకులను, వాయిద్యకారులను తయారుచేసి అప్పటి ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో వేలాదిప్రదర్శనలు నిర్వహించారు.

రాష్ట్రవ్యాప్తంగా నడిచిన ఈ యాత్రను తను ఒంటిచేత్తో నడిపిన విధానం అందరిమన్ననలు పొందింది. అనేకానేక ప్రజాసమస్యలపై సాగిన ఈ యాత్ర ప్రజలను చైతన్యవంతులను చేయటంలో ఎంతగానో తోడ్పడింది. అక్కడ ఆ ప్రస్థానంతోపాటు, తన స్వగ్రామమైన యడ్లపాడులో కూడా మరోప్రస్థానం మొదలుపెట్టాడు. ముత్తవరపు పద్మారావు, జరుగుల శంకర్రావు, ముత్తవరపు రామారావు (రాముడు) ముత్తవరపు సురేష్‌బాబు (నేను), పోపూరి శివరామకృష్ణ,

పుల్లగూర జోసఫ్ ఇంకా అనేకమంది కలయికతో ప్రజానాట్యమండలి కార్యక్రమాలను ప్రారంభించాడు దాసుమామ.

ముందుగా ప్రజాసమస్యలను ఇతివృత్తంగా తీసుకొని వీథినాటికలు, పాటలు, కోలాటంతో మొదలైన ప్రస్థానం, రాష్ట్రవ్యాప్తంగా జరిగే సాంఘికనాటకాల పోటీలవరకూ ఈ యాత్ర కొనసాగింపజేశాడు. ఈ టీంలో రచయిత, దర్శకులు జరుగుల రామారావుగారిని కూడా ఇన్వాల్ చేసి ముందుకు నడిపిన విధానం గుర్తుండిపోయే అంశం. ప్రజానాట్యమండలి, మానవత అనే పేర్లతో సాగిన ఈ ప్రస్థానంలో – 'మీరైతే ఏంచేస్తారు', 'పంజా', 'హెచ్చరిక'లతో మొదలై 'హాలికులు సేమమా', 'బుద్ధుడు పుట్టిన భూమిలో', 'జస్టిస్', 'గంగాజలం', 'ఫలం', 'ఆ పిలుపే నా కోరిక', 'అరవిరిసిన కుసుమం' ఇంకా అనేక నాటికలు రాష్ట్రవ్యాప్తంగా వందలాది ప్రదర్శనలు ప్రదర్శించి అనేక విభాగాల్లో ఎన్నో బహుమతులు పొందటానికి ప్రధాన కారణం…ఆయన ఆర్గనైజర్గా వ్యవహరించిన తీరే అని చెప్పవచ్చు. దానిలో ప్రధానంగా కొన్ని సంఘటనలను ప్రస్తావిస్తాను.

రైతాంగ సమస్యలపై దృష్టి సారించిన దాసుమామ దాన్ని ఇతివృత్తంగా తీసుకొని ఒక నాటిక తీయాలన్న తలంపుతో, వంద కిలోమీటర్ల దూరంలో ఉన్న కొమ్మా ప్రసాద్గారిని కలిసి తను అనుకున్నది చెప్పి, నాటిక రాయమని కోరాడు. ఆయనకు తోడుగా జరుగుల రామారావుగారిని కూడా జతచేసి "హాలికులు సేమమా" అనే పేరుతో ఒక నాటికను తయారుచేశారు. దానికి తాను అర్గనైజర్గా వ్యవహరించి దర్శకత్వ బాధ్యతలు జరుగుల రామారావుగారికి అప్పగించాడు. దానిలో నటులుగా ముత్తవరపు పద్మారావు, జరుగుల శంకర్రావు, రత్నకుమారిలను ఎంపిక జేసి, తను కూడా ఒక నటునిగా టీమ్ని ఏర్పాటు చేశాడు. ఆ నాటికను రాష్ట్రవ్యాప్తంగా వందలాది ప్రదర్శనలు ఇవ్వటమేకాక ఎన్నో అవార్డులను సొంతం చేసుకున్నారు.

అదే సమయంలో సారాకు వ్యతిరేకంగా ఒక వీథినాటికను డాక్టర్ కందిమళ్ల సాంబశివరావుచే రచింపజేసి, జరుగుల రామారావు దర్శకత్వంలో తన ఆర్గనైజేషన్లో, రాష్ట్రవ్యాప్తంగా ఊరూర వందలాది ప్రదర్శనలు ఆడి ప్రజల

మన్ననలు పొందారు. దానిలో దాసుమామ నటించటమేకాక, నాచేత స్త్రీపాత్ర ధరింపజేయడం విశేషం.

1990లో యడ్లపాడు టీం సభ్యులు జరుగుల రామారావుగారు కలసి 'బుద్ధుడు పుట్టిన భూమిలో' అనే నాటికను రచించారు. ఆ రచనను నాటికగా మలచటం కోసం దాసుమామతో సంభాషణలు కొనసాగించారు. అయితే దాసుమామకు ఆ రచన అంతగా రుచించక నాటికగా మలచటానికి అంగీకారం తెలపలేదు. దాంతో అందరిమధ్య పెద్దచర్చ, ఈ విషయంలో జరుగుల రామారావు గట్టిగా చర్చించటం ఆయనకు తోడు ముత్తవరపు పద్మారావు, ఇతర సభ్యులు బాగుంది, ఖచ్చితంగా ఆడాల్సిందే అన్న తరుణంలో, వారి వాదనను అంగీకరించి నాటికరూపంగా మలచటానికి అంగీకారం తెలిపాడు దాసుమామ. ఈ విషయం నేను ఎందుకు తెలియచేస్తున్నాను అంటే "కేంద్రీకృత ప్రజాసామ్యం" అవలంభించటంలో కూడా చిత్తశుద్ధి ఉన్న వ్యక్తిగా భావించవచ్చు అని.

కొన్ని సందర్భాల్లో తనకు ఇష్టం లేకపోయినా, అందరి అభిప్రాయాన్ని గౌరవించి ముందడుగు వేయటం అనేది ఆయన నైజానికి నిదర్శనం అని చెప్పవచ్చు. ఆ తర్వాత ఆయన ఆర్గనైజేషన్‌లో 'బుద్ధుడు పుట్టిన భూమిలో' నాటిక తీయడం జరిగింది. ఆ నాటికలో ముత్తవరపు పద్మారావు, జరుగుల రామారావు, జరుగుల శంకర్రావు, పుల్లగూర జోసఫ్‌లతోపాటు ముత్తవరపు సురేష్‌బాబు (నేను) ముఖ్యపాత్రలో నటించటం జరిగింది. ఈ నాటిక రాష్ట్రవ్యాప్తంగా అనేక పరిషత్‌లలో ఎన్నో బహుమతులు పొందింది. ముఖ్యంగా 1991లో హైదరబాద్ పరుచూరి రఘుబాబు స్మారక నాటకపోటీల్లో అన్ని విభాగాల్లో బహుమతులు పొంది, ఉత్తమప్రదర్శనగా నిలిచింది. దాంతోపాటు నాకు సినిమాల్లో అవకాశం కల్పిస్తున్నట్టు స్టేజిమీద పరుచూరి బ్రదర్స్‌తో ఎన్నిక చేయబడటం మరపురాని అనుభూతి. ఈ కష్టంమొత్తం దాసుమామదే అని చెప్పటంలో ఏ మాత్రం అతిశయోక్తిలేదు. రిహార్సల్ దగ్గరనుంచి, ప్ర్యూట్నీ జడ్జీలు వచ్చినా, మహిళా కళాకారిణులు వచ్చినా, మ్యూజిక్ దర్శకులు వచ్చినా అందరికీ దాసుమామ ఇంట్లోనే ఆతిథ్యం కల్పించేవారు. ఈ సందర్భంగా దాసుమామ సతీమణి

విజయలక్ష్మి అక్కయ్యను అభినందించక తప్పదు. భర్తకుతగ్గ భార్య. అన్ని విషయాల్లో దాసుమామ కంటే ముందే ఉంటుంది. ఇంటికి వచ్చినవారిని గౌరవంగా చూడటం, కుటుంబ సభ్యుల్లో ఒకరిగా భావించటం, కావలసినవి వండిపెట్టి బంధువుల్లా చూసుకొని ఆతిథ్యం ఇవ్వటం ఆమె మంచితనానికి నిదర్శనంగా చెప్పవచ్చు.

ఈ సందర్భంగా నాకు సంబంధించి ఒక చిన్నవిషయాన్ని మీ దృష్టికి తీసుకువస్తాను. పరుచూరి బ్రదర్స్ నాకు సినిమాల్లో అవకాశం కల్పించటానికి హైదరాబాద్ రమ్మని కబురు చేశారు. దాసుమామ నన్ను, తోడుగా ముత్తవరపు రామారావు (రాముడు) అన్నయ్యను తీసుకొని హైదరాబాద్ పరుచూరి గోపాలకృష్ణగారి ఇంటికి తీసుకెళ్లాడు, 1992 ప్రాంతంలో. పరుచూరి గోపాలకృష్ణ గారితో మాట్లాడుతూ, 'మా మధ్య వీడు ఒక్కడేనండి. మీకు అప్పజెప్తున్నాము' అన్న సమయంలో నేను దాసుమామ వైపు చూశాను. జీరబోయిన చిన్నగొంతు, ఆయన కళ్లల్లో చిన్నకన్నీటిపొర వచ్చిన తీరు, నేను ఎప్పటికి మర్చిపోలేను. బహుశా ఆ సంఘటనేమో నేను వెనుదిరిగి రాకుండా అనేకరంగాల్లో ఎదగటానికి కారణమైంది!

ఆ తర్వాత యడ్లపాడులో పుచ్చలపల్లి సుందరయ్య నాటకోత్సవాలు ప్రారంభించటం, సుందరయ్యగారి పేరుమీద కళాప్రాంగణం, కళావేదిక నిర్మించటం జరిగింది. గత ఇరవైరెండు సంవత్సరాలుగా ముత్తవరపు రామారావు (రాముడు), ముత్తవరపు సురేష్‌బాబు (నేను), పద్మారావు, శంకర్రావులకి, దాసుమామ తోడుగా ఉంటూ ఇప్పటికీ నిర్వహణా బాధ్యతల్లో పాలుపంచుకోవటం ఆయన కమిట్‌మెంట్‌కి ప్రత్యక్ష నిదర్శనం. అనేకమంది కళాకారుల్ని సత్కరించటం, పుచ్చలపల్లి సుందరయ్యగారి పేరున అవార్డ్ ప్రదానం చేయటం, మహిళా కళాకారిణులను అడపడుచు లాంఛనాలతో సత్కరించటంలాంటి కార్యక్రమాలు ఆయన మంచితనానికి నిదర్శనంగా చెప్పవచ్చు.

అదేవిధంగా యడ్లపాడు గ్రామంలో కామ్రేడ్ పోపూరి రామారావు విజ్ఞాన కేంద్రం నిర్మాణంలో ముఖ్య భూమిక పోషించి, భవననిర్మాణ కార్యక్రమాలు

పూర్తయ్యేంతవరకు మాతో కలిసి పనిచేయటం ఆయన నిబద్ధతకు నిదర్శనం. ఆ భవనంలో ఇప్పుడు అనేక కార్యక్రమాలు నిర్వహిస్తూ ముందుకుసాగటంలో ప్రధాన భూమిక పోషిస్తున్నాడు దాసుమామ.

అదేవిధంగా యడ్లపాడు లూథరన్ ఉన్నత పాఠశాల విషయంలో ఇదే టీంతో, ఆలోకం పెద్దబ్బయ్యగారిని కలుపుకొని పాఠశాల అస్తులు కాపాడటమే కాక, స్థానిక విద్యార్థుల భవిష్యత్తుకోసం ఓ కార్యాచరణ రూపొందించుకొని ముందుకెళ్లటం, ఈ సందర్భంగా గుర్తుచేసుకోవాల్సిన అంశం.

ఈ సందర్భంగా నా చిన్నప్పటి జ్ఞాపకం ఒకటి ప్రస్తావించవలసిన అవసరం ఉంది. ఉద్యమాలకు ఊపిరిగడ్డ యడ్లపాడుగడ్డ అయితే! ఆ ఉద్యమాలలో భాగంగా యడ్లపాడు నేషనల్ హైవే మీద ఉండటంవల్ల, ఏ ఉద్యమం ప్రారంభమైనా, యడ్లపాడు హైవే దిగ్బంధనంతో ప్రారంభమయ్యేది. ఆ సమయంలో దాసుమామ పనితీరు గమనించాను. ఉద్యమం ఎంత ముఖ్యమో, వాహనదారులు, డ్రైవర్లు, ప్రయాణికుల బాగోగులు కూడా అంతే ముఖ్యంగా చూసుకోవటం నేను ప్రత్యక్షంగా చూశాను. పులిహోర, పెరుగన్నం, మంచినీళ్ళ బిందె భుజానికి ఎత్తుకొని వాహనం వాహనం తిరిగి అందరికి దాసుమామ అందజేయటం నా కళ్లారా చూశాను. దానితోపాటు గ్రామంలో ఇంటింటికి ఇద్దరు లేక నలుగురు చొప్పున పిల్లలను, మహిళలను పంపి వారికి కావలసిన సదుపాయాలను కల్పించటంలో దాసుమామయొక్క ఔదార్యం, అంకితభావం కన్పిస్తుంది.

## దాసుమామతో మధురానుభూతులు

'హాలికులు సేమమా', 'బుద్ధుడు పుట్టిన భూమిలో' నాటికలు ప్రదర్శించే సమయంలో రెమ్యునరేషన్ చాలా స్వల్పంగా ఉండేది. 300 రూపాయల నుంచి 700 వరకు వచ్చేవి. ఆ సమయంలో బడ్జెట్ విషయంలో ఒక అర్గనైజర్‌గా దాసుమామ పొదుపు పాటించేవాడు. వేరే ప్రాంతాలకు నాటిక ఆడటానికి టీం బయలుదేరే విధానం ఎలా ఉంటుంది అంటే! రాత్రి అందరూ ఇంటి దగ్గర

భోంచేసి రాత్రి 10 గంటలకు హైవే మీదకు వచ్చేవాళ్లం. అక్కడ ఏదైనా లోడుతో కూడిన లారీ మాట్లాడి మమ్మల్ని అందరినీ సామానుతో సహా లోడ్ పైభాగంలో టార్బల్‌పై కూర్చోపెట్టి, మాతో దాసుమామ కూడా. మహిళా కళాకారిణిని మాత్రం క్యాబిన్‌లో కూర్చోబెట్టి తొర్రూరు వెళ్లాం. అక్కడ భోజనాలకు హోటల్ టోకెన్స్ అందజేశారు. హోటల్‌కు వెళ్ళగానే చికెన్ వాసనలు గుప్పుగుప్పు మంటున్నాయి. అందరిలో నాన్-వెజ్ భోజనమని లోలోపల సంతోషం. వెళ్లి కూర్చోగానే అందరి ముందు వెజ్ భోజనం దర్శనమిచ్చింది. అందరికి లోపల నిరుత్సాహం. నేను దాసుమామవైపు చూశాను. ఆయనకు నా చూపులోని భావన అర్థమైనట్టుంది. అంతే వెళ్లి ఏదో మాట్లాడి వచ్చాడు. కట్‌చేస్తే, అందరిముందు నాన్-వెజ్ భోజనం. అందరిలో ఉత్సాహం. అది దాసుమామ అంటే!

పద్మారావుకాని, నేనుకాని, జోసఫ్ మాస్టారుకాని ఏమీ పట్టించుకొనేవాళ్లం కాదు. దాసుమామ లేకపోతే రిహార్సల్స్ కూడా చేసేవాళ్లం కాదు. ఒకసారి రిహార్సల్స్ రూమ్‌లో రిహార్సల్స్ చేయకుండా అందరం సొల్లు మాట్లాడుకుంటూ, జోకులు వేసుకుంటూ కూర్చున్నాము. ఎవ్వరూ దాసుమామను గమనించలేదు. అంతే! కోపోద్రిక్తుడైన దాసుమామ అక్కడ ఉన్న స్టూల్‌ని ఎత్తిపడేసి, 'దొబ్బేయండి. నాటికలేదు గీటికలేదు' అంటూ రంకెలు, కేకలు, తిట్లపురాణం...ఇక అందరికీ నో వాయిస్, ఓన్లీ రిహార్సల్స్...

దాసుమామకు సినిమాలమీద చాలా మక్కువ. నా చిన్నతనంలో దాసుమామ, మేనమామ నూతలపాటి సుబ్బారావుతో కలిసి నేనుకూడా చిలకలూరిపేట సినిమాకు వెళ్ళేవాడిని. వెళ్లినరోజు రెండు లేక మూడు సినిమాలు చూసేవారము.

దాసుమామ పంచకట్టు విధానం చాలా బాగుండేది. ఒత్తైనజుట్టు, తెల్లని పంచ, తెల్లనిచొక్కా ధరించి బజారుకు వచ్చేవాడు. నల్లనివాడైనా తెల్లగా మెరిసేవాడు. చూపరులను ఆకట్టుకునేవాడు. నాటికలు ఆడే సమయంలో మాత్రం లుంగీ, మాసినచొక్కా, భుజంమీద సెట్ ప్రాపర్టీ...దటీజ్ దాసుమామ...

## చివరి పలుకు

ఒక్కమాటలో చెప్పాలంటే కష్టంతెలిసిన మనిషి...ఎదుటివారి కష్టాన్ని ఎరిగిన మనిషి...ఎవరికి ఏ సమస్య వచ్చినా నేనున్నానంటూ ముందుకు నడిచే మనిషి..ప్రజాసమస్యలపై స్పందించే మనిషి...తనకున్నా లేకపోయినా ఎదుటివారి ఆకలితీర్చే మనిషి...

ఇలాంటి మనిషి గురించి ఎంత రాసినా, ఎంత చెప్పినా తక్కువే అవుతుంది. దాసుమామ గురించి నేను మీకు తెలియజేస్తున్నందుకు నాకు గర్వంగా ఉంది. నేను రాసిన ప్రతిమాట అక్షరసత్యం...మరొొక్కసారి నూతలపాటి కాళిదాసు మామకు, విజయ అక్కకు ధన్యవాదాలు తెలుపుతూ నిండు నూరేళ్లు వర్థిల్లాలి అని కోరుకుంటూ కళాభినందనలతో...





తక్కెళ్ళపాడులో డాక్టర్ సదాశివరావు నాటక కళాపరిషత్ వేదికమీద డాక్టర్ పి.వి. రావు, డాక్టర్ కృష్ణవర్ధన్, ముత్తవరపు సురేష్‌బాబు, మోపర్తి నాగేశ్వరరావు, నుసుము నాగభూషణం తదితరులు, మాట్లాడుతున్న కాళిదాసు.

# ఆంధ్ర ప్రజానాట్యమండలి ప్రార్థనగీతం

**ది**క్ర్ప్రాంగణములు ధ్వనియించు వీణపాణి
కళాంతర్వాణి కళగానాల - నాదాలసరళి
ప్రభవించు - ప్రభంజనాల ఝురిగనుదయించు

ఆంధ్ర ప్రజానాట్యమండలి రమ్యకాంతులకడలి
విశ్వకళామయి కనుల వెలిగించు సమతాలయ హోయలజ్యోతి...
జిందాబాద్ జిందాబాద్ ఆంధ్ర ప్రజానాట్యమండలి జిందాబాద్
డాక్టర్ రాజా జోహార్ - పెరుయిళ్లు జోహార్
కోడూరు అచ్చయ్య జోహార్ - కుటుంబరావు జోహార్
జోహార్! జోహార్! జోహార్! ॥జిందా॥

కాలం వంతుగకత్తులు వంతెనకట్టినవేళ
అణుఅణువు అడ్డుగోడలై నిలిచినవేళ
కళావన్నెలకు కళలను గరిపిన
బళ్లారికి నయనాంజలి - అంజలి - కుసుమాంజలి ॥జిందా॥

కళాచరితలో కెంపుగా మెరిసిన
ప్రజాసౌఖ్యమే నాదని తలచిన
నవగళమెత్తిన గరికపాటికి అంజలి - కుసుమాంజలి
ఇదియే మా హృదయాంజలి ॥జిందా॥

రచన: **తిరువీధి పురుషోత్తం**



**వై.యస్. కృష్ణేశ్వరరావు**
ప్రముఖ రంగస్థల రచయిత,
దర్శకుడు, నటుడు,
పొన్నూరు.
9866679102

# కమ్యూనిస్టు కాళిదాసు

కాళిదాసు –

అనగానే ఏ కాళిదాసు?

యడ్లపాడు కాళిదాసా?

నూతలపాటి కాళిదాసా?

రైతుసంఘం కాళిదాసా?

ప్రజానాట్యమండలి కాళిదాసా?

కమ్యూనిస్టు కాళిదాసా?

ఒక్కోచోట ఒక్కో ప్రశ్న...

రూపాలెన్ని వున్నా – సారం ఒక్కటే

'కమ్యూనిస్టు కాళిదాసు'

సిద్ధాంతం పట్ల విశ్వాసం, పార్టీ పట్ల నిబద్ధత – కలిస్తే కాళిదాసు.

పార్టీ తనకప్పుచెప్పిన పనిని క్రమశిక్షణతో, ఏమాత్రం అలసత్వం లేకుండా సక్రమంగా నిర్వహించే కార్యదక్షుడు – కాళిదాసు.

తనకన్నా కిందిస్థాయిలో వున్న కార్యకర్తనైనా, తనకన్నా ఎంతో పైస్థాయిలో వున్న నాయకులనైనా – నిర్వహణ విషయంలో నిలదీసే సిసలైన వ్యక్తిత్వం – కాళిదాసు.

లక్ష్యం నుంచి పక్కకి పోడు–

లక్ష్యాన్ని పూర్తిచేసేవరకు విశ్రమించడు–

ఇక నాకు తెలిసిన కాళిదాసుగారు–

ఆయనలో మంచి నటుడున్నాడు–

రంగస్థల నాటక పరిశీలకుడున్నాడు–

విమర్శకుడున్నాడు–

ప్రదర్శనని, రచనని అంచనావేయగల

గుణనిర్ణేత వున్నాడు–

అన్నిటికీ మించి పక్షపాతం లేని మంచి

మనిషి వున్నాడు–

కాళిదాసుగారు ముప్పదేళ్లుగా తెలుసు–

ఇరవై ఏళ్ల పరిచయం–

దాదాపు దశాబ్దం పైబడిన దగ్గరితనం–

ఆయన నిక్కచ్చితనం నాకు ఇష్టం–

ఆడంబరం, ఆర్భాటం తెలీని ఆయన వ్యక్తిత్వం

మరింత ఇష్టం–

విప్లవాభినందనలతో.....





**నర్రా శ్రీనివాసరావు**
న్యాయవాది,
ఆంధ్రప్రదేశ్ హైకోర్టు.
**బి. వాసంతి**
లీగల్ కమ్ ప్రొబేషన్ ఆఫీసర్,
గుంటూరు జిల్లా.
8897590565

# ప్రజాకళలసారథి కాళిదాసు

**క**ళ కళ కోసం కాదు, ప్రజలకోసం, ప్రగతికోసం అని నినదించే ఆంధ్ర ప్రజానాట్యమండలి గుంటూరు జిల్లా రథసారథి రాష్ట్ర ప్రజాకళా ఉద్యమంలో ప్రముఖపాత్ర పోషించిన శ్రీ నూతలపాటి కాళిదాసుగారు ప్రశంసనీయులు. ఉమ్మడి గుంటూరుజిల్లా ప్రజానాట్యమండలి కార్యదర్శిగా అనేక నాటికలు రూపొందించటంలో, వాటికి ప్రోత్సాహం ఇవ్వటంలో కాళిదాసుగారు ప్రత్యేకచొరవ చూపారు. వారితో మా ఇరువురికీ చిన్నతనంనుంచే అవినాభావ సంబంధం ఉన్నది. వారి కార్యక్రమాలను ప్రత్యక్షంగా చూడటం, వారి నిర్వహణ సామర్థ్యం 90వ దశకంనుంచి చూడటంవల్ల వారి కృషి, పట్టుదల ప్రజా కళా ఉద్యమంలో ఎంచదగినది.

90వ దశకంలో హైస్కూల్ చదివే రోజుల్లో మమ్ములను ప్రోత్సహించి, నాటిక పోటీలద్వారా చిన్నప్పుడే మాలో ఉన్న కళాతృష్ణను వెలికితీసి, నాటికలు వేయించి ప్రజా కళారంగంపట్ల ఆకర్షితులయ్యేటట్లు వారు కృషిచేశారు. అప్పటినుండి అనేకమైన వర్క్‌షాపుల్లో పాల్గొని వీధినాటికలు, డప్పు, పాటలు వంటి అనేక కళారూపాలు వారు వినూత్నంగా రూపొందించి ప్రజలకు చేరేటట్లు, ప్రజా అభ్యున్నతికి దోహదపడేటట్లుగా కాళిదాసుగారి కృషి ఎంతో ఉన్నది.

1993లో రాష్ట్రవ్యాప్తంగా ఉవ్వెత్తున సారా వ్యతిరేక ఉద్యమం నడవగా, ఆ ఉద్యమానికి ఊపిరిపోసేందుకు రెంటపాళ్ళలో ఒక కార్యశాలను నిర్వహించి అక్కడ కళాకారులతో సారా సర్కార్ అనే వీధినాటికను కళాకారులందరి భాగస్వామ్యంతో రచించి, అప్పటి ప్రజా నాట్యమండలి రాష్ట్రకార్యదర్శి శాంతారావుతో కలిసి ఆ వీధినాటికను రూపొందించి మా కళాకారుల బృందంచే దగ్గరుండి మరి 100కు పైగా ప్రదర్శనలు ఇవ్వటం, ప్రజలను ఉద్యమంలో భాగస్వామ్యం చేసి సారా నిషేధానికి తోడ్పడటం జరిగినది.

ఒక కార్యక్రమాన్ని తలపెడితే అది విజయవంతం అయ్యేవరకు రాత్రిపగలు తేడా లేకుండా శ్రమించడం, కార్యకర్తలను సమీకరించటం, కళారూపాల ప్రదర్శనలు, వాటిని ప్రజలకు హత్తుకునేలా ప్రదర్శించేటట్లు ప్రత్యేకశ్రద్ధ కనబరిచేవారు. రాష్ట్ర, జిల్లాస్థాయి వీధినాటకోత్సవాల నిర్వహణ అబ్బురపరిచే విధంగా నిర్వహించటం ఆయనకి వెన్నతో పెట్టినవిద్య. అన్ని సందర్భాల్లో కళాకారులను తీర్చిదిద్దటం, కమ్యూనిస్ట్ ఉద్యమానికి దోహదపడేటట్లు, సైద్ధాంతిక నిబద్ధతతో నిర్వహించటం ఆయన పట్టుదలకు చిహ్నం. నిరంతరం కార్యకర్తలను సమీకరించి, అటు రైతు ఉద్యమానికి, ఇటు కళా ఉద్యమానికి నాయకుడిగా ఎదిగి ఎందరికో స్ఫూర్తినిచ్చారు. ఆయన చెప్పదలచుకున్న విషయాలను సూటిగా నిర్మొహమాటంగా చెప్పటం, కార్యకర్తలకు చేదోడు వాదోడుగా ఉండటం, వారికి మార్గదర్శిగా వ్యవహరించటం, ఆయన కర్తవ్యంగా భావించారు.

మా చిన్ననాటి రోజుల్లో యడ్లపాడు, లింగారావుపాలెం కళాకారులు రూపొందించి ఆడే నాటకాలు, వివిధ కళారూపాలు, అటు చిలకలూరిపేటలో జిల్లా, రాష్ట్రస్థాయిలో అనేకమైనటువంటి బహుమతులు పొందడం, గుంటూరు జిల్లా కళా ఉద్యమానికి ఒక మంచిగుర్తింపు తీసుకురావడంలో వారు మంచి కృషి చేశారు. ఎక్కడ నాటకోత్సవాలు జరిగినా వాటికి న్యాయనిర్ణేతగా వెళ్ళటం, వాటిలో ఉండే సారాంశం ప్రజలకు ఉపయోగపడుతుంద లేదా అని సునిశితంగా చెప్పేవారు. కళ ప్రజలదైనందిన జీవితంలో మంచి, చెడును ఎంచటానికి, సమాజ

అభివృద్ధికి పాటుపడాలని, తద్వారా సమాజమార్పు సాధ్యమౌతుందని చెప్పేవారు. ఆ కృషిలో భాగంగా వందలమందిని కళాకారులుగా తీర్చిదిద్ది, వారి నైపుణ్యానికి పదునుపెట్టేవారు. 90వ దశకం నుంచి వారి కృషి, పట్టుదల అత్యంత సన్నిహితంగా చూసినందువల్ల వారిలో ఉండే సైద్ధాంతికనిబద్ధత, కమ్యూనిస్ట్ ఉద్యమం పురోభివృద్ధికి కళారూపంద్వారా ప్రజల చైతన్యానికి హితోధికంగా దోహదపడ్డారు. ఇప్పటిలా సమాచారవ్యవస్థ అభివృద్ధి కాని 90వ దశకంలో ఎక్కడ కార్యక్రమం నిర్వహించాలన్నా ఒంటి కాలితో బయలుదేరి రాత్రిపగలు తేడాలేకుండా కిలోమీటర్లు నడిచి వెళ్ళి ఆయన ఆయా గ్రామాల్లో, పట్టణాలలో కళాకారులను కలిసి, వారిని ప్రోత్సహించి, వారు వర్క్‌షాపులకు ప్రత్యేక కొత్తకళారూపాలను రూపొందించే టట్లు, నిరంతరం తపనపడేవారు. ఆ మేరకు కొన్ని వర్క్‌షాపుల్లో పాల్గొని తర్ఫీదు పొందిన మేము, వారి నిర్వహణ సామర్థ్యం కావలసిన ఆర్థికవనరులు సమకూర్చుకునేందుకు తెలిసినవారందరిని కలవటం, వారిని ఒప్పించి నిధులు సమీకరించి ఆయన చేపట్టిన ప్రతి కార్యక్రమాన్ని విజయంవైపు పరుగులు తీసేటట్లు కాళిదాసుగారు కృషిచేశారు.

వ్యక్తిగతంగా అనేక సందర్భాలలో మార్గదర్శిగా వ్యవహరించటం, మంచి సలహాలు సూచనలు చేసి మా వ్యక్తిగత అభివృద్ధికి తోడ్పడ్డారు. వారివల్ల మేము చాలా పాఠాలు నేర్చుకున్నాము. విద్యార్థి ఉద్యమంలో పనిచేస్తూ నరసరావుపేటలో ఉన్న కాలంలో జిల్లాస్థాయి ఓపెన్ థియేటర్ (షాట్) దిగ్విజయంగా నిర్వహించి రాష్ట్రవ్యాప్తంగా అనేకమంది కళాకారులను ప్రోత్సాహపరిచి, అప్పటి పార్టీ నాయకులు బి. ఆంజనేయరెడ్డిగారి తోడ్పాటుతో జయప్రదంగా వీధి నాటకోత్సవాలు, వివిధ కళారూపాలు ప్రదర్శించి, వాటిని చూసేందుకు వేల సంఖ్యలో ప్రజలను సమీకరించటం ఇప్పటికీ మా కళ్ళముందు ఆవిష్కృత మౌతున్నాయి.

కాళిదాసుగారి దీక్ష, పట్టుదలవల్ల ఉమ్మడి గుంటూరుజిల్లాలో ఎన్నో కార్యక్రమాలు నిర్వహించటం, తద్వారా ప్రజలను చైతన్యపరచటం ప్రత్యేకించి

అభినందించాల్సిన విషయం. ఇప్పటికీ ఉభయ తెలుగురాష్ట్రాలలో అనేకచోట్ల ఈ నాటకపోటీలు, వివిధ కళారూపాల కార్యక్రమాలకు హాజరవటం ఆయనలోని కళాతృష్ణకు నిదర్శనం. ఐదు దశాబ్దాల కమ్యూనిస్ట్‌పార్టీ (మార్క్సిస్ట్) ఉద్యమాలలో, ముఖ్యంగా కళారంగం ఉద్యమంలో కీలకపాత్ర నిర్వహించిన కాళిదాసుగారు మాకు ఎప్పుడు స్ఫూర్తిదాయకం. వారు మరిన్ని కార్యక్రమాలు నిర్వహించి కళాభివృద్ధికి, ప్రజల అభివృద్ధికి కృషి చేయాలని మనసారా కోరుకుంటున్నాను.






'మా తెలుగుతల్లికి మల్లెపూదండ' రాష్ట్ర తెలుగు భాషా సంస్కృతి కళాయాత్ర సందర్భంగా గుంటూరు శ్రీ వేంకటేశ్వర విజ్ఞానమందిరంలో వేదికపై గుంటూరు జిల్లా పోలీస్ సూపరింటెండెంట్ వి.సి.సజ్జనార్, డాక్టర్ కాసరనేని సదాశివరావు, డాక్టర్ కొండబోలు బసవపున్నయ్య, కవి, కథారచయిత డాక్టర్ పాపినేని శివశంకర్, శ్రీ కె.ఎస్. లక్ష్మణరావు. మాట్లాడుతున్న కాళిదాసు.



**బి. దశరథ**
రచయిత,
ప్రజానాట్యమండలి సీనియర్ నాయకులు,
రావినూతల, ప్రకాశం జిల్లా.
9440437995

# అడుగడుగునా ఆదర్శం

ఈమధ్య యద్లపాడులో సుందరయ్య నాటక కళాపరిషత్ సందర్భంగా మిత్రుడు కాళిదాసుగారి పిలుపుమేరకు న్యాయనిర్ణేతగా వెళ్లాను. అక్కడ ప్రేక్షకుల నుండి కొంతమందిని జడ్జీలుగా ఎంపిక చేశారు. మమ్మల్ని, వారిని కలిపి కాళిదాసుగారు ఒక ఇంట్లో చిన్న సమావేశం ఏర్పాటు చేశారు. ఆ ఇంటి యజమాని అందరికీ కూల్‌డ్రింక్ తెచ్చి ఆప్యాయంగా ఇస్తున్నాడు. 'నేను త్రాగనండి, వద్దు' అన్నాను. 'పర్వాలేదు తీసుకో'మని రిక్వెస్ట్ చేయడంతో ఆయన తృప్తి కోసం తీసుకున్నాను. అలాగే కాళిదాసుగారికి కూడా ఇవ్వబోగా 'వద్దు' అన్నారు. బ్రతిమిలాడినప్పటికీ 'కూల్‌డ్రింక్ తాగకూడదు, మంచిది కాదు, కాబట్టి నేను తాగను' అని నిర్మోహమాటంగా తిరస్కరించారు. నాటినుండి నేటికీ తను అనుకున్నది తూచా తప్పకుండా ఆచరించే కాళిదాసుగారి మనస్తత్వంలో ఏ మార్పు లేకపోవడంతో నాకు ఆశ్చర్యం, ఆనందం రెండూ కలిగాయి.

కొందరిని చూడగానే మొండివారిగా అనిపిస్తారు. తక్కువ పరిచయం ఉన్నవారు వీరిని మొండివాడు అనే ముద్ర వేస్తారు. ఈ మొండిలో రెండు రకాలు. తా పట్టిన కుందేలుకు మూడే కాళ్లు అనేవాళ్లు ఒకరైతే, తాను నమ్మిన సిద్ధాంతం కోసం నిజాయితీగా, నిబద్ధతతో అనుకున్నది సాధించేవరకు కృషి చేసేవారు రెండోవారు. ఈ రెండవవారు కాళిదాసుగారు. వీరు నిక్కచ్చిగా ఉండేవారు. తప్పు చేయరు, మాట పడరు. పొరపాటు జరిగితే ధైర్యంగా ఒప్పుకుంటారు,

సరిదిద్దు కుంటారు. వీరితో స్నేహం ముప్పై అయిదు ఏళ్లుగా నిత్య నూతనంగా విరాజుల్లుతున్నది.

తొలుత మేము ఒకరినొకరు అర్థం చేసుకోవడానికి ముప్పై ఏళ్లనాడు మా ప్రకాశంజిల్లాలో జరిగిన అక్షరాస్యత ఉద్యమం మాకెంతో దోహదపడింది. ప్రజానాట్యమండలి సహకారంతో నాడు ప్రకాశంజిల్లా అక్షరాస్యత ఉద్యమం... జిల్లా అధికారుల ఆధ్వర్యంలో ప్రభుత్వం నిర్వహించింది. ఆ సందర్భంగా మాకు సహాయంగా గుంటూరుజిల్లా ప్రజానాట్యమండలి కార్యదర్శిగా కాళిదాసుగారు రాష్ట్రటీమ్‌లో భాగంగా, పదిహేను రోజులుపాటు ఆ శిక్షణాకేంద్రంలో అహర్నిశలు కృషిచేసి, 600 మంది కళాకారులు అంకితభావంతో నేర్చుకొని పనిచేసేలా తోడ్పాటు అందించారు. ఆ వర్క్‌షాప్ అనుభవాలు మరువలేనివి. నలభై నాటిక దళాలు, ఎక్కువ కొత్తవారు అయినప్పటికీ జిల్లా వ్యాప్తంగా అక్షరాస్యత ప్రాధాన్యతను తమ ప్రదర్శనలద్వారా ప్రేరేపించడానికి, క్రమశిక్షణతో కూడిన ఆ పదిహేను రోజుల శిక్షణాశిబిరం ఎంతో దోహదపడింది. కళాకారులకు ఎలాంటి ఇబ్బందులు జరగకుండా భోజనం, వసతులు నిర్వహణలో ఎలాంటి లోపాలు జరగనీయకుండా కాళిదాసుగారు నిర్వాహకులకు సూచనలు ఇస్తూ వెన్నంటి కాచుకొని ఉండటం ఇప్పటికీ మర్చిపోలేము.

ఒక పని బాధ్యత తీసుకుంటే అది పూర్తి అయ్యేవరకు అదే ధ్యాస, అదే శ్వాస. అడ్డంకులు అధిగమించటమే కానీ వెనుకడుగు వేయటం తనకు నచ్చని పని. తెలియనిది పిల్లవాడిలా అడగటం, ఎవరైనా తప్పు చేస్తుంటే తండ్రిలా మందలించటం వారిలో ఉన్న గొప్ప సుగుణం. తప్పు జరిగితే ఎంతటి వారినైనా ప్రశ్నించే ధైర్యం, అర్థం కాకపోతే తనకంటే చిన్నవారినైనా గురువు వద్ద విద్యార్థిలా అడిగి తెలుసుకోవడం వారి వ్యక్తిత్వానికి నిదర్శనం.

ప్రజానాట్యమండలి నాడు నిరంతరం నిర్వహించే రాష్ట్రరచయితల శిక్షణ, కళారూపాల శిక్షణ శిబిరాల నిర్వహణలో తన పాత్ర చాలా కీలకం. తను రచయిత కానప్పటికీ రచయితల వర్క్‌షాప్‌కు కోరి పిలుచుకునేవారం. తను కూడా కళారూపాల నాణ్యత కోసం కోరి వచ్చేవారు. అంటే ప్రజాసమస్యల మీద

రూపొందించే కళారూపాలు ప్రజలకు అర్థమయ్యే రీతిలో, ఇతివృత్తం గాడితప్పని రీతిలో ఉండాలని మనసారా కోరుకొని రచయితల సారం పిండేవారు. లోపం ఉంటే ఎత్తిచూపడం, సందేహం వస్తే ప్రశ్నించడం ద్వారా, రచయితలకు మంచి పాట, నాటిక వ్రాయడానికి దారి సుగమం అయ్యేది.

ప్రజాకళలు ప్రజాచైతన్యానికి సులభమార్గమని నమ్మటమే కాకుండా, ప్రజా సాంస్కృతిక ఉద్యమ నిర్మాణానికి కళాసైనికులను తయారు చేయడంలో తన జీవితాన్ని వెచ్చించిన మార్గదర్శి కాళిదాసుగారు. ప్రజల కష్టాలను తన కష్టాలుగా భావించి రచయితల వెంటబడి ప్రజాసమస్యలపై కళారూపం వచ్చేవరకు తను నిద్రపోకుండా మిగతావారిని నిద్రపోనీయకుండా కళారూపం రూపొందించి, ప్రదర్శించే వరకు పట్టు వదలని విక్రమార్కుడు కాళిదాసుగారు.

1983-85 ప్రాంతంలో తెల్లదోమ వచ్చి ప్రత్తిపంట పూర్తిగా దెబ్బతిని పోయింది. సర్వం నష్టపోయిన రైతులు దిక్కుతోచక ఆత్మహత్యలకు పాల్పడ్డారు. ఈ తరుణంలో మా జిల్లాలో “అన్నదాతా మేలుకో” నృత్యనాటిక రైతులకు అండగా నిలిచి, రైతు ఉద్యమానికి ఉత్తేజాన్ని ఇచ్చింది. ఇదే సందర్భంలో కాళిదాసుగారు రైతుల దీనపరిస్థితిపై గుంటూరుజిల్లా యడ్లపాడులో “హాలికులు సేమమా” స్టేజి నాటిక రూపొందించి, విస్తృతంగా ప్రదర్శించి, రైతాంగానికి, రైతు ఉద్యమానికి తోడై నిలిచారు. నాటకపరిషత్తులలో ఎన్నో బహుమతులు సొంతం చేసుకున్న ఆ నాటిక ప్రజల హృదయాల్లో నేటికీ నిలిచిపోయింది అంటే వారి అంకితభావం ఎలాంటిదో తెలుస్తుంది.

ప్రభుత్వ విధానాలు, మార్కెట్ వైఖరి రైతును ఎలా కృంగదీస్తున్నాయో వివరిస్తూ కనుమరుగవుతున్న పౌరాణిక పద్యనాటకం రూపాన్ని తీసుకొని సామాజిక సమస్యలు జోడించి పూర్తి పద్యాలతో “విషవలయంలో భారతం” వీధినాటకం రూపొందించి హార్మోనియం తీసుకొని గ్రామగ్రామాన ప్రదర్శించి అందరి మన్ననలు పొందటం అనుకున్నంత సులభం కాదు. పద్యనాటకాన్ని బ్రతికించాలి, మన ప్రజానాట్యమండలి ప్రత్యేకతను చాటాలి అన్న దృఢసంకల్పం వారిని ఆ పనికి పురికొల్పింది.

ప్రథమ స్వాతంత్రోద్యమ సంగ్రామం స్వర్ణోత్సవాల సందర్భంగా దేవిగారు రచించి దర్శకత్వం వహించిన "కన్నెగంటి హనుమంతు" ఒక అద్భుతమైన హిస్టారికల్ ప్లేగా నిలిచింది. 45 మంది కళాకారులతో పాలపాడులో నెల రోజులు అహర్నిశలు కష్టపడి నేర్చుకున్న ఆ నాటకం ఆనాటి స్వాతంత్రోద్యమ కాలంలో కన్నెగంటి వీరోచిత పోరాటం నేటి యువతకు స్ఫూర్తిని రగిలించడంలో కాళిదాసుగారి అకుంఠిత దీక్ష, పట్టుదల చూస్తుంటే మాలాంటివారికి ఉత్తేజం కలిగించేవి.

జానపద కళ అయిన కోలాటం ద్వారా గ్రామాలలో దళాలను నిర్మించే ఆలోచనతో రేపల్లె దగ్గర తిప్పలకట్ట గ్రామంలో 15 రోజులు 20 మందికి కోలాటం గురువుల శిక్షణ ఇవ్వటం, వీరు ప్రతిరోజు పక్క గ్రామాల్లోని యువతకు వారు నేర్చుకున్నది ఏరోజుకారోజు నేర్పటం ఒక మంచిప్రయోగం. రెండు మూడు రోజులకి శిక్షణ శిబిరాలకు టైం వెచ్చించటానికి ఇబ్బంది పడుతున్న రోజుల్లో నాడు 15 రోజులు కోలాటం శిక్షణ నిర్వహించడం తన పట్టుదలకు నిదర్శనం. దాదాపు 300 మంది కళాకారులు నేర్చుకొని అమరవీరుల స్మారక స్థూపం వద్ద ప్రదర్శించడం చూస్తుంటే కాళిదాసుగారి దూరదృష్టిని గుర్తించవచ్చు.

కౌలురైతులు గిట్టుబాటు ధర లేక అప్పుల పాలవుతూ, ప్రభుత్వ రాయితీలు అందక ఆత్మహత్యలకు సిద్ధమవుతున్న తరుణంలో శాంతారావుగారి దర్శకత్వంలో నాచే రాయించిన" బ్రతుకుదారి" నాటిక రూపకల్పనకు కృషిచేసి, కష్టాలను ప్రభుత్వ దృష్టికి తీసుకువచ్చే ప్రయత్నం చూస్తుంటే ప్రజాసమస్యలపై వారి హృదయస్పందనకు తార్కాణంగా నిలుస్తుంది. ఇలా చెప్పుకుంటూపోతే ఎన్నో స్ఫూర్తినిచ్చే సంఘటనలు. అవి నెమరు వేసుకుంటుంటే మధురమైన అనుభూతి. అందుకే మా స్నేహం ఎప్పుడూ నిత్య నూతనం అంటాను.

చివరగా ఒక్కమాట. మనిషి జీవించడానికి గుండె ఎంత ముఖ్యమో కాళిదాసుగారు తన ఆశయాలకు అనుగుణంగా, నిరంతరాయంగా పని చేయడానికి తోడై నిలిచిన వారి సతీమణి శ్రీమతి జయమ్మను తలచుకోకుంటే తప్పుచేసిన వాడిని అనిపిస్తుంది.

బయటకు కనపడనిశక్తి జయమ్మగారు. కాళిదాసుగారి ఆరోగ్యం విషయంలో...చిన్నపిల్లవాడిని చూసుకున్నట్లుగా జాగ్రత్త వహించడం ఒక ఎత్తు అయితే, కాళిదాసుగారి స్నేహితులను, ఉద్యమనాయకులను ప్రేమతో పలకరించటం, ఆప్యాయంగా ఆతిథ్యం ఇవ్వటం ఆమెకు ఎంతో ఇష్టం అయినవి. ఇష్టమై చేసే పని కష్టం అనిపించదు. అందుకే ఆమెలో ఎప్పుడూ చిరునవ్వుల పలకరింపే చూస్తాము. తన ఇద్దరు ఆడపిల్లలు ప్రమాదంలో ఒకరి తరువాత ఒకరు చనిపోయినప్పటికీ కన్నపేగుతీపి కడుపులోనే దాచుకొని, మంచిసమాజం కోసం పరితపించేవారిని తన బిడ్డలుగా భావించి, సమసమాజం కోసం కలలుకనే ఆదర్శగృహిణి జయమ్మగారు. వీరిద్దరి అన్యోన్య దాంపత్యం, నమ్మిన సిద్ధాంతం కోసం సాగించేవారి జీవనవిధానం అడుగడుగునా ఆదర్శప్రాయం. దగ్గరుండి చూసినవారికి ఎంతో స్ఫూర్తిదాయకం. వారి జీవనయానం ఎందరికో మార్గదర్శకం. వారికివే నా హృదయపూర్వక అభినందనలు.

ఒక మంచిమిత్రుని సాంగత్యంలో మధురస్మృతులు గుర్తుచేసుకునే అవకాశం కల్పించిన శ్రీయుతులు బాలచందర్; సంస్కృతి, గుంటూరువారికి నా మనఃపూర్వక ధన్యవాదములు.



'షాట్ 99' సందర్భంగా వేదికమీద సహజకవి, సినీ నిర్మాత, డా. మల్లెమాల, ప్రొఫెసర్ ఉండేల మాలకొండారెడ్డి. మాట్లాడుతున్న కాళిదాసు.



**బి. ఆంజనేయరెడ్డి**
సిపిఎం సీనియర్ నాయకులు
నరసరావుపేట

# నా మదిలో కాళిదాసు...

**ఉ**ప్పెన 1977 నవంబర్‌లో దివిసీమను తుడిచిపెట్టడమే కాకుండా, దక్షిణ కోస్తానంతా కకావికలం చేసింది. చిలకలూరిపేట ప్రాంతాన్ని పెనుతుఫాన్ ఎఫెక్టెడ్ ఏరియాగా ప్రభుత్వం ప్రకటించలేదు. ఎవరు ఎంత మొత్తుకున్నా వినే పరిస్థితిలేదు. ఆ సమస్యపై రైతాంగం, వ్యవసాయ కార్మికులు, పేదలు షుమారు ఐదారు వేలమంది జాతీయ రహదారిని యడ్లపాడు వద్ద ఉదయం 9 గంటల నుండి సాయంత్రం వరకు బ్లాక్ చేయడం జరిగింది. 3 కిలోమీటర్ల మేర ట్రాఫిక్ నిలిచిపోయింది. న్యాయమైన సమస్య పైన జరుగుతున్న ఆందోళన కనుక బస్సుల్లో, వ్యానుల్లో, జీపుల్లో, కార్లలోని ప్రయాణీకులు కూడా ఇందులో పాల్గొన్నారు. వారందరికీ భోజనం ఏర్పాట్లు చేయడం జరిగింది. తప్పనిసరి పరిస్థితిలో స్పందించిన జిల్లా కలెక్టర్ ట్రాఫిక్ జామ్ వలన వంకాయలపాడు వద్ద కార్ దిగి 3 కిలోమీటర్లు నడిచి యడ్లపాడు చేరుకొని చిలకలూరిపేట ప్రాంతాన్ని పెనుతుఫాన్ ఎఫెక్ట్ ఏరియాగా ప్రకటించారు. జిల్లాలోనే సంచలనం రేపిన సంఘటన ఇది. ఈ కార్యక్రమానికి ప్రజలను సమీకరించే కృషిలోను, మొత్తం బంద్ కార్యక్రమం లోను నాటి యడ్లపాడు యువ కామ్రేడ్ కాళిదాసు పాల్గొని కీలకంగా పని చేశాడు. నాటి అఖిలపక్ష రైతాంగ ఉద్యమ ప్రభావం కూడా కాళిదాసుపై బలంగా పడింది.

1978లో జిల్లా రైతుమహాసభ యడ్లపాడులోని శ్రీనివాస్, లక్ష్మీ థియేటర్లలో 300 మంది ప్రతినిధులతో 2 రోజులపాటు జరిగింది. తదుపరి చిలకలూరిపేట నియోజకవర్గం పరిధిలో అఖిలపక్ష ఉద్యమం పాదయాత్ర, రిక్షా సైకిళ్ల దళం

ప్రచారం జరిగింది. ఈ రెండు కార్యక్రమాలను కామ్రేడ్ కాళిదాసు ఓన్ చేసుకొని తన మార్క్ కృషిని చేశాడు. ఇంతటితో ఈ పని రాక్షసుడు కామ్రేడ్ పుతుంబాక వెంకటపతి దృష్టిలో పడ్డాడు. 1979లో పార్టీ సభ్యత్వం ఇచ్చి యడ్లపాడు-2 శాఖలో చేర్చారు.

## ఆంధ్రప్రదేశ్ రైతు సంఘం - కాళిదాసు

1986-87లో ప్రత్తిపైరుపై పచ్చపురుగు దాడి చేసింది. తీవ్రనష్టానికి గురై ప్రకాశం, గుంటూరు జిల్లాల్లో రైతుల ఆత్మహత్యలు జరుగుచున్న పరిస్థితి. ఈ సమస్యపై "హాలికులూ-సేమమా" నాటిక రూపొందించి విస్తృతంగా ప్రచారం చేశారు. హైద్రాబాద్ లోని రవీంధ్ర భారతి ఆడిటోరియంలో జరిగిన ప్రదర్శనను హైకోర్ట్ జడ్జి పి.ఏ.చౌదరిగారు, ఇతర ప్రముఖులు చూసి ప్రశంసించారు. వివిధ జిల్లాల్లో, పరిషత్‌ల్లో, మద్రాస్ నగర పరిషత్‌లో మొత్తంగా 100కు పైగా ప్రదర్శనలు జరిగాయి.

ఎరువుల బ్లాక్ మార్కెట్ సందర్భంగా చిలకలూరిపేటలో జరిగిన అందోళనలన్నింటిలో పాల్గొన్నారు. ఒక సందర్భంగా ప్రైవేట్ గోడౌన్ తలుపులు తెరుస్తున్నప్పుడు తీవ్రంగా లాఠిచార్జి జరిగింది. పోలీసులు కాళిదాసును బలవంతంగా ఎత్తి పడేశారు. అప్పులకోసం బ్యాంకుల ముందు ప్రధానంగా సహకార బ్యాంక్ ముందు అనేక సందర్భాల్లో జరిగిన ఆందోళనల్లో పాల్గొన్నారు.

యడ్లపాడు ప్రాంతంలో రైతాంగాన్ని ఐక్యం చేసే కృషిలో కామ్రేడ్ పోపూరి రామారావుకి తోడుగా నిలిచారు. నాదెండ్ల సమితి ఎన్నికల సందర్భంగా యడ్లపాడులో 2800 పైగా ఓట్లు పోలైతే 2400కు పైగా పి.ఆర్.కు వచ్చాయి. పెద్దకర్మ రోజున కాకుండా మరునాడు భోజనాలకు వచ్చే నూతలపాటివారి అలవాటుని కూడా మార్పు చేశాడు. అంతకు ముందు పొగతోటలు పీకేసుకోవడం, గడ్డివాములు తగలపెట్టుకునే పరిస్థితి ఉండేది. పేదలు ఎర్రచెరువును ఆక్రమించి ఇళ్లు వేసుకునేప్పుడు, కొలతలు వేసి పట్టాలు ఇచ్చేప్పుడు, ఒక వేసవిలో వచ్చిన పెనుతుఫానుకు మునిగినప్పుడు ఆ ప్రజానీకానికి అండగా నిలిచాడు. అనంతరం ఏపి రైతుసంఘం గుంటూరు జిల్లా సహాయ కార్యదర్శిగా కామ్రేడ్ కాళిదాసు ఎన్నికైనారు. యడ్లపాడులో సిసిఐ కేంద్రం ఏర్పాటు చేసే కృషిలో భాగమైనారు.

1985లో ఆంధ్ర ప్రజానాట్యమండలి గుంటూరు జిల్లా కన్వీనర్‌గా, అదే ఏడాది రాష్ట్రకమిటి సభ్యులుగా ఎన్నికైనారు. సత్తెనపల్లిలో కార్యకర్తలకు శిక్షణా శిబిరం కూడా నడిపారు. 1990లో భారత జ్ఞానవిజ్ఞాన సమితి తరఫున "అక్షరాస్యత కార్యక్రమం" తీసుకున్నారు. నలుగురు ఆర్గనైజర్స్‌కు ధవళేశ్వరంలో 15 రోజులపాటు, 20 మంది దళానికి తాడికొండలో 15 రోజులపాటు శిక్షణ ఇప్పించి, జిల్లాలోని 57 మండలకేంద్రాల్లో మరియు 500 మందికి పైగా గ్రామాల్లో 45 రోజులపాటు ఏకధాటిగా ప్రచారం చేశారు. నల్గొండ, ఖమ్మం, తూర్పుగోదావరి దళాలస్థాయిలో ప్రచారం జరిగింది. ఆయా ప్రచారాల్లో విశ్వనాథం మాస్టారు, మెట్టు కోటిరెడ్డి, మాణిక్యమ్మ, అమరమ్మ, ముత్తవరపు పద్మారావు, శ్యాంప్రసాద్ తదితర కామ్రేడ్స్ కృషి, తోడ్పాటు అసాధారణం.

కామ్రేడ్ పోపూరి రామారావు తోడ్పాటుతో 1994 జనవరిలో 6 రోజులపాటు చిలకలూరిపేటలో ఆంధ్ర ప్రజానాట్యమండలి జిల్లామహాసభ జరిగింది. "రైతు" వీధినాటిక దళానికి శిక్షణ ఇవ్వబడింది. ఆం.ప్ర.నా.మండలి గుంటూరుజిల్లా అధ్యక్ష కార్యదర్శులుగా కాళిదాసు, కొలకొట్ల వెంకటేశ్వర్లు ఎన్నికయ్యారు. ఫణిదంవారి "రైతు" వీధినాటికను 100కు పైగా గ్రామాల్లో, పట్టణాల్లో ప్రదర్శనలిచ్చారు. కౌలు రైతుల సమస్యలపై పాలపాడులో "బ్రతుకు దారి" నాటికను రూపొందించి 50కి పైగా ప్రదర్శనలిచ్చారు. ఈ విధంగా ఎదిగిన స్థితిలో జిల్లాలో 11 దళాలు అందులో ప్రత్యేకంగా 2 మహిళాదళాలు ఏర్పడి పనిచేశాయి. గుంటూరు మహిళా మెడికోలు "ప్రశ్నించండి" నాటికను ఆరేడు ప్రదర్శనలు ముఖ్యమైన సందర్భాల్లో ప్రదర్శించారు. రాష్ట్రకేంద్రంలో తయారైన ప్రతి కళారూపానికి ఆడియో క్యాసెట్స్‌ని తయారుచేసి మన దళాలతో విస్తృతంగా ప్రదర్శనలిచ్చే స్థాయికి సంఘనిర్మాణం చేరింది.

1996 నరసరావుపేటలో 2వ జిల్లా మహాసభ 3 రోజులపాటు జరిగింది. 25 మంది కళాకారుల దళంతో 35 రోజులపాటు నరసరావుపేట పట్టణంలో ఇంటింటి ప్రచారం జరిగింది. 15 వేల కరపత్రాలు పంపిణీ చేయడం జరిగింది. మహాసభ సందర్భంగా ఫండ్ రూ. 2 లక్షలు వసూళ్లు జరిగింది. ప్రతిరోజు సాయంత్రం మున్సిపల్ హైస్కూల్లో ఆంధ్ర ప్రజానాట్యమండలి జిల్లాషాట్‌కు 2500 నుండి 3 వేలమందికి పైగా ప్రేక్షకులు హాజరుకావడం స్ఫూర్తిదాయకంగా

నిలిచింది. 3వ రోజున బహిరంగసభ జరిగింది. సఫ్దర్ హాష్మీ సహచరి సోనియాగుప్తా, తెలంగాణ పోరాటయోధురాలు మల్లు స్వరాజ్యంగారు హాజరయ్యారు.

2005 స్వాతంత్ర్య స్వర్ణోత్సవాల సందర్భంగా స్వాతంత్ర్య సమరయోధుడు కన్నెగంటి హనుమంతు చరిత్ర "వీరగంధం" నాటకాన్ని పాలపాడులో రూపొందించారు. పిఏ.దేవి, శాంతారావులతో పాటుగా కాళిదాసు 45 రోజులు అదే గ్రామంలో ఉండి పూర్తి చేశారు. వీరగంధం నాటిక హైద్రాబాద్‌లోని రవీంద్రభారతి ఆడిటోరియంలో ప్రదర్శన జరిగింది. రాష్ట్రంలో తయారయ్యే వీధినాటికలు, డప్పులు, కోలాటం విన్యాసాల్లో మాస్టర్లు, పాటలు, పద్యాలు పాడేవారు తయారయ్యే విధంగా కృషి జరిగింది. పాలపాడు, చేజర్ల, రొంపిచర్ల, అన్నవరం, నరసరావుపేట కార్యకర్తలు బాగా కృషి చేశారు.

## మిలిటెంట్ మార్క్సిస్ట్ - కామ్రేడ్ నూతలపాటి కాళిదాసు

1980-81 అఖిలపక్ష ఉద్యమంలో ఆర్.టి.సి.బస్ చార్జీల పెంపుకు వ్యతిరేకంగా యడ్లపాడులో రాస్తారోకో జరిగింది. కామ్రేడ్ సుందరయ్యగారి పిలుపు మేరకు బస్సులను ఆపి టైర్లలో గాలి తీయడం జరుగుతుండగా ఒక బస్సు టైర్‌లో గాలి తీస్తున్న కాళిదాస్‌ని పోలీసులు పక్కకులాగి, తీవ్రంగా లాఠిచార్జి చేశారు. కొందరు పార్టీ కార్యకర్తలను గుంటూరు లాలాపేట పోలీసు స్టేషన్‌కు తీసుకు పోయారు. కార్యకర్తలపై దారుణంగా లాఠిచార్జి జరగడం, దెబ్బలు భరించలేని స్థితిలో కార్యకర్తలు, రోడ్డుపై ఈ దారుణాన్ని చూస్తున్న ప్రజలు కూడా ఎదురుదాడికి దిగడం చూసి సిఐ గాలిలోకి కాల్పులు జరిపేందుకు ప్రయత్నించడం చూసిన కాళిదాసు, వెంటనే సదరు సిఐని కొట్టడంతో చెయ్యిగూడ జారి పిస్టల్ కిందపడి పోవడంతో, ఇతర పోలీసులు కూడా ఆయుధాలు వదిలేయడం అనేది రాష్ట్రంలోనే సంచలన సంఘటన. తర్వాత ఏం జరిగిందనేది అలా ఉంచితే యడ్లపాడుశాఖ సత్తాను, సమరశీలతను ఆ ఘటన చాటింది.

1981లో విజయవాడ రాణిగారితోటలో జరిగిన అఖిలపక్ష బహిరంగ సభకు, 1982లో పార్టీ 11వ అఖిల భారత మహాసభ సందర్భంగా విజయవాడ

వైపు కృష్ణానదిలో జరిగిన గొప్పబహిరంగ సభలకు ఊరూరు తిరిగి ప్రజలను పెద్దసంఖ్యలో సమీకరించడంలో కామ్రేడ్ కాళిదాసు తనదైన శైలిలో పని చేశారు. 1981 నాదెండ్ల సమితి ఎన్నికల్లో, 1987 యడ్లపాడు మండలపరిషత్ ఎన్నికల్లో కొండవీడు పరిసర గ్రామాల్లో పని చేశారు. రిగ్గింగ్, రీపోలింగ్, ఊహకందని దౌర్జన్యం జరిగిన మండలపరిషత్ ఎన్నికల్లో కోట గ్రామం పోలింగ్ బూత్‌లో కాళిదాసు, చెన్నుపాటి యానాది పోలింగ్ ఏజంట్లుగా ఉన్నారు.

1983, 85, 89, 94 అసెంబ్లీ ఎన్నికల్లో సత్తెనపల్లి నియోజకవర్గం లోని మేడికొండూరు సెంటర్‌గా పాలడుగు, సిరిపురం, వరగాని, భీమినేనివారి పాలెం, డోకిపర్రు, కొమెరపూడి, కంటెపూడి, కొర్రపాడు గ్రామాల్లో ప్రచారం, రాజకీయ భాద్యతలను నిర్వహించారు. ఆయా గ్రామాల పెద్దలతో పరిచయాలే కాకుండా, రాజకీయ అనుభవం సాధనకు ఎన్నికల క్యాంపెయిన్ దోహదపడింది. 1991 పార్లమెంట్ ఎన్నికల్లో మిర్యాలగూడ, సాగర్ పరిసరాలు, చలకుర్తి మండలంలో పార్టీ నిర్దేశించిన ప్రచార భాధ్యతలను విజయవంతంగా చేపట్టారు. 1984 ఆగస్ట్‌లో ఎన్టీఆర్ ప్రభుత్వం రద్దు అనంతరం ప్రజాస్వామ్య పునరుద్దరణకై జరిగిన మహోద్యమంలో కాళిదాసు ముందు పీఠిన ఉన్నారు. గవర్నర్ రామ్‌లాల్‌పై జనవిజ్ఞాన వేదిక ప్రచురించిన 50 వేల బుక్‌లెట్స్‌ని గుంటూరు నుండి నెల్లూరు వెళ్లేలోపే 3 రోజుల్లో ప్రజలకు అమ్మారు.

## కాయకష్టంతో కొడుకుని పెంచి, పెద్దచేసిన వెంకాయమ్మ

నూతలపాటి వెంకటేశ్వర్లు-వెంకాయమ్మగార్ల ఒక్కగానొక్క కుమారుడు కాళిదాసు. సంవత్సర ప్రాయంలోనే తండ్రి చనిపోయారు. కాళిదాసుకి ముందు ముగ్గురు పిల్లలు పుట్టిపోయారు. ఉమ్మడి ఆస్తిలో వారి వాటాను పెద్దనాన్న, బాబాయిలు న్యాయంగా పంచి ఇవ్వలేదు. ఆ స్థితిలో కాళిదాసు తల్లి వెంకాయమ్మ చాలా కష్టాలుపడింది. ఇళ్లులేదు, ఒంటరి మహిళ. కాళిదాసుకు కాస్తంత అన్నం పెట్టి గేదెను కాసుకు రమ్మని చెప్పి, 10 కిలోమీటర్ల దూరంలో చిలకలూరిపేటలోని గోల్డెన్ టుబాకో కంపెనీకి గ్రేడింగ్ పనికి నడిచివెళ్లి తిరిగి రాత్రికి నడిచే ఇల్లు చేరేది. మగవాళ్లుండి పిల్లావాడిని అభివృద్ధి చేసినట్లే, ఎంతైనా కష్టపడి ఎంతో కొంత సంపాదించి, కొడుక్కి అప్పజెప్పాలని ఎంతో కాయకష్టం చేసి ఒక ఎకరం

పొలం కొన్నది. పాతఇంటిని కొని, ఒక  ఇల్లు ఏర్పాటు చేసింది. ఈ పరిస్థితుల్లో కాళిదాసు చదువుమీద శ్రద్ధలేక అల్లరిచిల్లరగా తిరిగేవాడు. అలా 11 ఏళ్ల వయస్సు వచ్చాక కాళిదాసు బాబాయ్ వరసయ్యే పోపూరి వెంకట్రావు (చంద్రయ్య) తీసుకెళ్ళి అరక నేర్పి, పొలం దున్నే పనికి వారింట్లోనే 4 ఏళ్లు అట్టి పెట్టుకున్నారు. ఆ తర్వాత మేనమామ తుళ్ళురి సంగయ్య (సంక్రాంతిపాడు), స్వంత బాబాయి నూతలపాటి సుబ్బారావుల వ్యవసాయం 3 ఏళ్లు చేశాడు. ముందరక దున్నడం, 10 ఎకరాల చేలోనైనా కోంద్రవేయు నైపుణ్యం హలధారి కాళిదాసుకి అబ్బింది.

బంధువులందరూ కలిసి 1971 మార్చి 13న కొల్లూరి సత్యనారాయణ –వెంకాయమ్మల కుమార్తె విజయలక్ష్మి (చినకొండ్రుపాడు)తో వివాహం జరిపించారు. పెండ్లితర్వాత చినకొండ్రుపాడులోనే వ్యవసాయం చేస్తూ, కొంతకాలం తర్వాత యడ్లపాడు వచ్చి వ్యవసాయం చేశాడు. కాళిదాసు–విజయలక్ష్మిలకు ఇద్దరు అమ్మాయిలు. పెద్దమ్మాయి శోభారాణి ఇంటర్ ద్వితీయ సంవత్సరం చదువుతూ అకాలమరణం చెందగా, చిన్న అమ్మాయి నాగరాజ 4 ఏళ్ల ప్రాయంలో నిండుగా ఉన్న నీళ్లగాబులో పడి చనిపోయింది.

ఈ స్థితిలో పి.వి.గారు కాళిదాసు ఇంటికి వెళ్లి జిల్లా కేంద్రానికి రావాలి అని చెప్పినప్పుడు వాళ్ల అమ్మగారు ఎంతో బాధతో – అయ్యా! వాడున్నాడనే నేనున్నాను, ఆ ఒక్కణ్ణీ నాకు దూరం చేస్తే ఎలాగయ్యా అన్నప్పుడు వెంకటపతిగారు స్థాణువైపోయారు. మొదట్లో కాళిదాసుకు ఆమెను విడిచి వెళ్లడం ఇష్టం లేకపోయినా, కొన్నాళ్లకు వెంకటపతిగారు చెప్పినట్లే జిల్లా కేంద్రానికి చేరాడు. చివరిదశలో వాళ్లమ్మగారు కొడుకు, కోడలి దగ్గరకు చేరి వారి సేవలను పొంది గుంటూరులోనే కన్నుమూసింది.

## చివరిగా మరొక్కమాట...

గత 45 ఏళ్లుగా పార్టీకి సంబంధించి ప్రధానమైన అన్ని కాంపెయిన్లలో కామ్రేడ్ కాళిదాసును గమనిస్తున్నా, అతను చెమటోడ్చి పని చేసే భయమెరుగని కామ్రేడ్. తన పరిధిలో కమ్యూనిస్ట్ ఉద్యమానికి కట్టప్పలాంటి వాడు. కామ్రేడ్ కాళిదాసు–విజయలక్ష్మిలది అన్యోన్యమైన ఆదర్శదాంపత్యం. వారికున్నంతలో

పార్టీ, ప్రజాసంఘాల కార్యకర్తలను, నాయకులను తరతమ భేదాలు లేకుండా ఆప్యాయంగా ఆదరించేవారు.

గుంటూరులో పార్టీ జిల్లాకార్యాలయం, యడ్లపాడులో కామ్రేడ్ పోపూరి రామారావు విజ్ఞానకేంద్రం నిర్మాణంలో తనవంతుగా, తనదైన కృషి చేశారు. ప్రజా నాట్యమండలి రాష్ట్ర కార్యవర్గ సభ్యులుగా, జిల్లా కార్యదర్శిగా, అధ్యక్షులుగా, రైతుసంఘం నాయకులుగా, గుజ్జం జాషువా విజ్ఞానకేంద్రం కార్యదర్శిగా, పార్టీ జిల్లాకమిటి సభ్యులుగా, జిల్లా ఆఫీస్ కార్యదర్శిగా, అకౌంట్స్ విభాగ బాధ్యులుగా పార్టీ ఏ బాధ్యత ఇచ్చినా అందుకు నూటికి నూరుశాతం న్యాయం చేసేందుకు కాళిదాసు కృషి చేశారు. సామాన్య కార్యకర్తగా ఉద్యమంలోకి వచ్చి చదువులేకున్నా ప్రజాతంత్ర ఉద్యమంలో ఆదర్శంగా, నీతి నిజాయితీలతో నిలిచిన కాళిదాసు గురించి భవిష్యత్ తరాలకు తెలిసేలా పుస్తక రూపం తెస్తున్న శ్రీ సత్రాజు బాలచందర్ గారికి ప్రత్యేక అభినందనలతోపాటు కృతజ్ఞతలు తెలియచేస్తున్నాను.






యడ్లపాడులో సి.సి.ఐ. కేంద్రాన్ని ఏర్పాటు చేయాలని మేనేజర్‌కి వినతిపత్రం అందిస్తున్న రైతుసంఘం జిల్లా అధ్యక్షులు పోపూరి రామారావు, కాళిదాసు, గంగయ్య.



**ఎం. ఆంజనేయులు**
ప్రజాశక్తి విలేఖరి,
గుంటూరు.
9985658614

# యూరప్‌కి మనకీ అదే తేడా...

***ప్రకృతి సహకరించకపోయినా యూరప్‌లోని పలుదేశాలు అభివృద్ధిని సాధించాయని, అయితే భారతదేశంలో ఉన్న వనరులు, వాతావరణ పరిస్థితులతో పోల్చుకుంటే, యూరప్‌లో వంద సంవత్సరాల్లో సాధించిన ప్రగతి, మనదేశంలో పాతిక సంవత్సరాల్లోనే సాధించవచ్చని చెబుతున్నారు నూతలపాటి కాళిదాసు. ఆయన 2014 ఆగస్ట్ 3 నుండి 50 రోజులపాటు యూరప్‌లోని పలుదేశాలు పర్యటించారు. ఎం.ఆంజనేయులుతో ఆయన పంచుకున్న పర్యటన అనుభవాలు ఆయన మాటల్లోనే...***

**గొతెంబర్గ్‌లో...:** స్వీడన్ దేశంలోని సేబోల్ట్ కంపెనీలో కెమికల్ ఇంజినీర్‌గా పనిచేస్తున్న మిత్రులు ఎన్. క్రాంతికుమార్ ఆహ్వానం మేరకు నేను, నా భార్య విజయలక్ష్మి ఆగస్ట్ 3న బొంబాయి నుండి విమానంలో స్వీడన్‌లోని గొతెంబర్గ్ వెళ్ళాం. స్వీడన్, డెన్మార్క్, హంగేరీ, ఆస్ట్రియా, జర్మనీ, లక్సంబర్గ్, నార్వే దేశాల్లో పర్యటించి, ఆయా దేశాల్లోని ప్రజల జీవన విధానాలు, ప్రభుత్వాల పనితీరుని పరిశీలించాము. పర్యటనలో మాతోపాటు మా మిత్రుని తల్లిదండ్రులు కృష్ణకుమారి, వెంకటేశ్వరరెడ్డి కూడా పర్యటించారు. మొదటగా నా మిత్రుడు పనిచేస్తున్న సేబోల్ట్ కంపెనీకి వెళ్లాం. అక్కడ బయో ఆయిల్ తయారీ, ప్రయోగాలు జరుగు తున్నాయి. అనంతరం తను చదివిన చాల్‌మర్స్ విశ్వవిద్యాలయాన్ని సందర్శించాము. మన యూనివర్సిటీలకు, అక్కడి యూనివర్సిటీలను అసలు పోల్చలేము. అక్కడి ప్రయోగశాలలు, సాంకేతిక పరిజ్ఞానాన్ని ఉపయోగించుకొని ప్రజలకు సౌకర్యాలు కల్పించడంలో ముందున్నారు. గొతెంబర్గ్ నగరంలోని జాన్

హెరెక్సన్ విగ్రహాన్ని సందర్శించాం. హెరెక్సన్ 1803లో స్వీడన్‌లో పుట్టాడు. బోటు దిక్సూచిని కనుగొన్నాడు. మేము గొతెంబర్గ్ చేరుకునేనాటికి నాలుగురోజుల ముందునుండి అక్కడ సాంప్రదాయ సాంస్కృతిక కార్యక్రమాలు జరుగుతున్నాయి. అక్కడ ప్రధానంగా హిప్ అప్ డ్యాన్స్, ఆఫ్రికా మ్యూజిక్ ఆహుతులను ఆకట్టుకునే విధంగా ఉన్నాయి. వేల రకాల మొక్కలతో ఏర్పాటు చేసి చాలా శుభ్రంగా నిర్వహిస్తున్న బొటానికల్ గార్డెన్‌ని సందర్శించాము. ప్రతి మొక్కకి సంబంధించిన వివరాలు తెలుసుకునేందుకు స్టీల్ ట్యాగ్ ఒకటి ఏర్పాటు చేశారు. గార్డెనింగ్ ఇంతకు ముందు ఎక్కడా నేను చూడనంత పరిశుభ్రంగా ఉంది. కారణం నిర్వాహకులను అడుగగా 'మా దేశంలో పని ఇచ్చేటప్పుడు మీకు ఇష్టమైన పని ఏమిటి' అని అడుగుతారు, ఆ పనిలో ఆసక్తి ఉన్నవారిని మాత్రమే నియమించు కోవడం వల్లనే శుభ్రంగా, అందంగా నిర్వహించడం సాధ్యం అవుతుందని తెలిపారు. గొతెంబర్గ్ నుండి రాజధాని స్టాక్‌హోమ్‌కి 500 కిలోమీటర్లు కారులో ప్రయాణించాము. అక్కడ నోబెల్ బహుమతి ఇచ్చే ఆల్‌ఫ్రెడ్ పేరుతో భవనం ఉంది. పార్లమెంట్ భవనం, మ్యూజియం, పలు ప్రాంతాల్ని సందర్శించాము. ఇక్కడ నిరంతరం వర్షం పడుతూనే ఉంటుంది.

**ప్రభుత్వం ద్వారానే స్టీం సరఫరా :** స్వీడన్ చలి దేశం అయినందున ప్రభుత్వమే ప్రతి ఇంటికి పైపుల ద్వారా స్టీమ్‌ని (వేడి ఆవిరి) సరఫరా చేస్తుంది. ప్రతి ఇంటికి మంచినీటిని కూడా ప్రభుత్వమే అందిస్తుంది. 18 డిగ్రీలకంటే ఉష్ణోగ్రత తగ్గితే ఆటోమేటిక్‌గా పైపులద్వారా ఇంటిలోకూడా ఉష్ణోగ్రత పెరుగుతుంది. స్టీమ్ తయారీ గురించి అధ్యయనం చేయడం, ప్రమాదాలు సంభవిస్తే తీసుకోవాల్సిన చర్యలు గురించి అధ్యయనం చేయడానికి 'ఉప్సల్' అనే విశ్వవిద్యాలయంలో ప్రత్యేకమైన డిపార్ట్‌మెంట్, ల్యాబ్ ఉన్నాయి.

**గ్రామాల్లోనూ అన్ని సౌకర్యాలు:** మేము పర్యటించిన అన్ని దేశాల్లోని పట్టణాల్లో ఉన్న సౌకర్యాలు గ్రామాల్లో కూడా ఉన్నాయి. ఇక్కడ భూములు పెద్ద పెద్ద కమతాలుగా ఉన్నాయి. గ్రామీణ ప్రాంతాల్లో కూడా అనేక పరిశ్రమలు ఉన్నాయి. కాలుష్యాన్ని అదుపు చేయడనానికి అక్కడి ప్రభుత్వాలు అనేకచర్యలు

తీసుకుంటున్నాయి. మైనింగ్, ఐరన్, మోటార్ వెహికిల్స్, ఆయిల్ రీసెర్చ్, టెలికమ్యూనికేషన్స్, ఫార్మాసుటికల్ రంగాల పరిశ్రమలు అధికంగా ఉన్నాయి.

**బిడ్డల సంరక్షణకు అధిక ప్రాధాన్యత:** స్వీడన్‌లో డిగ్రీ వరకు ఉచిత విద్యను ప్రభుత్వమే అందిస్తుంది. తల్లి ప్రసవించిన నాటినుండి ఆ బిడ్డను పాఠశాలలో చేర్పించే వరకు తల్లి, బిడ్డ సంరక్షణకు నెలకు ఒక వెయ్యిక్రోనులు ప్రభుత్వం భృతి ఇస్తుంది. బిడ్డతోపాటుగా తల్లికి కూడా నిర్ణీత కాలంపాటు పనికి వెళ్లకుండానే తను పొందే జీతంలో 80 శాతం భృతిగా ఇస్తుంది. (1 క్రోన్ భారతీయ కరెన్సీలో షుమారు రూ.10తో సమానం) నిరుద్యోగులుగా ఉండేవారు 15 నుండి 25 ఏళ్ల మధ్యవారే. అంటే వారంతా విద్యను అభ్యసిస్తున్నారు. నిరుద్యోగులు ఉద్యోగం సంపాదించుకునే వరకు భోజనం, వసతిని ప్రభుత్వం కల్పిస్తుంది. ఒకప్పుడు ఆ ప్రాంతంలో ఆధ్యాత్మికచింతనలు అధికంగా ఉండేవని, అయితే సాంకేతికపరిజ్ఞానం అభివృద్ధి చెందడంతో ఇప్పుడు ఆ పరిస్థితి లేదని స్థానికులు తెలిపారు. 75 శాతం ప్రజలు అసలు చర్చిలకు వెళ్లడంలేదన్నారు. అయితే వివాహాలు మాత్రం చర్చిల్లోనే జరుగుతున్నాయని, ప్రస్తుతం చర్చి ఫాదర్‌లు స్కూళ్లవద్దకే వెళ్లి బోధనలు చేస్తున్నారు.

**పటిష్టమైన ట్రాఫిక్ వ్యవస్థ:** మేము పర్యటించిన అన్ని దేశాల్లోను ట్రాఫిక్ వ్యవస్థ పటిష్టంగా ఉంది. విశాలమైన రోడ్లు, నగరాల్లో సైకిల్ వినియోగం అధికంగా ఉంది. నగరాల్లో ట్రాఫిక్ మరియు కాలుష్య నియంత్రణకు నగర శివారువరకు సైకిల్‌పై ప్రయాణించి, అక్కడి నుండి కారులో ప్రయాణం చేస్తారు. గొతెంబర్గ్ నుండి డెన్మార్క్ రాజధాని కోపెన్‌హాగ్ 500 కిలోమీటర్ల దూరాన్ని కేవలం 3 గంటల్లో కారులో ప్రయాణించామంటే పటిష్టమైన రోడ్లు, అక్కడి ట్రాఫిక్ నిబంధనలు, ప్రజలు వాటిని పాటించే విధానం వారి క్రమశిక్షణను తెలుపుతుంది. గొతెంబర్గ్ నుండి కోపెన్‌హాగ్ వెళ్లే మార్గంలో మాల్మో అనే పట్టణానికి కోపెన్‌హగ్‌కు మధ్యలో 18 కిలోమీటర్ల సముద్రం ఉన్నది. ఈ సముద్రంపైన కట్టిన బ్రిడ్జి చాలా అద్భుతంగా ఉంది. ఎందుకంటే సముద్రం మధ్యలో 6 కిలోమీటర్లు దూరం మేరకు సముద్రం క్రింద భాగంలో రైలు, కార్లు, బస్‌లు వెళుతుంటాయి.

వీటిపైన నీటిలో స్టీమర్స్‌ద్వారా ప్రయాణాలు సాగుతాయి. ఈ బ్రిడ్జిని చూసి అక్కడివారిని అడుగగా ఇటువంటి బ్రిడ్జి స్వీడన్, జర్మనీల మధ్య 40 కిలోమీటర్లు నిర్మించబోతున్నట్లుగా తెలిపారు. ఇది చూస్తే టెక్నాలజీని ఎంతగా వినియోగిస్తున్నారో అర్థమైంది. డెన్మార్క్‌లో మొట్టమొదటి ప్రపంచ గడియారాన్ని కనుగొనబడిన మోడల్ మ్యూజియంను చూశాము. భూమి తిరిగే విధానాన్నిబట్టి ఈ గడియారాన్ని రూపొందించడం దీని ప్రత్యేకత. గొతెంబర్గ్ నుండి నార్వే రాజధాని ఓస్లో పట్టణానికి వెళ్ళాము. అక్కడ ప్రత్యేకత ఏంటంటే మనదేశంలో సొంతకార్లు ఉన్నట్లు అక్కడ సొంతబోట్లు ఉంటాయి. వాటి ద్వారా సెలవుల్లో దీవులకు వెళుతుంటారు. ఇక్కడ కూడా స్వీడన్ రాజధాని స్టాక్‌హోమ్ మాదిరి నోబెల్ బహుమతులు ఇచ్చే భవనం ఉంది.

**స్వీడన్ ఎన్నికల విధానం:** స్వీడన్ దేశంలో నాలుగు సంవత్సరాలకు ఒకసారి ఎన్నికలు జరుగుతాయి. మేము వెనుదిరిగిన కొద్ది రోజుల్లోనే అక్కడ ఎన్నికలు జరగనున్నాయి. అక్కడ ప్రధానంగా ఏడుపార్టీలు పోటీలో ఉన్నాయి. భారతదేశంలో మాదిరిగా అక్కడ ఎన్నికల ప్రచారం లేదు. కేవలం అభ్యర్థులయొక్క వివరాలు తెలుపుతూ పోస్ట్‌ద్వారా ఒక స్లిప్ మాత్రమే ఓటర్‌కు చేరుతుంది. ఆ స్లిప్‌లో పోటీ చేసే అందరి పేర్లు ఉంటాయి. పార్లమెంటు, రాష్ట్రం, పంచాయితీలుగా పరిపాలన వ్యవస్థలు ఉన్నాయి. రాష్ట్రాల్లో శాసనసభలు ఉండవు. పార్లమెంట్‌కి మాత్రం ప్రాతినిధ్యం ఉంటుంది.

**కాన్సన్ట్రేషన్ క్యాంప్ సందర్శన:** బెర్లిన్ నగరంలో హిట్లర్ కాన్సన్ట్రేషన్ క్యాంప్‌ని సందర్శించాము. అక్కడ ఒక ప్రాంతంలో 5 లక్షలమంది యూదుల్ని చంపిన ప్రదేశం ఉంది. ఆ ప్రాంతానికి చుట్టూ అద్దాలు అమర్చి హిట్లర్ ఏ సంవత్సరం ఎంతమందిని చంపాడో వివరాలు తెలిపే బోర్డ్‌లు ఉన్నాయి. బెర్లిన్ గోడ, మార్క్స్, ఏంగెల్స్ విగ్రహాలు, జర్మనీ అడ్మినిస్ట్రేషన్ భవనాలను సందర్శించాము.

**మార్క్స్ పుట్టిన నగరం:** జర్మనీలోని ట్రయర్ పట్టణంలో కారల్‌మార్క్స్ పుట్టిన ఇంటిని సందర్శించాము. మార్క్స్ పుట్టిన నాటికే 12 వేల జనాభా

కలిగిన అతి పెద్దపట్టణం అది. మార్క్సు ఇంటిని మ్యూజియంగా మార్చారు. వారి చిత్రపటాలు, సాహిత్యం ఉన్నాయి. మార్క్సుకి సంబంధించిన విషయాల్ని స్లైడ్స్ ద్వారా డిస్‌ప్లే చేస్తున్నారు. ట్రయర్ పట్టణంలో చాలా ప్రాంతాల్లో మార్క్సు బొమ్మలు ట్రాఫిక్ సిగ్నల్స్‌లో కనిపించాయి. కాన్సన్ట్రేషన్ క్యాంప్‌కు, మార్క్సు పుట్టిన ఇంటికి సందర్శకుల తాకిడి ఎక్కువగా ఉంది. ట్రయర్ పట్టణంనుండి లగ్జెంబర్గ్ దేశానికి వెళ్ళాము. అక్కడ గోల్డెన్ ఉమెన్ విగ్రహం, రోజా లగ్జెంబర్గ్ బొమ్మ, అలాగే కేరళ నుండి వచ్చి జీవిస్తున్నవారి కథాకళీ ప్రదర్శనలు ఇస్తున్నారు.

**హంగరీకి రైలుమార్గం ప్రత్యేకత:** హంగరీ రాజధాని బుడాపెస్ట్ నగరం. బుడా మరియు పెస్ట్ నగరాలకు మధ్య "దునా" నది ఉన్నది. ఈ నదిపై 2 కిలోమీటర్ల దూరంలో 10 బ్రిడ్జీలు వాహనాల రాకపోకలకు నిర్మించారు. బుడాపెస్ట్ నగరాలలో భూగర్భ రైలుమార్గంద్వారా ప్రతి 3 నిమిషాలకు ఒక విద్యుత్‌రైలు ప్రయాణిస్తుంది. బుడాపెస్ట్‌నుండి 400 కిలోమీటర్ల దూరంలోని ఆస్ట్రియా రాజధాని వియన్నా నగరానికి వెళ్లాము మేము సందర్శించిన ప్రదేశాల్లో ఎక్కడా లేనిది ఇక్కడ కొన్నిచోట్ల "ల్యాండ్ ఫర్ సేల్" అని బోర్డులు కనిపించాయి.

మేము పరిశీలించిన యూరప్ దేశాల్లో మన దేశంలోలాగ వారికి ఎల్లకాలం పనిచేయడానికి, పంటలు పండించడానికి అవకాశం లేదు. ఎందుకంటే అక్కడ ఎక్కువ కాలం మంచు పడడం, చలి ఉండడం, వర్షాలు పడటం కారణం. జనాభా తక్కువ భూ విస్తీర్ణం ఎక్కువ. అయితే అధికశాతం భూమి ప్రైవేట్‌వారి యాజమాన్యంలోనే ఉంది. అక్కడ అవినీతి కూడా లేదు. అక్కడి వాతావరణం కారణంగా పంటలు పండించడానికి వీలుకాదు. అలాగే పండ్లు కూడా తక్కువగా పండుతాయి.

కాని మనదేశంలో 365 రోజులు పనులు చేయడానికి అవకాశం ఉండి, అన్ని రకాల పంటలు పండించడానికి కావాల్సిన వనరులు, పనులు చేసే మనుషులు, మేథాశక్తి ఉన్నప్పటికీ వీటిని సక్రమమైన మార్గంలో వినియోగించే చిత్తశుద్ధి పాలకులకు లేదు. అంతేకాకుండా పాలకపార్టీల అవినీతి, పాలనా యంత్రాంగాన్ని అవినీతి పరులుగా మార్చడం, వీళ్ళిద్దరూ కలిసి ప్రజలను కూడా

పొల్యూట్ చేస్తున్నారు. లేకుంటే యూరప్ దేశాలు సాధించిన అభివృద్ధిని వారి కంటే ముందే మనదేశంలో సాధించేవారం. మన విద్యార్థులు చదువు పూర్తి అయిన అనంతరం వారి మేధాశక్తికి తగిన ఉద్యోగాలను మన దేశంలో కల్పించలేక పోవడం వలన వారు విదేశాలకు వలసలు వెళ్తున్నారు.



యూరప్ పర్యటనలో బెర్లిన్ నగరంలో మార్క్స్ ఏంగెల్స్ విగ్రహంవద్ద కాళిదాసు, విజయలక్ష్మి.



యూరప్ పర్యటనలో సోవియట్ యూనియన్ అమ్మాయి దాషా తల్లిదండ్రులకు హంగెరీలోని బుడాపెస్ట్ నగరంలో పుష్పగుచ్ఛాన్ని అందిస్తున్న కాళిదాసు, విజయలక్ష్మి, వెంకటేశ్వరరెడ్డి, కృష్ణకుమారి.



**చేరెడ్డి మణికుమారి**
లెక్చరర్, గుంటూరు.
9492079105

# నే నెరిగిన కాళిదాసు అంకుల్...

సేవాతత్పరుడు, కళాబంధు, కళాతపస్వి, వామపక్ష భావాలతో నిండిన వ్యక్తి. వసుధైక కుటుంబ వ్యవస్థను ఆస్వాదించే వ్యక్తి.

వ్యవసాయ కుటుంబంలో జన్మించి, ప్రాథమిక విద్యాబోధన జరుగు తున్నప్పుడే తండ్రిని కోల్పోవడంతో కుటుంబభారాన్ని తల్లి మోయడంతో పైచదువు కొనసాగించలేని స్థితిలో ఉన్న కొద్దిపాటి భూమిలో వ్యవసాయం చేస్తూ జీవనం సాగించారు. కళారంగంపట్ల ఉన్న ఆసక్తితో నాటికలు ప్రదర్శిస్తూ, వామపక్ష భావాలతో యువజన, రైతు సంఘాలలో పనిచేస్తూ ప్రజానాట్యమండలి బాధ్యతలను స్వీకరించి, వ్యవసాయమును వీడి గుంటూరు వచ్చారు. నా వివాహము అయిన తర్వాత కొద్దిమంది పరిచయం అయిన పార్టీవారిలో కాళిదాసుగారు ఒకరు. వారి మాటల లోనే బయట వ్యక్తులతో మాట్లాడుతున్నామన్న భావం ఉండేది కాదు, కుటుంబ సభ్యులలో ఒకరిగా ఉన్నట్లు ఉండేది. వారి పిలుపులోనే చాలా ఆప్యాయత ఉండేది. నాకు సంతోష విషయమైనా, బాధ కలిగించిన విషయమైనా వారికి చెప్పుకోవాలి అనిపించే విధంగా ఉండేది. తనకు ఏది న్యాయం అనుకుంటే అటు వైపు గట్టిగా నిలబడేవారు. అవసరమైన సహకారం అందించేవారు.

నేను, రాధాకృష్ణ తరచు అంకుల్ ఇంటికి వెళ్తుండేవారం. అలా ఆంటీతో మంచి అనుబంధం ఏర్పడింది. ఆంటీ కూడా అంకుల్‌కి అన్ని విధాల సహకారాన్ని

అందించేవారు. వారి ఆలోచన మొత్తం పార్టీ, ప్రజల యోగక్షేమాలు తప్ప మరొక ఆలోచనే ఉండేది కాదు. ఎవరైనా అనారోగ్యంతో ఉన్నారు అని తెలిస్తే వారికి తెలిసిన డాక్టర్ వద్దకు తీసుకెళ్లి వైద్యం చేయించేవారు. వారి బాధ్యతగా భావించేవారు. దానికి సగం డాక్టర్ అనుభవం గడించారు అనుకుంటా నేనైతే. ఒకసారి నాకు చిన్న ఆపరేషన్ జరిగితే ఆంటీ, అంకుల్ నాతో హాస్పిటల్‌కి వచ్చి ఆపరేషన్ అయ్యేవరకు రాత్రిపూట అక్కడే ఉన్నారు. మత్తుకి నాకు వాంతులైతే ఆంటీనే పట్టి, శుభ్రం చేశారు. నా జన్మలో ఆ సంఘటనను మర్చిపోలేను. వయస్సు రీత్యా అమ్మ రాలేకపోతే, ఆంటీనే అమ్మగా నాకు తోడుగా నిలిచి నేను ఇంటికి వచ్చే వరకు నాతోనే ఉన్నారు. నేను ఇంటికి వెళ్లమన్నా వెళ్లలేదు ఆంటీ. చాలామంది బంధువులు, రక్తసంబంధీకులు ఉండవచ్చు, కాని వారందరికంటే ఆంటీ, అంకుల్ ప్రత్యేకం. పార్టీలోని వ్యక్తులపై అంతటి శ్రద్ధాసక్తులను కనపరిచేవారు. నాకు పరిచయమైన ఈ 28 సంవత్సరాల కాలంలో నాకు ఏ అవసరమొచ్చినా వారి సలహాలనే తీసుకుంటాను. నన్ను వాళ్ల అమ్మాయిగానే చూస్తారు. ఒకసారి నాకు కష్టమైన పరిస్థితులు ఎదురైనప్పుడు రాధాకృష్ణ మీటింగ్‌లో ఉంటే తన వయస్సును, సమయాన్ని లెక్కచేయకుండ ఎర్రని ఎండలో నాకు తోడుగా ఉన్నారు. నా కుటుంబ సభ్యులందరికీ అంకుల్‌తో పరిచయముంది. రాధాకృష్ణ కుటుంబ విషయాలు పెద్దగా పట్టించుకోకపోయినా అన్ని విషయాలు నేనే చూసుకుంటానని అంకుల్ నన్ను బాస్ అని పిలిచేవారు. ఆ పిలుపులో అభిమానం, ప్రేమ కనిపించేవి.

ఏదైనా ఫంక్షన్ అంటే ఆంటీ నాకు తోడుగా ఉండేవారు. అంకుల్ బాధ్యతగా ప్రతి చిన్నవిషయాన్ని చూసుకునేవారు. అంకుల్, ఆంటీ ఉంటే చాలు నేను చాలా ప్రశాంతంగా ఉండేదాన్ని. ఒకసారి ఆంటీ ఊరు వెళ్లితే అంకుల్ 10 రోజులు సమ్మర్‌లో మా ఇంట్లో ఉన్నారు. అంకుల్ క్రమశిక్షణకు మారుపేరు. ఉదయాన్నే లేవడం, తన బట్టలు తనే ఉతుక్కోవడం, ప్లేట్లు కడగడం చేసేవారు. బయట వ్యక్తి ఉన్నారన్న ఫీలింగ్ ఉండేదికాదు, ఇంట్లోవారిలాగానే ఉండేది నాకు. నా ఆరోగ్య విషయాలు ఎక్కువ అడిగి పట్టించుకునేవారు. నేను ఫోన్ చేయకపోయినా తనే ఫోన్‌చేసి బాగోగులు అడిగేవారు. చాలా సింపుల్‌గా ఉండే

వ్యక్తి, నమ్మిన సిద్ధాంతం కోసం పనిచేశారు. భార్యాభర్తలు ఇలా ఉండాలి అనే విధంగా ఉండేవారు. ఆంటీ, అంకుల్ ఒకరికోసం ఒకరు అన్నట్లు ఉండేవారు. వారు పార్టీకోసం చేసిన కృషి ఎంతోమందికి ఆదర్శప్రాయమైనది. మా అమ్మ, నాన్న నాకు జన్మనిస్తే, నా వైవాహికజీవితంలో అమ్మ అంటే ఆంటీ, నాన్న అంటే అంకులే మా కుటుంబానికి పెద్ద దిక్కు. వారు చేసిన సహాయం నా జీవితంలో మరిచిపోలేను. విడిగా చెప్పే ధైర్యంలేదు. చెప్పినా ఊరుకోరు. కనుక ఈ విధంగా నా మనోభావాలను వ్యక్తీకరించడానికి, కృతజ్ఞతలు తెలపడానికి నాకు ఈ అవకాశం రావడం నా అదృష్టంగా భావిస్తున్నాను. ఇలాంటివారు చాలా తక్కువమంది కనబడతారు. ఆంటీ, అంకుల్ నిండునూరేండ్లు ఆరోగ్యంగా ఉండాలని కోరుకుంటున్నాను.






ఆత్మీయతను పంచిపెడుతున్న మణికుమారి



**ప్రొ॥ ఎన్. వేణుగోపాలరావు**
వ్యవసాయ శాస్త్రవేత్త,
జన విజ్ఞానవేదిక సీనియర్ నాయకులు.
9490098905

# ప్రజాసైన్స్ ఉద్యమానికి, ప్రజానాట్యమండలికి ఊతమిచ్చిన నూతలపాటి కాళిదాసు

**అ**మరుడు గరికపాటి రాజారావువంటి కళాకారుల చైతన్య ప్రతిరూపమే "ప్రజానాట్యమండలి". పీపుల్స్ ఆర్ట్ థియేటర్స్ ఆర్గనైజేషన్ – వంటి అఖిలభారత సంస్థ స్థానికరూపమే ప్రజానాట్యమండలి. అలానే శాస్త్రీయదృక్పథాన్ని ప్రజల్లో విస్తరింపజేయాలని ఏర్పడిన 'భారత జ్ఞానవిజ్ఞానసమితి' తెలుగురాష్ట్రాల రూపమే జనవిజ్ఞానవేదిక (ప్రజా సైన్స్ ఉద్యమం). ఈ రెండు సంస్థల కలయిక 1985–86 సంవత్సరాల్లో మొదలుపెట్టిన అఖిల భారత 'విజ్ఞానజాతాల్ని' మలుపు తిప్పింది.

1984–85లో జరిగిన 'భోపాల్ విషవాయువు ఘాతుకం' భారతదేశ చరిత్రలో ముఖ్యమైంది. నూతన సాంకేతిక, సైన్స్ ద్వారా ఒనగూడిన ఫలాలు విస్తరించిన దేశాల్లో ఎంత వికృతరూపం దాలుస్తాయో 1984 డిశంబర్ చివరి వారం జరిగిన 'మిథేన్ గ్యాస్' (బహుళజాతి సంస్థ యూనియన్ కార్బైడ్ విషపు పురుగు మందుల మూలకం) భోపాల్ ప్రమాదం ఒక ఉదాహరణ. దీని ప్రేరణతో రూపొందిన 'భారత జ్ఞానవిజ్ఞానసమితి' (BGVS) సైన్స్ ప్రచార అంశాల్ని కేంద్రంగా చేసుకొని దేశవ్యాపితంగా జాతాలు నిర్వహించింది. ఈ జాతాలద్వారా అనేక అంశాల్ని ప్రజలకు హత్తుకునేట్లు, అర్థమయ్యేట్లు చేసిన ఘనత ఆంధ్రప్రదేశ్‌లో 'ప్రజానాట్యమండలి'కి దక్కుతుంది.

ఫిబ్రవరి 28,1988లో రూపుదిద్దుకున్న జనవిజ్ఞానవేదిక నాలాంటివాళ్లను, ఉపాధ్యాయులను, వైద్యుల్ని, ఉద్యోగుల్ని ఎందర్నో ఇముడ్చుకుంది. నిజానికి దీనికి ప్రేరణ శాస్త్రజ్ఞులు, డాక్టర్లు, ఉపాధ్యాయుల ఉపన్యాసాలు, వ్యాసాలతోపాటు ప్రజా కళాకారుల వివిధ కళారూపాలంటే అతిశయోక్తి కాదు. ఆంధ్రప్రదేశ్‌లో 1988-94 దశలో ఎందర్నో ఆకర్షించగలగటమేగాక కామ్రేడ్ కాళిదాసును కళాకారుడిగా, కార్యకర్తగా, నాయకుడిగా ఇముడ్చుకోవడానికి ముఖ్య నేపథ్యం అక్షరాస్యత, సారా వ్యతిరేక ఉద్యమాలిచ్చాయి. కేరళ శాస్త్రసాహిత్య పరిషత్ ఇచ్చిన చేయూత అనేక ప్రజాకళలను సృష్టింపచేసింది. దానిని ప్రజా నాట్యమండలి అందుకో గలిగింది.

అక్షరాస్యత ఉద్యమాన్ని పరిపుష్టం చేసిన ఎన్నో గేయాల్ని రచించి గానం చేసిన కళాకారుల కృషి మర్చిపోలేనిది. చదువుకునేందుకు ప్రేరణ కల్గించే అనేక గేయాలు, అభినయగీతాలు, నాటికలు, బుర్రకథలను గుంటూరుజిల్లాలోని తెనాలి, మంగళగిరి, తాడేపల్లి, నూతక్కి, తుమ్మపూడి, వెనిగండ్ల, నరసరావుపేట, సత్తెనపల్లి, చిలకలూరిపేట, యడ్లపాడు, నాదెండ్ల, లింగారావుపాలెం గ్రామాల నుండి అనేక మంది ప్రజాగాయకులూ, కళాకారిణిలు కాళిదాసు ఆర్గనైజర్‌గా చేపట్టిన బస్సు యాత్ర అక్షరాస్యత  ఉద్యమాన్ని ఉన్నత స్థాయికి తీసుకెళ్ళారు. కేరళ ఎర్నాకులం ఉద్యమస్ఫూర్తిని అంధ్రదేశం చేపట్టడానికి ముఖ్య వాహకం కళ-గేయం, గానం, నృత్యం, నాటికలని చెప్పుకోవాలి. వాటి ప్రేరణతోనే నేను కూడా. నేను ఉద్యోగిగా పనిచేస్తున్న గుంటూరు 'ప్రాంతీయ వ్యవసాయ పరిశోధనస్థానం' లాంలో జరిగిన వ్యవసాయ సదస్సులో కామ్రేడ్ పుతుంబాక వెంకటపతిగారితో, కామ్రేడ్ కాళిదాసులతో పరిచయం ఏర్పడింది. దినసరి శ్రమజీవుల్లో అక్షరాస్యత వెలుగుని ప్రసరింపజేసే ప్రయత్నం చేయడం మరిచిపోలేని జీవితదశ. ఆ దశలో ఊపందుకున్న 'సారా వ్యతిరేక ఉద్యమం' అంధ్రదేశానికి ప్రపంచస్థాయి గుర్తింపును తెచ్చింది. ప్రభుత్వం మెడలువంచి సారాప్రవాహాన్ని అదుపు చేయించగలిగింది. నిషేధచట్టం రూపొందించగల్గింది. దీనికి ముఖ్యప్రేరణ ప్రజా కళాకారుల కృషి, ప్రజా ఉద్యమాల ఊపు. ఈ ఉద్యమంలో గుంటూరు జిల్లాలో కాళిదాసు నాయకత్వంలో ప్రజానాట్యమండలి చాలా ముఖ్యమైనపాత్ర నిర్వహించింది.

గుంటూరుజిల్లాలో ప్రజాసైన్స్ ఉద్యమ ప్రేరణకు, మూఢనమ్మకాల నిర్మూలనకు తోడ్పడే గేయాల్ని, నాటికల్ని, రూపకాల్ని ముందుకు తెచ్చారు. సామాన్యుల్ని సైతం ఆకర్షించగల-పిలుస్తున్నదీ! పిలుస్తున్నదీ!! విజ్ఞానవేదిక, జనజాగృతిగీతిక...వెలుగుతున్న దీపిక-జనవిజ్ఞానవేదిక...గతకాలపు నమ్మకాల చాదస్తం వదల్చడమే మేధావుల బాధ్యత...పాడుదమా స్వేచ్ఛాగీతం ఎగరేయు దమా జాతిపతాకం...వందేమాతరమని...స్వాతంత్ర్యం-నువ్వొచ్చి ఎన్నేళ్ళ యిందమ్మా...కాలం కూడా కదులుతుంది...జ్వాలై చెలరేగుతుంది...వంటి అనేక వందలగీతాలు రచించబడి, గానం చేయబడ్డాయి. ప్రజా రచయితల అభ్యుదయ గీతాలతో ఆరోగ్యం రంగంలో – వాంతులు – బేదులు నాటిక పాటలు, నృత్యాలు ఆరోగ్య కళాజాతాతో కామ్రేడ్ కాళిదాసు నిర్వహణలో గుంటూరుజిల్లా ప్రజా నాట్యమండలి కళాకారులూ సైన్స్ ఉద్యమానికి ప్రేరణ కల్గించారు.

అద్భుతమైన కళాకారులు, ప్రదర్శించిన కళారూపాలు ఇంకా గుర్తుకు వస్తూనే ఉన్నాయి. అనేక మంది కళాకారులూ ప్రజానాట్యమండలి ద్వారా జన విజ్ఞానవేదిక వార్షిక ఉత్సవాల్ని పరిపుష్టం చేస్తూ వచ్చారు.

గుంటూరు, ప్రకాశం జిల్లాల్లో ప్రత్తిపంటపై పచ్చపురుగు కీటక దాడి చేసిన సందర్భంగా "హోలికులు సేమమా" నాటికను రూపొందించి గుంటూరు, ప్రకాశం జిల్లాలే కాకుండా ఇతర ప్రాంతాల్లో కూడా 100కు పైగా ప్రదర్శనలు చేశారు. ఆంధ్రదేశంలో వ్యవసాయ సంక్షోభ విశ్లేషణా సదస్సులు విస్తృతంగా జరిపిన 2006-09 దశలో గంజి కేంద్రాల ద్వారా వ్యవసాయ కూలీల్ని, బడుగురైతుల్ని ఆదుకోవడం రైతుసంఘాలు, వ్యవసాయ కార్మిక సంఘాలు, జన విజ్ఞాన వేదికలు నిర్వహించడం ప్రత్యేకత. అందులో అనేకమంది ప్రజా నాట్యమండలి కళాకారులూ పాల్గొనడంలో కాళిదాసు కృషి ప్రత్యేకమైన అంశంగా చెప్పుకోవాలి. మోన్సాంటో వంటి బహుళజాతి సంస్థలు జరిపే విత్తనాల గుత్తపెట్టుబడి అంశాన్ని 'విషవలయంలో భారతం' అనే పద్య నాటకాన్ని గ్రామీణ ప్రజలస్థాయికి తీసుకెళ్ళిన ఘనత కాళిదాసుగారి ఆధ్వర్యంలో ఆంధ్రప్రదేశ్ రైతుసంఘం, ప్రజానాట్యమండలిది.

ప్రజాకళాకారులూ కాళిదాసు నిర్వహణలో రూపకాలు, గేయాలు, నాటికలువంటి కళారూపాల్ని ప్రదర్శించారు. రైతు రక్షణవేదిక వంటి సంస్థలు నిర్వహించిన 'విత్తన స్వావలంబన' ఉద్యమానికి ఊపునిచ్చాయి. హేతువాది, కళా ప్రపూర్ణ శ్రీ కొండవీటి వెంకటకవిగారి శత జయంతి ఉత్సవాల నిర్వహణ చేపట్టి నేటితరానికి అందించిన ఘనత మంచి ఆర్గనైజర్‌గా కాళిదాసుగారికి దక్కుతుంది.

కేరళ శాస్త్ర సాహిత్య పరిషత్ తర్వాత దేశంలో అతి పెద్ద ప్రజా ఉద్యమ సంస్థ (జన విజ్ఞానవేదిక)గా విస్తరింపబడడానికి ప్రజానాట్యమండలి కూడా ముఖ్య కారణమంటే అతిశయోక్తి కాదు!!

నా చెమట చుక్కో! నా చెమట చుక్క!! అంటరానిదంటే అగ్గై మండిన నా చెమట చుక్కో!! వంటి గేయాలద్వారా ప్రజల్ని మేల్కొలుపుతూనే ఉన్న ప్రజానాట్య మండలికి అభినందనలు. ఇవన్నీ గుర్తు చేసుకోవడానికి, కాళిదాసుగారి కృషి, ఆర్గనైజింగ్‌ను రేఖామాత్రంగానైనా అవకాశం కల్పించిన శ్రీ బాలచందర్‌గారికి కృతజ్ఞతలు తెలియచేసుకుంటున్నాను.





విజయవాడలో రాష్ట్ర వీథినాటకోత్సవాలలో మాట్లాడుతున్న కాళిదాసు



**పి.వి. రమణ**
ప్రజా గాయకుడు
7396493100

# కమ్మని ప్రేమ

**క**మ్మని ప్రేమను కురిపించినోడు
కమ్యూనిస్టుగా నిరతం బతుకుతున్నోడు
కడుపేదోళ్ల బాధల్లో కరిగేటోడు
కళాజగతిలో నన్ను నిలిపినోడు
కాళిదాసు పదములకు వందనాలు అర్పిస్తా
ప్రేమమూర్తి జయమ్మకు జన్మంతా రుణపడతా

నలుపు రూపేగాని మనసేమో వలపుతోడు
మాట కఠినంగాని మమతల పూదోట
పొడిచేటి పొద్దంటే నీ రూపము
హద్దుల్ని చెరిపేసే నీ స్నేహము ॥కాళిదాసు॥

ఎవ్వరి మాట వినడని సీతయ్య అని కొందరు
వాదనలో కాళీతో గెలవలేమని ఎందరో
అందరికంటే ముందు అన్నింటా తాను
పట్టుపడితే ఏ పనైనా పరిపూర్ణమగును ॥కాళిదాసు॥

ఆస్తిపాస్తుల ఊసేలేదు ఆఫీసే ఇల్లు
ఆదాయం ధ్యాసలేదు ఆశయాలే ధ్యానం

పదుగురికై నీ పయనం పరులసేవకే నీ నయనం
ఆదర్శం మీ జంట మా కన్నులకే పంట ॥కాళిదాసు॥

సాక్షరతా ఉద్యమాన సారథిగా నాడు
పల్లె పల్లెనా అక్షరదీప్తిని రగిలించినాడు
వీధి వీధినా నాటకాలకు తొలిబీజం వేసెను
శిక్షణశిబిరాలతో కళాకారుల్ని తీర్చిదిద్దెను ॥కాళిదాసు॥

హాలికులు సేమమంటూ పాలకుల్ని ప్రశ్నించెను
రైతు లేనిదే రాజ్యం లేదని నిరూపించెను
అప్పొ అమ్మకమా అంటూ ప్రమాదాన్ని చెప్పెను
కన్నెగంటి చరిత్రను 'వీరగంధంగా' చూపించెను ॥కాళిదాసు॥

కష్టజీవి వెంకాయమ్మ కలలపంటవు
యడ్లపాడు ఎర్రజెండా ముద్దుబిడ్డవు
పోపూరి ఆశయాలకు సాక్ష్యంగా నిలిచి
జన్మభూమి ప్రజల తలలో నాలుకగా నిలిచి

కులం మతం ఎంచి చూసే సమాజం ఉన్నంతవరకు
నువు చెప్పిన ఆశయం ఎన్నటికీ నెరవేరబోదు
అంటరానివాడ్నయినా అందలమెక్కించావు
అంతేలేని విశ్వాసం అణువణువునా నింపావు ॥కాళిదాసు॥

అవమానం అనుమానం ఎదిరించాలని ఉంది
ఆత్మగౌరవమే మిన్నని అంతరాత్మ చెప్పింది
నీ ఆశయాలదారులను వీడానని కలత వద్దు
పొడిచేటి పొద్దునై నీల్ – లాల్ స్వర్గాన్నె మళ్లీ నే ప్రజ్వలిస్తా...
ఆదుకున్న చేతులకు వందనాలు అర్పిస్తా
గుండెల నిండా ఎర్రనిజెండాగా ఎగరేస్తా

(పెంచిన తల్లిదండ్రులు నూతలపాటి కాళిదాసుగారికి, మాతృమూర్తి జయమ్మలకు ప్రేమపూర్వక కృతజ్ఞతలతో...)



**నూతలపాటి విజయలక్ష్మి కాళిదాసు**
యడ్లపాడు
9849369769

# నమ్మిన సిద్ధాంతం కోసం ఎంతదూరమైనా...

**నూ**తలపాటి కాళిదాసు...అందరికీ మొండి మనిషిగా, కఠినాత్ముడుగా కనబడే కాళిదాసు మనస్సు వెన్నకన్నా సున్నితమైనది. పార్టీ కేటాయించిన పని పట్ల ఎంత నిబద్ధతతో ఉంటారో, కార్యకర్తలపట్ల అంతే అనురాగం, ఆప్యాయతతో ఉంటారు. అబద్ధాలు, మోసాలు సహించని కాళిదాసు నమ్మిన సిద్ధాంతం కోసం ఏందాకైనా, ఎవరితోనైనా పోట్లాడడానికి వెనుకాడని మనస్తత్వం ఆయనది.

మాది వ్యవసాయ కుటుంబం. పెళ్లికి ముందు, పెళ్లి తర్వాత కాళిదాసు వ్యవసాయం చేశాడు. పెళ్లి తర్వాత కొన్నాళ్ళు మా నాన్నతో కలిసి వ్యవసాయం చేశాడు. మా కుటుంబంతో కాళిదాసు మంచి ఆప్యాయంగా ఉండేవారు. పెళ్లి తర్వాత దాదాపు 20 ఏళ్లపాటు యడ్లపాడులోనే నివాసం ఉన్నాము. డివైఎఫ్ఐ, ప్రజానాట్యమండలి, రైతుసంఘం అన్ని ప్రజా సంఘాల కార్యక్రమాలను గ్రామాల్లో చేపట్టేవారు. పార్టీ కార్యక్రమాలకు, ఇంటికి సమ ప్రాధాన్యత ఇస్తాడు. ఇంట్లో ఏ అవసరం ఉన్నా ముందే తెలుసుకొని అన్నీ సమకూర్చేవాడు.

1992లో పుతుంబాక వెంకటపతిగారి కోరిక మేరకు గుంటూరు జిల్లా కేంద్రంలో పార్టీపని చేయటానికి వచ్చాము. ఏటి అగ్రహారంలో మొదట పూరి ఇల్లు దొరికితే అక్కడ అద్దెకు ఉన్నాము. వర్షానికి గోడలన్నీ తడిచిపోయేవి. ఒక రోజు మా ఇంటికి వచ్చిన దొప్పలపూడి సుబ్బారావు వారిభార్య అరుణగార్లు

బృందావన్ గార్డెన్స్‌లో వేరే ఇంటికి తీసుకెళ్లారు. ఏదో సంపాదించాలి... కూడబెట్టాలి...అని మాకు ఎప్పుడూ లేదు. ఉన్నంతలో బ్రతుకుతూ పార్టీ కోసం పనిచేయాలని అనుకున్నాం. ఇద్దరం ఒకే అభిప్రాయంతో ఉండటం, ఎవరితోనూ విబేధాలు లేకుండా ఉండటం మా కుటుంబంలోనివారికి కూడా మా పట్ల గౌరవం ఏర్పడిందని భావిస్తాను.

పార్టీ పట్ల, కార్యకర్తల యెడల ఎంత బాధ్యతగా ఉంటాడో బంధువుల పట్ల కూడా అంతే బాధ్యతగా ఉంటాడు. బంధువులకు గుంటూరులో ఏ పని ఉన్నా, అది వైద్యం అయినా, ఇతర ఏ పని ఉన్నా దగ్గర ఉండి పని పూర్తి అయ్యాకే వస్తారు. మా పుట్టింటి వాళ్లు నాకన్నా తనతోనే ఎక్కువ చనువుగా ఉండేవారు. మా అమ్మ కుటుంబానికి సంబంధించిన ఏ విషయమైనా కాళిదాసుకి చెప్పి, ఆయన అభిప్రాయం తీసుకున్న తర్వాతనే నిర్ణయానికి వచ్చేది.

యడ్లపాడులో ఉన్నా, గుంటూరులో ఉన్నా పార్టీ కార్యకర్తలు ఎవరో ఒకరు ఇంటికి వస్తూనే ఉంటారు. వారికి ఏమి కావాలో ముందుగానే ఏర్పాటు చేసేవారు. యడ్లపాడులో పొలం పనులు వలన పార్టీ కార్యక్రమాల్లో అడపాదడపా పాల్గొనే నేను గుంటూరు వచ్చాక ఎక్కువ సమయం పార్టీ కార్యక్రమాల్లో పాల్గొనేలా కాళిదాసు ప్రోత్సహించేవారు. జిల్లా కేంద్రం కాబట్టి ప్రతి కార్యక్రమంలో పాల్గొనే అవకాశం ఉండేది.

2000 సంవత్సరంలో పార్టీ సభ్యత్వం తీసుకున్నాక మహిళా సంఘం, ఇతర ప్రజాసంఘాల కార్యక్రమాలు, నిర్మాణపనుల్లో భాగస్వామిని కావడంలో కాళిదాసు ప్రోత్సాహం ఉండేది. చివరిగా కుటుంబసభ్యులు దూరమైనా, బంధువులు దూరమైనా మనకు పార్టీ ఉంది, ఎందుకు భయం, బెంగ అని కాళిదాసు ధైర్యంగా ఉంటూ, నాకు మానసిక భరోసాని, అండని అందించారు.





**వై. రాధాకృష్ణ**
జిల్లా కార్యవర్గ సభ్యులు,
సిపియం పల్నాడు జిల్లా.
సెల్: 9490098630

# పార్టీ నిర్ణయమే శిరోధార్యం

కాళిదాసుగారు వాళ్ళ అమ్మాయిని 1985లో ఇంటర్మీడియట్‌లో చేర్చి కుటుంబం మొత్తం యడ్లపాడునుండి గుంటూరుకి వచ్చారు. అశోక్‌నగర్‌లో ఒక చిన్న పూరింట్లో ఉండేవారు. నేను డిగ్రీ చదువుతూ ఎస్.ఎఫ్.ఐలో పని చేస్తున్నాను. వాళ్ళపాప చాలా యాక్టివ్‌గా ఉండేది. అలా కాళిదాసుగారి కుటుంబంతో నాకు మొదటగా పరిచయం ఏర్పడింది. ఎప్పుడు వెళ్ళినా జయమ్మ ఆంటి చాలా ఆప్యాయంగా మాట్లాడేవారు. ఆ అనుబంధం ఇప్పటికీ అలానే కొనసాగుతుంది. కాళిదాసుగారి అమ్మాయి చనిపోయిందని తెలిసి విద్యార్థులం మేమంతా చాలా బాధపడ్డాము. తిరిగి కాళిదాసుగారు యడ్లపాడు వెళ్ళారు. పుతుంబాక వెంకటపతి గారు పార్టీ జిల్లాకార్యదర్శిగా ఉన్నారు. కళారంగానికి జిల్లాకేంద్రంలో బాధ్యుని కోసం అన్వేషణలో ఉన్నారు. ఒకానొక సందర్భంలో ఎవరూ లేక ఎస్.ఎఫ్.ఐ జిల్లాకార్యదర్శిగా ఉన్న బి. సురేంద్ర జిల్లాకన్వీనర్‌గా ఉన్నారు.

యడ్లపాడులో నాటికల్లో వేషాలు వేస్తూ కళారంగంలో పనిచేస్తున్న కాళిదాసుగారిని జిల్లా బాధ్యులుగా పెట్టాలని పి.వి (పుతుంబాక వెంకటపతి)గారు ఆలోచించి కాళిదాసుని వ్యవసాయంమాని పార్టీలో పూర్తికాలం కార్యకర్తగా పనిచేయాలని వారితో మాట్లాడారు. తల్లిని వదిలిపెట్టి రావడం కొంచెం కష్టంగా అనిపించినా, పార్టీ చెప్పిన మాటను కాదనడం ఇష్టం లేక రావడానికి అంగీకరించారు. అదే సమయంలో 1993 మే 30న కామ్రేడ్ పి.వి.గారు

గుండెపోటుతో హఠాన్మరణం చెందారు. ఆ తర్వాత కొద్ది నెలలకు కాళిదాసుగారి కుటుంబం గుంటూరు వచ్చారు. ఎ.టి.అగ్రహారంలో ఒక ఇంటిపైన పూరిల్లు ఉన్నది. దానిలో ఉన్నారు.

పార్టీ జిల్లాకార్యదర్శిగా ఈదా మాధవరెడ్డిగారు ఉన్నారు. జిల్లాకేంద్రంలో పనిచేస్తున్న పూర్తికాలం కార్యకర్తలందరికీ పార్టీ అలవెన్సులు ఇవ్వడం కష్టంగా ఉండేది. ఏ ప్రజాసంఘంవారు ఆ ప్రజాసంఘాలలో నిధులు వసూలు చేసుకొని ఖర్చు పెట్టేవారు. అదే విషయాన్ని పార్టీ జిల్లాకార్యదర్శి కాళిదాసుగారికి చెప్పారు. కొత్తగా వచ్చినప్పటికి, ప్రజానాట్యమండలి కార్యక్రమాల ఖర్చులను, తన అలవెన్సులను వారికున్న సంబంధాలను ఉపయోగించి వసూలు చేసేవారు. భార్యా, భర్తలు ఇద్దరు అలవెన్సులు తీసుకోకుండ దానికి తగిన ఏర్పాటు చేసుకొని పనిచేయాలనుకునేవారు. ఆ లక్ష్యంతో యడ్లపాడు గ్రామంలో ఉన్న పొలం అమ్మి అప్పటికే ఉన్న అప్పులు తీర్చి, ఉన్న కొద్దిమొత్తాన్ని పోస్టు ఆఫీసులో ఫిక్సిడ్ చేసి నెలనెలా వచ్చే కొద్దిపాటి ఆదాయంతోనే కుటుంబాన్ని పోషించుకుంటూ, భార్య విజయలక్ష్మి, తను ఇద్దరూ పార్టీకి అంకితమై పనిచేశారు. ఆంటి (విజయలక్ష్మి) కుటుంబాన్ని చక్కగా నిర్వహించడంలో మంచినేర్పరి. ఉన్నంతలో ఇంటిని చాలా శుభ్రంగా ఉంచుతుంది. పార్టీవారు ఎవరు వచ్చినా చాలా ఆప్యాయంగా పలకరిస్తుంది. ఎంతమందికైనా వంటచేసి పెట్టడంలో ఎప్పుడు వెనక్కు తగ్గేవారు కాదు. ఒంటరిగానే అన్ని స్వయంగా తనే చేసి పెట్టేవారు. పార్టీ జిల్లాకమిటి సమావేశాల సందర్భంగాకూడ నాయకులకు భోజనం ఏర్పాటు చేసేవారు.

పార్టీ జిల్లాకార్యదర్శి కామ్రేడ్ సింహాద్రి శివారెడ్డి, కాళిదాసుగారు ముందు, వెనుక పోర్షన్‌లలో ఒకే ఇంటిలో ఉండేవారు. 15 సంవత్సరాలపాటు శివారెడ్డిగారి భోజన ఏర్పాట్లన్నీ ఆంటీనే చూశారు. కాళిదాసుగారు కొత్తగా పార్టీలోకి వచ్చిన యువకార్యకర్తలను బాగా ప్రోత్సహించేవారు. విద్యార్థులంటే మహాప్రేమతో ఉండేవారు. వారంతా కుటుంబసభ్యులతో ఉన్నంత ఫ్రీగా ఉండేవారు. పెద్ద, చిన్న అన్న తారతమ్యం లేకుండా అందరితో చర్చించేవారు. నీతి, నిజాయితీగా ఉండాలని చెప్పేవారు. అది లేకపోతే ప్రజలు మనల్ని ఆదరించరనేవారు. పార్టీ

క్రమశిక్షణను ఎవరైనా ఉల్లంఘించినా తీవ్రంగా మండిపడేవారు. 1994లో రేపల్లెలో జరిగిన పార్టీ జిల్లామహాసభలో జిల్లాకమిటి సభ్యునిగా ఎన్నికయ్యారు.

1995 నవంబర్ మాసంలో అక్షరాస్యత ప్రాధాన్యతను వివరిస్తూ కళా రూపాలతో జిల్లాలో 60 దళాలను ఏర్పాటు చేశారు. గుంటూరు లూథరన్ హైస్కూల్, సెయింట్ జోసఫ్ బియిడి కాలేజీలో శిక్షణ ఇచ్చారు. 10 రోజులపాటు మండలానికి ఒక దళం గ్రామాలు, హైస్కూల్స్‌లో విస్తృత ప్రచారం గావించాయి. ఈ కృషిలో కాళిదాసుగారి పాత్ర ప్రముఖమైనది. ప్రభుత్వ అధికారులతో సమన్వయం చేసుకోవడం, కళాకారులను కూడగట్టడం, వారందరికీ భోజన, వసతి ఏర్పాట్లలో కీలకంగా వ్యవహరించారు.

ప్రజానాట్యమండలి జిల్లాకార్యదర్శిగా కళారంగ నిర్మాణానికి మంచికృషి చేశారు. పాటలు పాడేవారిని ప్రోత్సహించేవారు. వీథినాటిక దళాలను తయారు చేసేవారు. ప్రజల సమస్యలకు తగినరీతిలో రచనలు చేయించడంలో, రచయితలకు పరిస్థితులను వివరించి, వ్రాయించి కళారూపకాన్ని తయారు చేసేవారు. అలా తయారు చేసిన వాటిలో ఒకటి పత్తిరైతుల ఆత్మహత్యలపై రూపొందించిన నాటిక “హాలికులు సేమమా.”

తను ఏ పనిచేసినా ఒంటరిగా కాకుండ ఎవరో ఒకరిని తోడు చేసుకొని ప్రతి విషయాన్ని చర్చిస్తూ పనిచేసేవారు. ప్రతి సందర్భంలోను నేను పెద్దగా చదువుకోలేదు, ఎక్కడ ఏ పొరపాటు జరుగుతుందేమోనని ఆలోచించేవారు. డిగ్రీలు చదివినవారు మంచిగా ఆలోచిస్తారనే భావం వ్యక్తం చేసేవారు. కాలేజీల్లో చదవక పోయినా, చిన్నప్పటినుండి తనచుట్టూ ఉన్న సమాజాన్ని అధ్యయనం చేశారు. చదువుకున్నవారికంటే ఎక్కువగా సాహిత్యాన్ని చదివారు. పుస్తకాన్ని కూడా చాలా త్వరగా చదివేవారు. అందులో సారాంశాన్ని కూడా బాగా అర్థం చేసుకునేవారు. ఏమైనా అనుమానాలుంటే వాటిలో నిష్ణాతులుగా ఉన్నవారితో చర్చించి ఒక నిర్ణయానికి వచ్చేవారు. తను నమ్మినదానిపై గట్టిగా నిలబడి వాదించేవారు. మన శత్రువుల ముందు ఒకలాను, మిత్రులముందు ఒకలా

వాదించేవారు. పార్టీలో జరిగే పొరపాట్లనుకూడా పార్టీ కామ్రేడ్స్ వద్దనే మాట్లాడేవారు.

ప్రజానాట్యమండలి మహాసభలు కళారూపాలతో ఒక ఉత్సవంగా జరిపేవారు. చిలకలూరిపేట, నర్సరావుపేట, యడ్లపాడు, గుంటూరులో తన కాలంలో జిల్లా మహాసభలను జరిపారు. కళారూపాలతోపాటు కార్యకర్తలను అభివృద్ధి చేసుకోవడంపై శ్రద్ధ వహించేవారు. ఆ కృషిలో భాగంగానే పి.వి.రమణ, అంజిరెడ్డిలను ప్రోత్సహించి, తీసుకొచ్చి పని చేయించారు. అదే సందర్భంలో పార్టీ క్రమశిక్షణకు భిన్నంగా వ్యవహరిస్తే సహించేవారు కాదు.

వీథినాటికలు ప్రదర్శిస్తున్న కాలం సమకాలీన అంశాలపై రచనలు చేసి ప్రజల దగ్గరకువెళ్లి రోడ్లమీదనే కళారూపాలను ప్రదర్శించేవారు. రాష్ట్రంలో ప్రతి ఏటా ఏదో ఒక జిల్లాలో సఫ్దర్ హష్మీ వీథినాటకోత్సవాలు (SHOT) జరుగు తుంటాయి. 1999లో గుంటూరులో జరపడానికి బాధ్యత తీసుకొని శ్రీ వెంకటేశ్వర విజ్ఞాన మందిరం ఆవరణలో నాలుగు రోజులపాటు విజయవంతంగా నిర్వహించారు.

## విద్యుత్ ఉద్యమం

2000 సంవత్సరంలో ప్రపంచబ్యాంకు సంస్కరణల నేపథ్యంలో విద్యుత్ బోర్డుని మూడు ముక్కలుచేసి జన్‌కో, ట్రాన్స్‌కో, డిస్కంలుగా విడగొట్టి ప్రైవేటువారికి అప్పగిస్తూ ప్రభుత్వం నిర్ణయం చేసింది. అప్పటివరకు ఉన్న విద్యుత్ చార్జీలను ఒకేసారి 300 శాతం పెంచి ప్రజలపై అధికభారం మోపింది. ఈ సంస్కరణలకు వ్యతిరేకంగా మూడునెలలపాటు అనేక రూపాలలో రాష్ట్రం మొత్తం నిరసన పోరాటాలు జరిగాయి. వామపక్షపార్టీలన్నీ కలిసి నిర్వహించిన ఉద్యమం అదే.

ఆనాడు ప్రతిపక్షంలో ఉన్న కాంగ్రెస్‌పార్టీకూడా ఉద్యమానికి మద్దతుగా ఉంది. ఆ ఉద్యమాల్లో పాల్గొన్నవారిపై కేసులుపెట్టారు. ఈ సందర్భంగానే కాళిదాసు నేతృత్వంలో గుంటూరులో వీథినాటిక ప్రదర్శిస్తుండగా పోలీసులు వచ్చి ఆపివేయించి కళాకారులపై కేసుపెట్టారు. కోర్టులో ఫైన్ కడితే కేసు కొట్టి

వేస్తామన్నారు. 'మేము తప్పుచేయలేదు. నాటికను ప్రదర్శించుకునే హక్కు మాకుంది, ఫైన్ కడితే మేము తప్పు చేసినట్లు అంగీకరించడమే, కనక మేము ఆ పని చేయము' అని చెప్పారు. కొన్నినెలల విచారణ అనంతరం కేసు కొట్టివేశారు. ఇలాంటి అనేక నిర్బంధాలతో పోరాటాలు నిర్వహించి, చివరకు ఛలో అసెంబ్లీ నిర్వహించారు. ప్రజలు పెద్ద ఎత్తున హైదరాబాద్ వెళ్ళడానికి సిద్ధమయ్యారు. బస్టాండు, రైల్వేస్టేషన్‌లలో పోలీసులు పెద్ద ఎత్తున మోహరించారు. నాయకుల్ని గుర్తుపట్టి వెంటనే అరెస్టు చేసేవారు. దీన్ని గమనించిన కాళిదాసు పోలీసుల కంటపడకుండా హైదరాబాద్ చేరుకున్నారు.

## ఆఫీసు నిర్మాణం

గుంటూరులో జిల్లాఆఫీసు పునర్నిర్మాణం చేయవలసి వచ్చినప్పుడు కామ్రేడ్ శివారెడ్డి, కామ్రేడ్ నరసింహారావుతో పాటు కాళిదాసుగారిని కలిపి ముగ్గురితో భవననిర్మాణ కమిటిని ఏర్పాటు చేశారు. ఆ భవననిర్మాణంలో చాలా కీలకంగా వ్యవహరించారు. నిర్మాణానికి కావలసిన మెటీరియల్‌ని సమకూర్చుకోవడంలో, కట్టుబడి మేస్త్రితో, ఆర్కిటెక్చర్‌తో సమన్వయం చేసుకుంటూ, ప్రతిరోజు ఎప్పటి కప్పుడు లెక్కలు వ్రాసుకుంటూ, అనుకున్న టైమ్‌కి పూర్తి చేయించారు. ఇసుక లారీని టౌన్‌లోకి రాకుండ పోలీసులు అడ్డుకుంటే వారితో ఘర్షణపడి పని ఆగకుండ చేయించిన సందర్భాలూ ఉన్నాయి. ఆఫీసు ప్రారంభించిన మరుసటి రోజే మొత్తం ఖర్చులు వ్రాసి అప్పగించారు. ఎక్కడ తేడా వస్తుందేమోనని అన్నింటిని నాకు చూపించి చెక్ చేయించేవారు. నేను అప్పుడు ఆఫీసు కార్యదర్శిగా బాధ్యతలు చూస్తున్నాను. ఆఫీసు ప్రారంభించిన తర్వాత పైన ఒకగదిలో కాళిదాసుగారు ఉన్నారు. మొత్తం ఆఫీసుని శుభ్రంగా ఉంచడంలో కాళిదాసుగారి చొరవే ఎక్కువ.

ప్రజానాట్యమండలి బాధ్యతలను యువకులకు అప్పగించి ఆఫీసు నిర్వహణ, అకౌంట్స్, ఆడిట్ బాధ్యతలను తీసుకొని పని చేశారు. తల్లిని పెద్దవయస్సు కారణంగా గుంటూరు తీసుకు వచ్చి తన యోగక్షేమాలను జాగ్రత్తగా చూసుకున్నారు.

నేను ఉండే ఇల్లు ఆఫీసుకి చాలాదూరం. కనుక లంచ్‌బాక్స్ తెచ్చుకుని కాళిదాసుగారి ఇంట్లోనే భోజనం చేసేవాడిని. ఆంటీ చేసిన కూరలు కూడా వడ్డించేది. ఆంటీ కూరలు చాలా రుచిగా ఉండేవి. అలా ఆఫీసు కార్యదర్శిగా ఉన్నంతకాలం ఆ కుటుంబంతో నా అనుబంధం మరింతగా పెరిగింది. ఇక్కడ ఒక సమస్య వచ్చిపడింది. నేను ఆఫీసు కార్యదర్శిగా రిలీవ్ అయి రైతుసంఘంలో పని చేయాలనుకున్నాను. కాళిదాసుగారు అప్పటికే రైతుసంఘంలో జిల్లా సహాయకార్యదర్శిగా పని చేస్తున్నారు. పూర్తిగా రైతుసంఘం బాధ్యతలు చూడాలని కాళిదాసుగారిని రాష్ట్రనాయకత్వం అడిగారు. అయితే రాష్ట్ర కేంద్రం బాధ్యులను కాళిదాసుగారు తనతోపాటు ఇంకొక పూర్తికాలం కార్యకర్త రైతుసంఘానికి కావాలని అడిగారు. రాష్ట్రబాధ్యులు మాత్రం రైతుసంఘానికి కాళిదాసు ఒక్కరే సరిపోతారు అని చెప్పారు. అప్పటికే నేను కాళిదాసుగారితో  రైతుసంఘంలో పనిచేయాలనుకున్న విషయం చెప్పాను, దీనితో కాళిదాసుగారు నన్ను రైతుసంఘంలో పని చేయించమని రాష్ట్ర బాధ్యులతో చెప్పి, ఆయనకు ఇష్టం లేకపోయినా పట్టణకమిటిలో బాధ్యతలు తీసుకున్నారు. అప్పటికే పట్టణంలో బాధ్యతలు నిర్వహిస్తున్న వై. శ్రీనివాస్ (వై.ఎస్) తో కలిసి పనిచేయడం ప్రారంభించారు. వారు చేసిన ఉద్యమాల్లో ఇళ్ళస్థలాల కోసం చేసిన ఉద్యమం మహోన్నతమైనది.

## 2006లో ఇళ్ళస్థలాల కోసం జరిగిన పోరాటం

పట్టణీకరణ పెరుగుతుంది. గ్రామాలనుండి పనులకోసం పట్టణాలకు వచ్చేవారు పెరిగారు. ఇంటి అద్దెలు చాలా ఎక్కువగా ఉన్నాయి. వారి సంపాదనలో ఎక్కువభాగం అద్దె చెల్లింపులకే ఖర్చు అవుతుంది. కుటుంబాలు పెరిగి సొంత ఇల్లు నిర్మించుకోలేని పరిస్థితి. స్థలాలరేట్లు విపరీతంగా పెరిగాయి. సామాన్యుడు ఒక సెంటుస్థలం కూడా కొనలేని పరిస్థితి ఏర్పడింది. రియల్ ఎస్టేట్ వ్యాపారం జోరుగా సాగుతుంది. పెద్దలు ఎక్కడెక్కడ భూములన్నీ కారుచవకగా ఆక్రమించుకొని వ్యాపారం చేస్తున్నారు. ప్రజల సమస్యలను గుర్తించి ప్రభుత్వ భూములను ఇళ్ళస్థలాల కోసం, సాగుకోసం పేదలకు ఇవ్వాలని పార్టీ డిమాండ్ చేసింది.

ప్రభుత్వం ఆ పని చేయకుంటే మేమే ప్రత్యక్ష కార్యాచరణ చేపట్టి ప్రభుత్వస్థలాలలో ఇళ్ళు వేయిస్తామని పిలుపునిచ్చింది. ఆ సమయంలో గుంటూరునగరంలో బాధ్యతల్లో ఉన్న వై.ఎస్, కాళిదాసు కలిసి ప్రభుత్వస్థలాల వెతుకులాటలోపడి కొన్ని స్థలాలను గుర్తించారు. ఆ స్థలాలలో ప్రజలచేత ఇల్లు వేయించారు. వారికి అవసరమైన బాదులు, కర్రలు, రేకులు తదితర సామాగ్రిని తెచ్చుకోలేనివారికి కూడా సహాయ, సహకారాలను అందించారు. ఇల్లు నిర్మించుకున్న పేదలకు అండగా రాత్రి సమయాలలో కూడా అక్కడే ఉన్నారు. అనేకసార్లు అధికారులకు రాయబారాలు నడిపి స్థలాలను మంజూరు చేయాలని కోరారు. నగరంలో ఐదు ప్రాంతాలలో స్థలాల కోసం పోరాటం నిర్వహించారు. వేలాదిమంది పేదలు ఈ ఉద్యమంలో పాల్గొన్నారు. పేదలు ఇల్లు వేసుకున్నచోట ప్రభుత్వం కూల్చివేసే పనులకు పూనుకుంది. ఈ పనులను అర్ధరాత్రులు చేసేవారు. వీటిని తీవ్రంగా ప్రతిఘటించారు. లాఠీచార్జి చేసి తీవ్రంగా బాదేవారు. అన్నింటిని భరించి పేదలకు ధైర్యంచెప్పి నిలబెట్టడంలో కాళిదాసుగారు ప్రముఖపాత్ర నిర్వహించారు.

పొన్నూరురోడ్‌లో ప్రభుత్వ సీలింగ్ భూములలోకి పేదలు వెళితే, అప్పటికే ఆ భూములను ఆక్రమించుకొని రియల్ ఎస్టేట్ వ్యాపారులు ప్లాట్లువేసి అమ్మకాలు చేశారు. అది చెల్లుబాటుకాదని ఆందోళనలు చేసినా ప్రభుత్వం ఆక్రమణదారులకే అండగా ఉంది. భూములలోకి వెళ్ళిన పేదలపై రియల్ ఎస్టేట్ వ్యాపారులు, ఆక్రమణదారులు భౌతికదాడులకు పూనుకున్నారు. కొంతమందిని టార్గెట్ చేసి కొట్టాలని ప్రయత్నం చేశారు. వాటన్నింటిని ఎదిరించి నిలబడటంలో కాళిదాసుగారి పాత్ర అమోఘమైనది. ఈ సందర్భంగా చాలామంది కార్యకర్తలపై అక్రమకేసులు బనాయించారు. రెండు సంవత్సరాలపాటు కోర్టులచుట్టూ తిరిగారు. ఈ పోరాటాల ఫలితంగానే నగరంలో సుందరయ్యకాలనీ, ప్రగతినగర్ ఏర్పడి సుమారు 500 కుటుంబాలు నివాసం ఏర్పాటు చేసుకున్నారు. ఆ తర్వాతనే ప్రభుత్వం రాజీవ్ గృహకల్ప, టిడ్కో ఇళ్ళ నిర్మాణం, జగనన్న కాలనీలను చేపట్టి పేదలకు ఇళ్ళు మంజూరు చేసింది.

## ఏఐకెఎస్ జాతీయ మహాసభల సాంస్కృతిక కార్యక్రమాల నిర్వహణలో...

ఎ.ఐ.కె.ఎస్ జాతీయమహాసభలు 2010 జనవరిలో గుంటూరులో జరిగాయి. ఈ సందర్భంగా జరిగిన సాంస్కృతిక కార్యక్రమాల నిర్వహణలోను, భోజన ఏర్పాట్లలోనూ కీలకంగా వ్యవహరించారు.

### కరోనా ఐసోలేషన్ సెంటర్స్ నిర్వహణలో...

2020లో దేశంలో కరోనా విజృంభించి ప్రజలను అతలాకుతలం చేసింది. ఇది ఒకరుతాకిన ప్రదేశంలో మరొకరు తాకినా అందరికీ కరోనా వ్యాప్తి చెందడంతో కరోనా ఉన్న వ్యక్తిని 14 రోజులపాటు క్వారంటైన్‌లో ఉంచాల్సి వచ్చింది. 14 రోజుల తర్వాతకాని దాని ప్రభావం తగ్గేది కాదు. తగిన జాగ్రత్తలు తీసుకోకుంటే వారిద్వారా ఇంకొందరికి వ్యాపించేది. ముఖ్యంగా పేదకుటుంబాలలో కరోనా ఉన్న వ్యక్తి ప్రత్యేకంగా ఒక గదిలో ఉండాలన్నా, వైద్యం పొందాలన్నా, ఆహారం తీసుకోవాలన్నా, వారికి మరోకరు సహాయం చేయాలన్నా భయపడి పోతున్న పరిస్థితిలో పార్టీ రాష్ట్రకమిటి అన్ని జిల్లాలలో "ఐసోలేషన్" కేంద్రాలను ఏర్పాటు చేయాలని పిలుపిచ్చింది. డాక్టర్లతో సంప్రదించి ప్రతికేంద్రంవద్ద డాక్టర్లను ఏర్పాటు చేసి, పనిచేసే వాలంటేర్లను ఏర్పాటు చేసి, భోజనం, మందులు అందించింది. పార్టీ ఆఫీసులనే ఐసోలేషన్ కేంద్రాలుగా మార్చింది. గుంటూరు ఆఫీసులోను, యడ్లపాడులోను ఏర్పాటుచేసిన కేంద్రాలకు కాళిదాసుగారు పూర్తి సహాయ, సహకారాలు అందించారు. కరోనా సోకినవారి వద్దకు వెళ్ళి వారికి ధైర్యం చెప్పేవారు. డాక్టర్లను తీసుకెళ్ళి పరీక్షలు చేయించేవారు. దీనికి అవసరమైన నిధులను సమీకరించడంలో మంచి కృషి చేశారు.

## గుఱ్ఱం జాషువా విజ్ఞానకేంద్రం ట్రస్ట్ ఏర్పాటులో...

గుంటూరులో గుఱ్ఱం జాషువా విజ్ఞానకేంద్రం ట్రస్టుని పార్టీ ఏర్పాటు చేసింది. సమకాలీన అంశాలపై సెమినార్లు, విద్యా, వైద్యరంగంలో, సామాజిక, సాంస్కృతిక మరియు సేవా, తదితర రంగాలలో ప్రజాస్వామిక హక్కులకోసం, లౌకిక, సమానత్వ భావాలను పెంపొందించడం కోసం అనేక బహుముఖ

కార్యక్రమాలను విజ్ఞానకేంద్రం కమిటిద్వారా నిర్వహించాలని నిర్ణయించారు. కమిటీకి ప్రధానకార్యదర్శిగా ఉన్న ఎన్.కాళిదాసుగారు విజ్ఞానకేంద్రం బాధ్యతను నిర్వహించారు.

భార్య, భర్తలు ఇద్దరు మరో ఆలోచనలేకుండా పార్టీనే కుటుంబంగా గడిపారు. పార్టీకార్యకర్తలతోనే కాకుండ వారి కుటుంబసభ్యులతోకూడా మంచి సంబంధాలు ఉండేవి. వైద్యపరంగాకాని, మరే సమస్య వచ్చినా వారికి అండగా ఉండేవారు. పార్టీ కుటుంబాలతో వారికున్న సంబంధాలు మరెవ్వరికీ లేవంటే అతిశయోక్తి కాదు. వయస్సురీత్యా పార్టీ బాధ్యతల నుండి రిలీవ్ అయ్యి స్వగ్రామం యడ్లపాడు వచ్చారు. 30 సంవత్సరాల క్రితం వదిలి వెళ్ళిన శాఖలోనే సభ్యునిగా ఉంటూ, పార్టీ కార్యక్రమాలలోను, గ్రామంలో జరిగే సుందరయ్య నాటకోత్సవాల నిర్వహణలో, పోపూరి రామారావు విజ్ఞానకేంద్రం కార్యక్రమాలలో, గ్రామ అభివృద్ధి కమిటీ నిర్వహించే ఉచిత వైద్యశిబిరాలలో, వేసవిలో జరిగే స్కూల్ పిల్లల శిక్షణ క్యాంపులలోనూ కీలకంగా వ్యవహరిస్తున్నారు.

గ్రామంలో కమ్యూనిస్టు పార్టీ పట్ల ఆకర్షితుడై, పార్టీ సిద్ధాంతాన్ని అవగాహన చేసుకొని నీతి, నిజాయితీతో నిస్వార్థంగా పార్టీకి, ప్రజలకు వీరు చేసిన కృషి భావితరాలకు, కమ్యూనిస్టు శ్రేణులకు ఆదర్శప్రాయము.

గుంటూరులో సి.పి.ఐ.(యం.) ఆఫీసు శంకుస్థాపన ఫలకాన్ని ఆవిష్కరిస్తున్న కామ్రేడ్ మండవ వెంకటసుబ్బయ్యతో కాళిదాసు.



**ఎస్. వెంకట్రావు**
ప్రజాశక్తి, ఉపసంపాదకుడు,
విజయవాడ.
9496099333

# నిబద్ధతకు, నిక్కచ్చికి నిలువుటద్దం కాళిదాసు

**ని**బద్ధతను, నిక్కచ్చితనాన్ని కలగలిపి అద్దం ముందు పెడితే కనబడే ప్రతిబింబం కాళిదాసు. యువకుడుగా ఉన్నప్పుడు నేను చూసిన కాళిదాసుకూ ఇప్పటి కాళిదాసుకూ ఈ రెండు లక్షణాల్లో తేడా ఏమీ లేదు. తను క్రమశిక్షణ పాటిస్తాడు. పార్టీలోనూ, ఆయన పనిచేసిన రంగంలోనూ సామాన్య కార్యకర్తలే కాదు నాయకులు కూడా క్రమశిక్షణ పాటించాల్సిందేనంటాడు. ఆ విషయంలో ఆయన కొన్ని సమస్యలనెదుర్కొన్నా రాజీపడేదే లేదన్నాడు.

నేను ప్రజాశక్తిలో సబ్‌ఎడిటర్‌గా పనిచేస్తున్నప్పటి నుండి కాళిదాసును ఎరుగుదును. నాటి ప్రజానాట్యమండలి రాష్ట్ర ముఖ్య నాయకుల్లో ఆయనొకడు. పరిషత్ నాటికలకే కాదు, అభ్యుదయ కళారూపాల నిర్మాణానికి గుంటూరుజిల్లా ఎడ్లపాడు కేంద్రంగా ఉండేది. అక్కడి తన అనుభవాలను రాష్ట్రమంతటికీ విస్తరించడంలో, ముఖ్యంగా ఆంధ్రప్రజానాట్యమండలి చేపట్టిన అక్షర కళా యాత్రల్లో కాళిదాసు ముఖ్యభూమిక నిర్వహించాడు.

1980, 90 రెండు దశాబ్దాలపాటు ఆంధ్రప్రజానాట్యమండలి కళాకారులకు తాడేపల్లి సుందరయ్యనగర్ కేంద్రంగా ఉండేది. నాతోపాటు ప్రజాశక్తి కార్మికులు, పార్టీసభ్యులు అనేక మందిమి అక్కడ నివాసాలు ఏర్పాటు చేసుకున్నాం. పిఎన్ఎం రాష్ట్ర కార్యదర్శి శాంతారావు, దేవి మా ఇంటి ఎదురుగా ఉండడం, గాయకుడు మోహన్, జగన్, పట్టాభి ఇంకా అనేకమంది కళాకారులు

సుందరయ్యనగర్‌లో నివసించడంవల్ల అక్కడ వివిధ ప్రాంతాలనుండి వచ్చిపోయే కళాకారులతో సందడిగా ఉండేది. ఆ విధంగా కాళిదాసు నిరంతరం వచ్చి పోయేవాడు. ఆయనతో ఏర్పడిన పరిచయం ఉద్యమంలో గట్టి బంధంగా మారింది.

సుందరయ్యనగర్ పార్టీ, మహిళా ఉద్యమం బలంగా ఉన్నందున రాష్ట్ర స్థాయి కళాజాతాలకు మహిళాకళాకారులు అక్కడ లభించేవారు. పార్టీ కుటుంబాల నుండి అనేక మంది అమ్మాయిలు, మహిళలు రాష్ట్రస్థాయి అక్షర కళాజాతాల్లోనూ, వీధినాటికల్లోనూ పాల్గొన్నారు. ఆ విధంగా మహిళాకళాకారుల కోసం కూడా కాళిదాసు సుందరయ్యనగర్‌కు తరచూ వచ్చి మమ్మల్ని కలిసేవాడు.

కాళిదాసు కళలపట్ల అభిరుచి మాత్రమే కాదు కమ్యూనిస్టు ఉద్యమంపట్ల లోతైన అవగాహన గలిగిన వ్యక్తి. అందువల్ల కళాకారులనూ, సాంస్కృతిక ఉద్యమాన్నీ ప్రజా ఉద్యమాలకు దన్నుగా నిర్మించడానికి ప్రయత్నించేవాడు. అటు తెలంగాణ నుండి ఇటు కోస్తాంధ్రలోని పలు జిల్లాలనుండి వచ్చే కళాకారులతో నిత్యం ఈ విషయమై చర్చలు జరిగేవి. ఆ చర్చలకు బాగా దోహదం చేసినవారిలో కాళిదాసు ఒకరు.

కళారంగం ద్వారా పరిచయమైన కాళిదాసు దంపతులు క్రమంగా మాకు కుటుంబమిత్రులుగా కూడా మారారు. గుంటూరుజిల్లా ప్రజానాట్యమండలి ఉద్యమానికి సారధ్యం వహించినప్పుడుగానీ, పార్టీ జిల్లాకార్యాలయ ఇంఛార్జిగా ఉన్నప్పుడుగానీ, లేక ఆయన పార్టీకి సంబంధించి ఏ బాధ్యతల్లో ఉన్నాగానీ ఆ బాధ్యతను నిబద్ధతతో నిర్వహించేవారు.

ఈ రోజున నయాఫాసిస్టు శక్తులు దేశంలో బలంగా వేళ్లూనుకుంటు న్నాయి. మన రాష్ట్రం దానికి మినహాయింపు కాదు. రాష్ట్రంలో తెలుగుదేశం నేతృత్వంలో ఎన్డీఎ ప్రభుత్వం ఏర్పడిన తరువాత ప్రమాదకరమైన ఆర్ఎస్ఎస్ శక్తులు విస్తరించడానికి గట్టి భూమిక ఏర్పడింది. గతంలో చాపకింద నీరులా విస్తరిస్తూ వచ్చిన మతోన్మాదులు వివిధ రకాల ముసుగుల్లో అధికారం అండతో ప్రజల్లో విద్వేషభావజాలాన్ని విస్తారంగా ప్రవేశపెట్టడానికి అన్నివిధాలా

ప్రయత్నిస్తున్నాయి. ఇటువంటి తరుణంలో లౌకిక ప్రజాతంత్ర భావజాలాన్ని ప్రజల్లో ప్రచారం చేయడం, వారిని అభ్యుదయంవైపు నడపడం అత్యంత అవసరమని సిపిఐ(ఎం) భావిస్తోంది. ఇటువంటి భావజాల ప్రచారానికి సాంస్కృతికరంగం మంచివేదిక. అందుకనే పార్టీ సారథ్యం వహించే అన్ని ప్రజారంగాల్లోనూ, ప్రజా ఉద్యమాల్లోనూ సాంస్కృతికరంగాన్ని పెంపొందించాలని పార్టీ ఆదేశించింది. సాంస్కృతికరంగంలో పార్టీ ఎలా కృషిచేయాలో సూచిస్తూ ప్రత్యేకంగా ఒక పత్రాన్ని విడుదల చేసింది.

ఇటువంటి తరుణంలో ఉద్యమానికి కాళిదాసువంటి నిబద్ధత కలిగిన సాంస్కృతికరంగ కార్యకర్తల అవసరం ఎంతైనా ఉంది. వయసు, ఆరోగ్యంరీత్యా ప్రస్తుతం ఆయన కృషి ఎడ్లపాడుకు పరిమితమై ఉన్నా రానున్న కాలంలో ఆయన గుంటూరుజిల్లా ఉద్యమానికీ, రాష్ట్ర ఉద్యమానికీ మరింతగా సేవలు అందజేస్తారని ఆశిస్తున్నాను. ఆయన ఆయురారోగ్యాలతో సుదీర్ఘకాలం జీవించాలనీ, ఉద్యమానికి మరింతగా తోడ్పడాలనీ కోరుకుంటున్నాను.





ఉద్యమ నాయకులు కామ్రేడ్ చౌదరి తేజేశ్వరరావు, వారి భార్య
కామ్రేడ్ సంపూర్ణమ్మతో కాళిదాసు, విజయలక్ష్మి.



**డాక్టర్ చిట్టినేని శివకోటేశ్వరరావు**
నటులు - వ్యాఖ్యాత,
నంది అవార్డు గ్రహీత
ఫోన్: 9912340167

# అందరి బంధువయా!

Maxim Gorky అన్నట్లు ఏ దేశంలోనైనా సంస్కృతి నిర్మాతలు ముగ్గురే! వారు శ్రమజీవులు...శాస్త్రజ్ఞులు...సాహితీకారులు.

పోరాటాల పురిటిగడ్డ వామపక్ష భావజాలం దృఢంగా వేళ్ళూనిన గుంటూరు జిల్లా, యడ్లపాడుగ్రామంలో 1953 సం॥లో కమ్మని మట్టివాసన నెరిగిన ఒక సామాన్య రైతుకుటుంబంలో, నూతలపాటి వెంకటేశ్వర్లు, వెంకాయమ్మ దంపతులకు శ్రీ కాళిదాసుగారు జన్మించారు.

గ్రామీణ నేపథ్యంలో చిన్న-సన్నకారు రైతులు, విద్యార్థులు, జనపదుల కష్టాలు తెలిసిన శ్రమజీవి కాళిదాసుగారు. సమాజాన్నే తన కుటుంబంగా ఎందరో ఆర్తులకు, అన్నార్తులకు, ఆప్తులకు, ఆపన్నులకు అండగా నిలిచారు. సాంఘిక, సామాజిక, సాంస్కృతికరంగాలలో శ్రోతగా ప్రేక్షకునిగా, నటునిగా, విమర్శకునిగా, విభిన్నపాత్రలు పోషించారు. ఎందరో లబ్ధప్రతిష్ఠులకు ప్రముఖులకు, రాజకీయులకు సన్నిహితుడై విశిష్టతను సంతరించుకున్న పరిపూర్ణవ్యక్తిత్వం మన నూతలపాటి కాళిదాసుగారిది అనడం ఏమాత్రం అతిశయోక్తికాదు.

బాల్యంలో ప్రాథమిక విద్య యడ్లపాడులో పూర్తిచేసినా, ఆర్థిక ఇబ్బందుల కారణంగా పైచదువులకు స్వస్తి చెప్పి చిరుప్రాయంలోనే గ్రామీణ సమస్యలను ఆకళింపుచేసుకొని, యువజనులను సమీకరించి యడ్లపాడుగ్రామంలోని పలు సమస్యలను ఆకళింపు చేసుకుని తన పరిధిలో పరిష్కరించటానికి పోరాటాలకు శ్రీకారంచుట్టారు. ఆ సమయంలోనే కళలపట్ల ఆకర్షితులై, కమ్యూనిష్టుపార్టీ

కార్యక్రమాలతో ఉత్తేజితులై, వామపక్ష భావజాలాన్ని పెంపొందించుకున్నారు. తన సమీపబంధువు కీ॥శే॥ పోపూరి రామారావుతో ఉన్న సాన్నిహిత్యం ప్రజా సమస్యలపై పోరాటానికి పురికొల్పింది. ఈ పోరాటపటిమ గ్రామస్థాయినుండి తాలూకా, జిల్లా, రాష్ట్రస్థాయి సమస్యలపై అవగాహన కలిగించి మార్క్సిస్టుపార్టీ కార్యక్రమాల అమలుకు దోహదంచేసింది.

కీ॥శే॥ పుతుంబాక వెంకటపతిగారితో ఉన్న పరిచయం కారణంగా, ప్రజాసమస్యలను అధికారుల దృష్టికి తీసుకువెళ్ళి, పరిష్కరించే మార్గాలను సుగమంచేసింది. శ్రీ పుతుంబాక వెంకటపతిగారినుండి శ్రీ రామారావుగారివరకు అధ్యక్షులుగా యున్న కాలంలో జిల్లా పార్టీఆఫీసు బాధ్యతలును కడు సమర్ధవంతంగా నిర్వహించారు. గుంటూరుజిల్లా మార్క్సిస్టుపార్టీ చేపట్టిన కార్యక్రమాల అమలులో, పార్టీ ఆఫీసు నిర్మాణంలో ఎందరో వదాన్యుల నుండి విరాళాలు సేకరించి ఆర్థికంగా పార్టీని పరిపుష్టం చేశారు. జిల్లాలోని అన్ని పార్టీలవారితో స్నేహభావం పెంపొందించుకొని ప్రజాసమస్యల పరిష్కారానికి తనవంతు కృషి చేశారు. జిల్లా పార్టీ ఆఫీసు వ్యవహారాలు ఎంతో పారదర్శకంగా నిర్వహించి పార్టీ రాష్ట్ర కార్యవర్గం ప్రశంసలు పొందారు.

కేవలం ఉపన్యాసాలద్వారానేకాక, కళారూపాలద్వారా సమాజంలో మార్పును తీసుకురావడం సులభమని విశ్వసించిన సంస్కరణాభిలాషి కాళిదాసు గారు. ఒక దురాచారంయొక్క సమగ్రస్వరూపాన్ని, అనర్థాలను రంగస్థలంపై కళ్ళకు కట్టినట్లు చూపిస్తే ప్రేక్షకుల హృదయాలపై చెరగనిముద్ర వేస్తుందని, వారిలో ఆలోచనలు రేకెత్తిస్తుందని ప్రగాఢంగా విశ్వసించే వ్యక్తి కాళిదాసుగారు. 1972 సం॥లలో చదువు పూర్తి చేసుకొని యడ్లపాడులో ప్రైవేట్ కాన్వెంట్ స్థాపించి పేద విద్యార్థులకు విద్యను అందిస్తున్న సజ్జారాజు బాలచందర్‌గారి పరిచయం కాళిదాసు గారికి కళలపట్ల ఆసక్తి పెంచింది అని చెప్పవచ్చు. వారి సహచర్యంలో చిన్న చిన్న వేషాలతో ప్రారంభమై, ప్రజానాట్యమండలి చేపట్టిన అనేక వీధి నాటికలలో నటించడం ద్వారా ప్రజలను చైతన్యపరచిన విధానం కళాకారుడుగా తనకు తృప్తికలిగించిందని కాళిదాసుగారు ఎంతో వినమ్రంగా తెలియచేస్తారు.

అందుకే శ్రీ శాంతారాం, శ్రీ దేవేంద్ర తదితరుల సహకారంతో వీధి నాటకాలకు తనదైనరీతిలో ప్రోత్సాహాన్ని అందించి, కళ ప్రజలకోసం అనే ప్రజా నాట్యమండలి పిలుపుకు స్పందించి వివిధ కళారూపాల ప్రదర్శనలు ఏర్పాటు చేశారు.

మనిషికి, మనిషికి మధ్యనున్న అంతరం సమసిపోవాలని, అడ్డుగోడలు కూలిపోవాలని, కులమత వర్గవిబేధాలకు అతీతంగా యడ్లపాడు చుట్టుప్రక్కల గ్రామాలలోని ప్రజలను చైతన్యపరచి ఎందరికో మార్గదర్శకులు అయ్యారు. అన్నదాతల ఆత్మహత్యలపర్వాన్ని, కళ్ళకు కట్టినట్లుగా శ్రీ జరుగుల రామారావు దర్శకత్వంలో ప్రదర్శించిన నాటిక "హాలికులు సేమమా"లో తనదైనశైలిలో నటించి ప్రేక్షకుల ప్రశంసలందుకున్నారు.

1993-94లో ఉద్భవించిన సారావ్యతిరేక ఉద్యమంలోకూడా గుంటూరు జిల్లా ప్రజానాట్యమండలిద్వారా అనేక కార్యక్రమాలు, సభలు - సమావేశాలు, వీధినాటిక ప్రక్రియద్వారా ప్రజలను చైతన్యపరచిన సన్నివేశాలు కాళిదాసుగారి జీవన గమనంలో మరచిపోనివి.

మానవత్వం, ప్రేమ, మంచితనానికి నిలువెత్తు దర్పణం శ్రీ నూతలపాటి. "బలిమికి సాఫల్యం అది బలహీనులు మెచ్చినప్పుడే, కలిమికి సాఫల్యం అది నలుగురికి దక్కినప్పుడే" అన్న నగ్నసత్యాన్ని తన జీవితంలో ఆచరణలో చూపిన ఆదర్శప్రాయుడు, పరోపకారి శ్రీ నూతలపాటి కాళిదాసు. పలువురు పేదవిద్యార్థులు ఉన్నతవిద్యను అభ్యసించే విధంగా మిత్రులద్వారా కృషిచేసి పలు విద్యాసంస్థలలో ప్రవేశం కల్పించి, విద్యపై తన మక్కువను తెలియజేశారు.

ఎక్కడా తన ప్రవర్తనలో అహంభావం మచ్చుకైనా గోచరించదు. పెద్దలపట్ల ఎంతగౌరవం చూపుతారో, తనకన్నా చిన్నవాళ్ళపైనా, వివిధరంగాలలో కృషిచేస్తున్న ఔత్సాహికులపై కూడా అంతే వాత్సల్యాన్ని చూపుతారు. కృతజ్ఞత అనే మాటకు తన జీవితంలో ఎంతో ప్రాధాన్యతను ఇచ్చారు.

పోపూరి రామారావుగారి సహచర్యం, పుతుంబాక వెంకటపతిగారి పోరాటపటిమ, డాక్టర్ కాసరనేని సదాశివరావుగారి పరిశీలన, కె. శాంతారామ్, కె. దేవేంద్రల ఆలోచనలు, సజ్జాజు బాలచందర్‌గారి దాతృత్వం - కళారాధన"

కాళిదాసుగారి వ్యక్తిత్వాన్ని ఇనుమడింపచేశాయి అనడం ఎంతైనా సమంజసం. చేసేపనిమీద చిత్తశుద్ధి ఉండాలనేది ఆయన నమ్మిన ప్రాథమికసూత్రం.

"సొంతలాభం కొంతమానుకో, పొరుగువాడికి తోడుపడవోయ్" అన్న గురజాడ అడుగుజాడలో నడుస్తూ మానవసంబంధాలన్ని ఆర్థికసంబంధాలై పోతున్న నేటిరోజులలో, జాతి, మత, కులవిచక్షణ లేకుండా అందరికీ చేతనైన సహకారం అందిస్తూ, ప్రజాసమస్యలపై అనునిత్యం అలుపెరగని పోరాటయోధుడు కాళిదాసు.

"ఉమ్మడి కుటుంబాలు బంధాలు, బాంధవ్యాలు దేవుడెరుగు అసలు కన్న తల్లిదండ్రుల గోడుకూడా పట్టించుకోని నేటి సమాజంలో, పెద్దలపట్ల గౌరవం వారిపట్ల వీరు చూపే అనురాగస్పర్శ ఎంతైనా అభినందనీయం. "డబ్బుకాదు శాశ్వతం, అనుబంధాలు మాత్రమే శాశ్వతం" అనే విధంగా కాళిదాసుగారు నడిచేబాట, ఇప్పటికి, ఎప్పటికి నభూతో నభవిష్యతి.

శ్రీ కాళిదాసుగారికి సొంత ఊరు యద్లపాడుపై విపరీతమైన అభిమానం. తనకు ప్రజలలో గుర్తింపు తీసుకురావడానికి అవకాశం కల్పించిన యద్లపాడు హైస్కూల్స్ అభివృద్ధికొరకు ముత్తవరశ్రీనపు రామారావు, ఆలోకం పెద్దబ్బయ్య తదితరులతో కలిసి ఎంతో శ్రమించారు. యద్లపాడు ప్రాంతంలో ప్రజలను కళారూపాలద్వారా చైన్యపరచాలని భావించి గత 22 సంవత్సరాలుగా ముత్తవరపు రామారవు, పద్మారావు, సురేష్‌బాబు, శంకరరావులతో కలిసి కామ్రేడ్ పుచ్చలపల్లి సుందరయ్య నాటకోత్సవాలు నిర్వహిస్తున్నారు. గుంటూరు – ప్రకాశంజిల్లాలలో నిర్వహించే పలు నాటకపరిషత్తులకు న్యాయనిర్ణేతగా ఎంతో పారదర్శకంగా గుణాత్మక నిర్ణయాన్ని వెలువరించి పలువురు కళాకారుల అభిమానాన్ని చూరగొన్నారు.

శ్రీ కాళిదాసుగారి స్ఫూర్తిని పొందిన ఎందరో...ప్రజాసమస్యలపై పోరాటాలు చేయడమే కాదు, వారి సేవలనుకూడా గుర్తెరిగి రాష్ట్ర, రాష్ట్రేతర ప్రాంతాలలో వారి ఆశయాలను కొనసాగిస్తున్నారు. కాళిదాసుగారి నిర్మొహమాట తత్వం, నిక్కచ్చితనం కొందరిని తాత్కాలికంగా దూరం చేసినా, ఆత్మవిమర్శతో తిరిగి దగ్గరైనవారు ఎందరో...ఆత్మీయులు ఎవరైనా పొరపాటు చేస్తే వారిసేవలను

సమర్థిస్తూనే విడిగా ఒంటరిగా ఉన్నప్పుడు కుండబద్దలు కొట్టినట్లు వారి తప్పులను గురించి చెప్పేవారు.

జానపద కళలపైయున్న మక్కువతో 2006లో 'తానా'వారు గుంటూరులో ఏర్పాటు చేసిన, తానా జానపదకళోత్సవాలలో రాష్ట్రం నలుమూలల నుండి విచ్చేసిన దాదాపు 500 మంది కళాకారులను సమన్వయపరచి మూడురోజులపాటు ప్రదర్శనలు 'విజయవంతంగా నిర్వహించటం, నాకు వారితోయున్న ప్రత్యక్ష అనుబంధానికి చిన్న ఉదాహరణ. గుంటూరునగరంలో జరిగే అన్ని సాహితీ, సాంస్కృతిక కార్యక్రమాలలో క్రమం తప్పకుండా పాల్గొని కళాకారులకు, సమాజాలకు తన సేవలు అందిస్తున్నారు.

ప్రజాసమస్యలు, కళాకారుల స్థితిగతులు, పేదవిద్యార్థుల కొరకు అలుపెరుగని పోరాటం చేస్తున్న శ్రీ కాళిదాసుకు కూడా కాలప్రవాహంలో ఎదురీత తప్పలేదు. ప్రవాహం ఎప్పుడూ ఒకేతీరుగాయుండదు. వడులు, సుడులూ, మలుపులూ ఎన్నో ఉంటాయి. వాటిని అధిగమించి, అందరినీ తన కుటుంబం గాను, తన సొంతవారిగా ప్రేమించి, ఆదరించే గుణాన్ని అలవరచుకున్నారు. కొంతకాలం అనారోగ్యంతో ఇబ్బంది పడ్డప్పుడు, ఆత్మస్థైర్యంతో తన సతీమణి అందించిన మానసిక అండతో తన అనారోగ్యాన్ని జయించి, తిరిగి సాంఘిక, సామాజిక రంగాలలో తన సేవలను అందిస్తున్నారు.

పరిపూర్ణవ్యక్తిత్వం కేవలం ఆ వ్యక్తికే చెందింది కాదు. వ్యక్తితో మరెందరో వ్యక్తులుంటారు. శ్రీ కాళిదాసుగారి జీవితసాఫల్యతకు దోహదంచేసి, సహకారం అందించిన వారి సహధర్మచారిణి శ్రీమతి విజయలక్ష్మి ఉరఫ్ జయమ్మగారి పాత్ర ఎంతైనా శ్లాఘనీయం. శ్రీకాళిదాసుకు లభించిన అరుదైన బహుమతి శ్రీమతి జయమ్మగారు. సహధర్మచారిణిగా వారి జీవనప్రయాణంలో ఒడుదుడుకులను ఎదురొడ్డి వారి వెన్నంటి ప్రోత్సహించి అన్యోన్య దాంపత్యానికి ఆదర్శప్రాయురాలుగా నిలిచారు. వాస్తవంగానే ఈశ్వరతత్వంలోని అర్ధనారీశ్వరం వారి జీవననిజ ఐశ్వర్యం. ఏడుపదుల వయస్సు దాటిన శ్రీ కాళిదాసుగారి దంపతులు పదిపదులు వరకు సంపూర్ణ ఆయురారోగ్యాలతో జీవించాలని ఆశిస్తూ...ఆకాంక్షిస్తూ.. అభిమానధనుడైన ఆత్మీయమిత్రునికి ఇదే నా అక్షరనీరాజనం.



**టి. విజయనాగవర్ధిని**
ఉపాధ్యాయిని
**కె. రామబ్రహ్మం**
జీవితబీమా ఏజంట్, యడ్లపాడు.
9908399169

# కాళిదాసు మామయ్యగారితో మా పరిచయం

**కా**ళిదాసు మామయ్యగారితో నాకున్న అనుబంధం గురించి చెప్పాలంటే చాలా సన్నిహితమైనది. కాళిదాసు మామయ్యగారి ఇళ్లు మా వీధిచివర ఉండేది. నాన్నగారు, కాళిదాసు మామయ్య చాలా సన్నిహితస్నేహితులు. ఇద్దరూ కళాకారులే. ఇద్దరూ కలిసి నాటకాలు కూడా ప్రదర్శించారు. ఇద్దరి పెళ్లిళ్లు అయ్యాకకూడా ఆ స్నేహం అలాగే కొనసాగింది. అమ్మ కాళిదాసు అన్నయ్యా! అని ఆప్యాయంగా పిలిస్తే, అంతే ఆప్యాయతతో మామయ్యకూడా అమ్మని పలకరిస్తారు. ఆయనకి ఎందులోనూ తగ్గదు మామయ్య సతీమణి జయమ్మ అత్తయ్య. అన్ని విషయాల్లో ఆయనకు సరైనజోడీ అనిపించుకుంటుంది. వారిదాంపత్యం ఎంతో అన్యోన్యమైనది, ఆదర్శమైనది.

బాల్యంలో కాళిదాసు మామయ్య చేసిన అల్లరిపనులను, నాన్నగారు అప్పుడప్పుడు మాతో చెపుతూ సరదాగా నవ్వుకునేవారు. తాను నమ్మిన సిద్ధాంతాలు, ఆదర్శాలు ఆచరణలో ఏ మాత్రం రాజీపడనితత్త్వం ఆయనది. జీవితంలో వచ్చే ఆటుపోట్లను ఎంతో నిబ్బరంతో ఎదుర్కొని నిలబడే ఆయన మనోధైర్యం ఎంతో కొనియాడదగినది. కాళిదాసు మామయ్యగారి పెద్దమ్మాయి శోభారాణి మా క్లాస్‌మేట్. తనతోపాటు వాళ్లింట్లో చనువుగా తిరిగేవాళ్లం. అయితే ఇద్దరు బిడ్డలను

వేరువేరు ప్రమాదాల్లో పోగొట్టుకున్నా, తట్టుకొని మనోధైర్యంతో, ప్రజా నాట్యమండలి, సిపిఎం కోసం అహర్నిశలు కష్టపడి తన సేవలను అందిస్తున్న ఆదర్శవాది. ధీమంతుడు మామయ్య.

మా వివాహం జరిగిన విధానం మా ఊళ్లో పెద్దసంచలనం, ఇంకా పెద్ద ఆశ్చర్యం కల్గించింది. ప్రజల్లో ఎందుకంటే మాది కులాంతర వివాహం అలాంటి మా పెళ్లి జరుపుటలో అతి ముఖ్యమైనపాత్ర పోషించారు మామయ్య. మా నాన్నగారు కమ్యూనిస్ట్‌పార్టీ అభిమాని అయినప్పటికీ, ఆయనకి కొన్ని సనాతన భావాలు ఉండేవి. మా అమ్మగారికి ఇంకా ఎక్కువ. అటువంటి కుటుంబానికి అర్థమయ్యేలా నచ్చ చెప్పి, ధైర్యం చెప్పి మా పెళ్లికి అంగీకరించేలా చేసి, అందరూ విస్తుపోయేలా మా వివాహం జరుపుటలో కీలకపాత్ర పోషించారు. తన కీలక పాత్ర ఉండబట్టే మా వివాహం ఎంతో హుందాగా, విజయవంతంగా జరిగింది అనుటలో అతిశయోక్తి లేదు.

పెద్దచదువులు చదవకపోయినా గొప్ప విషయపరిజ్ఞానం కలిగినవారు మామయ్య. సమాజాన్ని జీవితాన్ని ఎంతో క్షుణ్ణంగా చదివిన గొప్పవిశ్లేషకులు. ఆయనతో ఏ విషయమైనా చర్చించవచ్చు. నాన్నగారితో కూడా చర్చించని విషయాలను మామయ్యతో స్వేచ్ఛగా చర్చించగలను. ఎందుకంటే ఆయన అంత చక్కగా అర్థం చేసుకోగలరు. నాన్నగారు కాలం చేశాక మామయ్యతో మాట్లాడుతూ ఉంటే, ఆయన చూపే వాత్సల్యం నాన్న లేనిలోటు కనిపించనివ్వదు.

జీవితంపట్ల ఒక దృఢమైన అభిప్రాయం కల్గినవ్యక్తి మామయ్య. ప్రతి ఒక్క నిమిషాన్ని ఎంతో ఉపయోగకరంగా మలుచుకుంటారు. 7 పదులు నిండినా, అలుపెరగక ఎన్నో సామాజిక, సేవాకార్యక్రమాల్లో ఉత్సాహంగా పాల్గొని నడిపిస్తునారు. వాటిల్లో భాగంగానే నా భర్త రామబ్రహ్మంగారితో కలిసి గ్రామాభివృద్ధి కమిటీలో భాగమైన విద్యాకమిటి నెలరోజులపాటు నిర్వహించు వేసవి శిక్షణా తరగతులకి సంబంధించిన కార్యక్రమాల్లో ఆయన పాత్ర కీలకమైనది. చదువుతో పాటు కో-కరిక్యులర్ యాక్టివిటీస్‌కి చెందిన ప్రత్యేకశిక్షకులను పిలిపించి విద్యార్థులకు శిక్షణ ఇప్పించి వారి సర్వతోముఖాభివృద్ధికి తోడ్పడుతున్నారు.

గ్రామాభివృద్ధి కమిటి తరుపున 2 నెలలకు ఒకసారి నిర్వహించే మెడికల్ క్యాంప్‌కి తన అమూల్యమైన సలహాలు, సహాయ సహకారాలు అందిస్తూ, క్యాంప్ చక్కగా నిర్వహించేలా కృషి చేస్తున్నారు. ఇలాంటి ఉన్నతమైన వ్యక్తి గురించి గుర్తుచేసుకునే అవకాశం మామయ్యగారి మిత్రులు ఎస్. బాలచందర్‌గారు పుస్తక ప్రచురణద్వారా కలగడం నాకు ఎంతో సంతోషం కల్గించింది. దానిని తెలియచేస్తూ వ్రాసే అవకాశం వచ్చినందుకు శ్రీ బాలచందర్‌గారికి అభినందనలు, కృతజ్ఞతలు తెలియచేస్తున్నాము.





యడ్లపాడు మెడికల్ క్యాంప్‌లో సహకరిస్తున్న కాళిదాసు



**రత్నకుమారి**
లెక్చరర్
**అంకమ్మరావు**
GMC, Asst. A.P.R.O, గుంటూరు.
9966581797

# కాళిదాసు విజయలక్ష్మి

**కు**లాలకు, వర్గాలకు అతీతంగా ప్రతి ఒక్కరిని ఆప్యాయంగా పలకరిస్తూ అందరికి నేను ఉన్నా అంటూ అండగా నిలిచే మా కమాండర్ (కాళిదాసు) నిండునూరేళ్ళు ఆరోగ్యంగా ఉండాలని కోరుకుంటున్నాము.

కాళిదాసు–విజయలక్ష్మి (ఆంటీ అంటేనే అందరికి తేలికగా గుర్తు) గార్లతో మాకు అతి తక్కువకాలం పరిచయమే కాని మా జీవితాంతం గుర్తుండే అనుభవాలు వారితో చాలా ఉన్నాయి. బహుశా మెడికల్, పోలీస్, లాయర్, పారిశ్రామికవేత్తలు, కవులు, కళాకారులు, రచయితలు, వివిధపార్టీల జాతీయస్థాయి నాయకులతో అత్యంత సమీపపరిచయాలు, వాటిని ఏరోజు స్వార్థానికి వినియోగించుకోని వ్యక్తుల్లో కాళిదాసు ముందుభాగాన ఉంటారు.

కార్యకర్తలపట్ల అభిమానం (కల్మషం లేకుండా), నమ్మిన సిద్ధాంతంపట్ల అచంచల విశ్వాసం, తప్పు అనిపిస్తే ఏ స్థాయివారినైనా (నాయకులు కావచ్చు, అధికారులు కావచ్చు) ప్రశ్నించే మనస్తత్వం కాళిదాసు సొంతం. పార్టీ నిర్ణయాల పట్ల అచంచల విశ్వాసం, కార్యకర్తలపట్ల ప్రేమ, అభిమానం కాళిదాసు – విజయలక్ష్మిల సొంతం. కాళిదాసు మాట కఠినంగా ఉన్నా అది అంశంమీదే ఉంటుంది తప్ప ఏనాడు వ్యక్తిగతంగా విమర్శించే వ్యక్తికాదు. జిల్లాకేంద్రంలో కాళిదాసుగారు ఉన్నంతకాలం గుంటూరునగరంలో ఎవరికి మెడికల్ లేదా ఇతర పనులు ఏమైనా మన కాళిదాసు ఉన్నాడు అనే భరోసా ఉండేది. ఆయన పార్టీలో

ఉన్నత పదవులు (భాధ్యతలు) ఏనాడు కావాలి అనుకోలేదు...కాని పార్టీకి ఏ అవసరం ఉన్నా అందరికన్నా ముందు ఉండే నైజం. గుంటూరులో జిల్లా పార్టీ కార్యాలయం నిర్మాణం, మీటింగ్‌హాల్, డైనింగ్‌హాల్ నిర్మాణాల్లో ఆయన శ్రద్ధ బహుశా తన ఇంటి నిర్మాణంపట్ల కూడా చూపలేదని భావిస్తున్నాం. జాషువా విజ్ఞానకేంద్రం సెక్రెటరీగా ప్రతి సంవత్సరం జాషువా జయంతి ఉత్సవాలు నిర్వహించడంలో ప్రధానభూమిక పోషించారు. పార్టీ కార్యాలయంను అత్యంత శుభ్రంగా ఉంచడంలో తనే ముందు ఉండేవారు, ఎక్కడ చిన్నకాగితం ఉన్నా తీసి డస్ట్‌బిన్‌లో వేయడంవల్లనేమో ఆఫీస్‌లో ఇతర జిల్లాల కార్యాలయాలకంటే గుంటూరుజిల్లా కార్యాలయం బాగుంటుంది అని అనేకమంది రాష్ట్ర నాయకులు మాట్లాడేవారు.

**ఆదర్శాలు అందరూ చెప్తారు...పాటించడం కొందరే చేస్తారు**

ఆదర్శాలు, సిద్ధాంతాలు చెప్పడం చాలాతేలిక, కాని వాటిని ఆచరణలో పాటించడం అతి కొద్దిమంది మాత్రమే చేస్తారు. వాటిని పాటించడంలో ప్రాక్టికల్‌గా వచ్చే ఇబ్బందులు తట్టుకునేవారే నిజమైన ఆదర్శవాదులు అని మా అభిప్రాయం. కాళిదాసుగారి అమ్మగారు (వెంకాయమ్మ) మరణించాక తన బంధువులు ఒక్క కొడుకివి నీ తల్లికి తలకొరివి పెట్టి, సంప్రదాయంగా దహనసంస్కారాలు చేయాలని చెప్పినా ఒప్పుకోని నైజం కాళిదాసుది. గుంటూరుజిల్లా కార్యాలయ బాధ్యతలు నందు రిలీవ్ అయ్యాక యడ్లపాడులో తను నిర్మించుకున్న నివాసం కూడా రోడ్ పోటు అంటే అవి యేవీ ఆయన పట్టించుకోడు అనడానికి చిన్న ఉదాహరణలు మాత్రమే.

పై వాక్యాల్లో కాళిదాసు పేరే ఎక్కువ చెప్తున్నాం. విజయలక్ష్మిగారి పేరు తక్కువగా ఉంటుంది అనుకుంటారేమో, మాకు మాత్రం వారిలో ఎవరి గురించి చెప్పినా ఇద్దరి గురించే అనేలా వారి ఆదర్శదాంపత్యం మేము అతి దగ్గరనుండి గమనించాము. జిల్లా పార్టీఆఫీస్‌లో ఎవరు వచ్చినా విజయలక్ష్మిగారు అన్నపూర్ణగా ఆదరించేవారు. పార్టీ కార్యక్రమాల పేరుతో కాళిదాసు రోజులతరబడి బిజీగా ఉన్నా ఉన్నదానిలో కుటుంబాన్ని సర్దుకురావడమేకాదు జిల్లాకేంద్రంలో జరిగే

కార్యక్రమాల్లో, బ్రాడిపేటలో పార్టీ కార్యక్రమాలు, మహిళా సంఘం కార్యక్రమాల్లో ముందు ఉండేవారు. ఏది ఏమైనా జిల్లాకేంద్రంలో ఏ సమస్య ఉన్నా, ఏ ఇబ్బంది ఎదురైనా ముందుగా మా కమాండర్ దగ్గరికి వెళితే పరిష్కారం దొరుకుతుంది అనే భరోసా ఉండేది. అటువంటి కాళిదాసు–విజయలక్ష్మీగార్లు యడ్లపాడు వెళ్లడం మాకైతే వ్యక్తిగతంగా పెద్దలోటుగా భావిస్తున్నాము.

**గురజాడ చెప్పినట్లు..**

దేశమును ప్రేమించుమన్నా...మంచి అన్నది పెంచుమన్నా!

స్వంత లాభం కొంత మానుకు...పొరుగువాడికి తోడుపడవోయి

పరుల కలిమికి పొర్లి యేడ్చే

పాపి కెక్కడ సుఖం కద్దోయి?

ఒకరి మేల్ తన మేలనెంచే

నేర్పరికి మేల్ కొల్లలోయి!

కాళిదాసు–విజయలక్ష్మీల గూర్చి ఇంకా ఎన్నో విషయాలు, అనుభవాలు చెప్పవచ్చు కాని పుస్తకంలో స్థలాభావం వలన సాధ్యం కావడం లేదు.

మరీ ముఖ్యంగా నేటితరానికి ఆదర్శంగా నిలిచిన కాళిదాసు గూర్చి పుస్తక రూపం తీసుకురావడానికి కృషి చేసిన కళాభిమాని, కళాపోషకులు, అభ్యుదయ భావాలు కల్గిన మంచి వ్యక్తి బాలచందర్‌గారికి మా కృతజ్ఞతలు.





**చెరుకూరి సత్యనారాయణ**
న్యాయవాది, గుంటూరు.
9848664587

# నిజాయితి + నిబద్ధత + మొండితనం = నూతలపాటి కాళిదాసు

**కా**ళిదాసుది యడ్లపాడు అనే విషయం అందరికీ తెల్సు. సి.పి.యం. నాయకులు పోపూరి రామారావుగారి అమ్మాయి అరుణతో నాకు పెళ్లికావటంతో, 1975లో నేను ఆ గ్రామానికి అల్లుణ్ణయ్యాను. అప్పటివరకు కమ్యూనిస్టుపార్టీ నిర్మాణంలో వున్న నాకు జూదం అలవాటు లేకపోవటమేకాదు, కళావరుకు ఇస్పేటుకి తేడా కూడా తెలియదు. గుంటూరు హిందూకాలేజి యూనియన్ అధ్యక్షునిగా వుంటూ విద్యార్థుల రూములకు, కాలేజి హాస్టలుకు వెళ్ళినప్పుడు వాళ్ళను తిడుతూ – ఒక పేకముక్క తీసుకోవటం, మరో ముక్క కింద పడేయటం– దీనిలో ఆనందమేమిటో అసలు అర్థమయ్యేదే కాదు. ఆ ఆట ఆడుతున్నందుకు వాళ్ళను తిడుతుండేవాణ్ణి.

అలాంటి స్థితినుండి రోజుల తరబడి యడ్లపాడులో వున్నందున ఆడపిల్లల దగ్గర పేకాట నేర్చుకున్నాను. పిల్లల దగ్గర వుత్తుత్తి ఆటలో మజాలేదని డబ్బులతో ఆడే పెద్దవాళ్ళ దగ్గరకెళ్లి ఆడటం ప్రారంభించాను. ఇప్పుడు పోపూరి రామారావు విజ్ఞానకేంద్రం ఉన్న స్థలంలో ఒక పాతమేడ వుండేది. అది ప్రధానమైన మదుగు. ఇంకో రెండు ఇళ్ళు కూడా ఈ ఆటకు కేంద్రాలుగా వుండేవి. అప్పుడప్పుడు మా అత్తగారి తండ్రి "ప్రెసిడెంటు సుబ్బయ్య" కర్ర తీసుకొని ఆడేవాళ్ళని బాదేవాడు. ఆయన్ను చూస్తే ఆయన కొడుకు కల్లూరి రామారావు, నేను తప్ప అందరూ

పారిపోయేవాళ్ళు. నన్నేమి అనలేక 'నువ్వూ తయారయ్యావా?' అని చూస్తూ వెళ్ళేవాడు.

ఈ సోదంతా ఎందుకు చెబుతున్నానంటే అదిగో అక్కడ పేక ఆడుతూ మొదటిసారిగా నాకు కాళిదాసు కన్పించాడు. వ్యవసాయం చేసుకుంటూ అప్పటికే నటనపై వున్న ఆసక్తితో గ్రామంలో యువజన సంఘానికి, ప్రజానాట్యమండలికి బాగా దగ్గరై జూదం, సిగరెట్ పూర్తిగా మాని ఆ సంఘాల్లో క్రియాశీలకంగా మారి 1979లో సి.పి.యంపార్టీలో సభ్యుడయ్యాడు. విప్లవ కమ్యూనిస్టుపార్టీ నిర్మాణంనుండి బయటకొచ్చి నేను చెడిపోతే, సి.పి.యం. నిర్మాణంలోకి వెళ్ళి కాళిదాసు బాగుపడ్డాడు.

ఆనాటి ఆ ముఠానుండి బయటపడిన కాళిదాసు, పద్మారావులు ఇద్దరూ ప్రజానాట్యమండలిలో క్రియాశీలకంగా మారారు. ఒకరు ఆర్గనైజర్‌గా, మరొకరు నటుడిగా ప్రముఖలయ్యారు.

కూతురి చదువు అనేది నెపమేగాని, పూర్తికాలపు కార్యకర్తగా రావాలని పార్టీ ఆదేశమే ప్రధానంగా గుంటూరు చేరాడు. మధ్యలో కొంతకాలం గడ్డిపాటి కోటేశ్వరరావుగారి వత్తిడితో అతను చైనా పర్యటన ముగించుకొని వచ్చేవరకూ ఆయన వ్యాపారలావాదేవీలు చూశారు. కాని ఆ వ్యాపారాలపట్ల విముఖతతో యడ్లపాడు వెళ్లి మళ్లీ పార్టీ ఆదేశంతో గుంటూరు వచ్చాడు. కాళిదాసు గుంటూరు రావటంలో పుతుంబాక వెంకటపతి–భారతిగార్ల ఒత్తిడి, రామారావుగారి ప్రోద్భలమూ వున్నాయి.

అప్పటికి పూర్తిగా నిర్మాణరూపం తీసుకోని ప్రజానాట్యమండలి కన్వీనర్‌గా, మొదటి మహాసభ (చిలకలూరిపేట) తర్వాత ప్రధానకార్యదర్శిగా, ఆ తర్వాత అధ్యక్షునిగా "ఆంధ్రప్రజానాట్యమండలి" పునఃనిర్మాణంలో కాళిదాసు పాత్ర శ్లాఘనీయం. ఈ బాధ్యతతోపాటు రైతుసంఘంలోనూ క్రియాశీలకంగా వున్నారు. ప్రజానాట్యమండలికి జిల్లాకమిటి నుండి గైడ్‌గాను, రైతుసంఘం జిల్లా అధ్యక్షుని గాను పోపూరి రామారావుగారు వున్నందున ఆ రెండురంగాల్లో కాళిదాసు కృషికి పూర్తి సహకారం లభించి వుండవచ్చు.

జిల్లా పార్టీకార్యాలయం (పమిడిముక్కల లక్ష్మణరావు భవనం) నిర్మాణంలోనూ, ఆ తర్వాత దాన్ని మూడు అంతస్తుల భవనంగా నిర్మించి అన్ని ప్రజా సంఘాలకూ ఎవరిగది వారికి కేటాయించేట్లుగానే కాకుండా, రాష్ట్రకమిటి తరఫున నిర్మాణ బాధ్యతల్ని పర్యవేక్షించిన కొరటాలగారు అమరులవ్వటంతో ఆయన పేరిట ఒక సమావేశమందిరాన్ని కూడా నిర్మించారు. ఆ హాలు నేడు పార్టీలకతీతంగా అన్ని సంఘాలు ఉపయోగించుకుంటున్నాయంటే వాటి నిర్మాణంలో కాళిదాసు కృషి కీలకం.

సాదాసీదా కార్యకర్తగా వున్న కాళిదాసు ఈ రోజు గుర్రం జాషువా విజ్ఞాన కేంద్రం బాధ్యునిగా, పార్టీ జిల్లాకమిటి సభ్యునిగా ఎదిగాడన్నా, రాష్ట్రవ్యాపితంగా పార్టీశ్రేణుల్లోనూ, నాయకత్వంలోనూ తగు గుర్తింపు పొందాడన్నా, అది అతని నిబద్ధతకూ, నిజాయితీకి లభించిన గుర్తింపే. తన అభిప్రాయాల్ని వ్యక్తపరచటంలో కొంత మొండితనమున్నా, పాతతరం సి.పి.యం కార్యకర్తల్లో వుండే కుందేలు–మూడుకాళ్లు సామెత కాళిదాసు విషయంలోనూ వుంది. ఈ ధోరణి పార్టీలోపలా బయటాకూడా వుండి నిష్కర్షగా వుండటంతో కొంతమందికి అయిష్టుడయ్యాడేమో కాని ఆ మొండితనం వెనుక నిజాయితీ–నిబద్ధత అతణ్ణి ఉన్నతుడిగానే నిలిపాయి.

కాళిదాసు జీవనయానంలో అతని శ్రీమతి విజయలక్ష్మి పాత్ర శ్లాఘనీయమైనది. ఏమాత్రం రాజకీయ నేపథ్యంలేని కుటుంబంనుండి, అలాంటి గ్రామం (చినకోండ్రుపాడు) నుండి వచ్చిన ఈమె తమ కుటుంబంలో జరిగిన అంతులేని విషాదాన్ని దిగమింగుకొని మళ్లీ మామూలు మనుషులు కావటంలో తనని తాను తయారుచేసుకోవటమేగాక కాళిదాసునుకూడా ఆ జ్ఞాపకాలనుండి బయటపడవేసింది.

తమ పిల్లలస్థానంలో యస్.ఎఫ్.ఐ.లో పనిచేసే పిల్లల్ని దగ్గరకు తీసుకొని వారి బాగోగులు చూశారు. మెడిసిన్ చదువుతున్న శివబాబు, శ్రీనివాస్, రత్నకుమారి, విజయలక్ష్మి, అనూరాధలను తామే తల్లితండ్రులు అన్నంతగా వారి బాగోగులు చూశారు. శివబాబు – విజయలక్ష్మిలు డాక్టర్లుగా మారి కులాంతర వివాహం చేసుకొని తెలంగాణాలోని జహీరాబాద్‌లో ప్రజలకు వైద్యసేవలు అందిస్తున్నారు. వీరి పెళ్లి కాళిదాసు ఇంటిలోనే కేవలం వంద రూపాయల ఖర్చుతో

అయిపోయింది. అలాగే డా॥ శ్రీనివాస్, డా॥ రత్నకుమారిలు కూడా కులాంతర వివాహం చేసుకొని శ్రీకాకుళంలో వైద్యశాల నిర్వహిస్తున్నారు. డా॥ మురళీ, అనూరాధ విజయవాడలోనూ, డా॥ ధనలక్ష్మి, డా॥ చక్రవర్తి హైదరాబాద్, డా॥ సవిత అమెరికాలోనూ, డా॥ పద్మావతి ఎన్.ఆర్.ఐ. ఆసుపత్రిలోనూ వైద్యులుగా పనిచేస్తున్నారు.

మెడికల్ కాలేజిలో చదువుతూ యస్.ఎఫ్.ఐ.లో పనిచేస్తున్న మహిళా విద్యార్థులతో ఒక టీం ఏర్పరచి వారితో స్త్రీ సమస్యలపై రాసిన "ప్రశ్నించండి" అనే నాటికను విజయవాడ, గుంటూరు, నర్సరావుపేటల్లో ప్రదర్శింపజేశాడు. బహుశా మన రాష్ట్రంలో అచ్చం వైద్యవిద్యార్థినులతో ఈ రకమైన కళాకారుల టీం వుండటం ఇప్పటికి మొదటిది – చివరది కూడా.

ప్రజానాట్యమండలి కళాకారులకు కూడా తన ఇల్లే కార్యక్షేత్రం. నెల్లూరు జిల్లా మారుమూల గ్రామానికి చెందిన పి.వి.రమణని గుంటూరు తీసుకువచ్చి, తన ఇంటిలో వుంచుకొని అతనిలోని గాయకుణ్ణి సానపెట్టి తనను జిల్లా ప్రజానాట్యమండలి కార్యదర్శిగా చేశాడు. ఈరోజు రాష్ట్రంలో ప్రముఖగాయకుల్లో ఒకడిగా రమణ వున్నాడంటే దానికి అతనిలోని గాయకుణ్ణి వెలికితీసిన కాళిదాసు కృషే కారణం. సంతగుడిపాడు అంజిరెడ్డిని, రేపల్లెప్రాంతానికి చెందిన కొందరు కళాకారుల్ని కూడా ఇలాగే తన ఇంటిలో వుంచుకొని కళారంగానికి అందించాడు.

సింహాద్రి శివారెడ్డిగారు జిల్లా సి.పి.యం. కార్యదర్శిగా వున్న కాలంలో వీళ్ళ ఇంటిలోనే సంవత్సరాల తరబడి కలిసి వున్నారు. ఆయన మంచిచెడ్డలన్నీ వీళ్ళే చూసేవారు.

యడ్లపాడులో "పోపూరి రామారావు విజ్ఞానకేంద్ర" నిర్మాణాన్ని ప్రతిపాదించటమేగాక, విరాళాలసేకరణ, నిర్మాణ విషయాల్లో విశేషమైనకృషి చేశాడు. యడ్లపాడు గ్రామ పార్టీచరిత్రని రామారావుగారితో రాయించటంలో కాళిదాసు పాత్ర కీలకం. ఆయన వెంటపడి రాయించటమేగాక దాన్ని డి.టి.పి. చేయించి, ప్రచురణకు వీలుగా ఎడిట్ చేయమని నాకు అప్పగించి, "నేను – యడ్లపాడు – ఎర్రజెండా" పేరుతో ఆ పుస్తకం ప్రచురించటం వెనుక కాళిదాసు కృషే ప్రధానం.

గుంటూరు మకాం మార్చిన తర్వాత లక్ష్మీపురం, ఏ.టి. అగ్రహారంలలో పూరి ఇళ్ళలో, బ్రాడీపేటలో అద్దెలకుండి చివరకు పార్టీ కార్యాలయంలోని ఒక గదిలో కాపురం వుంటూనే, ఈ కార్యక్రమాలన్నీ నడిపాడు. మూడు దశాబ్దాల పాటు కార్యాలయ కార్యదర్శిగా వుండి తన వారసుని తయారుచేసిగాని తను ఆ బాధ్యతనుండి తప్పుకోలేదు.

డా॥ కాసరనేని సదాశివరావు దంపతులతో తనకున్న సాన్నిహిత్యం పట్టణంలో ప్రముఖవైద్యులందరితో పరిచయమవ్వటానికి కారణమవ్వగా, పార్టీ పరిచయాల్లోని డా॥ గడ్డిపాటి బాబురావు, డా॥ కళాధర్‌లతో వున్న పరిచయాలు కూడా కలుపుకొని వివిధ జిల్లాలనుండి వచ్చేవారికి వైద్యసహాయం అందించేవాడు.

చివరకు సప్తతికి చేరువవ్వటంతో విశ్రాంతి తీసుకోవాలనే భ్రమతో యడ్లపాడు వెళ్ళాడు. కాని విశ్రాంతి – కమ్యూనిస్టుపార్టీ అనేవి పరస్పర విరుద్ధమైన అంశాలు అని తెల్సుకోలేక తొందరపడ్డాడు. భవిష్యత్ జీవితాన్ని కాళిదాసు కుటుంబం సుఖప్రదంగా గడపాలని ఆశిద్దాం.



శ్రీ వేంకటేశ్వర విజ్ఞానమందిరంలో (గుంటూరు) రాష్ట్ర 10వ వీధినాటకోత్సవాలలో (SHOT 99) భాగంగా మహిళా డాక్టర్లు ప్రదర్శించిన 'ప్రశ్నించండి' నాటిక.



**జరుగుల రామారావు**
ప్రముఖ నటులు, దర్శకులు, రచయిత.
జాలాది,
7702157985

# కార్యశూరుడు కాళిదాసు

**నూ**తలపాటి కాళిదాసు ఉత్తమ నటుడుగాగాని, దర్శకుడుగాగాని, రచయితగాగాని గుర్తించబడ్డాడా? అవార్డులు కొట్టాడా? అవార్డులు రివార్డులు సంపాదించిన వారి గురించి పుస్తకమేదీ ప్రచురించబడలేదే! మరి కాళిదాసుకు ఈ గౌరవం ఎందుకు దక్కింది? మేమందరం వ్యక్తిగతమైన గుర్తింపుకోసం నాటకాలాడాం. కాని కాళిదాసు సమాజంలోని ప్రజలను మేలుకొల్పడంకోసం కళారూపాలను రాయించాడు, వేయించాడు.

అందుకే నూతలపాటి కాళిదాసుకు ఈ అరుదైన గౌరవం లభించింది. గుర్తింపుకోసం పనిచేస్తే వచ్చే పేరుప్రతిష్ఠలు తాత్కాలికమే. కాని ఆశయంకోసం పనిచేస్తే వచ్చే కీర్తి శాశ్వతమైనది అని కాళిదాసు కళాప్రస్థానం నిరూపించింది. సంస్కృతకవి కాళాదాసుకు, మన కాళిదాసుకు ఒక పోలికుంది. ఆ కాళిదాసు చదువుకోలేదు. ఈ కాళిదాసుకూ చదువు అంతంత మాత్రమే.

నాకు పరిచయమైనప్పటి కాళిదాసు భాషకీ, ఇప్పటి కాళిదాసు భాషకీ అసలు పోలికే లేదు. డాక్టరు డిగ్రీ సంపాదించిన వాళ్ళకన్నా స్వచ్ఛమైన భాషను ఇప్పుడు అనర్గళంగా మాట్లాడుతున్నాడు. 'కృషి ఉంటే మనుషులు ఋషులౌతారు' అని పెద్దలు చెప్పిన మాటను రుజువు చేశాడు కాళిదాసు.

నన్ను రచయితగా కళారంగానికి పరిచయం చేసింది కాళిదాసే. 'హోలికులు సేమమా' నాటికను నాచేత రాయించాడు. మొదట నేను రాసింది ఈ నాటిక

కాదు. 'అరవిరిసిన కుసుమం'. టీనేజ్ ఈజ్ నాట్ ద ఏజ్ ఫర్ లవ్. తొలిచూపులో కలిగేది ప్రేమ కాదు, సెక్స్ ఎట్రాక్షన్. ఐదు సంవత్సరాలు మాత్రమే పాలించే నాయకుడిని ఎన్నుకోవటానికి వయసు ప్రాతిపదికగ కావాలి కానీ, జీవింతాంతం తోడుండే భాగస్వామిని ఎన్నుకోవడానికి వయస్సుకూ మనసుకూ పరిపక్వత అవసరం లేదా? ఈ కంటెంట్‌తో నేను నాటిక రాసానని చెప్పాను. వెంటనే రైతు సబ్జెక్టుపైన నాటిక రాయండి అని అడిగాడు. సూదనగుంట వెంకటేశ్వర్లు ముక్తినూతలపాడు గ్రామంలో కొమ్మా ప్రసాద్‌చేత వ్రాయించారు. ఆ నాటిక తెచ్చుకో అన్నాను. నిమిషాలలో బయలుదేరదీసి ఆ ఊరికి నన్ను కాళిదాసు లాక్కెళ్ళాడు. ఆ నాటికలో వ్యాపారస్తుడు ప్రత్తిపంట వేయమంటే భార్య వత్తిడి చేయడం వలన వేసాడని, నష్టం రావడంతో భార్యపైన పత్తిరైతు కోప్పడటం వలన భార్య ఆత్మహత్య చేసుకున్నట్లు వ్రాసాడు కొమ్మా ప్రసాద్. అలా కాదని మార్పులు చెప్పాను. "తర్వాత రాసి పంపిస్తా" అన్నాడు కొమ్మా ప్రసాద్. అప్పుడు జరిగిన సంఘటన కాళిదాసు ప్లానింగ్‌కి, ఆర్గనైజేషన్ స్కిల్‌కు ఉదాహరణ. తర్వాత అనే పదాన్ని నిషేధించాడు కాళిదాసు. కొమ్మా ప్రసాద్ నడుపుతున్న టిఫిన్ సెంటర్‌కి నాలుగు రోజులు సరిపడా వస్తువులు కొనిపించి, కొమ్మా ప్రసాద్‌గారి సతీమణికి అప్పగించి, యడ్లపాడు గ్రామానికి కొమ్మా ప్రసాద్‌ని తీసుకొచ్చి... ఊహుఁ...లాక్కొచ్చి, నాతో కూర్చోబెట్టి నాటిక వ్రాయించాడు. నేను కూడా చేయిచేసుకోవడం వలన కొమ్మా ప్రసాద్‌తోపాటు నా పేరు కూడా రచయితగా వ్రాసాడు. అంతవరకు నటుడిగా, దర్శకుడిగా కాస్తో కూస్తో పేరున్న నేను రచయితగా కూడా గుర్తించబడ్డాను. డైలాగ్స్ కాకుండా నాటికలో షాడో ప్లేలో వచ్చే టెక్నికల్ సీన్స్‌కు సపోర్టు చేస్తూ అప్పుడప్పుడు వచ్చే గేయాన్ని నేనే వ్రాసాను. అలాగే రచయితగా కూడా కాళిదాసులద్వారానే అయ్యాను.

నేను వ్రాసిన రెండవ నాటిక "బుద్ధుడు పుట్టిన భూమిలో" గణపవరం పరమేశ్వర కాటన్ మిల్స్‌లో ఉద్యోగం చేస్తున్నప్పుడు వ్రాసాను అనటం కంటే కాళిదాసు అండ్ కో...పద్మారావు, శివరామకృష్ణ, శంకర్రావు వ్రాయించారు అనటం కరెక్ట్. రిహార్సల్స్ క్రమబద్ధంగా జరగడానికి కాళిదాసు ఏంచేసాడో తెలుసుకుంటే నాకిప్పటికీ ఆశ్చర్యం వేస్తుంది. గణపవరంలో రిహార్సల్స్ కోసం స్కూల్‌లో పర్మిషను

తీసుకున్నారు. యడ్లపాడు నుండి ఆర్టిస్టులను కాళిదాసు లారీలలో ఎక్కించి, అవునండీ, అప్పట్లో 1991 ప్రాంతంలో ఆటోలు లేవు. రిహార్సల్స్ రాత్రి పదకొండు గంటలకు. పదిన్నర గంటలకు ఆ ఫేజ్ కరెంటు వచ్చాక జిన్నింగ్ మిషన్స్‌కు వర్కర్లను సెట్ చేసి లింక్ సరిగా వస్తుందో లేదో చెక్ చేసి దాదాపు పదకొండు గంటలకు రిహార్సల్స్‌కు వెళ్ళేవాడిని. పాపం వీళ్ళకి పాఠాలు చెప్పిన జోసఫ్ మాష్టారు కూడా వేషం చేస్తున్నాడు. ఈ టైంలో రిహార్సల్స్ కుదరదురా అంటే క్లాస్ పీకి లారీలో పార్శిల్ చేసి పంపాడు కాళిదాసు. ఏ డ్రామా కోసం చదవలేదు కాని, 'బుద్ధుడు పుట్టిన భూమిలో', 'హాలికులు సేమమా' రెండు నాటికల్లో ఒక్క క్షణంకూడా పొరపాటు లేకుండా లైటింగ్ వర్క్ చేసాడు. మరీ ముఖ్యంగా 'బుద్ధుడు పుట్టిన భూమిలో' నాటికకు లైవ్ మ్యూజిక్ వాడకుండా రికార్డెడ్ మ్యూజిక్ వాడాను. పర్‌ఫెక్ట్ టైమింగ్‌తో ఎక్కడా డైలాగ్‌ను డామినేట్ చేయకుండా మ్యూజిక్‌వర్క్ చేశాడు కాళిదాసు. ఆ రెండు నాటికల విజయానికి ముఖ్య కారకుడు కాళిదాసు; నేను కాదు. అవును నేను కాదు అనే అంటున్నాను. ఆ తర్వాత కూడా నాటికలు తయారుచేసాను. కాని సక్సెస్ కాలేదే...కమ్యూనిస్ట్‌పార్టీ ఆదేశాలమేరకు గుంటూరు షిఫ్ట్ అయ్యాడు కాళిదాసు. అందుచేత యడ్లపాడులో నాటికలు తయారు చేయలేకపోయాను. చాలాకాలం తర్వాత ఖాజావలి నిర్వహణలో ప్రగతినగర్ నుండి "రాచపుండు" నాటకం, ఏలూరునుండి 'సైసై జోడెడ్లబండి' నాటకం ప్రదర్శించేవరకు నేను విజయాన్ని చవిచూడలేదు. ఆ రెండు నాటకాలలో టెక్నికల్ ఎఫెక్ట్స్ ఖాజావలి పర్‌ఫెక్ట్‌గ ఎగ్జిబిట్ చేసాడు.

మా ఇద్దరి ప్రయాణంలో ముఖ్యమైన ఘట్టం దూబగుంట రోశమ్మ చేపట్టిన సారా ఉద్యమానికి సపోర్టుగా నాటిక వ్రాయమని కాళిదాసు, పద్మారావు గణపవరం పత్తి కంపెనీ క్యాంపస్‌లోకి వచ్చారు. రాసే నైతికహక్కు నాకు లేదు అన్నాను. కాని కాళిదాసు పడితే ఉడుంపట్టే. చివరికి నేను కాదు కందిమళ్ళ సాంబశివరావుతో వ్రాయిద్దాం అన్నాను. కందిమళ్ళ సాంబశివరావును పట్టుకొచ్చి పరమేశ్వర కాటన్‌లో కూర్చోపెట్టి 'సారా సంహారం' అనే పేరుతో నాటిక వ్రాయించాడు కాళిదాసు. ఆ వీథినాటికలో మూడురకాల కొత్తప్రయోగాలు చేశాం. డైలాగ్ క్యారీ కావడం కోసం గుంజలు పాతించి, లారీ టైర్లుకట్టి పైనుంచి స్టేజీమైక్స్

ప్రేలాడదీశాం. రెండవది అప్పటిదాకా నటులే పాటలు పాడేవారు. కానీ ఎమర్జెన్సీరీత్యా స్టేజిమైక్ అరేంజ్ చేసి గాయకుడితో పాట పాడించాను. మూడవది సీన్‌కు అనుగుణంగా మార్చుకోవటానికి వీలుగా సెట్ వేశాను. ఇవన్నీ ఊహలుగా ఉంటే ఏం ప్రయోజనం? ఆచరించబడితేనే విజయం వస్తుంది. 'ఆచరణ'కు నిర్వచనం కాళిదాసు.

అలాగే అక్షరకళాయాత్ర సందర్భంగా కూడా కాళిదాసు నేను వ్రాసిన నాటికను పక్కన పెట్టించి రైతు సబ్జెక్టు బలవంతంగా వ్రాయించాడు. కాళిదాసు గురించి నా అనుభవాలన్ని వ్రాయాలంటే పుస్తకం అవుతుంది. కాళిదాసు కళా ప్రయాణంలో నేను తెలుసుకున్న నిజం ఏమిటంటే మంచి నిర్వాహకుడు ఉన్న చోటనే మంచి కళారూపం తయారవుతుంది. కాళిదాసులాంటి నిబద్ధత, భావస్పష్టత, క్రమశిక్షణ ఉన్న యువకార్యశీలురు కళారంగంలోకి రావాలని కోరుకుంటూ...





'హాలికులు సేమమా?' నాటికలో పద్మారావు, కాళిదాసు, శంకర్రావు.



**ఎస్.జి.ఎం. బాషా**

పూర్వ అధ్యక్షులు,

ప్రజానాట్యమండలి, ఆం.ప్ర.

9966912533

# అశయాలసాధనలో నిశ్శబ్దానికి తావులేదు

**కా**ర్యసాధకులకు కళారాధకులకు లక్ష్యసాధన పర్వంలో కామాలేగాని ఫుల్‌స్టాప్‌లు ఉండవు. అలాంటి అరుదైన వ్యక్తుల్లో ఒకరు...నేనెరిగిన కాళిదాసుగారు. కొద్దిరోజుల క్రితం నాకు ఉదయం ఫోన్ కాల్ వచ్చింది...ఎవరని చూశా...కాళిదాసుగారు...ఫోన్ రిసీవ్ చేసుకున్నా...బాషాగారూ బాగున్నారా...ఓ ఆత్మీయ పలకరింపు...సమాధానం ఇచ్చా...వెంటనే నేను వైజాగ్‌లో ఉన్నాను... నాకో చిన్నసహాయం కావాలి...కమాండింగ్ రిక్వెస్ట్...చెప్పండి సార్ అన్నాను. ఏంలేదు...నాకు ఉక్కు పోరాట దీక్షాశిబిరాన్ని చూడాలనుంది ...వీలవుతుందా... అన్నారు. ఒకే సార్ తప్పకుండా ఏర్పాట్లు చేద్దాం...అన్నా. ఎవరైనా వైజాగ్ వస్తే ప్రసిద్ధిచెందిన విశాఖ ఆర్.కె.బీచ్. కైలాసగిరి... భీమిలి...అరకు అందాలను చూసేందుకు అరాటపడతారు...కాని కాళిదాసుగారు ఉక్కుకార్మికుల పోరాటక్షేత్రాన్ని చూడాలని అనుకోవడం...అది ఆయన వర్గ దృక్పథానికి...వర్గ పోరాటస్ఫూర్తికి నిదర్శనం.

ఆ తర్వాత నేను ఉద్యమబాధ్యులతో మాట్లాడటం, వారు కాళిదాసుగారిని సాదరంగా రిసీవ్ చేసుకోవడం...అ నేపథ్యంలో కాళిదాసుగారు దాదాపు 500 రోజులపైగా పట్టుదలతో నిర్వహించబడుతున్న ఉక్కు దీక్షాశిబిరాన్ని సందర్శించి వారికి సంఘీభావం సందేశం ఇవ్వడమేకాక స్థానిక స్టీల్ ప్రజానాట్యమండలి కళాకారులకు సీనియర్ కళాకారులుగా తన అనుభవాలను వారితో పంచుకోవడం జరిగింది.

ఇక ఆయన కళారంగ పరిచయానికి ముందు కాళిదాసుగారి కార్యదక్షత గురించి రెండు విషయాలు ఈ సందర్భంగా ముచ్చటించుకుందాం.

ఆల్ ఇండియా మహాసభలు విశాఖలో జరపాలని నిర్ణయించారు. ఆ సందర్భంగా విశాఖ ఫెస్టివల్ జరపాలని వివిధ సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించాలని సూచించారు. ఉభయరాష్ట్రాల నుంచి దాదాపు 400 మంది కళాకారులను ఆహ్వానించాలని, కళాప్రదర్శనలు నిర్వహించాలని అనుకోవడం జరిగింది...సరే కళాకారుల సమీకరణ...వేదికలు...తదితర నిర్వహణ బాధ్యతలకు పనిపంకం జరిగింది...కాని 400 మంది కళాకారులకు వసతి సదుపాయాలు అలాగే భోజన సదుపాయాల పర్యవేక్షణకు తగిన బాధ్యుల ఎంపిక దగ్గర ఆగింది...ఉభయరాష్ట్రాల కాడర్‌లో ఎవరు ఈ బాధ్యతను సమర్థవంతంగా నిర్వహించగలరు...ఈ అన్వేషణలో కాళిదాసుగారి పేరు సూచించబడింది...అ బాధ్యతను నిర్వహించేందుకు అంగీకారం తెలపడమేకాక 10 రోజులపాటు అవిరామ కృషిచేసి నిర్వాహకుల ప్రశంసలు అందుకున్నారు. చివరి కళారూపం ప్రదర్శించిన కళాకారులకుకూడా సమయంతో సంబంధం లేకుండా భోజన సదుపాయాలు సమకూరేవి...ఆ మహాసభలలో కళారూపాల ప్రదర్శనలు జయప్రదం కావడానికి శ్రీ కాళిదాసుగారి పాత్ర అద్వితీయం. అలాగే వేరే సందర్భంలో హైదరాబాద్‌లో ఆల్ ఇండియా మహాసభల సందర్భంగా నిర్వహించిన హైదరాబాద్ ఫెస్టివల్‌లో కూడా సమర్థనీయమైన బాధ్యత నిర్వహించారు. కళాప్రాంగణ నిర్వహణ కమిటీలో భాగస్వామ్యం వహించి...కళారూపాల ప్రదర్శనలు క్రమపద్ధతిలో జరిగేందుకు తనదైన శైలిలో వ్యవహరించి దాదాపు 12 రోజుల పాటు శ్రమించారు. అ కమిటీలో నేను కూడా భాగస్వామినే...కాని కాళిదాసుగారి వ్యవహారదక్షత తెలిసిన నేను అంతగా జోక్యం చేసుకొనేవాణ్ణి కాను...ఎందుకంటే నాకు తెలుసు కాళిదాసుగారు తనకు అప్పగించిన బాధ్యతను ఎంత నిబద్ధతతో నిర్వహిస్తారో...ఇవి కేవలం రెండు ఉదాహరణలు మాత్రమే...అనేక సందర్భాల్లో అనేక వేదికలపై తనకు ఇచ్చిన పనిని అంచనాల మేరకు జయప్రదం చేసినవి ఎన్నో...నిర్వహణకు నిబద్ధతకు...క్రమశిక్షణకు కట్టుబడి పనిచేసే కార్యదక్షతగల ప్రజాకళాసైనికుడు కాళిదాసుగారు.

నాకు కాళిదాసుగారితో ప్రజానాట్యమండలిలోకాక పూర్వపరిచయం లేదు. ప్రజానాట్యమండలి పునర్నిర్మాణం సమయంలో జరిగిన సమావేశాలలో... మాంటిసోరి కన్వెన్షన్‌గానీ విశాఖలో జరిగిన రాష్ట్ర మహాసభలలో కేవలం ముఖపరిచయాల వరకు మాత్రమే...ఆ రోజుల్లో ప్రజాతంత్ర ఉద్యమ మహాసభలలో గాని, ప్రజాసంఘాల సభలలోగాని సాంస్కృతిక కార్యక్రమాలలో నాటకప్రదర్శనలు తప్పనిసరిగా ఉండేవి...ప్రజానాట్యమండలి ఖమ్మం రాష్ట్రమహాసభలో అయితే రెండు స్టేజిల ప్రయోగం జరిగింది...భువనగిరిలో జరిగిన రాష్ట్రమహాసభల తర్వాత నాటక ప్రదర్శనలు...అరకొర సాగేవి. విశాఖపట్నం...నెల్లూరు...గుంటూరు... ఖమ్మం...విజయవాడ...ఇలా చాల తక్కువమంది మాత్రమే థియేటర్‌మీద ఆసక్తిగల దళాలు ఉండేవి. ఆనాటి రాష్ట్రకమిటి నాయకులలో కూడా థియేటర్‌మీద పట్టు ఉన్నవారు తక్కువగా ఉండేవారు...అప్పటికే కాళిదాసుగారు నాటకాలపట్ల ఆసక్తి చూపడం, ప్రజాతంత్ర ఉద్యమం ఆయనకు కళారంగ బాధ్యతను చూడాలని కోరడం, ఆ తర్వాత ఆయన గుంటూరుజిల్లాలో ప్రజానాట్యమండలి నిర్మాణసారథ్యం వహించారు...తరచు సభలు...సమావేశాల్లో కలుసుకొనే వాళ్లం...సఫ్దర్ హష్మీ మరణానంతరం రాష్ట్రవ్యాప్తంగా వీధినాటికోద్యమం కొత్తపుంతలు తొక్కింది... వీధినాటిక శిక్షణాశిబిరాలు విరివిగా జరిగేవి...షాట్ పేరుతో ప్రతి సంవత్సరం ఏదో జిల్లాకేంద్రంలో ఉత్సవాలు నిర్వహించడం జరిగేవి. షాట్ అనంతరం జరిగే సమీక్షాసమావేశాలలో కళారూపాల కథావస్తువు దగ్గరనుండి ప్రదర్శనతీరు నైపుణ్యం...నిర్వహణ తీరుతెన్నులపై చర్చలు జరిగేవి...ఆ చర్చల్లో కాళిదాసుగారు తన అభిప్రాయాలను కుండబద్దలు కొట్టినట్లు చెప్పేవారు. అనంతరం ప్రజానాట్య మండలి రాష్ట్రకమిటీ నుండి రాష్ట్రకార్యదర్శివర్గ సభ్యులుగా బాధ్యత వహిస్తూ... రాష్ట్రవ్యాప్తంగా ప్రజానాట్యమండలి విస్తరణకు తమ వంతు కృషి చేసేవారు...ఒక పక్క ప్రజానాట్యమండలి నిర్మాణ కార్యక్రమాలతోపాటు శ్రీ జరుగుల రామారావుగారి దర్శకత్వంలో 'హాలికులు సేమమా' అనే రైతాంగ సమస్యలపై రూపొందించిన నాటికను దాదాపు వందకుపైగా ప్రదర్శనలు ఇచ్చారు...అనేక పరిషత్తులలో పాల్గొని ఉత్తమప్రదర్శనగా బహుమతులు పొందడం జరిగింది. ఈ యజ్ఞంలో సూత్రధారి... పాత్రధారి...కాళిదాసుగారే...అలాగే ప్రజాతంత్ర ఉద్యమ సారధ్యంలో జరిగే నాటికోత్సవాలలో నాటికలతో

పాల్గొనడమేగాక నిర్వహణలో భాగస్వామ్యం వహించారు...అలాగే జిల్లాలో జరిగే మనేతర సంస్థల అధ్వర్యంలో జరిగే నాటకాల పరిషత్తులోగాని వీధినాటిక పరిషత్తుల నిర్వహణలో ప్రత్యక్షంగా పాల్గొంటూ...అవి జయప్రదం గావడానికి తగు సూచనలు...సలహాలు అందించారు...ఇలా దాదాపు మూడు లేక నాలుగు దశకాలపాటు కళారంగానికిగాని, ప్రజానాట్యమండలి నాయకులుగాగాని ఎనలేని కృషిచేసిన ప్రజా కళాశ్రేయోభిలాషి కాళిదాసుగారు.

అనంతరంకూడా ప్రజాతంత్ర ఉద్యమ సూచనల అనుసారం కళారంగ బాధ్యతలనుండి ఇతర బాధ్యతలపై కేంద్రీకరించి...వాటికి కూడా పూర్తి న్యాయం చేసిన స్ఫూర్తిదాయక నాయకులు...నాకు తెలిసి ఆయన కళారంగ బాధ్యతలలో ఉన్నా, ఇతరేతర బాధ్యతలలోఉన్నా, ప్రజాపక్షం వహిస్తూ...ఆశయంలోను, ఆచరణ లోను క్రియాశీలకపాత్ర నేటికీ పోషిస్తూ...నేటి యువతరానికి స్ఫూర్తిప్రదాతగా నిలవగలగడం చిన్న విషయమేమి కాదు. కాళిదాసుగారి మాట కఠినం, మనసు మైనం. అన్యవర్గ ధోరణుల ప్రభావాలకులోనుకాకుండా సుదీర్ఘకాలంపాటు ప్రజాసాంస్కృతికోద్యమానికి...ప్రజాతంత్ర ఉద్యమానికి సేవలు అందించిన కాళిదాసుగారు నిజంగా అభినందనీయులు.



పశ్చిమగోదావరి జిల్లా, ఏలూరులో రాష్ట్ర కళారంగ క్లాసుల సందర్భంగా ఫోటో ఎగ్జిబిషన్ చూస్తున్న జననాట్యమంచ్ నాయకురాలు, కళాకారిణి కామ్రేడ్ మలయశ్రీహష్మి (సఫ్దర్ హష్మి భార్య), ప్రజానాట్యమండలి రాష్ట్రకార్యదర్శి కామ్రేడ్ దేవి, కాళిదాసు.



**డాక్టర్ కందిమళ్ల సాంబశివరావు**
నాటకరంగ దార్శనికులు,
చిలకలూరిపేట.
9848351517

# గీతలో(ల్లో) "కాళి"

"నిండుమనంబు నవ్యనవనీత సమానము...పల్కు దారుణాఖండల శస్త్రతులము" అనే నన్నయగారి మాటలకు నిక్కమైన ఉదాహరణ కాళిదాసు. అతగాణ్ణి నేను మహాకవి అనీ...కాళీ అని పిలుస్తూ ఉంటాను. కాళి నాకు ఆప్తమిత్రుడే కాదు, ఆత్మీయహితుడుకూడా. దాదాపు నాలుగు దశాబ్దాలకు పైబడిన స్నేహం మాది. చిలకలూరిపేటలో ఉద్యోగప్రస్థానంలో 1981లో ప్రయాణం మొదలుపెట్టినప్పుడు పద్మారావుద్వారా కాళి పరిచయమయ్యాడు. అప్పటినుండి ఇప్పటిదాకా మా స్నేహం అరమరికలు లేకుండా చిక్కబడింది. ఎన్ని...కాదు ఎన్నో...ఎన్నెన్నో కార్యక్రమాల్లో కలిసి నడిచాం...చాలామందిని నడిపించాం కూడా...

కాళిదాసు యడ్లపాడు ప్రజానాట్యమండలి దళానికి వెన్నుముకగా ఉండేవాడు. నాటకాల్లో నటించడంకన్నా నిర్వహణాబాధ్యతలను భుజానికి ఎత్తుకొనేవాడు. ఆ కర్తవ్యనిర్వహణలో మాత్రం చండశాసనుడే. నాకు గుర్తున్నంత వరకు దివాకర్‌బాబు గప్‌చుప్ నాటిక సమయంలో ఒక ఆర్గనైజర్‌గా నాకు సన్నిహిత మయ్యాడు. 1985 ప్రాంతంలో ప్రకాశంజిల్లాలో ప్రత్తిరైతుల ఆత్మహత్యలు దేశాన్ని దిగ్భ్రాంతికి గురిచేసినప్పుడు తెలుగునాటకరంగంలో తొలిసారిగా స్పందించింది కాళిదాసు, పద్మారావు మిత్రమండలి.

అతని ఆరాటం...పోరాటం నుండే 'హాలికులూ... సేమమా' నాటిక పురుడు పోసుకుంది. మొదటి వెర్షన్ కొమ్మా ప్రసాద్ వ్రాశారు. అది పచ్చిపచ్చిగా ఉండడంతో రచయితగా 'జరుగుల'ను రంగప్రవేశం చేయించాడు. హాలికులూ సేమమా నాటిక ఆర్థికమూలాలు విచ్ఛిన్నమైపోయిన రైతాంగవ్యథలను కళ్లకు కట్టినట్లు చూపింది. సమస్యలు చుట్టుముట్టి ఉక్కిరిబిక్కిరి చేసినప్పుడు ఆత్మహత్యలు ఏమాత్రం పరిష్కారం కాదని విస్పష్టమైన సందేశాన్ని. ఇచ్చింది. జరుగుల దర్శకత్వంలో 'మానవత' యడ్లపాడు సమాజం రమారమి వంద ప్రదర్శనలిచ్చింది. పద్మారావు, శంకరరావు, రత్నకుమారి, కాళిదాసు ఈ నాటికలో నటించారు. నటునిగా కాళిదాసు రాణించలేదు. కానీ ఆర్గనైజర్‌గా ఆయన నిర్వహణాధురీణత్వం మాత్రం నిక్కచ్చిగా...నిష్కర్షగా...ఆర్గనైజర్లకు ఒక అడుగుజాడగా ఉంటుంది. ఆ తరువాత 'బుద్ధుడు పుట్టిన భూమిలో' నాటికకు కూడా కాళిదాసే ఆర్గనైజర్.

కాళిదాసు ఆర్గనైజర్‌గా పక్కా ప్రణాళికతో అన్ని పనులనూ ముందస్తు జాగ్రత్తలతో చక్కబెట్టేవాడు. కళాకారుల వ్యక్తిగత సమస్యలను పట్టించుకొని వాటిని పరిష్కరించేవాడు. నాటిక ప్రదర్శనకు కావలసిన సెట్‌ప్రాపర్టీ; ప్రయాణ ఏర్పాట్లను అన్నీ స్వయంగా పర్యవేక్షించేవాడు. పనులన్నింటినీ ఎంత సాఫీగా...సరళంగా చేసేవాడో...ఎవరైనా తప్పు చేస్తే మాత్రం ఉపేక్షించకుండా కేకలు వేసేవాడు. ఒక నాటిక సమాజనిర్వాహకునికి ఎంత సహనం ఉండాలో...ముందస్తు ప్రణాళిక ఉండాలో కాళిదాసును చూసి నేను నేర్చుకొన్నాను.

1993 ప్రాంతంలో సారావ్యతిరేక ఉద్యమం ముమ్మరంగా సాగుతున్నప్పుడు పద్మారావు, శంకర్రావు నన్ను వీథినాటిక వ్రాయమని వత్తిడి చేశారు. నన్ను జరుగులకు అప్పగించారు. అప్పుడు 'ఆఖరాట' వీథినాటిక వ్రాశాను. చర్చల్లో కాళిదాసు పాల్గొనేవాడు. తనకు నచ్చని విషయాలు ఉంటే దాపరికం లేకుండా కుండబద్దలు కొట్టేవాడు. మొండిగా వాదించేవాడు.. కాళిదాసుతో సబ్జెక్ట్ చర్చలంటే నాకూ చాలా ఇష్టం...కొన్ని సందర్భాలలో కాళిదాసు ఇచ్చే సలహాలు ఎంతో ఉపయోగపడేవి...కాదు చాలా ఉపయోగపడ్డాయి కూడా. నేను వ్రాసిన 'ఆఖరాట' వీథినాటికకు కాళిదాసు ఆర్గనైజర్‌గా వ్యవహరించడంతోపాటు రౌడీపాత్రను కూడా

వేశాడు. ఆ నాటిక స్క్రిప్టును సైక్లోస్టైల్ చేసి (అప్పటికి జిరాక్స్‌మిషన్లు అంతగా అందుబాటులోకి రానందున) రాష్ట్రవ్యాప్తంగా అన్ని సమాజాలకు పంపేలా కాళిదాసు ప్రోత్సహించాడు.

యడ్లపాడులోనేకాదు, గుంటూరుజిల్లాలో తానే కార్యక్రమాన్ని నిర్వహించినా నన్ను భాగస్వామిని చేసేవాడు. నేను కమ్యూనిష్టుని కాదు. ఆచరణలో అన్నీ చూపించకపోయినా ఒక అధ్యాపకుణ్ణి...నాటక రచయితను కాబట్టి కొన్ని అభ్యుదయ భావాలు చాలామందికి లాగానే నాకూ ఉన్నాయి. చిలకలూరిపేటలో జరిగిన వీథినాటికల శిక్షణాశిబిరంతోపాటు మూడు పర్యాయాలు షాట్‌లలో (సఫ్దర్ హష్మీ ఓపెన్ థియేటర్) నన్ను భాగస్వామిని చేశాడు. తద్వారా ప్రజానాట్యమండలి రాష్ట్రదళంలో ఉన్న శాంతారావు, దేవి, దేవేంద్ర వంటివారు కాళిదాసుద్వారా నాకు అత్యంత ఆత్మీయులయ్యారు.

కాళిదాసు యడ్లపాడు ప్రజానాట్యమండలి బాధ్యునిగా ఉన్నప్పుడు జిల్లా శాఖ బాధ్యునిగా రావాలని జిల్లా, రాష్ట్రశాఖలు కాళిదాసును కోరాయి. నాకు చదువు తక్కువ. అంత పెద్దబాధ్యతను నిర్వహించగల శక్తిసామర్థ్యాలు తనకు లేవనీ, ఈ విషయంలో నిర్ణయం తీసుకొనడానికి నీ సలహా కావాలని నన్ను అడిగాడు. నువ్వు గొప్పనటుడివి కాదు...రచయితవు కావు...కానీ మంచి నిర్వాహకునివి. ప్రజానాట్యమండలితో నడిచి...నడిపించే మంచి నిర్వాహకునిగా నువ్వు తప్పక రాణిస్తావు. పాటలు, నృత్యనాటికలకు మాత్రమే పరిమితమౌతున్న ప్రజానాట్యమండలిచేత నాటికలకు ప్రాధాన్యమిచ్చేలా చేయడంలో నీ పాత్ర కీలకమౌతుందని చెప్పాను. 'జిల్లాశాఖకు వెళ్లాలా? వద్దా అనే విషయంలో నీ ఒక్కడి సలహా మాత్రమే అడుగుతున్నాను. నీ సూచనతో నాకు స్పష్టత వచ్చింది' అని జిల్లాశాఖకు వెళ్లిపోయాడు. ఆ దశాబ్దికాలంలో కాళిదాసు నేతృత్వంలో నాటకానికి ఎంతో ప్రాధాన్యత వచ్చింది. చాలా...చాలా...కష్టపడ్డాడు...కృషి చేశాడు. ఎన్నో ప్రయోగాలు, ప్రాజెక్ట్‌లు జరిగాయి.

కాళిదాసు ఒక సిద్ధాంతాన్ని నమ్మాడు...నరనరానా జీర్ణించుకొన్నాడు. దానికే కట్టుబడ్డాడు. నూటికి నూరుపాళ్లు అది నిజం. ఏ విషయాన్ని అయినా ఆ

కోణంలో నుండే చూస్తాడు. అందరూ అలానే ఉండాలనుకొంటాడు. అతని కోణం నుండి చూస్తే అదీ నిజమే. అతని వాదం...విధానం చూస్తే ఎదుటివారికి చాదస్తం లాగా...కొంత పెడసరంగానూ కన్పిస్తుంది. అది అతను నమ్మిన ఇజం...నిజం అని అనుకొంటే కాళిదాసు ఆలోచన మంచిదే. కాళిదాసు తత్వం అర్థమయ్యేది, అర్థం చేసుకొనేది కొందరు మాత్రమే. చాలామందికి మాత్రం ఆయనది పిడివాదం అనుకొంటారు. కాళిని అర్థంచేసుకొనేవారి కంటే అపార్థం చేసుకొనేవారి సంఖ్యను ఎక్కువగా నేను గమనించాను. నాకు మాత్రం కాళి బాగా అర్థమయ్యాడు. అందుకే కాళిని నేను తీవ్రంగా అభిమానిస్తాను. కాళి వ్యక్తిగతంగా మంచివాడు. పదిమంది బాగుండాలని కోరుకొంటాడు. ఎవరికైనా సమస్య వస్తే అది తనదిగా స్పందిస్తాడు. తనకు చేతనైనంత సహాయం చేస్తాడు. అందుకే కాళిని నేను నా స్వంత మనిషిగా ఎప్పుడూ భావిస్తాను. ఒక్కొక్కసారి మాట పుల్లవిరుపుగా...కటువుగా ఉన్నా కాళి మంచిమనిషి. మానవత్వం పరిమళించే మనిషి. కొన్ని సందర్భాలలో మంచి జరుగుతుంది అన్నప్పుడు గీత దాటమని అప్పుడప్పుడూ అంటుంటాను. కానీ భీష్మించుకొంటాడు. గీతదాటితే కాళిదాసు ఎందుకౌతాడు, ఖాళీదాసు అవుతాడు. నాటికలు వ్రాయమని నన్ను భయపెడతాడు... హెచ్చరిస్తాడు... అలా చేయకపోయినా నేను చేసే నాటక వ్యాసంగానికి లోలోపల పొంగిపోతాడు.




గుంటూరు కళాపరిషత్ ప్రారంభ సభాకార్యక్రమంలో మాట్లాడుతున్న
ప్రజానాట్యమండలి జిల్లా కార్యదర్శి నూతలపాటి కాళిదాసు



**కె. ఉషారాణి**
ఉపాధ్యాయిని
**యు. వెంకటేశ్వర్లు**
ప్రజాశక్తి ఉపసంపాదకులు,
సుందరయ్యనగర్, తాడేపల్లి.
7382174144

# ప్రజాకళాభిమాని కాళిదాసు

**కా**ళిదాసు...35 సంవత్సరాలు క్రితం పరిచయం...తాడేపల్లి సుందరయ్య నగర్‌లో సీపీఎం ఆధ్వర్యాన ఇళ్ళు వెలిసిన కాలమది. ఎన్నో సమస్యలతో కనీస మౌలిక సదుపాయాలులేని ఈ ప్రాంతంలో ఏ ఇబ్బంది వచ్చినా పార్టీ అండగా నిలబడింది. జనంకూడా అదే అభిమానంతో వున్నారు. ఆటలకి, పాటలకి పార్టీ కార్యాలయం వేదిక. సంక్రాంతి వచ్చిందంటేచాలు ఇంటికో కళాకారుడన్నట్టుండేది. యువజన, మహిళా, ప్రజానాట్యమండలి సంఘాలు చాలా చురుగ్గా పనిచేసేవి. ఈ కారణంగా చుట్టు పక్కలగ్రామాల్లోనూ మంచి ఆదరణ ఉండేది. ఈ కాలంలో సుందరయ్యనగర్‌కు కాళిదాసన్న తరచూ వచ్చేవారు. యడ్లపాడునుండి విజయవాడకు వచ్చే ప్రతిసారీ ఆయన ఎక్కిన లారీ సుందరయ్యనగర్‌లో ఆగి దింపి పోవాల్సిందే...ఏమేమి కళారూపాలు నేర్చుకుంటున్నారో చూసి భలే సంతోషపడేవారు...ఇక్కడ మహిళా పాటలదళం, డప్పుదళం, చిన్నపిల్లల కోలాటదళం, మహిళల, పురుషుల దళాలు ఉండేవి. మహిళల, పురుషుల నాటికదళాలు స్థానిక, చుట్టుపక్కల ప్రదర్శనలు ఇవ్వడంతోపాటు జిల్లాలో ఎక్కడ అవసరం అయినా వెళ్లగలిగేవి. 1987 నాటికి గుంటూరుజిల్లాలో నాకు గుర్తున్నంత వరకూ ప్రజానాట్యమండలి కమిటీలేదు. కన్వీనర్‌గా కాళిదాసన్న వ్యవహరించేవారు. సహజంగానే ప్రజా కళాభిమానం మెండుగా వుండే వ్యక్తి కావడంతో ఔత్సాహిక కళాకారులను బాగా ప్రోత్సహించేవారు. ఇక్కడలాగానే జిల్లాలో నాతో (ఉష) కలిపి నలుగురు స్టాండర్డ్ గాయనీలు ఉండేవాళ్ళం. అందులో

ముగ్గురు అమరమ్మ, మాణిక్యమ్మ, జగన్నాథమ్మ యడ్లపాడు ఏరియావారే. సాక్షరతా ఉద్యమం సందర్భంగా అక్షరజ్యోతి పేరిట సాగిన కార్యక్రమంలో ప్రజానాట్య మండలి అత్యంత చురుగ్గా పాల్గొన్నది. ఒక్క మా ఏరియాలోనే అక్షరజ్యోతి రాత్రిపాఠశాలలు 30 వరకు నడిచాయి. దరిమిలా ఎగిసిన సారా వ్యతిరేక పోరాటంలో ప్రజానాట్య మండలి పోషించిన పాత్ర చరిత్ర ఎరిగిందే...ఈ సందర్భంగా జిల్లాలో జరిగిన ప్రచారజాతా వెన్నంటి నడిచినవ్యక్తి కాళిదాసన్న. 1994 నాటికి జిల్లాలో పూర్తిస్థాయి కమిటీ ఏర్పడినట్టు గుర్తు. ఆ మహాసభలో జిల్లాకార్యదర్శిగా ఎన్నికయ్యారు. మంగళగిరిలోనూ ప్రజానాట్యమండలి నాయకత్వం బలంగానే ఉండేది. రాఘవయ్య వంటి ప్రజాకళాకారులు నాటినుండి నేటివరకూ అదే నిబద్ధతతో వున్నారు. రైతు, వ్యవసాయ కార్మికసంఘాల ఆధ్వర్యంలో సమస్యల పరిష్కారం కోసం జీపు జాతాల సందర్భంగా మంగళగిరి నియోజకవర్గంలో విస్తృతంగా ప్రచారం జరిగింది. ఈ అన్ని సందర్భాల్లో కాళిదాసు అన్న పూసల్లో దారంలా అంటిపెట్టుకున్నారు. అఖిలాంధ్ర కళాకారులసంఘం ఏర్పాటు, విస్తృతిలో మా సోదరుడు వున్నం బసవయ్యగారితోనూ మంచి సాన్నిహిత్యం ఉండేది. బసవన్న చనిపోయినప్పుడు ఆయన్ను కడసారి చూసేందుకు మాతో కలిసి వచ్చిన సందర్భంలో ప్రారంభరోజుల నాటి ఎన్నో విషయాలు పంచుకున్నారు. ప్రజానాట్యమండలి పునరుజ్జీవంనుండి బసవన్న, ధైర్యానందం, డాక్టర్ విఠల్ తదితరులుతో కలిసి కృషిచేసినవారిలో కాళిదాసు కూడా ఒకరు. కార్యకర్తలపట్ల అత్యంత అభిమానం ప్రదర్శించే కామ్రేడ్. ప్రజకళాకారుడిగా సీపీఎం నాయకుడిగా నిబద్ధతతో పనిచేసే వ్యక్తి. దశాబ్దాల పరిచయంలో కొన్నింటిని మాత్రమే గుర్తుచేసుకోగలిగాం...70వ పడిలో అడుగుపెడుతున్నా ఇప్పటికీ అదే ఒరవడి, అదే నిబద్ధత, మార్క్సిజంపట్ల అదే విశ్వాసం. జీవితమే మార్క్సిజం అయిన వ్యక్తి గురించి ఇంతకుమించి రాయడానికి ఏముంటుంది... ఆయురారోగ్యాలతో ఉండి మరింతగా ప్రజాసమస్యలపై పోరాటంలో సాగాలని కోరుకోవడం తప్ప.





**దండా లక్ష్మీనారాయణ**
సి.ఐ.టి.యు జిల్లా అధ్యక్షులు,
గుంటూరు.
9490098627.

# లౌక్యం తెలియని ముక్కుసూటి మనిషి

**కా**ళిదాసుగారు నాకు 1994 నుండి పరిచయం ఉన్నా నాకు 1999లో రాజకీయ వీధినాటకం కబడ్డీ శిక్షణ పెదనందిపాడులో జరిగినప్పటి నుండి దగ్గరగా గమనించాను. "కబడ్డీ రాజి వీధినాటకం" ఆ నాటకంలో నా పాత్ర సీతారాం కేసరి. ఆ నాటకంలోని డైలాగులకు నేనే నవ్వేవాడిని. ఆ సందర్భంగా కాళిదాసుగారు సీరియస్‌గా కళ్ళు ఉరుముతూ పిచ్చిముండాకొడకా అంటూ చేతులెత్తి కొట్టినంత పనిచేసి "నటుడుకి ఎప్పుడూ తన పాత్రలో ఉన్నప్పుడు పాత్రమీద దృష్టి ఉండాలి, మన నటనద్వారా ఆడియన్స్ ఎమోషన్ కావాలి, మనం కాదు అని చెప్పాడు." అది నాకు బాగా నచ్చింది. ఆ నాటకంలో నాకు మంచిగుర్తింపు వచ్చింది. తరువాత చంద్రబాబు ప్రపంచబ్యాంకు విధానాలపై రాజకీయ వ్యంగ్యనాటకం బఫూన్‌పాత్ర వేశాను. తర్వాత ఇది సుమారు 250 చోట్ల ప్రదర్శించాము. నేను కళారంగంలో పనిచేయకపోయినప్పటికీ కళారంగంపట్ల ఒక అవగాహనరావడానికి నాకు ఎంతో తోడ్పడింది. కాళిదాసుగారు చెప్పినమాట పాత్రలో లీనమైనప్పుడు ఎదుటివ్యక్తిలో ఎమోషన్స్ మనం చూడాలి తప్పా, మన ఫేసులో కనబడకూడదు అని చెప్పినది నేడు జబర్దస్త్ చూస్తున్నప్పుడల్లా కాళిదాసే గుర్తొస్తుంటాడు. ఎందుకంటే ఇప్పటికీ జబర్దస్త్‌లో కొందరు నటులు వారే జోక్ వేస్తారు ఎదుటివాడికి నవ్వురాకపోయినా వాళ్లు మాత్రం నవ్వుకుంటూ ఉంటారు. కళాకారులను గుర్తించడంలోనూ, వారిని తయారుచేయడంలో కాళిదాసుగారు

కృషి అమోఘం. ప్రజానాట్యమండలి జిల్లా కార్యదర్శిగా పనిచేసిన పీవీ రమణను నెల్లూరునుండి తెచ్చి, చదివించి, కళా రంగంలో ఒక అపూర్వమైన గుర్తింపు రావడానికి ప్రధానవ్యక్తి కాళిదాసుగారు. కాళిదాసుగారు కార్యకర్తలపట్ల చాలా శ్రద్ధ తీసుకునేవాడు. మెడికల్ కాలేజీ విద్యార్థులను తన కుటుంబంలోని సభ్యులుగా చూసుకునేవాడు. కార్యకర్తలకు కష్టం వస్తే నేనున్నానంటూ వచ్చి వాలిపోతాడు. కాళిదాసుగారి ప్రత్యేకత ఏమిటంటే కేవలం ఆ వ్యక్తితోనే పరిచయం కాకుండా కుటుంబంలోని అందరితోనూ పరిచయాలు పెంచుకొని వారందరూ కాళిదాసు మనోడే అనే భావన కలిగించుకునే విధంగా వారితో కలిసిమెలిసి ఉండేవాడు. సమస్య వస్తే ఆ సమస్య పరిష్కారమయ్యే వరకు వెంటపడే మనస్తత్వం కాళిదాసుగారిది. నేను పీజీ అయిపోయాక పార్టీ పూర్తికాలం కార్యకర్తగా రావాలనుకున్నప్పుడు మా కుటుంబంలోనివాళ్లు ఒప్పుకోలేదు. నేను మా ఊరు అమరావతి వెళితే ఇంట్లోవారు నీవు గుంటూరు వెళ్ళవద్దు. కాంపిటీషన్ పరీక్షలు రాయాలనుకుంటే అమరావతిలో ఉండే చదువు, జాబు చేయాలనుకుంటే మేము చెప్పింది చదువు, లేదంటే ఇంటిలోనే ఉండు అని ఇంటి దగ్గర నుండి కదలకుండా కట్టడి చేశారు. నేను ఈ విషయాన్ని నా సహచరులద్వారా కాళిదాసుగారితో చెబితే "నీవు పూర్తికాలం కార్యకర్తగా రావడానికి ఇష్టమేనా" అని అడిగాడు, నేను ఇష్టమే అని చెప్పగానే కాళిదాసుగారు రామరాజుతో కలిసి వచ్చి నన్ను కట్టుబట్టలతోనే గుంటూరు తీసుకుని వచ్చాడు. నా పెళ్లి విషయంలో కూడా మా కుటుంబ సభ్యులతో మాట్లాడి మీ వాడికి ఏ ఇబ్బంది ఉండదు ఏమీ పర్వాలేదు, నేను చూసుకుంటానని చెప్పి భరోసా ఇచ్చినవ్యక్తి కాళిదాసు. కాళిదాసుగారు లౌక్యంలేని ముక్కుసూటి మనిషి. ఎదుటిమనిషిలో లోపం కనిపిస్తే సహించేతత్వం లేనివాడు. అందుకే కాళిదాసుగారు నిరంతరం ఘర్షణ పడుతూనే ఉంటాడు.

గుంటూరుజిల్లా ఆఫీస్ నిర్వహణలో కాళిదాసు పాత్ర మరువలేనిది. ఆఫీసు నిర్వహణలో పరిశుభ్రత అతి ముఖ్యమైనది. కాబట్టి పర్మినెంట్, నమ్మకస్తుడైన వ్యక్తి ఉండాలనే ఆలోచన తట్టిన వెంటనే, దీనికోసం ఆర్టీసీ రిటైర్డ్ ఎంప్లాయిస్ యూనియన్ నాయకుడు కామ్రేడ్ గంగాధర్‌రావు సహకారంతో శ్రామికనగర్ లోని నారాయణతో మాట్లాడి, ఒప్పించేదాన్లో మరియు అతని కుటుంబంలో

సమస్యలు వస్తే పరిష్కరించేదానిలో, నారాయణకున్న తాగుడు లక్షణాన్ని తనభార్య సహకారంతో మాన్పించేందుకు ఎంతో కృషి చేశాడు. అందుకే ఆఫీసు నిర్వహణలో రాష్ట్రంలోనే ఒక గుర్తింపు రావడానికి కారకుడు అయినాడు.

అదేవిధంగా మహాసభలు, రాజకీయ క్లాసులు జరుగుతున్నప్పుడు 2018 వరకు వంట బాధ్యత కాళిదాసుగారే చూసేవాడు. ఎప్పుడూ వంట చాలలేదని కంప్లైంట్ ఉండేది కాదు. ఏదో ఒకటి చేసి సంతృప్తిపరిచేవాడు.

కళారంగంలో కాళిదాసుగారు అనేకమంది రచయితలతో, కవులతో, ప్రముఖులతో పరిచయాలు ఏర్పడిన సంఘం అభివృద్ధి కోసమే తప్ప, వ్యక్తిగత అవసరాలకి ఎప్పుడూ ఉపయోగించేవాడుకాదు.





ఎఐకెయస్ జాతీయ మహాసభలు గుంటూరులో జరుగుతున్న సందర్భంగా స్వాతంత్ర్య సమరయోధురాలు, తెలంగాణ సాయుధ రైతాంగ పోరాట యోధురాలు కామ్రేడ్ మల్లు స్వరాజ్యం, జాతీయ ఎఐకెయస్ జాతీయ ఉపాధ్యక్షులు కామ్రేడ్ ఎస్. మల్లారెడ్డి, గుంటూరు జిల్లా ఎఐకెయస్ అధ్యక్షులు కామ్రేడ్ పోపూరి రామారావు, కామ్రేడ్ మండవ చిట్టెమ్మ, కాళిదాసు, తదితరులు.



**పి.వి. రమణ**
ప్రజాగాయకుడు,
గుంటూరు.
7396493100

# కాళిదాసు మీద ఆన

**‘సొం**తలాభం కొంత మానుకు
పొరుగువానికి తోడుపడవోయ్
వట్టిమాటలు కట్టిపెట్టి
గట్టిమేలు తలపెట్టవోయ్’

అన్న గురజాడ కవితా సందేశానికి అక్షరసత్యం కాళిదాసు...‘కాళీ’ అని ఆప్యాయంగా, అనురాగంతో పిలవబడే నూతలపాటి కాళిదాసు. కళ కళ కోసం కాదు, కళ ప్రజల కోసం అని నమ్మి మార్క్సిజమే ఈ సమాజాన్ని ముందుకు తీసుకెళ్లే మహత్తరశక్తి అని మనసా వాచా కర్మణా నమ్మిన త్యాగశీలి. తన యవ్వనాన్ని, తన కుటుంబాన్ని మొత్తం ‘దారి పొడగునా గుండె నెత్తురులు’ తర్పణ చేస్తూ పదండి ముందుకు మరో ప్రపంచపు కంచునగారా విరామ మెరుగక మ్రోగింది అని ఇప్పటికీ కలలు కంటూ స్ఫూర్తివంతమైన జీవితాన్ని కొనసాగిస్తున్న ఆశాజీవి కాళిదాసు.

నూతలపాటి కాళిదాసుగారి పుట్టిన ఊరు యడ్లపాడు ఉద్యమ కార్యస్థలం గుంటూరు జిల్లా. నేను పుట్టి పెరిగింది నెల్లూరు జిల్లా చివరిలో ఉండే ‘శత్రువైనా కరుణతో చూసే చెంబేడు’. నేను చిన్నప్పటి నుండి పాటలు పాడుతూ మా ఊరిలో హైస్కూల్లో మంచి బహుమతులు తెచ్చుకుంటూ ఉండేవాడిని నా నాలుగో

తరగతిలోనే తల్లి మరణించడంతో నా విద్యాభ్యాసమంతా సంక్షేమ హాస్టల్లోనే సాగింది. వంటపని ఇంటిపని అన్నీ నేనే. నేను 9వ తరగతి చదువుతున్న సమయంలో అక్షరాస్యత ఉద్యమం పల్లె పల్లెనా సాగుతున్నది. 'కొండల్లో కోయిల పాటలు పాడాలి పల్లెలో అక్షరదీపం వెలగాలి' అనే పాట ఊరూవాడ మారుమోగుతున్నది. జనవిజ్ఞానవేదిక, ప్రజానాట్యమండలి ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో వందలాది దళాలతో పాటలు, పల్లెసుద్దులతో కళాకారుల ప్రచారం గ్రామ గ్రామాన ఊపందుకుంది. ఇలా మా గ్రామంలో నేను చదువుకుంటున్న హైస్కూల్‌లో కళాబృందం ప్రదర్శన ఇచ్చింది.

ఆ బృందంలో మా మేనమామ ప్రేమానందం, బుజ్జయ్యలు పల్లెసుద్దులు చెబుతూ పాటలు పాడుతూ ప్రదర్శనలు ఇచ్చారు. మధ్యలో మా హెడ్మాస్టారు 'మా విద్యార్థి పివి ఒకపాట పాడతాడు. ఓ అవకాశం ఇవ్వండి' అని బృందాన్ని కోరగా నేను లేచి 'కొండల్లో కోయిల పాటలు పాడాల' అంటూ పాడటంతో ఊరు ఊరంతా చప్పట్లతో అభినందించింది. అక్కడున్న పెద్దఆఫీసర్లు, టీచర్లు చాలా పొంగి పోయారు. ఇక నాపేరు మండలమంతా మారుమోగిపోయింది ఎమ్‌డీవోగారికి విషయం తెలియడంతో మా మేనమామను ఒప్పించి నన్ను మండలమంతా ఎమ్‌డీవోగారి స్పెషల్ పర్మిషన్‌తో దళంలో తిప్పారు. ఈ యాత్ర జరుగుతున్న సమయంలోనే నేదురుమల్లి జనార్దన్‌రెడ్డి ముఖ్యమంత్రి హోదాలో ఆనాటి మా జిల్లా కలెక్టర్ లక్ష్మీగారు మా మండలానికి ఓ ప్రోగ్రాం నిమిత్తం వచ్చారు. ఆ సభలో ముఖ్యమంత్రి సమక్షంలో నేను దేవేంద్రగారు రాసిన 'చదవాలిరా ఎన్ని ఆటంకాలొచ్చినా...చదువు లేకపోతే మన బతుకు పెద్దసున్నా' అనే పాట పాడటంతో ముఖ్యమంత్రి, కలెక్టర్ నన్ను దగ్గరకు పిలిచి నన్ను పొగడ్తలతో ఆకాశానికెత్తారు. ముఖ్యమంత్రిగారు నాకు ఓ పెన్ను బహుమతిగా ఇచ్చారు. మరుసటి రోజు ఈ వార్త పేపర్లో ప్రచురించడం, మా స్కూల్‌బోర్డులో ఆ పేపరు అంటించడం, ఉదయం జరిగే ప్రేయర్‌లో నన్ను సన్మానించడం గుర్తొస్తే చాలా ఆనందం వేస్తుంది.

ఇలా నా పాటల ప్రయాణం సాగుతున్న సమయంలో నెల్లూరు ఎల్లాయపాలెంలో ప్రజానాట్యమండలి రాష్ట్రస్థాయి డప్పులు, పాటలు, వీధినాటకాల

శిక్షణాశిబిరానికి మా మామయ్య ప్రేమానందం నన్ను వెంటబెట్టుకుని వెళ్లాడు. ఆ శిబిరంలో సీనియర్ గాయకులు జగన్, సురేష్‌లు పాటలు నేర్పుతున్నారు. వాళ్లు నేర్పుతున్న ప్రతిపాటనీ అందరికంటే ముందే తప్పుల్లేకుండా పాడుతుండేవాడిని. ఈ శిక్షణాశిబిరంలో సాయంత్రం సమయంలో సమాజంలో జరుగుతున్న అనేక పరిణామాలు, కళాకారుల కర్తవ్యంపై అనేకమంది నాయకులు చేసిన ఉపన్యాసాలు నన్ను ఆకట్టుకున్నాయి. ఆ శిబిరానికి గుంటూరునుంచి కాళిదాసుగారు వచ్చి నా పాటలను విన్నారు...నన్ను కలిసి నా అడ్రస్ తీసుకుని 'గుంటూరు వస్తావా...బాగా చదివిస్తాం...ఏసీ కళాశాలలో చేర్పిస్తాం...'అని చెప్పి వెళ్లిపోయారు.

ఆ మరుసటి ఏడాది పదోతరగతి పరీక్షలు రానేవచ్చాయి. నేను చదువులో, రాతలో, ఉపన్యాస పోటీల్లో, పాటల్లో అన్నింటా ముందుండేవాడిని. మా నాన్నకి నేను ఫస్ట్‌క్లాస్‌లో పాస్ అవుతానని నమ్మకం. కానీ నేను పాటల ధ్యాసలో పడి పదో తరగతి మ్యాథ్స్‌లో ఏడు మార్కులు తక్కువతో ఫెయిల్ అయ్యాను. ఇంక నాన్న నన్ను అందరి ముందు కొట్టుకుంటూ ఇంటికి తీసుకెళ్లి...ఇంట్లో కూర్చుని ఏడ్చేశాడు. చిన్నప్పుడే అమ్మ పోవడంతో పెళ్లి కూడా చేసుకోకుండా మా కోసం కష్టపడ్డాడు. రెడ్డేరు ఇళ్లల్లో పాలేరు పని చేసి మమ్మల్ని చదివించాలని తపన పడ్డాడు. నేను ఫెయిల్ అవ్వడం ఆయన్ను మరింత కుంగుదీసింది. నాన్న ఏడవడం నన్ను ఎంతో బాధించింది. ఎట్టాగైనా పాస్ అవ్వాలని నాయుడుపేట ట్యూషన్లో చేరి మళ్లీ పరీక్ష రాసి పాసయ్యాను. నాన్న సంతోషానికి అవధుల్లేకుండాపోయింది.

పదవతరగతి పాస్ అవ్వగానే నన్ను ఏసీ కళాశాలలో చేరాలని కాళిదాసు గారు ఉత్తరం రాశారు. కానీ నాన్నకు గుంటూరు పంపటం ఇష్టంలేక మల్లాం జూనియర్ కాలేజీలో చేర్పించారు. ఇంటర్మీడియట్లో చేరినాగాని కాళిదాసుగారి నుంచి ఉత్తరాలు వస్తూనే ఉన్నాయి. దాదాపు 20-30 లెటర్లు రాసి ఉంటారు. నా ఇంటర్ మొదటి సంవత్సరంలోనే నెల్లూరుజిల్లా జువ్వలదిన్నెలో డివైఎఫ్ఐ, ఎస్ఎఫ్ఐ రాష్ట్రస్థాయి క్లాసులు జరగడం, నన్ను అక్కడికి తీసుకెళ్లడం, కాళిదాసుగారు అక్కడికి రావడం, మరలా సెకండియర్‌లో అయినా నన్ను గుంటూరు రమ్మనడం జరిగింది. నేను నాన్నను ఒప్పించి సెకండ్ ఇయర్‌లో

ఏసీ కళాశాలలో చేరాలని నిర్ణయించుకోవడంతో వేసవిసెలవుల్లోనే రేపల్లెదగ్గర తిప్పలకట్ట అనే గ్రామంలో కోలాటగురువుల శిక్షణాశిబిరం జరుగుతుందని కాళిదాసుగారి నుంచి కబురు వచ్చింది. ఈ విషయం నాన్నకు చెప్పి రేపల్లె బయలుదేరాను. అక్కడ సిపిఎం కార్యాలయంలో రాత్రి బసచేసి ఉదయాన్నే తిప్పలకట్ట చేరుకున్నాను. ప్రకాశంజిల్లాకు చెందిన జాన్‌మాస్టారు కోలాటంగురువు. ఆయన దగ్గర నేర్చుకోవడానికి ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ నలుమూలలనుండి అనేకమంది వచ్చారు. ఆ శిబిరానికి కర్త కర్మ క్రియ అన్నీ కాళిదాసుగారే.

ఆ శిక్షణ రాష్ట్రానికి రోల్‌మోడల్. ఆ శిబిరం ఉదయంనుంచి సాయంత్రం వరకు జరుగుతుంది. అక్కడ పగలంతా నేర్చుకున్న కోలాట కోపులను ఒక్కొక్క గురువు ఆ చుట్టుపక్కల గ్రామాలకువెళ్లి రాత్రుళ్లు కోలాటం నేర్పాలి. అలా 20 మందితో ప్రారంభమైన శిబిరం చుట్టుపక్కల దాదాపు పది దళాలు, 300 మంది కోలాటం కళాకారులతో చివరిరోజు రేపల్లె మృతవీరుల స్మారకసభ జనజాతరలా సాగింది. ఈ శిబిరంలో కాళిదాసుగారు వేసిన ప్రణాళిక, శిబిరం నడిపిన తీరు, ఏకకాలంలో గురువులు, ఆ గురువులకు చుట్టుపక్కల నేర్పడంద్వారా స్వీయ అనుభవం తదనంతర కాలంలో రాష్ట్రానికి ఒక గొప్ప అనుభవంగా మారింది. తర్వాత జిల్లాలు, మండలాల్లో కోలాటదళాలు తయారయ్యాయి. ఈ శిబిరంద్వారా నేను కోలాటగురువుగా కూడా తయారయ్యాను. శిబిరం అయిన తర్వాత నేను కాళిదాసుగారితో గుంటూరుకు పయనమయ్యాను. ఊరికి వెళ్లాలని దిగులుకానీ ఈయనకు చెబితే ఏమంటాడో అన్న భయం. చెప్పకుండానే గుంటూరు చేరాను. ఆఫీసులో దించి అక్కడ కామ్రేడ్స్‌కి పరిచయం చేసి ఇంటికి తీసుకెళ్లి భోజనం పెట్టారు.

ఇలా సెలవుల్లో కాళిదాసుగారి ఇంట్లో భోజనం సదుపాయం. కన్నతల్లి లాంటి ఆదరణ కాళిదాసుగారి భార్య విజయమ్మలో చూశాను. చక్కటిభోజనం, ఆత్మీయమైన పలకరింపు నన్ను చాలా ఆనందింపజేశాయి. నాకు పెరుగు తినే అలవాటు లేదు. అంటే మా ఇంటిలో పెరుగు నిత్య ఆహారంలో భాగంగా తినలేదు. పండగల్లో దేవుడికి పెట్టినప్పుడే మాకు అలవాటు. కానీ గుంటూరు ఆహారంలో నిత్యం ఒక భాగం. నాకు అలవాటు లేదమ్మా...అంటే అస్సలు ఊరుకోలేదు.

తప్పనిసరిగా తినాలని అలవాటు చేసింది. సెలవులు అనంతరం 1996లో ఇంటర్మీడియట్ సెకండియర్‌లో ఏసీ కళాశాలలో అడ్మిషన్ ఇచ్చారు. ఉల్ఫ్‌హాల్ హాస్టల్లో ఎస్ఎఫ్ఐ నాయకులు చేర్చారు అప్పటినుండి ఎస్ఎఫ్ఐ ప్రజానాట్య మండలి రెండుసంఘాల్లో చాలా క్రియాశీలకంగా పనిచేశాను. నా బాధ్యత ఎస్ఎఫ్ఐ కంటే ప్రజానాట్యమండలే ప్రధానబాధ్యతగా చెప్పారు. కార్యక్రమాలుంటే ఆఫీసులో ఉండేవాడిని లేకపోతే హాస్టల్లో ఉండేవాడిని. గుంటూరు బాగా అలవాటైంది. నిత్యం ఏదోఒక ధర్నా, మీటింగ్, ర్యాలీ ఇలా సిఐటియు, ఏపీఎంఎస్ఆర్‌యు, డివైఎఫ్ఐ, ఎస్ఎఫ్ఐ, వ్యవసాయ కార్మిక సంఘం, రైతుసంఘం, మహిళాసంఘం, పార్టీకి అనుబంధసంఘాలు ప్రతిరోజూ ఏదోఒక కార్యక్రమం ఉండేది. ప్రతి కార్యక్రమంలో పాటలు పాడుతుండేవాడిని. ఏసీ కాలేజీలో ప్రిన్సిపాల్ దగ్గరనుండి లెక్చరర్ వరకు అందరూ నా ఫ్యాన్సే. ఎందుకంటే ఆగస్టు 15, జనవరి 26, టీచర్స్‌డే, తదితర పండగల్లో పాటలు పాడి అందర్నీ మెప్పించేవాడిని. అందువల్ల కాలేజీకి వెళ్లకపోయినా నాకు పరీక్ష సమయంలో హాల్ టిక్కెట్ ఇచ్చేవాళ్లు.

ఆ రోజుల్లో గుంటూరులో ఎస్ఎఫ్ఐ ఉద్యమం చాలా బలంగా ఉండేది. విద్యార్థుల సమస్యలపై సమ్మెలు, ధర్నాలు విస్తృతంగా జరిగేవి. నేను ఏసీ కళాశాలలో ఎస్ఎఫ్ఐ కార్యకర్తగా, అధ్యక్షుడిగా కూడా చేశాను. నరేంద్ర, రమేష్ నా క్లాస్‌మెట్స్. ఎస్ఎఫ్ఐ నాయకులుగా నా తర్వాత ఎదిగారు. ఇంటర్మీడియట్ మరియు మూడేళ్ల డిగ్రీలో ఒకేసారి అన్ని పాస్ అయ్యాను. వేసవి, సంక్రాంతి సెలవుల్లో కూడా ఇంటికి పంపించేవారుకాదు కాళిదాసుగారు. ఏదో ఒక కార్యక్రమంలో నిమగ్నం చేయించేవారు. బ్రాడీపేట 2/3లోని కాకతీయ మెస్ ఉండేది. ఆ మెస్సులో కార్డు ఇచ్చేది సంఘం. ఇలా దాదాపు ఐదేళ్లు నా ప్రయాణం ఆట పాట చదువుతోనే సాగింది. పార్టీఆఫీసులో చాలామంది నా సీనియర్ కామ్రేడ్స్ ఉండేవాళ్లు. బైరగాని శ్రీనివాసరావు, ఈమని అప్పారావు, కాకుమాను నాగేశ్వరరావు, జయప్రకాష్, నళినీకాంత్, కొండూరు వీరయ్య.. వీళ్లంతా అప్పటికే యూనివర్సిటీలో పెద్దపెద్ద చదువులు చదివి సమాజ మార్పుకోసం హోల్ టైమర్లు (అంటే పూర్తి కాలం కార్యకర్తలు)గా లెటర్లు పెట్టి ఉన్నారు.

వీళ్లందర్నీ ఆదర్శంగా చూపి 'నువ్వుకూడా హోల్ టైమర్‌గా రావాలి' అని కాళిదాసుగారు చెబుతుండేవారు. హోల్‌టైమర్ అంటే పూర్తిగా ప్రజాసంఘం పని. కుటుంబం లేదు, బంధువులు లేరు, ఇల్లు వాకిలి లేదు. సమస్తం పార్టీకి అంకితం చేయాలి. ప్రతి ఏటా జరిగే క్లాసుల్లో మూడు మాటలు పదేపదే చెప్పేవారు వ్యక్తిగత, కుటుంబ ప్రయోజనాలకన్నా పార్టీ ప్రయోజనాలు మిన్న. పార్టీ సభ్యుడుగా ఉండాలంటే ఏదో ఒక ప్రజాసంఘంలో పనిచేయాలి. ప్రజాశక్తి తప్పనిసరిగా చదవాలి. ఇవన్నీ శ్రీరామ నామస్తోత్రంలాగా నా చెవుల్లో మార్మోగేవి. ఆచరణలో కూడా పైన నేను చెప్పిన సీనియర్ కామ్రేడ్స్ పాటిస్తుండేవాళ్లు. వ్యక్తిగత క్రమశిక్షణ విషయంలో శుభ్రత విషయంలో, సాటిమనిషిని గౌరవించే పద్ధతిలో, ఆఫీసుకు వచ్చే మహిళాకామ్రేడ్స్‌పట్ల వ్యవహరించే గౌరవమర్యాదలు నాపై తీవ్రమైన ప్రభావితం చూపాయి.

డిగ్రీ పాసయ్యాక హోల్‌టైమర్‌గా రావాలని కాళిదాసుగారు ప్రతిపాదన చేశారు. నేను సరే అన్నాను. లెటర్‌కూడా పెట్టాను. అప్పటి పార్టీ జిల్లాకార్యదర్శి సింహాద్రి శివారెడ్డిగారు. త్యాగానికి, నిస్వార్థ ప్రజాసేవకి నిలువెత్తు నిదర్శనం. ఎమర్జెన్సీ కాలంలో జైలునిర్బంధం ఎదుర్కొన్నారాయన. శరీరంలో తుపాకీగుండు దూరి, ఆరోగ్యం పాడైన నేనెరిగిన గొప్పకమ్యూనిస్టు ఆయన. నన్ను రమణయ్యశాస్త్రి అనేవాడు. పూర్తికాలం కార్యకర్తగా లెటర్‌పెట్టిన తర్వాత మా నాన్నతో నేను 'నాన్నా నేను సిపిఎంపార్టీ హోల్‌టైమర్‌గా పని చేస్తాను' అని చెప్పాను. హోల్‌టైమర్ అన్నా, సిపిఎం అన్నా, ఆయనకు తెలియదు. నా కొడుకు ఉద్యోగం చేస్తాడు... ప్రయోజకుడు అవుతాడు...మమ్మల్ని బాగా చూసుకుంటాడు... అనే భ్రమలో ఉన్నాడు. విషయం చెప్పడంతో ఆయన చాలా బాధపడ్డాడు. 'సరే నీ ఇష్టం...నీ బతుకు నీది...మా బతుకు మాది...' అని చెప్పడంతో నేను పూర్తికాలం కార్యకర్తగా పనిచేయాలని నిర్ణయించుకున్నాను.

యూనివర్సిటీలో పీజీ చదవాలని నాకు కోరిక పుట్టింది. కాళిదాసుగారు ససేమిరా ఒప్పుకోలేదు. ఎస్ఎఫ్ఐ నాయకులు...'నువ్వు పీజీచేస్తే విషయపరిజ్ఞానం పెరుగుతుంది...యూనివర్సిటీలో చేరు...మేము కూడా పీజీచేసే హోల్‌టైమర్‌లుగా

వచ్చాం...' అని చెప్పారు. కాళిదాసుగారికేమో నేను 'పీజీ చేస్తే హోల్‌టైమర్‌గా రాడు' అని మనసులో బలమైన ముద్రపడింది. చివరికి కాళిదాసుగారు ఓ ప్రతిపాదనపెట్టాడు. నువ్వు హోల్‌టైమర్‌గా పనిచేస్తూనే ఏసీ కాలేజీలో పీజీ చేయి అని చెప్పారు. ఇక షరా మామూలే పరీక్షలు మాత్రమే కాలేజీకి మిగతా రోజుల్లో ప్రజానాట్యమండలి డివిజన్ కార్యక్రమాల నుంచి రాష్ట్రస్థాయి కార్యక్రమాల వరకు నేను చేయనిపని అంటూ లేదు. నేను పాటపాడని వేదికంటూలేదు. నేను పాల్గొనని సభలంటూ లేవు. అన్నిసభల్లో పదిమందిని పోగేసుకోవడం, శిక్షణివ్వడం, కార్యక్రమాలు జయప్రదం కావించడం నిత్యకృత్యమైంది. అప్పటినుంచి పేరుకు చదువు కానీ ఇంటర్మీడియట్ తీసేస్తే 1999 నుండి 2019 వరకు 20 ఏళ్లు నేను నా యవ్వనాన్ని మొత్తం ప్రజాసాంస్కృతిక ఉద్యమపతాక ప్రజానాట్యమండలి జెండా ఎత్తి ఈ నేల నలుచెరగుల ఆటైపాటై సాగినోణ్ణి. ఈ ప్రయాణంలో కాళిదాసుగారు నన్ను తీర్చిదిద్దిన తీరు, కొన్ని సందర్భాల్లో ప్రేమతోనూ మరికొన్ని సందర్భాల్లో అసహనంతో ఎక్కువ సమయంలో కోపంతో సాగింది. కోపమంటే ప్రేమతో కూడింది.

ఇక పీజీకూడా సక్సెస్‌ఫుల్‌గా ఎగ్జాంరాసి పాస్ అయ్యాను. ఇక్కడ నా జీవితం మలుపు తిరగాల్సిన సంఘటన కాళిదాసు కూడా తెలియనిది జరిగింది. పీజీ పాసైన వెంటనే ఏసీ కాలేజీలో లెక్చరర్‌గా నన్ను ప్రోత్సహించాలని ముత్యం, పి.రంజన్‌బాబు, యాంద్రు జోసఫ్, పిల్లి శాంసన్ నన్ను ప్రత్యేకంగా ఏసీ కళాశాలలో సోషియాలజీ డిపార్ట్‌మెంట్‌కు పిలిపించి 'కాలేజీలోనే లెక్చరర్‌గా చేరి పిహెచ్.డి. చెయ్. నువ్వు ఇక్కడ పర్మినెంట్ అవుతావు. లైఫ్ సెటిల్ అవుతుంది. కొంత డబ్బులు యాజమాన్యానికి కట్టాలి. అది మేము ఏర్పాటు చేస్తాం' అని చెప్పడంతో నేను నిశ్శేష్టుడనయ్యాను. అప్పటికే నా నరనరాల్లో ఎర్రజెండా, ప్రజానాట్యమండలి తప్ప వేరే ఆలోచనలేదు. వాళ్లు చెప్పిన వెంటనే 'లేదుసార్ నేను పార్టీలోనే పనిచేస్తా. ఇప్పుడు నేను ప్రజానాట్యమండలి జిల్లాకార్యదర్శిని. నాకు అదే ఇంట్రెస్ట్' అని ఖరాఖండీగా చెప్పాను. అయినా సరే, తర్వాత కూడా చాలా కార్యక్రమాలకు విరాళాలు ఇచ్చేవారు.

ఇలా హోల్‌టైమర్‌గా కొనసాగుతుండగానే పెళ్లి ప్రతిపాదన తెచ్చారు కాళిదాసుగారు. చాలామంది ప్రజానాట్యమండలి కార్యక్రమాలకు వచ్చే అమ్మాయిల్ని చూపించి వీళ్లని చేసుకో...వాళ్లనుచేసుకో అని సతాయించేవాడు. ఒకరోజు నేను మా మేనమామ కూతుర్ని చేసుకుంటానని చెప్పడంతో సరే అని మా ఊరెళ్లి నాన్నతో, మామయ్యతో మాట్లాడి 2006 మే 25న వెంకటలక్ష్మితో గుంటూరు జిల్లా సిపిఎం కార్యాలయంలో అప్పటి ప్రజానాట్యమండలి రాష్ట్రకార్యదర్శి పిఎ దేవి, సిపిఎం జిల్లాకార్యదర్శి సింహాద్రి శివారెడ్డి, ప్రజానాట్యమండలి రాష్ట్రస్థాయి నాయకులు, గాయకుల సమక్షంలో నాన్న నాకోసం పంపిన 3000 రూపాయలతో దండలు పెళ్లి చేసుకున్నాను. నాపెళ్లి చూసి నాన్న, నా కుటుంబసభ్యులు చాలా ఆనందపడ్డారు. మా ఊరు నుంచి వచ్చినవాళ్లకి యుటిఎఫ్ ఆఫీసులో భోజనాలు. అన్ని ఏర్పాట్లూ తన సొంతఖర్చులతో చాలాబాగా చూసుకున్నారు కాళిదాసు గారు. మా ఇంట్లో, మా ఊర్లో ఇప్పటికీ కాళిదాసుగారిని ఏమన్నా ఊరుకోరు. అలా ఆకట్టుకున్నారాయన.

నేనాచరించని నీతులు బోధించి
రాని రాగము తీయలేను నేను
సంసార యాత్రకు చాలినంతకు మించి
చిల్లిగవ్వయు కోరుకొనను నేను
కులమతాలు గీచుకున్న గీతల జొచ్చి
పంజరాన కట్టుబడను నేను....

అన్న జాషువా వాక్కులు కాళిదాసు విషయంలో అక్షరసత్యం. దాదాపు 23 ఏళ్లు అతి దగ్గరగా చూశాను. కాళిదాసుగారు మాలల్లో మాలోడిగా, మాదిగల్లో మాదిగగా, తండాల్లో నాయక్‌గా ఒదిగిపోయాడు. వాళ్ల ఇళ్లల్లో ఎటువంటి బేషజాలూ లేకుండా జీవించాడు. కొన్ని వందలరోజులు దళితుల ఇళ్లల్లో అన్నం తిన్నాడు. అసలు ఇక్కడ ఒక విషయం చెప్పాలి. ప్రజానాట్యమండలి నిర్మాణంలో దళితులు, గిరిజనులు ఎక్కువ. గోరటి వెంకన్న అన్నట్టు–

'వాడు ఆడాడు రా
వాడు పాడాడు రా

వాడు గీశాడు రా

వాడు చిందేశాడు రా

అంటే వాడు మాలన్నా అయి ఉండాలి, మాదిగన్నా అయి ఉండాలి. మరే ఇతరు అణగారిన వర్గమైనా అయి ఉండాలి. చిందేసేవాడే గొంతెత్తి అరవగలడు, చెమటలు చిందించి గంతేయగలడు. నమ్మితే ప్రాణాలు పెడతాడు. వాళ్ల బలాన్నంతా ధారపోస్తారు...అని కాళిదాసుకి బాగా తెలుసు. వారాల తరబడి పల్లెల్లోనే కాళిదాసు జీవనం ఎక్కడా ఎవర్నీ తక్కువ చేసి చూసింది లేదు. పూటకూడా గడవని కళాకారులు ప్రజానాట్యమండలి కార్యక్రమాలకు వచ్చేవాళ్లు. వాళ్లకు వచ్చే ముందే అక్కడ లోకల్‌పార్టీ నాయకులకు చెప్పి బియ్యం, సరుకులు ఏర్పాటు చేసేవాడు. ఇలా అనేక సందర్భాలు చూశాను. అక్షరాస్యత ఉద్యమంలో పనిచేసిన ఎస్టీ మహిళ మంగమ్మ (క్రోసూరు)కు అప్పటి కలెక్టర్‌తో మాట్లాడి కండక్టర్ ఉద్యోగం ఇప్పించారు. నాకు తెలిసి చాలామంది ఈ జాబితాలో ఉన్నారు. తర్వాతకాలంలో కాళిదాసులో పార్టీ స్వార్థం పెరిగింది. పరిచయం అయిన ప్రతి కార్యకర్తా పార్టీకోసం పని చేయాలని ప్రోత్సహించేవారు. ప్రజానాట్యమండలి సంబంధంలోకి వచ్చిన ప్రతి కార్యకర్తని పార్టీలో క్రియాశీలకం చేశారు. వాళ్లలో రాష్ట్రంలో, చుట్టుపక్కల జిల్లాల్లో వివిధ బాధ్యతల్లో, వివిధ హోదాల్లో చాలామంది ఉన్నారు.

కాళిదాసుగారి గురించి అన్నీ చెప్పడం సాధ్యంకాదు. కరుడుగట్టిన కమ్యూనిస్టు కాళిదాసు. ఆయన చాలామందికి నచ్చరు...ఎందుకంటే మార్పులు అయన కోరుకోరు. తన మైండ్‌లో ఎక్కిన సిద్ధాంతం కచ్చితంగా అమలు చేయడమే ఒక విధంగా చెప్పాలంటే కేంద్రీకృత ప్రజాస్వామ్యాన్ని తూచా తప్పకుండా కర్ర పెత్తనం చేసైనా అమలు చేస్తాడు. పై కమిటీ చెప్పింది చేయాల్సిందే...పార్టీ అప్పుజెప్పిన పని అమలు కావాల్సిందే...ఆ పట్టుదలే కాళిదాసుగారిని చాలా మందికి నచ్చని విధంగా చేసింది. ప్రజానాట్యమండలి రాష్ట్రకమిటీ ఇచ్చిన ప్రతి పిలుపు గుంటూరుజిల్లాలో జయప్రదమయ్యేది. దేవేంద్ర రచన, శాంతారాం దర్శకత్వంలో రూపొందిన 'రైతు' నాటిక రాష్ట్రంలో ఎక్కడ జరగనన్ని ప్రదర్శనలు అంటే 100 ప్రదర్శనలుపైగా గుంటూరుజిల్లాలో ప్రదర్శించారు. అప్పొ, అమ్మకమా

నాటిక, గొర్రెలు తిరగబడతాయి, చేనేత శంఖారావంలాంటి వీధినాటకాలు గుంటూరుజిల్లాలో చాలా తయారయ్యాయి.

రైతు ఆత్మహత్యల మీద నరసరావుపేట, పాలపాడులో ఓ నాటిక తయారు చేయాలని శాంతారాం, బి. దశరథ, కాళిదాసు నేను ఆ ఊర్లో వారం రోజులు ఉండి 'బ్రతుకుదారి' పేరుతో వీధినాటకం పాలపాడు దళిత యువకులతో తయారు చేయించాం. పాలపాడు పల్లెకి కాళిదాసుగారికి అవినాభావ సంబంధం ఉంది. 'సమయానికి రాకపోతే కాళీ ప్రాణం తీస్తాడు రా' అని సమయానికి వచ్చి రిహార్సిల్సు చేసేవారు. ఆ ఊర్లోనే ఆదర్శకమ్యూనిస్టు పశువుల డాక్టర్‌గా పేరొందిన మెట్టు కోటిరెడ్డిగారికి మంచి పేరుంది. ప్రజానాట్య మండలి జిల్లా ఉపాధ్యక్షులు కూడా. గాయకులకు, డప్పు కళాకారులకు పల్లె సుద్దులకు ఆ ఊరిలో బోలెడు మంది కళాకారులు వచ్చేవాళ్లు. ఆ ఊర్లోనే దేవిగారు నెల రోజులు పాటు పుల్లరి వ్యతిరేక పోరాటయోధుడు కన్నెగంటి హనుమంతు జీవితం ఆధారంగా 'వీరగంధం' నాటకం రూపొందించారు. రచన, దర్శకత్వం దేవిగారే. శాంతారాం పర్యవేక్షించారు. నాటకానికి సంబంధించి ఎడ్లబండ్లు, ఆహారం, డబ్బులు సమకూర్చడం మెట్టు కోటిరెడ్డి, కాళిదాసు ఎప్పటికప్పుడు అందించేవారు. 'వీరగంధం' పాలపాడులో మొదటి ప్రదర్శననుండి హైదరాబాదు రవీంద్రభారతిలో ప్రదర్శించేవరకు ఎవర్నీ నిద్రపోనియ్యలేదు. అలా గుంటూరుజిల్లా ప్రజానాట్యమండలికి ఘనమైనపేరు తేవడం కాళిదాసుగారికే దక్కింది. ప్రజా సాంస్కృతికకేంద్రాలుగా గుంటూరుజిల్లాలో చాలా గ్రామాలుండేవి. పాలపాడు, నూతక్కి, ఉండవల్లి, ఆత్మకూరు, యడ్లపాడు, చేజర్ల, లింగారావుపాలెం తదితర గ్రామాల్లో ప్రజానాట్యమండలి కళారూపాలు, కళాకారులు తయారవడంలో విశేషమైన కృషి చేశారు.

**గాయకుల బృందాలు**

నేను గుంటూరు వచ్చే సమయానికే చాలామంది గాయకులు పాటలు పాడుతుండేవాళ్లు. తోకల కోటేశ్వరావు (లింగారావుపాలెం), కోటి, పెద్దిరాజు, డాబా శేషయ్య, శేషయ్య, బాలకోటయ్య (పాలపాడు) లాజరు (నూతక్కి), పండల ప్రసాద్, నల్లక శ్రీధర్ (ఆత్మకూరు), పీటర్, రోశయ్య (యడ్లపాడు), ఆర్‌వి

రాఘవయ్య (ఉండవల్లి), అమరమ్మ, మాణిక్యమ్మ, జగన్నాథమ్మ (నాదెండ్ల), ఒక మహిళాబృందమే నాదెండ్ల కేంద్రంగా ఉండేవారు. వీళ్ళందరూ కార్యక్రమాల్లో వయస్సురీత్యా, బాధ్యతలురీత్యా, ఉద్యోగాలురీత్యా వెనకపట్టు పట్టారు. జిల్లా కేంద్రంలో ఒక గాయకుడు, ఒక ఆర్గనైజర్ ఉండాలని కాళిదాసుగారు తపన. గాయకుడను దొరికాను. ఇంకో ఆర్గనైజర్ కావాలని నరసరావుపేట ప్రాంతానికి చెందిన అంజిరెడ్డిని జిల్లాకేంద్రానికి తీసుకువచ్చారు. చాలా చురుకైన కార్యకర్త... తెలివిగల నాయకుడు... పెళ్లి కూడా చేశారు. ప్రజానాట్యమండలికి చెందిన కోటిరెడ్డి గారి బంధువు కూతుర్ని ఇచ్చి పార్టీ పెళ్లి చేశాడు. కొంతకాలానికి అంజిరెడ్డి అన్ని బాధ్యతలునుండి రిలీవ్ అయి ఒంగోలులో స్థిరపడ్డారు. చివరకు జిల్లాకార్యదర్శిగా నన్ను నియమించి అధ్యక్షుడిగా కొంతకాలం కొనసాగి రైతుసంఘం బాధ్యతలోకి వెళ్లారు.

జిల్లా కార్యదర్శిగా నేను బాధ్యతలోకి వచ్చే సమయానికి సంఘానికి ఆర్థిక వనరులు చాలా తక్కువగా ఉన్నాయి. పార్టీ అకౌంట్‌కు బదలాయించి నాకు ఐదారునెలలకు సరిపడా డబ్బులు ఉంచి రిలీవ్ అయ్యారు. వీడు స్వతంత్రంగా ఎదగగలడు అని నమ్మకమా? లేదా ఎట్టా డబ్బులు వసూలు చేసి సంఘాన్ని నడుపుతాడో చూద్దాం అన్న కోపమా? ఇప్పటికీ అంతుపట్టని ప్రశ్న. నాకు చాలా తక్కువ అలవెన్స్. మెస్‌కార్డు పోను నెలకు రూ. 1200. ఈ డబ్బులు లెక్కేసుకుంటే ఐదారునెలలకు కూడా చాలవు. సంఘానికి జిల్లాకార్యదర్శిని, ఏం చేయాలో తెలియని స్థితి. రాష్ట్రకమిటీ పిలుపుని జయప్రదం చేస్తూనే రాష్ట్రస్థాయి కార్యక్రమాలకు నేను వెళుతూ కళాకారులను కలుపుకుంటూ సంఘాన్ని ముందుకు నడిపించాను. ఇదే సమయంలో బాలల రంగస్థల ఉత్సవాలు చేయాలని హైస్కూల్ విద్యార్థులకు పాటలు, నృత్యాలు, కళారూపాలు నేర్పి బాలల ఉత్సవాలు చేయాలని ప్రజానాట్య మండలి పిలుపు. ఇప్పుడు విజ్ఞానకేంద్రాల ఆధ్వర్యంలో నడస్తున్న బాలోత్సవాలను ప్రజానాట్యమండలి ఎంతో సృజనాత్మకంగా నిర్వహించేది. ఈ పిలుపును గుంటూరు జిల్లాలో జయప్రదంగా నడిపాను. ఆర్థిక వనరులు సమీకరణ కూడా చేయగలిగాను. ఈ సందర్భంగానే అరుణాచలం మాణిక్యవేల్, సత్రాజు బాలచందర్, గద్దె మంగయ్య, ఆలోకం పెద్దబ్బాయి, కన్నా మాస్టారు, భాష్యం

రామకృష్ణ సార్ వీళ్లంతా బాలల రంగస్థలం ఉత్సవాలద్వారా నా పాటలకు ఫిదా అవడం, నా ఆత్మవిశ్వాసానికి బలాన్నిచ్చింది. నన్ను ఇప్పటికీ ఎంతగానో ప్రేమిస్తారు. నేను ప్రజానాట్యమండలి నుంచి బయటకు వచ్చే సమయానికి 7 లక్షల ఫిక్స్‌డ్ డిపాజిట్లు కూడా వేయడం జరిగింది. సంఘాన్ని ఏ ఆర్థిక ఇబ్బందులూ లేకుండా నడపగలిగాను. ప్రజానాట్య మండలి పేరుతో ఏ కార్యక్రమం చేసినా ప్రజలు ఆదరించారు. ఇది ముమ్మాటికీ ప్రజానాట్యమండలి గొప్పతనమే. అందుకనే నా తర్వాత వచ్చిన నాయకులు బ్యాంకు తాలూకా వివరాలకు సంతకం కోసం ఇంటికొస్తామని ఫోన్ చేస్తే నేనే బ్యాంకు దగ్గరికి వెళ్లి నా సంతకాలు చేసి అప్పజెప్పి వచ్చాను. ఇది కాళిదాసుగారు నాకు నేర్పిన క్రమశిక్షణ. ఆయన కూడా నాకు అలానే అప్పజెప్పారు.

### లెక్కల్లో దిట్ట

కాళిదాసుగారు వ్యక్తిగత విషయంలోనూ సంఘంలోనూ ఆర్థికవ్యవహారాల్లో చాలా సిన్సియర్‌గా ఉండేవారు. ఒక చిన్నపుస్తకం జేబులో పెట్టుకుని ఏ రోజుకారోజు లెక్కలు రాసేవారు. ప్రజానాట్యమండలి లెక్కలు రాసేటప్పుడుకూడా అంతే. తెనాలి వెళ్లి వచ్చాను అంటే కుదరదు...బస్ టికెట్ ఇవ్వాల్సిందే. బస్ టికెట్ ఇవ్వకపోతే ఆ డబ్బులు మనకిందే. ఇలా ప్రతిదీ పారదర్శకంగా ఉండేవారు. అందరూ అలా ఉండాల్సిందే అనేవాడు. ఏమండీ...చాలా రోజులైంది...ఊరికి వెళ్లి వస్తాను...వెళ్లరా...మరి చార్జీలకు ఇవ్వండి...ఊరికి వెళ్లడం అనేది నీ వ్యక్తిగత విషయం...అందుకని సంఘం ఇవ్వదు. నేను పర్సనల్‌గా ఇస్తున్నాను పోయి రా...అనేవాడు అటువంటి లెక్కలు సంఘంలో రాసేవారు కూడా కాదు. సంఘం నుంచి రిలీవ్ అయ్యేటప్పుడు అన్ని లెక్కలు నాకు అప్పజెప్పారు. ప్రజానాట్య మండలికి బజాజ్ చేతక్ అనే బండి ఉండేది. ఆ బండికి రిపేర్లు చేయించలేక రూ. 1200కి అమ్మి సంఘం అకౌంట్లో జమ చేయమని నాకు అందించి ఆయన సొంతగా సైకిల్ కొనుక్కున్నాడు. జిల్లా ప్రజాసంఘాలు, డివిజన్ పార్టీల ఎకౌంటును ఆడిట్ చేసే బాధ్యతను పార్టీ ఈయనకి అప్పజెప్పింది. ప్రతి సంఘం మార్చినాటికి ఎకౌంటు ఆడిట్ చేయించుకోవాలి. ఇన్‌కమ్‌టాక్స్ డిపార్ట్మెంట్‌వాళ్లుకూడా

కాళిదాసుగారిలా చూడరు...లెక్కలు కూడడంలో, వాటిని చూడటంలో అందెవేసిన చేయి. క్యాలిక్యులేటర్ లేకుండానే కూడేసేవారు. చాలామంది నాయకులు ఈయనకి లెక్కలు చూపించడానికి భయపడేవారు. తప్పు రాసామని కాదు...ఎక్కడ పొరపాటు జరిగి జమాఖర్చులు సరిపోకపోతే ఈయన దగ్గర ఎన్ని తిట్లు తినాలో అని. అరవీర భయంకరుడులా ఉండేవాడు. రోజువారీ లెక్కలు రాసుకొని వోచర్లు రాసేవారికి ఇబ్బందిలేదు. నాలాంటి బద్దకస్తులకి ఇబ్బంది వచ్చేది. నేను చాలాసార్లు బ్యాలెన్స్ కాకపోతే గొడవపడి ఇబ్బందులుపడ్డాను. వామపక్షపార్టీల్లో ముఖ్యంగా సిపిఎం ఆర్థిక విషయాల్లో జాయింట్ ఎకౌంట్‌లతో పకడ్బందీగా నిర్వహించడంలో నిజాయితీ ఉంటుందనేది అక్షరసత్యం. ప్రజలిచ్చిన ప్రతిరూపాయికీ జవాబుదారిగా ఉండాలన్నది సిపిఎం భావన.

## ఎవరి మాటా వినడు సీతయ్య

ఇంతకుముందు చెప్పినట్లు చాలామందికి కాళిదాసుగారి తీరు నచ్చదు. ఎందుకంటే మూర్ఖంగా వాదిస్తాడని, ఎదుటివాడు చెప్పింది వినడని ఎక్కువమందికి అభిప్రాయం. ఒక పని ఎవరికన్నా అప్పజెబితే పదేపదే చెప్పి విసిగించడం, చెప్పిన సమయానికి పని అవ్వకపోతే విప్లవం శంకరు విలాస్ సెంటర్లో ఆగిపోయింది బ్రాడీపేట ఆఫీస్‌కు రానట్టే. ఎగిరెగిరి గంతులేయడం అందరికీ అలవాటైపోయింది. ఈ పనే బయట వ్యక్తులదగ్గర చేస్తే ఊరుకోరుగా. కానీ అదే చేసేవాడు పరిషత్ కళాకారులకు కాళిదాసుగారంటే భయం. పరిషత్ నాటకాలు చూడటానికే అందర్నీ తీసుకెళ్లేవాడు. వాళ్లు ఆడిన నాటకానికి పరిష్కారం చూపలేదు...మీరు చెప్పిన సబ్జెక్టు కరెక్ట్ కాదు...అని రాసిన రచయితలతో గొడవ పెట్టుకునేవాడు. ఈయన చెప్పే పరిష్కారం చివరిలో చెప్పాలి. అది ఈయన గొడవ...పాపం పరిషత్ కళాకారులు హడాలెత్తిపోయేవాళ్లు. తర్వాత కాళిదాసుగారితో నాటకాలు చూడడానికి వెళ్లేవాడినికాదు. ఇలా ఎక్కడికి వెళ్లినా మీరు మారాలి...సమాజాన్ని మార్చాలి...పరిష్కారం చెప్పాలి...అనేవాడు. అదేమన్నా ఎదుటివాడు గట్టిగా వాదిస్తే సమాధానం చెప్పలేక 'నేను ఎక్కువగా చదువుకోలా...చదువుకున్నోళ్లు మీరే... దీని గురించి ఆలోచించాలి...' అని ఎదురు సమాధానం చెప్పేవాడు.

వామపక్షాల ఉమ్మడి కార్యాచరణ కార్యక్రమాల్లో ఈయన వేగానికి తట్టుకునేవారు కాదు. ముందు ఎవరు పాడాలి, తర్వాత ఎవరు పాడాలి అనుకునే వాళ్లం. అవతల కామ్రేడ్స్ ఈ పద్ధతి అంటే పాటించేవాళ్లు కాదు. వాళ్లతో గొడవ పెట్టుకునేవాడు. ఇలా ఎక్కడా ప్రశాంతంగా ఉండేవాడు కాదు. ఇతరులను కూడా ఉంచేవాడు కాదు.

అలజడి మా ఊపిరి
ఆందోళన మా సిద్ధాంతం
తిరుగుబాటు మా వేదాంతం

అన్నట్టుగా ఉండేవాడు. పని...పని...పని...ఈయనకు తెలిసింది ఈ మూడే. మహాసభలైనా ధర్నాలైనా శిక్షణశిబిరాలైనా ఫండ్ క్యాంపెయిన్ అయినా మరేదైనా అన్నింటాముందే. కాళిదాసుగారికి అప్పజెప్పిన బృందాన్ని వెంటబెట్టుకుని సక్సెస్‌ఫుల్‌గా జయప్రదం చేసేవారు. 20 ఏళ్ల నా ప్రజానాట్యమండలి జీవితంలో నాకంటే 20 ఏళ్లు ముందుగా ఆయన పనిచేసిన అనుభవంలో ఎక్కడా వయసు మళ్లినోడిగాను, ఎముకలు కుళ్లినోడిగాను నాకు కనబడలేదు. నిద్రలోకూడా పని గురించే. ఉద్యమాలబాట అనంత త్యాగాలబాట అని నమ్మిన త్యాగశీలి.

**మహాతల్లి విజయమ్మ**

ఏ అమ్మ కన్నబిడ్డ ఈ అమ్మ కాళిదాసుగారితో వివాహం తర్వాత కాళిదాసు గారి ఇష్టాలన్నీ తన ఇష్టాలుగా మార్చుకుంది. తన ఇంటిని కళాకారుల నిలయంగా మార్చుకుంది. తన ఇంటిని విద్యార్థుల ఆలయంగా తీర్చిదిద్దింది. తన ఇంటిని పార్టీ నాయకులకు ఆశ్రయంగా మార్చింది. నన్ను ఒక బిడ్డలాగా చూసుకుంది. ఇంటికి వచ్చే వాళ్లందరిపట్ల ఆ తల్లి అలాగే ఉండేది. ఇంటికి వచ్చి పోయేవారికి వేడివేడిగా వండి వడ్డించడమే తన పని అనుకునేది. ఇటువంటి మహాతల్లులు చాలా అరుదుగా ఉంటారు. కాళిదాసుగారి కోపానికి, ఆయన పనిలోపడే టెన్షన్‌కి తగ్గట్టుగా తల్లి దొరికిందని నా బలమైన భావన. తెల్లారి లేచిన దగ్గర్నుంచి పొద్దుగూకే దాకా అంట్లు తోముతూనో బట్టలుతుకుతూనో వంట చేస్తూనో

కనబడేది. కాళిదాసు గారి బట్టలను మల్లెపువ్వులాగా గంజిపెట్టి ఇస్త్రీ చేయించేది. అంత ఇష్టంగా చేసే ఇల్లాలిని నేను చూడలా.

గుంటూరు మెడికల్ కాలేజీలో చదివే విద్యార్థులు తరచుగా ఇంటికి వస్తుండేవారు. డాక్టర్ విజయలక్ష్మి, డాక్టర్ ధనలక్ష్మి, డాక్టర్ శివబాబు ఇంకా చాలామంది ఉన్నారు. వారందరికీ విజయమ్మ ఆరాధ్యదైవం. ఆంటీ...ఆంటీ... అని పడి చస్తుంటారు. వాళ్లందరితో కాళిదాసుగారు 'భారతమ్మ ఎక్కడ ప్రశ్నించండి' నాటికలు నేర్పి ప్రదర్శింపచేశారు. మంగళగిరి ప్రాంత కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాత, మచ్చలేని మంచి కమ్యూనిస్టు సిపిఎం గుంటూరుజిల్లా కార్యదర్శి కామ్రేడ్ సింహాద్రి శివారెడ్డి చాలాకాలం అనారోగ్యంతో మంచంపట్టినప్పుడు కాళిదాసుగారి నివాసంలో ఉన్న శివారెడ్డిగారి ఆలనాపాలన విజయమ్మగారే చూసింది. వేళకింత అన్నం, రుచికరమైన కూరలు వండి తండ్రి సమానంగా చూసింది. శివారెడ్డిగారు కోలుకున్నారంటే ఆయమ్మ చేతిచలవే.

బ్రాడీపేట 2/12లో అద్దె ఇంట్లో ఉన్న కాళిదాసుగారి కుటుంబం ఆఫీసు పునర్నిర్మాణం తర్వాత పైఅంతస్తులో ఒక సింగిల్ గదిలోకి షిఫ్ట్ అయింది. అప్పటికి ఇల్లు దగ్గరయ్యేసరికి తాకిడి ఎక్కువైంది. ఆఫీస్‌పైనే ఇల్లయ్యేసరికి ఆప్యాయంగా పలకరించే నాయకులు అందరూ వచ్చిపోయేవారు. వీళ్ళందరికీ టీలు, టిఫిన్ అవసరమైతే భోజనాలు ఇక పనే పని. పొలిట్‌బ్యూరో సభ్యులు నాకు తెలిసి కామ్రేడ్ కొరటాల సత్యనారాయణ గుంటూరు సమావేశాలకు హాజరైనప్పుడు కొన్ని సందర్భాల్లో భోజనం పైనే తయారయ్యేది. కొరటాలగారు మితాహారి. పెరుగన్నం కొంత, పప్పన్నంతప్ప ఎక్కువ తినేవారుకాదు. ఇలా నిత్యం అనేకమంది రాకపోకలతో సందడి సందడిగా ఉండేది. వీరందర్నీ విసుగుచెందకుండా చేరదీసేది విజయమ్మ. కాళిదాసుగారు సుదీర్ఘకాలం ఉద్యమానికి సేవలు చేయగలిగారంటే ముమ్మాటికి విజయమ్మే కారణం. మొండోడికి మహాఇల్లాలు దొరకడం ఆయన అదృష్టం.

చాలా సందర్భాల్లో నన్ను తన మాటలతో ఇబ్బందులకు గురిచేసినప్పుడు విజయమ్మ ఒప్పుకునేది కాదు. 'ఎందుకు వాడిని రాచి రంపాన పెడతావు' అనేది.

ఆయన కోపంనుండి కొన్ని సందర్భాల్లో కాపాడిందికూడా. ఇలా ఎవరిని ఒక మాటకూడా అననిచ్చేది కాదు. పార్టీకార్యక్రమాల్లో క్రమంతప్పక పాల్గొనేది. పార్టీ సభ్యురాలు, మహిళాసంఘం బ్రాడీపేట ఏరియాలో బాధ్యతలు చూసేది. ఆఫీస్ పైనే ఇల్లుకాబట్టి నీటిమోటారు వేయడం దగ్గరనుంచి నారాయణ అన్నతో ఆఫీసును శుభ్రంగా ఉండేటట్లు చూసేది. నాకు తెలిసి ఆంధ్రరాష్ట్రంలో గుంటూరు సిపిఎం ఆఫీసు ఉన్నంత శుభ్రంగా మరే ఆఫీసూ ఉండదు. దానికి కారణం విజయమ్మ గారి పర్యవేక్షణ, నారాయణన్న దంపతుల విసుగులేని చాకిరి. (నారాయణ అన్న అంటే ఆఫీసు స్వీపర్).

కాళిదాసు ఆశయాలకు ఊపిరి పోస్తూ
కాళిదాసుగారు చెప్పింది తూచా తప్పకుండా అమలు చేస్తూ
కాళిదాసుగారి కోపతాపాలని మౌనంగా భరిస్తూ
కాళిదాసుగారు ఎక్కడికి వెళితే అక్కడికి ప్రయాణిస్తూ
చివరికి యడ్లపాడుకు పెట్టె బేడ సర్దు
అంటే మాట తప్పకుండా కాళిదాసు గారి వెంటే పయనమై
భర్త ఆశయాల అడుగుజాడల్లో నిరంతరం కష్టపడ్డ గొప్పవ్యక్తి విజయమ్మ.

ఓ కవి అన్నట్టు 'తన దేహము తన గేహము తన కాలము ప్రజలకు అర్పించిన అమ్మా నీకు విప్లవాభినందనాలు.

**రచయితలతో సంబంధాలు**

'నేను పెద్దగా చదువుకోలా మీరు చదువుకున్నోళ్లు బాగా పనిచేయాలి బాగా రాయాలి' అని వెంటపడే మనిషి కాళిదాసు. ప్రజానాట్యమండలి రచయితలు దేవేంద్ర, సత్తెన్న, సాంబరాజు, యాదగిరి, చింతల యాదగిరి, రమేష్ అన్న, స్ఫూర్తి, సన్యాసిరావు, బి.దాశరథి, భాస్కర్, దేవి, శాంతారాం, శేషగిరి తదితర రచయితలతో పట్టుబట్టి పాటలు, నాటికలు రాయించి ట్యూన్స్ చేయించేవారు. నన్ను రాయమనేవాడు. రాయగలవని ప్రోత్సహించేవాడు. అరుచుకుంటూ ఉండేవాళ్లం. మళ్లీ ఒక్కటయ్యేవాళ్లం. ప్రజానాట్యమండలిలో గొప్ప గొప్ప కళారూపాల్ని సమష్టికృషితోనే తయారయ్యేవి. పాటైనా నాటికైనా నృత్యమైనా

అలా తయారైన కళారూపాలు ఆంధ్రరాష్ట్రాన్ని కుదిపేసాయి. ప్రైవేటీకరణ తదితర అంశాలపై ఆనాడే 'అప్పా...అమ్మకమా' నాటిక సంచలనం సృష్టించింది. ఇలా ప్రజానాట్యమండలి ఉమ్మడి ఆంధ్రప్రదేశ్లో కాళిదాసుగారికి కవులతో కళాకారులతో గొప్ప అనుబంధమే ఉంది. పనిలో అరుసుకున్నా కళారూపాల్లో నాణ్యత ప్రదర్శించారు.

**నన్ను కదిలించి ఓ సంఘటన...**

నెల్లూరులో షాట్ (సఫ్దర్ హాష్మీ ఓపెన్ థియేటర్) వీధి నాటకోత్సవాలు జరుగుతున్నాయి. ఈ ఉత్సవాల్లో కాళిదాసుగారికి హార్ట్ ఎటాక్ (గుండెపోటు) వచ్చింది. వెంటనే రామచంద్రారెడ్డి ప్రజావైద్యశాలలో చేర్పించడంతో ప్రాణాపాయం తప్పింది. ఈ విషయం కొంతమంది నాయకులకుతప్ప ఎవరికీ తెలియదు. రెండో రోజు ఉదయాన్నే దేవేంద్ర, దేవి, శాంతారామ్, జగ్గరాజు, నేను వెళ్లాము చూడటానికి. వేదికలమీద శిబిరాల్లో గంభీరంగా కణకణమంటూ గర్జించిన ఆ గొంతులు ఒక్కసారి ఆయన చుట్టూచేరి చిన్నపిల్లల్లా ఏడ్వడం మొదలుపెట్టారు. ఎవరికీ ఎవరూ చుట్టాలుకారు...రక్తసంబంధం అంతకన్నా కాదు...వీళ్లని ఆపడం ఎవరితరం కాలా...ఇది కదా ఆశయ బంధం అంటే...అనిపించింది. ఇది కదా ప్రజానాట్యమండలి పేగుబంధం అంటే...అనిపించింది. పార్టీనాయకుడికి, కళాకారులకి తేడా ఉంటుంది. నాయకుడికి ఉద్వేగం తెలియదు. గొప్ప గొప్ప నాయకులు మరణించినప్పుడు నాయకుల కంటకన్నీరు వచ్చింది నేను చూడలేదు. కానీ ప్రజానాట్యమండలి కళాకారుడు వెక్కివెక్కి ఏడుస్తూ పాడడం నేను చూశాను. ప్రజానాట్యమండలి కళాకారులు కోపాన్ని, దుఃఖాన్ని, భయానకాన్ని, రౌద్రాన్ని కళల్లోనేకాదు జీవితంలోనూ అది ఉంటుంది. అది ఉంటేనే ప్రజానాట్యమండలి. కళాకారుడిని కొంచెం ప్రేమిస్తేచాలు వాడిజీవితాన్ని అర్పించేస్తాడు. అందుకే మాక్సిమ్ గోర్కి 'కళాకారులు మానవ హృదయనిర్మాతలు' అని అంటాడు. తర్వాత కాళిదాసుగారిని నెల్లూరునుంచి హైదరాబాద్కి షిఫ్ట్చేశారు. వైద్యం తర్వాత కోలుకొని మరలా పార్టీకార్యక్రమాల్లో నిమగ్నమయ్యారు.

**మారిన కాళిదాసు**

వయసు పెరిగేకొద్దీ చాదస్తంకూడా పెరగడం ప్రారంభమైంది కాళిదాసు గారిలో. నేను చెప్పిందే వేదం అన్న భావన పెరిగిపోయింది. ఓ రోజు కాళిదాసు గారితో గొడవపడి బ్యాగ్ సర్దుకుని నేను 'తాతయ్య' అని ఆత్మీయంగా పిలుచుకునే సింహాద్రి శివారెడ్డిగారికి చెప్పి మా ఊరు వెళ్ళిపోదామని సిద్ధమయ్యాను. సాయంత్రం ఏడు గంటలకు వెళ్లిన నేను రాత్రి 11 గంటల వరకు ఆయన కాళిదాసుగారి గురించి చెప్పిందంతా విని ప్రయాణాన్ని విరమించుకున్నాను. రమాదేవిగారు పార్టీ కార్యదర్శిగా బాధ్యతలు చేపట్టారు. వారి విలువైన సలహాలతో పార్టీ పూర్తికాలం కార్యకర్తగా కొనసాగాను. తర్వాత పాశం రామారావుగారు సిపిఎం జిల్లాకార్యదర్శిగా బాధ్యతలు చేపట్టారు. వారి గైడెన్స్‌లో కొంతకాలం సాఫీగా పని చేశాను. ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ ప్రజానాట్యమండలి రాష్ట్ర సహాయ కార్యదర్శిగా పదేళ్లపాటు పనిచేశాను.

జిల్లా అధ్యక్ష కార్యదర్శులుగా సుబ్బారెడ్డిగారు, నేను తిరిగి ఎన్నికయ్యాము. సుబ్బారెడ్డిగారు ఇచ్చిన సపోర్ట్ అంతా ఇంతా కాదు. ఈ క్రమంలో నిర్మాణంలో కొన్ని ఇబ్బందులు ఎదుర్కొన్నాను రాష్ట్రం తెలంగాణ ఆంధ్రగా విడిపోయింది. ప్రజానాట్యమండలి కూడా ఆంధ్ర, తెలంగాణశాఖలుగా విడిపోయాయి క్రమంగా అవగాహనలో ఇబ్బందులు, నిర్మాణంలో సంఘర్షణ, కుటుంబ అవసరాలు ఇవన్నీ దృష్టిలో పెట్టుకొని 2018 జనవరి ఒకటో తేదీన పార్టీ కార్యదర్శికి 'నేను స్వచ్ఛందంగా బాధ్యతలనుంచి తప్పుకుంటున్నట్లు' లెటర్ ఇచ్చాను. ఈ సంఘటనతో నన్ను గుంటూరు రప్పించి నన్ను తీర్చిదిద్దిన కాళిదాసుగారు నావైపు కన్నెత్తి చూడలేదు. ఎలా బతుకుతావు అన్నమాట కూడా మాట్లాడలేదు. దాదాపు మూడు నాలుగేళ్లు నాతో మాట్లాడనూ లేదు. దీనంతటికీ కారణం కాళిదాసుగారిలో ఉన్న పార్టీపై అచంచలమైన విశ్వాసం. పార్టీ నేర్పిన ఉక్కు క్రమశిక్షణ...అని నాలో నేను సర్దుకున్నాను

చివరిగా ఒకమాట: ప్రజానాట్యమండలి అనంతరం నన్ను బాగా ప్రోత్సహించిన గుంటూరు ప్రముఖుల్లో సంస్కృతి సత్రాజు బాలచందర్‌గారు ఈ

అభినందన సంచిక ప్రచురణకర్త. వీరికి కాళిదాసుగారంటే ఎంతో అభిమానం, ఇష్టం. యద్లపాడులో టీచర్‌గా ట్యూషన్స్ చెప్పేవారట బాలగారు. అలా వీరిమధ్య మంచి బంధమే ఉంది. అందుకే కాబోలు సైకిల్ మీద కాళిదాసుగారు తిరగడం చూడలేక 'బాలా' అనే స్టిక్కర్ వేసి ఉన్న తాను వాడుకునే సుజుకి స్కూటర్ తాళాలు ఇచ్చి పంపారట. ఇది కళాకారులపట్ల ఆయనకున్న ఔదార్యం. నా టాలెంట్ చావకూడదని 'నిన్నటి వరకు నువ్వు ఒక పార్టీకి హోల్ టైమర్...ఇప్పుడు పాటకి హోల్‌టైమర్ కావాలి' అని నెలనెలా కొంత పెన్షన్ ఇచ్చి (చాలామంది సీనియర్ సిటిజన్ కళాకారులకు ఇచ్చినట్టుగా ఆ జాబితాలో నన్ను కూడా చేర్చి) నా పాటకు ప్రాణం పోశారు బాలాగారు. ప్రజానాట్యమండలి నేర్పిన ఆశయాలబాటలో ఎన్ఆర్‌సికి వ్యతిరేకంగా గొంతెత్తి గర్జించా. ఢిల్లీలో రైతాంగ ఉద్యమానికి గళం విప్పా. గుజరాత్‌లో జరిగిన అల్లర్లపై పాట పాడా. అమరావతికై రాజధాని రైతులు చేసిన పోరాటంలో ముందు పీఠిన నిలబడ్డా. విశాఖ ఉక్కు ఆంధ్రుల హక్కు అని గర్జించా. ఆంధ్రనాట జరిగే ప్రతి పిలుపులో ప్రతి మలుపులో నా పాటలతో ప్రతిధ్వనిస్తూనే ఉన్నా. ప్రాణం ఉన్నంత వరకు పాటనై ప్రభలు చిమ్ముతూనే ఉంటా. కాళిదాసు మీద ఆన.





ఉండవల్లిలో 'మనచరిత్ర' నాటికను రాష్ట్ర శిక్షణాశిబిరంలో నేర్చుకుంటున్న రాష్ట్రకళాకారుల బృందంతో కాళిదాసు.



**బి. దశరథ**

# ఉద్యమాల పురిటిగడ్డ

పల్లవి : ఉద్యమాల పురిటిగడ్డ గుంటూరు మన జిల్లా
శత వసంతాల ఖిల్లా గుంటూరు మన జిల్లా

చరణం : పలనాటి పౌరుషం పుణికిపుచ్చుకున్న మనం
స్వాతంత్ర్య సమరంలో చరితకెక్కినాములే
తెల్లవాళ్ళ నెదిరించిన కన్నెగంటి వారసులం
దీక్షబూని సాగినట్టి వీరులను స్మరియిద్దాం ॥ఉద్య॥

2. హెచ్చుతగ్గులేలని మనుషులంత ఒకటేనని
నినదించిన సంస్కర్త ఉన్నవ మనకాదర్శం
హేతువాద రథసారథి త్రిపురనేని రామస్వామి
ఆశయాలకంకితమైన ప్రభవించిన నేతలెందరొ ॥ఉద్య॥

3. పరవశించె కృష్ణమ్మ పరుగులెత్తి నాగార్జున
వాణిజ్య పంటలకు గుంటూరు నిలయమయ్యె
గుంటూరుకె గుబాలింపు సాహితీగులాబీలు
తెలుగుతల్లి మెడలోన అయినట్టి పూలదండలు

4. చరిత కెక్కిన అమరావతి నాగార్జునుని బోధనలు
మహనీయుడు పర్వతనేని కవికోకిల జాషువా
కరుణశ్రీ జంధ్యాల పుట్టినది గుంటూరే
మహామహుల కెందరికో పుట్టినిల్లు మనవూరే ॥ఉద్య॥

5. కులమతాల అసమానత కూడదన్న బ్రహ్మన్న
చాపకూడు సిద్ధాంతం అందించే ఆ అన్న
నాజరు బుర్రకథతో త్రిపురనేని బోధనలతో
కార్మిక, కర్షక నేతలెందరికో స్ఫూర్తినిచ్చె ॥ఉద్య॥

6. మార్క్సిస్టులు మాకినేని మోటూరి ఎల్.బి.జి
రైతుబంధు పుతుంబాక పుట్టినది గుంటూరే
అభ్యుదయ వామపక్ష ఉద్యమాల సెలయేరు
అజ్ఞానపు చీకట్లను పారద్రోలె గుంటూరు ॥ఉద్య॥

(గుంటూరు జిల్లాకు ఓ గేయం వుండాలని 100 ఏళ్ళ గుంటూరు వేడుకకు బి. దశరథగారితో పట్టుబట్టి కాళిదాసుగారు రాయించిన పాట.)



గుంటూరు జిల్లా నాయకులతో రైతు ర్యాలీని జెండా ఊపి ప్రారంభిస్తున్న కాళిదాసు



**కె. మిన్ను**
డైరెక్టర్, ఫిల్మ్ స్కూల్,
హైదరాబాద్.

# కాళిదాసు అంకుల్‌తో నా జ్ఞాపకాలు

**నా**కు ఎన్ని జ్ఞాపకాలు ఉన్నాయో అన్నీ జ్ఞాపకాల్లోనూ కాళిదాసు అంకుల్, జయమ్మ ఆంటీలు ఉంటారు.

బహుశా నాకు ఐదారేళ్లుంటాయి అపుడు. సైన్స్ క్యాంప్ జరిగింది. అక్కడే కాళిదాసు అంకుల్‌తో నా తొలి పరిచయం. అది సైన్స్ మ్యూజియం. అక్కడ ఓ మనిషి పొగతాగుతూ అస్థిపంజరంగా మారిపోయిన దృశ్యాన్ని చూపిస్తున్నారు. అప్పట్లో కాళిదాసు అంకుల్ సిగరెట్లు తాగేవారు. ఈ దృశ్యాన్ని చూసిన తర్వాత ఆయన్ను ఆటపట్టిస్తూ ఉండేవాడిని. తాగితే నువ్వు కూడా అస్థిపంజరం అవుతావు అని.

నాకు ఆయనతో ఉన్న సంబంధం గౌరవానికి స్నేహానికీ మధ్య తిరుగుతూ ఉండేది. మేము ఆటపట్టించినా ఆయన తన వైఖరి ఏమీ మార్చుకోలేదు. అనుకున్నది చేసేవాడు. ఏది తప్పు ఏది ఒప్పు అన్న విషయాలమీద పిల్లలతో నిరంతరం మాట్లాడుతూ ఉండేవాడు. వాళ్ళల్లో ఆత్మవిశ్వాసాన్ని నింపేవాడు. ఈ ఆత్మవిశ్వాసంతోనే మేము పెరిగాము.

బాల్యంనుండి నాకు యవ్వనం వచ్చే వరకూ కాళిదాసు అంకుల్ ఆంటీ వాళ్ళ ఇంటికి రెగ్యులర్‌గా వెళ్తుండేవాడిని. అక్కడికి వెళ్లి వచ్చినపుడల్లా ఏవేవో అనుభూతులు తీయని జ్ఞాపకాలు మిగిలేవి. రెండేళ్లు గుంటూరులో వేసవి శిక్షణా

శిబిరానికి హాజరైనపుడు అంకుల్ వాళ్ళఇంట్లో ఉన్నాను. ఈ వేసవి శిక్షణాశిబిరాల్లో నేను ఈత కొట్టడం, స్కేటింగ్ చేయటం వంటివి నేర్చుకున్నాను. అప్పట్లో నేను గడిపిన సమయం నాకు జీవితంలో ఎంతో సంతోషాన్ని తెచ్చిపెట్టింది.

గూగుల్ స్మార్ట్‌ఫోన్లు లేనికాలం కదా అది. నేను ఎపుడు వాళ్ళ ఇంటికి వెళ్ళిన నగరంలో నేనెక్కడికి కావాలంటే అక్కడికి వెళ్లి దారి తప్పకుండా ఇంటికి వచ్చేలా నాకు మ్యాపులు గీసి ఇచ్చేవారు. ఆ మ్యాపులు నాకు వరాలు. ఎక్కడికీ వెళ్ళాలన్నా తెరుచుకునే తలుపులు. ఆ రకంగా చూసినపుడు గుంటూరు విషయంలో నాకు అంకుల్ ఎక్కడికెళ్లినా భద్రంగా ఇంటికి వచ్చేలా చేసిన గూగుల్ మ్యాప్.

ఆయన వేసుకునే మల్లెపువ్వులాంటి దుస్తులతోపాటు మరెన్నో విషయాల గురించి మేము జోకులు వేసుకున్నా మా ఇద్దరినీ కట్టిపడేసింది మాత్రం పచ్చళ్ళు. ఇద్దరికీ పచ్చళ్ళు అంటే వల్లమాలిన ఇష్టం. జయమ్మ ఆంటీ కొసరి కొసరి కొద్దిగానే వడ్డించాలి అనుకున్నా మేము మాత్రం ఇష్టం వచ్చినంత తినేసేవాళ్ళం. మా పళ్ళాల్లో పచ్చడి చూసినప్పుడల్లా ఆరోగ్యం ఎలా ఉంటుంది ఇలా అయితే అని విసుక్కునేది ప్రేమగా.

వాళ్లిద్దరూ నాకు నేర్పిన మంచిపాఠం ఏమిటంటే అన్నం వృధా చేయకూడదు అని. నచ్చినవి తిని మిగిలినవి వదిలేయడం సరైనది కాదని పళ్ళెంలో ఏమి ఉంటే అది పూర్తిగా తినాలని చెప్పేవాళ్ళు. ఈ పాఠం నా జీవితం అంతా గుర్తు ఉంటుంది. రైతుల కష్టానికి గౌరవంగా. వారి స్వేదానికి కృతజ్ఞతగా.

నా జీవితాన్ని తీర్చిదిద్దడంలోనూ నాకు మంచివిలువలు నేర్పించడంలోనూ వారి ప్రభావం నా మీద ఎంతో ఉంది. వారు నేర్పిన విలువలు నా జీవితాంతం నన్ను వెన్నంటి ఉంటాయి. ఉన్నాయి. కాళిదాసు అంకుల్ జయమ్మ ఆంటీ వంటి వాళ్ళ సాంగత్యం ఉంటే పిల్లలకు మంచి అలవాట్లు అలవడతాయి అనటంలో సందేహం లేదు.





**డాక్టర్ బత్తుల కిషోర్**
మెడికల్ సూపరింటెండెంట్,
విష్ణు మల్టీ సూపర్ స్పెషాలిటీ హాస్పిటల్,
తిరుపతి.

# నిత్యయువకుడు కామ్రేడ్ కాళిదాసుగారు

**నా**కు ఈ నెల మొదట్లో ఒక ఫోన్‌కాల్ వచ్చింది. “డాక్టర్ కిషోరేనా మాట్లాడేది?” అని అటువైపు నుండి అడుగుతున్న గంభీరమైన గొంతును గుర్తుపట్టాను. 14 సంవత్సరముల ముందు విన్న ఆ గొంతు కాళిదాసుగారిది.

“చెప్పండి” అన్నా.

“మేము తిరుపతి వస్తున్నాం ఈ నెలలో. నిన్ను కలుస్తాను. నువ్వు ఉంటావుగా”! అని అడిగారు.

“నేను ఉంటానండి. మీరు రండి. చూసి చాన్నాళ్లు అయింది” అన్నాను.

ఆ తరువాత నేను14 సంవత్సరముల క్రితం జరిగిన విషయాలను గుర్తు చేసుకోవడం జరిగింది.

అది 2010 సంవత్సరం. ఎంబిబిఎస్ పూర్తి చేసుకుని పోస్ట్‌గ్రాడ్యుయేషన్ ఎంట్రెన్స్ ఎగ్జామ్‌కి ప్రిపేర్ అవ్వడానికి గుంటూరుకు వెళ్లాను. అక్కడ గవర్నమెంట్ హాస్పిటల్ దగ్గరలో రూమ్ తీసుకుని, గుంటూరు మెడికల్ కాలేజీ లైబ్రరీలో చదువుకుందామని ప్లాన్ చేసుకొన్నాను. రూమ్ దొరకడానికి రెండు మూడు రోజులైనా పడుతుందనుకొని అనుకుని, ఎస్ఎఫ్ఐ నాయకులు లెనిన్ అన్నకి కాల్ చేసి మాట్లాడాను. లక్ష్మణ్ అనే కామ్రేడ్ ని నా పని కోసం పురమాయించారు.

అప్పుడు లక్ష్మణ్ రూమ్ దొరికేవరకు గుంటూరు సిపిఎం జిల్లా ఆఫీసులో నన్ను ఉండమని చెప్పి ఆఫీసుకు తీసుకు వచ్చాడు

"ఇక్కడ ఆఫీసులో ఉండాలంటే కాళిదాసుగారి సమ్మతి తీసుకోవాలి, ఆయన చాలా స్ట్రిక్ట్" అని చెప్పి నన్ను పార్టీఆఫీసులోనే మూడో అంతస్తులోని కాళిదాసుగారి ఇంటికి తీసుకుని వెళ్లారు. వారి ఇల్లు ఒక రూము మాత్రమే కలిగి ఉన్నది. ఆ ఇంట్లో కుర్చీలో ఆరడుగుల దృఢమైన ఆకారం, తెల్లటి ఫుల్‌హాండ్స్ చొక్కా, నల్లటి ప్యాంటు, నున్నగా షేవ్ చేసుకుని ఉన్న కాళిదాసుగారు, "ఏంట్రా అబ్బాయి లక్ష్మణ్ "అంటూ గంభీరమైన గొంతుతో పలకరించారు. అప్పుడు లక్ష్మణ్ కాళిదాసుగారితో "ఈ అబ్బాయి డాక్టర్ కిషోర్" అంటూ తిరుపతిలో ఎస్ఎఫ్ఐలో పని చేస్తూ డాక్టర్ చదివారట,  ఇక్కడ పీజీ ఎంట్రెన్స్ ప్రిపరేషన్ కోసం వచ్చారు అని చెప్పి పరిచయం చేశారు.

అప్పుడు కాళిదాసుగారు నాతో మాట్లాడటం మొదలుపెట్టారు. కుశలప్రశ్నలు వేసి మా ఇంటివిషయాలు నేను చెబుతున్నది నిజమా కాదా అని, తిరుపతి పార్టీ విషయాలు అన్నీ కూపీ లాగారు. నమ్మకం కలిగాక నా చదువు గురించి అడిగారు. ఆయన పెద్దగా చదువుకోలేదని నాకు అర్థమైంది. కానీ ఆయనకి మెడికల్ ఎడ్యుకేషన్ పైన చాలా నాలెడ్జి ఉందని, చాలామంది డాక్టర్లతో కూడా పరిచయం ఉన్నట్లుగా ఆయన మాటలలో నేను అర్థం చేసుకున్నాను. ఇంతలో కాళిదాసుగారి సతీమణి విజయగారు వచ్చారు. చక్కటి కాఫీ ఇచ్చారు. అంతటి బ్రహ్మాండమైన కాఫీ అంతకుముందు ఎన్నడూ తాగలేదు అంటే అతిశయోక్తికాదేమో! ఆమె నాతో "డాక్టర్‌గారూ!  మీరు చదువుకోవాలంటే వీలైనంత త్వరగా రూమ్ తీసుకోండి. ఇక్కడ ఆఫీసులో మీకు డిస్ట్రబెన్స్‌గా ఉంటుంది. ఏ అవసరం ఉన్నా మీరు ఆఫీస్‌కి రావచ్చు. అలాగే మా ఇంటికి రావచ్చు"  అని భరోసా ఇచ్చారు. అలా పిచ్చాపాటి మాట్లాడి వెళ్ళబోతుంటే, "కిషోర్! నువ్వు ఏమీ మొహమాటపడకు. నీకు ఏ సహాయం కావాలన్నా మన ఇంటికి రావచ్చు. నువ్వు మా బిడ్డలాంటివాడివే" అని ఆంటీ ఒక అరగంట సమయంలోనే నన్ను బిడ్డగా ఒప్పుకున్న ఆమె పార్టీఆఫీసులోనే అందరికీ ఆదర్శ అమ్మ.

తరువాత నాకు తెలిసింది ఆఫీసులో ఆకలితో ఉండే అందరినీ వాళ్ళు తమ బిడ్డలుగా చూసుకుంటారని. వారికి భోజనం పెట్టడమే కాదు, వారి చదువుల విషయం, ఇంట్లో విషయాలను తెలుసుకోవడం, సలహాలు ఇవ్వడంతోపాటు కొంతమందికి పెళ్లిళ్లు చేయించిన ఆదర్శకమ్యూనిస్టు దంపతులువాళ్ళు. కాళిదాసుగారు ఎంత ప్రేమగా జాలీగా ఉంటారో ఆఫీస్ వ్యవహారాల్లో చాలా నిక్కచ్చిగా ఉండేవాళ్లు. అందరూ ఆయన అంటే భయంగా కూడా ఉండేవారు. ఎవరైనా రాష్ట్రస్థాయి నాయకులువస్తే వారికి దగ్గరుండి ఎటువంటి అసౌకర్యం లేకుండా చూసుకునేవాళ్లు. ఎంత పని ఒత్తిడి ఉన్నా అందరినీ నవ్వుతూ పలకరించేవారు. అన్నిటికంటే కూడా ముఖ్యమైన విషయం ఆయన టైం చాలా చక్కగా ఫాలో అయ్యేవారు. మీటింగ్ ఫలానా టైంకి మొదలవ్వాలి అంటే టైంకి రెడీ చేసి ఆ మీటింగ్‌ని సజావుగా సాగేలా చూసేవారు. నేను కాళిదాసుగారిలో ముఖ్యంగా గమనించింది రెండు విషయాలు.

ఒకటి: ఆయన ఎంతమంది ఉన్నా ఆఫీసులో ఎక్కువగా కుర్రోళ్ళతో ఉండటానికి, వారితో హుషారుగా మాట్లాడుతూ, వారికి పనులు పురమాయించి పనులు పూర్తి చేసుకోవడం. అలాగే వారికి సలహాలు సూచనలు చేయడానికి ఇష్టపడేవారు.

రెండోది: ఆ కుర్రోళ్లను మరియు పార్టీ క్యాడర్‌ని దగ్గరికి తీసుకోవడం. వాళ్ళకి సమస్యలు వచ్చినప్పుడు వెనక నిలబడడం నేను కళ్లారా చూశాను.

మచ్చుకు రెండు సందర్భాలు.

ఒకసారి నేను, మిగతా కామ్రేడ్లు ఒక పదిమంది కలసి బ్రాడీపేట నాలుగవ లైన్‌లో ఒక ర్యాలీ కార్యక్రమం చేస్తున్నాం. ఇంతలో ఒక పోలీస్ ఒక కామ్రేడ్‌తో దురుసుగా ప్రవర్తించాడు. ఆ కామ్రేడ్‌కూడా గట్టిగా వాదించడంతో మమ్మల్ని అందరినీ పోలీస్ స్టేషన్‌కి తీసుకెళ్లారు. ఈ విషయం తెలిసిన కాళిదాసుగారు స్టేషన్‌కి వచ్చారు. ఎస్సైగారు మేము తప్పు చేశామన్నట్లుగా మాట్లాడారు. అప్పుడు కాళిదాసుగారు, "సర్! మీరు చాలా సంవత్సరాలుగా ఇక్కడ ఉన్నారు. నేను మీకు బాగా తెలుసు. ఎప్పుడైనా మేము మీ పైనకానీ, మీ అధికారులపైకానీ

అనుచితంగా ప్రవర్తించామా? అలాగే ఈ కామ్రేడ్ నా కొడుకులాంటివాడు. మా ఆఫీసులోనే ఉంటాడు. అతను ఎవరితో దురుసుగా ప్రవర్తించినట్లుగా నేను గమనించలేదు. అతను చాలా సౌమ్యుడు. పొరపాటు ఉంటే మీ వాళ్ళదే ఉంటుంది, కానీ మా వాళ్లది ఉండదు. పైగా వీరంతా ఉన్నతవిద్యను అభ్యసించే విద్యార్థులు" అని, మమ్మల్ని "మీరు ఏం చదువుతున్నారో చెప్పండి" అన్నారు. నేను డాక్టర్ అని, లక్ష్మణ్ లా విద్యార్థి అని, ఇంకొకరు పీజీ అలా చెప్పేసరికి ఎస్ఐకి నోటమాట రాలేదు. అలా ఎస్ఐని ఒప్పించడమే కాకుండా, "సారీ కాళిదాసుగారు" అని అనేలా చేశారు.

ఇంకొక సంఘటన: అప్పుడు దీనికి పూర్తిగా వ్యతిరేకంగా మాట్లాడారు. అదేంటంటే, ఒకసారి కొంతమంది ఆర్ఎస్ఎస్ అల్లరిమూకలు ఆఫీస్‌మీదకు దాడికి వచ్చారు. అది ఆదివారం మధ్యాహ్నం. నేను, క్రాంతి, లక్ష్మణ్, ముత్యం ఉన్నాం. వాళ్లు కర్రలతో వచ్చారు. మేము ప్రతిఘటించాము. అంతలో మాకు సపోర్టుగా నాగేశ్వరరావు అన్న, బైరగాని శ్రీనివాస్ అన్న, అప్పారావు అన్న వచ్చారు. వాళ్లను పట్టుకుని ఆఫీసులో కూర్చోబెట్టాము. కాళిదాసుగారి ముందు ఉంచాము. కాళిదాసుగారు వాళ్లతో "మీ మీద పోలీసుకేసు పెడితే మీ భవిష్యత్తు పాడవుతుంది. అసలు మా కుర్రాళ్ళు లాఠీదెబ్బలు తిన్న చేతులు. వీళ్ళ చేతుల్లో పడి మీరు దెబ్బలు తట్టుకొని బతుకుతారా?" అని భయపెట్టాడు. అంటే పైన రెండు సందర్భాలలో పార్టీక్యాడర్‌ని సమయస్ఫూర్తితో ఆత్మస్థైర్యంతో, ధైర్యంగా ముందుకు నడిపించడంలో చాలా చాకచక్యంగా ఉండేవారని తెలియజేస్తాయి.

నేను సుమారు 9 నెలలు గుంటూరులో ఉన్నాను. నేను నా రూము నుండి ఆఫీసుకు వస్తూ పోతూ ఉండేవాడిని. ప్రతిసారి కాళిదాసుగారు నా చదువు గురించి, నా యోగక్షేమాల గురించి ఆరా తీసేవారు. నేనూ వాళ్ళ ఇంటిలో మనిషిగా మారిపోయాను. నేను ఉన్న తొమ్మిది నెలలు కూడా నన్ను గుంటూరు పార్టీ ఆఫీస్ నవమాసాలు మోసిన తల్లిలా చూసుకుంది. అందులో కాళిదాసుగారు, విజయమ్మగారు ప్రత్యేకము.

అలా సంవత్సరాలు గడిచాయి. నేను తిరుపతిలో సెటిల్ అయ్యాను. కాళిదాసుగారు ఫోన్ చేసి “నేను వస్తున్నాను తిరుపతికి. నిన్ను కలుస్తాను” అని అన్నారు. సుమారు 14 సంవత్సరముల తర్వాత వచ్చారు. కలిశారు. కాళిదాసుగారు అలానే ఉన్నారు ఇప్పటికీ. నన్ను చూస్తూ “ఏంటి డాక్టర్‌గారూ, నాకంటే ముసలివాడిలా ఉన్నావు” అంటూ ఆటపట్టించారు. “లిఫ్ట్‌లో వెళ్లండి” అంటే, “నాకు ఇప్పుడు 72 ఏండ్లు. అయినా నాకేమీ ప్రాబ్లం లేదు. చక్కగా నడుస్తా” అంటూ మెట్లు దిగి ఆటోలో వెళ్లిపోయారు. అందుకే కాళిదాసుగారిని చూస్తే నాకు అనిపించింది గుంటూరుజిల్లా సిపిఎం పార్టీలో నిత్యయువకుడు కాళిదాసుగారు అని.

కాళిదాసుగారి జీవితం, పోరాటం, నిబద్ధతవంటి లక్షణాలు నాలాంటి ఎంతోమందికి స్ఫూర్తిదాయకం. వారు ఇలాగే నిత్యయువకుడిలా ఉండాలని ఆశిస్తున్నాను.





గుంటూరు నగరంలోని కోబాల్డుపేటలో ఇంటింటికీ తిరిగి కరపత్రాలు పంచుతున్న నూతలపాటి విజయలక్ష్మి

# సంస్కృతి (గుంటూరు) ప్రచురణలు

1. **నివేదన** (2014) – సంపాదకుడు: మోదుగుల రవికృష్ణ
2. **స్వాభిమాన ప్రతీక విద్యాసుందరి బెంగుళూరు నాగరత్నమ్మ జీవితము కొన్ని రచనలు** (2014) – సంపాదకుడు: మోదుగుల రవికృష్ణ
3. **సద్గురు నారాయణతీర్థుల జీవితచరిత్ర** (2015) – 'కవిసమ్రాట్' విశ్వనాథ సత్యనారాయణ.
4. **వైష్ణవసాక్షి** (2016) – సంపాదకుడు: మోదుగుల రవికృష్ణ
5. **దేశభక్త కొండ వెంకటప్పయ్య స్వీయచరిత్ర** (2016) – సంపాదకుడు: మోదుగుల రవికృష్ణ
6. **అమోహం** (2017) – రచయిత్రి: శ్రీసుధ మోదుగు
7. **ఆన** (2018) – ఆంగ్లమూలం: **ది ఓత్**– డా॥ కళ్యాణ్ సి. కంకణాల అనువాదం: పిన్నమనేని మృత్యుంజయరావు
8. **త్యాగరత్న** (2018) – కన్నడమూలం: ఆచార్య యమ్.గురుస్వామి అనువాదం: రంగనాథ రామచంద్రరావు
9. **సారస్వత భాస్కర** (2018) – సంపాదకుడు: సజ్జాజు బాలచందర్
10. **'యశస్వి' సజ్జాజు శ్రీవేణుగోపాలరావు సర్వలభ్య రచనల సంకలనం** (2019)– సంపాదకుడు: సజ్జాజు బాలచందర్
11. **బాలూ పాటవై వచ్చావు భువనానికి** (2020)– సంపాదకుడు: మోదుగుల రవికృష్ణ
12. **కేళీగోపాలం** (2020) – సంపాదకత్వం: డా. యశోదా ఠాకోర్
13. **మానవీయ విశ్వనాథ** (2022) – సంపాదకుడు: మోదుగుల రవికృష్ణ
14. **వసుంధరా వృత్తతారావళి** (2023)–రచన: ఆచార్య అప్పాజోస్యుల సత్యనారాయణ
15. **సారస్వత భాస్కర** (2024) – సంపాదకుడు: మోదుగుల రవికృష్ణ
16. **సంస్కృతి యువనాటికలు** (2024) – సంపాదకుడు: మోదుగుల రవికృష్ణ
17. **గురుస్మరణ** (2024) – సంపాదకుడు: మోదుగుల రవికృష్ణ
18. **కామ్రేడ్ కాళిదాసు** (2024) – సంపాదకుడు: మోదుగుల రవికృష్ణ.



# కామ్రేడ్ కాళిదాసు

## అభినందన సంచిక

ఎన్ని సమస్యలెదురైనా ఎన్ని కష్టాలొచ్చినా నమ్మిన సిద్ధాంతం కొరకు నిలబడడం చాలా కష్టం. అలా నిలబడాలంటే చెక్కుచెదరని నిబద్ధత కావాలి. ఆ నిబద్ధత పరిపూర్ణంగా వున్న వ్యక్తి కాళిదాసు. మనుషులను సంపాదించుకోవడం చాలా కష్టం. అది సాధించాడు కాళిదాసు. వసుధైవ కుటుంబం అనే భావన పెంపొందించుకున్నాడు కాబట్టే కాళిదాసు గురించి ఈ పుస్తకం.

**– సజ్జాజు బాలచందర్**

దశాబ్దాల తరబడి విసుగూ, విరామం లేకుండా నాటకరంగంతోపాటు అనేక కళారీతుల్లో కళారూపాలు తీర్చిదిద్దుతూ వందలాది కళాకారులను తీర్చిదిద్దిన నిత్యనూతన కృషీవలుడు నూతలపాటి కాళిదాసు.

**– కె. దేవేంద్ర**

కాళిదాసు నారికేళపాకం. టెంక చాల గట్టిది. లోపల రుచి చాల గొప్పది. తాను నిలబెట్టినవాళ్ళు తనకు ద్రోహం చేసినా పోనీలే అనుకుని ఫిర్యాదు కూడా చేయనివాడు. కాని వాళ్ళు ఉద్యమానికి హానిచేస్తే నిర్దాక్షిణ్యంగా కత్తిరించగలిగినవాడు.

**– పి.ఎ. దేవి**

ఆయన అనుసరిస్తున్న సాధారణ జీవితం పుచ్చలపల్లి సుందరయ్య గారికి నిజమైన వారసుడు అనిపిస్తుంది.

**– పాతూరి కోటేశ్వరరావు**

కుటుంబసభ్యులు దూరమైనా, బంధువులు దూరమైనా మనకు పార్టీ ఉంది, ఎందుకు భయం, బెంగ అని కాళిదాసు ధైర్యంగా ఉంటూ, నాకు మానసిక భరోసాని, అండని అందించారు.

**– నూతలపాటి విజయలక్ష్మి**